# మృగజల్

అనంతగోపాల్ షేవడే



విశ్వవాణి పబ్లిషర్సు, విజయవాడ.

# మృగజల్



మూలం: అనంతగోపాల్ షేవడే

అనువాదం: నీలకంఠం



విశ్వవాణి పబ్లిషర్సు, విజయవాడ.



# మృగజల్

విక్టోరియా టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్, విశాల భవనం చుట్టుప్రక్కల నేడు బహు సందడిగా వుంది. ఆ భవనమంతా రంగురంగుల జండాలతోనూ, తోరణాలతోనూ రమ్యంగా అలంకరించారు. ముఖద్వారాన్ని అరటి చెట్లూ, మామిడాకులతోరణాలతోనూ, దానిపై భాగంలో 'సుస్వాగతం' అనే కాన్వాస్‌పట్టాతో సుశోభితం చేశారు. అక్కడక్కడా, ఎక్కడ చూచినా పూలమొక్కల కుండీలు ఏర్పాటుచేశారు. ఇదంతా చూస్తుంటే, యింకొకచోట కనుపించని విశేషం బహుశా మీ కిక్కడ కనుపించవచ్చు. ఈ ఏర్పాట్ల ఆంతర్యంలో, దీనిని ఏర్పాటుచేసినవారి సౌందర్యాసక్తమైన కళాదృష్టి స్పష్టంగా కనుపిస్తోంది. పూలూ, జండాలూ, లతాకుంజాలు, ఆకులూ, వీరి కూర్చటంలో, శృంగారించడంలో ప్రతిఅంగుళంలోకూడా మీకు అనుపమమైన కౌశలం కనిపిస్తుంది. నేడు యీ విశాలభవనంహాలులో అఖిలభారతీయ చిత్రకళా ప్రదర్శన జరగబోతున్నదికదా! కళాప్రదర్శన అంటే, ఫాన్సీబజారు కాదు. అందువల్లనే దాని ఏర్పాట్లలో ఇంత సౌందర్యం సాక్షాత్కారమవటంలో ఆశ్చర్యమేముంది?

ఎంతో కష్టపడి, ఎన్నో ప్రయత్నాలుచేశాక, ఈ సంవత్సరం క్రిస్టమస్‌లో, యీ ప్రదర్శనం నాగపూరులో జరుగుతోంది. దీని కార్యభారమంతా నెత్తిన వేసుకుని ఎంతో ఓర్పుతో, ఉత్సాహంతో, నిర్వహించిన కళారసికుడు హిమాంశుబాబుకే, యీ కీర్తంతా దక్కుతుంది. ఈనాడాయన ముఖంలో విజయోత్సాహంతో కూడిన చిరునవ్వు సగర్వంగా చిందులాడుతోందంటే, యిదే కారణం.

ఆ భవనంబయట 'మహారాజాబాగ్' మైదానంలోను, దానికి బయటనున్న ప్రదేశంలోను కారులూ, బగ్గీలూ, టాంగాలు విడిసివున్నవి. అందమైన వస్త్రాలతో, నిత్యనవీన భ్యాషన్‌గా అలంకరించుకున్న స్త్రీ-పురుషులు హాలువేపు నడుస్తున్నారు. అందరిముఖాల్లో సౌమ్యమైన ఆనందదీప్తి మెరుస్తోంది. విశేషించి స్త్రీలముఖాలు, వారినగరంలోనికి కళాదేవతే అరుదెంచినట్లు, ఉత్సాహానికీ, అభిమానానికీ అవధులులేక, ఆనందరేఖలు వెదజల్లుతూ కలకలలాడుతున్నవి. ఆ ఆడంబరం చూస్తోంటే అక్కడ చిత్రకళాప్రదర్శనకు మారుగా స్త్రీల సౌందర్యప్రదర్శన జరగటంలేదుకదా అని పిస్తోంది. ఈ భవనంముంగిటనున్న మహారాజాబాగ్‌లో ఒక లతానికుంజంపద్ద సైనిక బ్యాండుమేళం హాయిగా నాదం విన్పిస్తోంది. దాని మధురస్వరం ఆ రమణీయ వాతావరణంలో ఆహ్లాదమూ, ఉల్లాసమూ ద్విగుణీకృతంచేస్తోంది.

ఇక మనం ప్రదర్శనశాలలోనికి వెడదాం. అసలు హిమాంశుబాబు కళాపిపాసని వొప్పుకునితీరవలసిందే. లోపల ప్రవేశించగానే, కాన్వాసుపట్టామీద తళతళ మెరుస్తున్న

'సుస్వాగతం' అనే ఎర్రనిఅక్షరాలు కనిపిస్తాయ్! దాని క్రిందుగా 'అఖిల భారతీయ చిత్రకళాప్రదర్శనం; నాగపూరు' అని వున్న జండా గాలిలో తేలియాడుతూవుండడం కనిపిస్తుంది. ధానికి దిగువగా భారతమాత భవ్యచిత్రం వుంది. ఆ చిత్రంలో హిమాలయపర్వతశృంగాలు మకుటంగానూ,-గంగా, యమునా నదుల ఉజ్వలధారలు కంఠహారంగానూ, నర్మదా, తపతీ పావనతోయాలు కటిప్రదేశానికి వడ్డాణంగానూ, చీరెఅంచు మీాద కృష్ణా, కావేరి, తుంగభద్రానదు లూగిసలాడుతూంటే, పాదపద్మాల్ని హిందూమహాసాగరం తన నిర్మలజలరాశితో శుద్ధిచేస్తున్నట్లుంది. ఆ చిత్రంమధ్యలో అక్కడక్కడా, వింధ్య, సాత్పూరా, అజంతా, సహ్యాద్రి, నీలగిరి మొదలైన పర్వత మాలల, పచ్చపచ్చని రంగులగుర్తులు, దాని సౌందర్యాన్ని ద్విగుణీకృతంచేస్తున్నవి. దానిక్రిందుగా అందమైన అక్షరాలతో 'సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం' అని వ్రాసి వుంది.

ఆ చుట్టుప్రక్కల గోడలమీాద ఆకుపచ్చ, నీలం, ఊదా, నారింజరంగు పరదాలమీాద, వివిధచిత్రాల్ని ప్రదర్శనకు పెట్టారు. పరదాలకూ, చిత్రాలకున్నరంగులలో అపూర్వమైన సామరస్యత వుంది. చిత్రాలకు మధ్యమధ్యగా, ఒకచోట పూలకుండీలనూ, యింకొకచోట అందమైన లతలనూ, మరొకచోట తోరణాలను వ్రేలాడగీశారు. ఆ హాలులోనికి వచ్చాక, మృత్యులోకంనుంచి స్వర్గంలోని దేవతా వనాల్లోకి రాలేదుకదా అనిపిస్తుంది.

భారతదేశం నలుమూలలనుంచి, అమూల్యమైన చిత్రాలు ఆ ప్రదర్శనకు వచ్చినవి. వీటిలో బెంగాలు ప్రాంతంనుంచి నందలాల్‌బోసు, మైత్ర, నేపాలునుంచి రాణా జంగ్‌బహదూర్‌సింహ్, గుజరాతునుంచి కనూదేశాయి, కేరళ నుంచి పార్థసారథి, ఆంధ్రనుంచి చక్రపాణి, మహారాష్ట్రనుంచి దురంధర్, అయోధ్యనుంచి రాజకుమారి, మధ్యప్రాంతం నుంచి అశోక్‌ఠాకూరు మొదలైనవారి చిత్రాలు ముఖ్యమైనవి. ఇవిగాక, కొత్త కొత్త కళాకారులూ, కళాకారిణుల చిత్రాలు యిరవైకి పైగా వున్నవి. చిత్రాలుకూడా బహు వ్యాప్తమైనవి. ఆకారణంగా ప్రదర్శన ఒక అందమైన వాటికగా మారిపోయి, కళారసికులు గంటలతరబడి స్వేచ్ఛగా తిరుగుతూ తమ తమ సౌందర్యపిపాసను తృప్తిపరచుకుంటున్నారు.

అన్నిరకాల అభిరుచులకు కావలసిన సామగ్రి అక్కడ సిద్ధంగా వుంది.

ఒక్కొక్క చిత్రంముందు నలుగురైదుగురు స్త్రీ-పురుషులు చేరి, దాని కళనూ, రమణీయతను గురించి చర్చించుకుంటున్నారు. ఈ చర్చలకు వారికి పూర్వపరిచయం అవసరం కూడా లేదు. సమాజంలో ఒకేతరగతికి చెందినవారై వుండవలసిన అవసరంకూడా లేదు. మనోవినోదంకోసం, వారంతా కళాప్రేమికులమనేభావంతో ప్రేరేపింపబడి, దానివల్ల కలిగే నిర్మలానందాన్ని అనుభవించడానికే ఆశపడుతున్నారు. ఈ ప్రేక్షకులలో నిజమైన కళాదృష్టి; కళాశక్తిగలవారు చాలా తక్కువే అనిపిస్తోంది. చాలామంది తమకు కళలమీద ప్రేమ

వున్నట్లు నటించడంకూడా సభ్యమానవసమాజ ప్రతిష్ఠకు లక్షణమన్నట్లు అక్కడ తిరుగుతున్నారు.

కొంతమంది చిత్రాల్ని దగ్గర్నించి చూస్తున్నారు. ఇద్దరు ముగ్గురు అయిదడుగుల దూరంగావుండి చూస్తుంటే, యింకొంతమంది పదడుగులదూరాన వుండి చూస్తున్నారు. కొందరు మెడలువంచుకుని చూస్తుంటే, మరికొందరు గచ్చు మీద కూర్చుని చూస్తున్నారు. ప్రతివారూ, తాము కళా విజ్ఞులమనీ, చిత్రకళలో తమకుకూడా ప్రజ్ఞ వుందనీ చెప్పేం దుకు ఉత్సాహపడుతున్నారు. కొంతమంది చిత్రాలను చూచి ఆనందించేకన్నా ప్రేక్షకుల చేష్టలను చూచి ఆనందిస్తున్నారు.

ఏదైనా, ఒక చిత్రంముందు, అందమైన స్త్రీ నిల్చుని వున్నప్పుడు అక్కడికి నలుగురైదుగురు యువకులో, సభ్య పురుషులో తప్పకుండా చేరేవారు. వారు ఆ చిత్రాన్ని ఆక ర్షించే అక్కడికి వెళ్ళారో లేక దాన్నవలోకించేవారిఆకర్షణ తోనే వెళ్లారో చెప్పడం కష్టం. కాని దీన్ని సాకుగా చేసుకుని, వారామెతో, ఒకటి రెండు మాటలు మాట్లాడకుండా, ఆమె కటాక్షవీక్షణాలు చవిచూచే అవకాశం వదిలిపెట్టుకునేవారు కారు. ఆమెకూడా యీ ఆగంతుకుని పరిచయాన్ని కాదం టుందాఅంటే, అదీకాదు. స్త్రీ-పురుషులమధ్య యీ ఆకర్షణ నిర్దోషితమైనదే అందుచేత దానిలో ఎవరికీ అయిష్టతవుండేది కాదు.

ఆ ప్రదర్శనలో ప్రదర్శించే చిత్రాల కళాకారులల్లో చాలమంది బయటిప్రాంతాలవారు గనుక వారక్కడ లేరు. అక్కడ ఒక్క నాగపూరు కళాకారుడైన అశోక్‌ఠాకూరు,

యింకా పలుగురైదుగురు మహిళలు వున్నారు. ఆ మహిళా మణులు ఒక్కొక్క చిత్రాన్ని పంపారు. కాని, అశోక్ ఠాకూరు పంపిన నాలుగు చిత్రాల్ని హాలులో ప్రముఖస్థానంలో ప్రదర్శనకు పెట్టారు.

వాటి నలా ప్రదర్శనకు పెట్టినందుకు ఆశ్చర్యపడ వలసిన అవసరంలేదు. ఎందుకంటే, ఆ చిత్రాల్లో స్పష్టంగా కనుపిస్తున్న కళాకారుని ప్రతిభ అద్భుతమైనది. ఆ చిత్రాల్లోని సజీవత్వమే తన సందేశాన్ని, స్పష్టమైన వాణిలో వినిపింప చేస్తోంది. దాని సందేశం తాలూకు శుచిత్వానికీ, ఉదాత్తతకూ ఏ కళాపిపాసియైనా తన్మయత్వం చెందకమానడు

ఒకచిత్రంశీర్షిక:-"సంధ్యారాణి". పగటి అవసానము, సంధ్యారాణి ఆగమన మందులో చిత్రించాడు. తాటి, యూకలిప్టస్ వృక్షాలపైనున్న క్షితిజములో, పర్వతమాలల వెనుకనుంచి చంద్రుడు ఉదయిస్తున్నాడు. వృక్షాలూ, లతలూ, పక్షిగణమూ, ఆవులూ, గేదెలూ, కుక్కలూ, ఈ గోధూళివేళను బడలికగా, మౌనంగా నిలుచునివున్నవి. సమస్త వాతావరణం, యీ దివా రాత్రి సంధికాలంలో మూగిగా, ప్రశాంతానికి చిహ్నంగా 'పద ఇక యింటికి పద' అన్నట్లుంది.

రెండో చిత్రం :- 'పిచ్చిది'. భక్తిరసంలో లీనమైపోయి తన గిరిధరగోపాలుని ప్రణయానందంలో నాట్యంచేస్తున్న మీరాబాయి చిత్రం. చేతిలో చిరుతలూ, కాళ్ళకు గజ్జెలూ, శరీరంమీద కాషాయరంగు చీర, మెడలో రుద్రాక్షమాల

లతో, కురులు విడిపోయి, అర్ధనిమీలితలోచనయై, కనుకొలకు ల్లోంచి నీరు ధారగా కారుస్తూ, ఆత్మను సంపూర్ణంగా మరిచిపోయి బాహ్యజగత్తును వదిలిపెట్టి, పిచ్చిదానిలా నాట్యం చేస్తోంది.

మూడో చిత్రం:- 'ప్రణయజంట'. ఇదొక స్త్రీ లేదా పురుషుని చిత్రం కాదు. అదొక హరిణదంపతుల కరుణగాథ. ఆ చిత్రం మేవాడు నిర్జల మరుభూమి వాతావరణంలో చిత్రించ బడింది ఆ ప్రణయజంట ఒక చిన్న జలాశయంవద్ద మరణా వస్థలో పడివున్నది. వాటికి బాగా దాహం వేసింది. జలాశయ ములో వున్న నీరు చాలా తక్కువ. కాని వాటిప్రేమ మహా సాగరంలా విశాలమూ, అగాధమైనది. ప్రాణాన్ని నిలబెట్ట గలిగిన నీటికోసం రెండూ, మైళ్ళదూరం పరుగెత్తుకుని వచ్చి నవి. కాని, జలాశయంవద్దకు వచ్చి చూసినప్పుడు, దానిలోని నీరు ఒక్కదానికి సరిపోనంతగా వుంది. రెండూ ఒకదాన్నొకటి బ్రతిమలాడుకుంటున్నవి. 'నువ్వుత్రాగు, నువ్వుత్రాగు-' అని. ఈవిధంగా బ్రతిమిలాడుకుంటూనే, రెండూ ప్రాణాలు విడిచి నవి. చంద్రుని చల్లని కిరణాల్లో, వాటిశరీరాలు ఒక దివ్యమైన కాంతిపుంజంతో తళుక్కున మెరిశాయి. జలాశయంలోని నీటిమీదకూడా ఆ కిరణాలు, తమ కాంతిపుంజాన్ని వెద జల్లినవి. ఆ చిత్రంలోని సమస్తభావాల్ని ఆత్మజ్ఞాతం చేసు కున్నాక, హృదయంలో సానుభూతి కలుగకుండా, నోటి వెంట అవ్యక్తమైన నిశ్వాస బయటికిరాకుండా మానదు.

నాలుగోచిత్రం:- 'స్వతంత్ర బాటసారి'. దీనిలో మహాత్మాగాంధి తన అనుయాయులతో పాటు, 'దండి' సము

ద్రంవేపు నడుస్తున్నాడు. ప్రభాకరు డప్పుడే పైకి రాబో తున్నాడు. రాత్రి మసక వెలుతురు యింకా దూరంకాలేదు. ఆ వెలుగునీడల మిశ్రితకాంతిలో గాంధీజీ ధ్యానమగ్నమూర్తి తలొంచుకుని, చేతికర్రను టకటకలాడిస్తూ— పెద్ద పెద్ద అడుగులువేస్తూ ముందుకు సాగిపోతోంది. గాంధీజీలలాటంమీద కుంకుమబొట్టు, అక్షతలు వుంచబడినవి. ఆయనముఖంలో గాంభీర్యము, దృఢప్రతిజ్ఞాభావం కనుపిస్తున్నాయి. దారి కిరువైపులా అసంఖ్యాకులైన స్త్రీపురుషులు మోకాళ్ళమీద కూచుని, తలవంచి ఆయనపాదధూళిని తలలమీద చల్లుకుంటు న్నారు. ఆ చిత్రం సజీవమైంది, రమ్యమైనది. ప్రేరేపణ వుంది. 'వారంతా ఎలా వెడుతున్నారో చూడండి' అన్నట్లుగా వుంది.

ఈ చిత్రాలకు కుడివైపుమూలగా చిత్రకారుని సంతకాలు 'అ. ఠా' అని వున్నాయి.

అశోక్ ఠాకూర్ చిత్రించిన యీ చిత్రాల్ని ఎంతగానో మెచ్చుకుంటున్నారు. ముఖ్యంగా 'ప్రణయజంట'ముందు గుమిగూడిన స్త్రీజనసమూహం తరగడంలేదు. ఈ కళాప్రదర్శన ఏర్పాటుచేసిన హిమాంశుబాబు సంతోషానికి హద్దులేకుండా వుంది. ఇదంతా తనకు విజయమేనని భావించాడు. అందువల ఎంతో ఉల్లాసంగా, హాలులో అటూ యిటూ తిరుగుతూ గౌరవకుటుంబీకులను కలుసుకుని, వారినోటివెంట తనను గురించి వచ్చే ప్రశంస విని సంతోషిస్తున్నాడు. ఒకామె అతన్ని చూచి—"ఈ, 'అ. ఠా' ఎవరండీ? గొప్ప కళాకారుడిలా వున్నాడు!" అని అడిగింది.

"ఓహో! ఐతే మీరు అశోక్ ఠాకూరునే ఎరుగరా మాయాదేవీ! మీ నాగపూరువాడే"

"సరే, ఈ చిత్రాన్ని అమ్మగలరేమో విచారించ గలరా? ఇది నా కెంతో బాగుంది."

"ఆ...ఆ...ఇప్పుడే కనుక్కునివస్తాను. వారుకూడా యిక్కడే వున్నారు. ఐదునిముషాలు ఆగండి. అక్కర్లేదు. మూడునిముషాలు చాలు. నే నిప్పుడే కనుక్కొనివస్తాను." అంటూ గబగబా అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

హిమాంశుబాబు ఒక అందమైన యువకునితో హుషారుగా మాట్లాడుతూవుండడం మాయాదేవి తన పొడుగు పాటి మెడను ఒకప్రక్కకు త్రిప్పి చూచింది. ఆ మరుక్షణంలోనే ఆయన, అతన్ని తనవద్దకు తీసుకొనిరావడంకూడా క్రీగంట చూచింది. ఐనా అతడు తనవద్దకు రావడానికి సంకోచిస్తున్నట్లుంది. అతను తనవేపు రావటం చూచి మాయాదేవి తిరిగి చిత్రంవేపు చూస్తోంది. కాని, ఆమె ధ్యాసంతా, ఆ చిత్రం తాలూకు కళాకారుని అడుగులధ్వని వినడంలోనే నిమగ్నమైపోయింది.

"మాయాదేవీ, మీరు కావాలన్న చిత్రాన్ని చిత్రించిన అశోక్ ఠాకూరు యితనే; అశోక్ బాబూ! వీరు శ్రీమతి మాయాదేవి నీలకంఠ. జాగీరుదారు...——"

"ఆపండి...ఆపండి...చాలు." అంటూ ఆమె అశోక్ ఠాకూరువేపు చూచి, చిరునవ్వుతో, చేయికలపడానికి చేతిని చాచి- "నేను మీవంటి కళాకారుని కలుసుకునేభాగ్యం కలిగినందుకు కృతజ్ఞురాల్ని" అన్నది.

"ధన్యవాదాలు. మీరిలా గౌరవించినందుకు నేనెంతో కృతజ్ఞత తెలియచేస్తున్నాను." అంటూ దూరంగావుండే చేతులెత్తి నమస్కరించాడు. మాయాదేవి చాచిన తనచేతిని వెనుకకుతీసుకుంది

తనెదుట ఒక అందమైనయువకుడు నిలుచునివుండటం చూచింది. అతనివ్యక్తిత్వం విశేషించి, స్త్రీలమీద తప్పకండా పడుతుంది. ముప్పది, ముప్పదొక్కసంవత్సరాల వయసుంటుంది. తల వెంట్రుకలు ఒత్తుగా, దట్టంగా పొడుగ్గావున్నవి. చేతులు, చేతి వేళ్ళుకూడా పొడుగే. ముక్కుకూడా పొడుగానే వుంది. దాన్ని చూస్తుంటే, గ్రీకుశిల్పమూర్తులు జ్ఞాపకం వస్తుంటవి. పెద్ద పెద్ద కళ్ళు. కాని, బడలికగా వుండి, వస్తువు బాహ్యారూపాన్ని కాకుండా దాని ఆంతర్యాన్ని చూచేందుకు అలవాటుపడినట్లున్నాయి. ఈ నిర్లిప్తదృష్టిగల యువకునిమీద మాయాదేవిచూపు పడినదసడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఆమెకు అందమంటే అభిరుచి మెండు. అది చిత్రంకానీ సంగీతం కానీ, పురుషుడుకానీ, లేదా యింకొక కళావస్తువైనాసరే.

అశోక్ ఠాకూరు ఆమె వ్యక్తిత్వపు లోతుపాతుల్ని కనుగొందామనే ఉద్దేశ్యంతో, ఆమెకళ్ళలోకి సూటిగా చూస్తున్నాడు మాయాదేవి ఆ చూపుల్ని సహించలేక పోయింది. కాని, ఆ స్వల్పావకాశంలోనే, అశోక్ ఠాకూరు ఎంతో గ్రహించగలిగాడు.

స్వతహాగా మాయాదేవి అందమైనది. ఆమెవ్యక్తిత్వంలో సౌందర్యలాలస, విలాసాసక్తమైవున్నట్లు ఆమె ప్రతి హావభావంలో వ్యక్తమవుతోంది. వయసు ముప్పదివిదేళ్ళు

వుండవచ్చు. కాని, తన తరుణత్వాన్ని ఎంతో ప్రయత్నంతో కాపాడుకొంటున్నది. అందుకని పౌడరు, సుగంధనూనె,గోళ్ళకు రంగూ, చెవులకు రింగులూ మొదలైన ఉపకరణాల్ని బాగా వుపయోగిస్తుంది. మాయాదేవిశరీరం తెల్లగా వుంది. ముఖం తీరు అపురూపమైనది కాకపోయినా అందంగావుంటుంది. కాని, ఆ కళ్ళలోమాత్రం విశేషంవుంది. అవి సాధారణంగాచిన్నవే! కనుపాపలుమాత్రం నీలంగా, చంచలంగా వున్నవి. ఒకే స్థానంలో ఎక్కువకాలముండే స్వభావ మా పాపలకు లేదు. ఆమె పేరు మాయాదేవి నీలకంఠానికి బదులు, మాయాదేవి నీలాక్షి అని వుంటే ఎంతో బావుండేది.

"ఈ చిత్రం చాలా బాగుంది. దీన్ని అమ్మకానికే పెట్టారా?" మాయాదేవి నవ్వుతూ అడిగింది. ఆ చిరునవ్వులో పురుషుల్ని మోహింపచేసే శక్తివున్నట్లు అశోక్ గ్రహించాడు.

"అవునండీ! నా నాలుగుచిత్రాలుకూడా అమ్మకానికి పెట్టినవే! మీరు మీకు కావలసినదాన్ని తీసుకోవచ్చు."

"నాకు యిదే కావాలి. వీలుంటే 'సంధ్యారాణి'కూడా యివ్వండి. 'పిచ్చిది' అనే చిత్రంతాలూకు ఊహ చాలా ప్యూరిటీగా వుంది. ఇక 'స్వాతంత్ర్య బాటసారి'కోసం ఎవరైనా కాంగ్రెసుధనికులు ముందుకురావచ్చు. ఇంతకూ ధర ఎంత చెప్తారు.?"

మాయాదేవి విమర్శ అశోక్‌ఠాకూరుకు కష్టం కలిగించింది. ఈమెకు ఒక్కచిత్రంకూడా అమ్మకూడదన్నంత కోపం వచ్చింది. కాని, అలాచేయడం అనుచితంగా వుంటుంది. తన వృత్తికే దెబ్బతగులుతుందని ఆలోచించి- "నా చిత్రాలకు

నేను విలువకట్టలేను. కళను వెండినాణాలతో కొలవలేము కూడాను. కళాగ్రాహకులు యిచ్చినదానినే సంతోషంగా పుచ్చుకుంటాను. నిజమైన కళారసికులకు, నా కళద్వారా ఆనందం లభించినట్లయితే, వారు దాని విలువకట్టడంలో భిక్షావృత్తిని అవలంబించరని నా నమ్మకము." అన్నాడు.

ఈ తీవ్రమైన వ్యంగ్యానికి మాయాదేవి దిగ్భ్రాంతురాలైంది. అవమానంతో కేవలం "సరే" అని మాత్రం అనగలిగింది.

ఈ విధంగా ఆ చిత్రానికి అశోక్ ఠాకూర్‌కు మూడు వందలరూపాయలు లభించినవి. 'సంధ్యారాణి'కి రెండువందలు యివ్వడానికి సిద్ధపడింది. కాని, హిమాంశుబాబు బలవంతం చేసి దినేశ్ కాంగాకు రెండువందలయాభై రూపాయలకు అమ్మాడు. 'స్వతంత్ర బాటసారి' చిత్రంకోసం, యిద్దరు గుజరాతీవర్తకులు పోట్లాడుకున్నారు. దాన్ని వారిలో ఒకరికి మూడువందలకు అమ్మి, రెండోవారికికూడా వేరొకటి చిత్రించి యిస్తానని వొప్పుకున్నాడు. చూస్తూ చూస్తుండగానే ఒక మహారాష్ట్ర జాగీరుదారు 'పిచ్చిది' అనే చిత్రాన్నికూడా కొనేశాడు. ఈరకంగా అశోక్ ఠాకూరుకు, యీ ప్రదర్శన వెయ్యిరూపాయలు సంపాదించిపెట్టింది. తన కృషికి తగిన ఫలితం లభించినందుకు అతని కెంతో సంతోషంకలిగింది.

వెళ్ళబోయేముందు మాయాదేవి అశోకునితో–"నాకు చిత్రాలంటే ఎంతో అభిరుచి. మీ ప్రతిభను చూచి, నా కెంతో సంతోషం కలిగింది. మీరు మంచిచిత్రాలు

వేసినట్లయితే నన్ను తప్పకుండా అడిగిచూడండి. వీలుంటే నేనే కొంటాను" అన్నది.

"ప్రయత్నించిచూస్తాను."

"ఇంకొక విషయం. మీరూ నేనూ ఒకేకళకు భక్తులం. వచ్చే శనివారంనాడు మీరు మాయింటికి భోజనానికి రాగలరా ?"–మాయాదేవి వినయంగా చెప్పింది. ఆ వినయం మోహంలో పడి అశోక్ ఠాకూరు కాదనలేకపోయాడు.

"శనివారంనాడా ?"

"అవును, సరిగ్గా ఎనిమిదిన్నర గంటలకు, అంటే మూడురోజుల తరువాత నన్నమాట. మీకు జ్ఞాపకంచేయడానికి ఆహ్వానపత్రం పంపుతాను మీరు నిశ్చింతగా వుండండి."

అశోక్ ముఖంలో సన్మతితాలూకు సూక్ష్మభావాల్ని మాయాదేవి తీక్షణదృష్టి పసిగట్టింది. అతని జవాబుకోసం ఎదురుచూడకుండానే నమస్కారంచేసి, తన సిల్కుచీరను సరసరలాడిస్తూ వెళ్ళిపోయింది.

తన పనికంటె పరులపనుల్లో హిమాంశుబాబు ఎక్కువ ఆసక్తికలిగివుంటాడు. అది ఆయనస్వభావం. పరుగెత్తుకుని వచ్చి, వగర్చుతూ–"అభినందనలు, హృదయపూర్వకమైన అభివందనాలు, అశోక్ బాబూ! చేతికి మంచి పట్టుచిక్కింది. అదృష్టం పగలపడింది. మాయాదేవి ఎవరిమీద అనురాగం చూపుతుందో, వారికి సుఖమే సుఖం! పట్టణంలోని సగం మంది రసికులైన యువకులు ఈమెవెనక తిరుగుతూవుంటారు. ఆమె మాత్రం నీ వొక్కడి వెంటపడింది. అంతేనయ్యా అంతే! దీన్నే అదృష్టమంటారు– అదృష్టం! కాని చూడు బాబూ !

ఈ హిమాంశుబాబును మాత్రం మరిచిపోవద్దు. నీకు పరిచయం చేసిందికూడా నేనే! ఒకవేళ రోజులు మారినట్లయితే జ్ఞాపకం చేసుకుంటూ వుండు, బీదవాణ్ణి" అంటూ పగలబడి నవ్వాడు.

అదంతా ప్రేలాపననుకుని అశోక్ వాటిని లక్ష్యపెట్టే లేదు. ఆ మాటల్లోని సూక్ష్మమైన అంతరార్థం వేపుకూడా ధ్యాసవుంచలేదు హిమాంశుబాబును ఒకప్రక్కకు తీసుకుని వెళ్ళి, ఆయన శ్రమకు తగ్గట్టుగా వందరూపాయల నోటును, ఆయనచేతిలో పెట్టి బయటికి వచ్చాడు.

## 2

"నేటిరాత్రి ఒకరింటికి విందుకు వెళ్ళాలి అబ్దుల్లా!"

"కారుతీసుకురమ్మంటారా ?"

"అక్కర్లేదు. నాకోసం కారు వస్తుంది."

"మరి...ఏ ఏ బట్టలు..."

"సాధారణమైనవే! లాల్చీ, పైజామా..."

"చిత్తం...."

"చూడు అబ్దుల్లా -"

"ఏమండీ-?"

"సంచారానికి బయలుదేరాలి."

"ఏవేపు...?...ఎప్పుడు...?"

"మరీ అంత దూరంకాదులే! మన ప్రాంతంలోనే ముఖ్యంగా సాత్పూరాపర్వతాల్లో తిరగాలనుంది. పదిరోజుల్లో బయలుదేరాలి...ఏమంటావు ?"

"మంచిదేనండీ - ఎన్నిరోజులుంటారు?"

"రెండు మూడు నెలలు. వసంతఋతువు అడవుల్లోనే గడపాలనుకొన్నాను."

"అటువంటప్పుడు రంగుట్యూబులు కావాలి బాబూ! నీలం, ఆకుపచ్చ, నారింజరంగు ట్యూబులు పోయిన వారం లోనే ఆఖరైనవి. మబ్బురంగూ, పసుపుపచ్చ, బహుశా వున్నాయేమో చూస్తాను. కొంత కాన్వాస్, పిన్నులూ, చెక్కలుకూడా దగ్గరుంచుకోవడం మంచిది."

"అవునవును. అవన్నీ సిద్ధంచేయి. పర్వతాల్లో చిత్ర లేఖనం చాలా బావుంటుంది. మరి బ్యాంకిలోంచి కొంత పైకం తీసుకొనవలసివస్తుందేమో!"

"అవునండీ! మొన్ననే వెయ్యిరూపాయలు జమకట్టిం చాను."

"మంచిది. నేను నీకేమీ చెప్పలేదు. అందువల్ల ఆ పైకంలో కొంత తాకట్టుపద్దుకింద జమవేయించావేమో ననుకొన్నాను."

"బాబుగారూ-!" ఎంతో శ్రద్ధగా పిల్చాడు.

"ఏమిటి అబ్దుల్లా-?"

"కొన్ని బట్టలు కుట్టించుకుంటే బావుంటుంది. మూడేళ్ళ నుంచీ మీరేమీ కుట్టించుకోలేదు. ఒకటి రెండు సిల్కు-సూట్లు కుట్టించుకుంటే...?"

"అంటే కావలసినన్ని బట్టలు లేవా అబ్దుల్లా? పని గడిచిపోతుంది కదా? అందులో సిల్కంటే నాకంతగా యిష్టంలేదు."

"బాబూ, పెద్దపెద్దవారిళ్ళకు వెళ్లివస్తుంటారు. అటు వంటప్పుడు కొన్ని మంచిబట్టలు వుండాలికదా. విదేశీ సిల్కు అవుసరంలేకున్నా, ఖద్దరు సిల్కు మీకు యిష్టమేకదా? అదే తీసుకోండి! ఖద్దరుభాండారంలోనికి మంచి సరుకు వచ్చింది. నేను నిన్ననే చూచివచ్చాను."

"సరేలే-"

"మరి మచ్చుకోసం తీసుకునిరమ్మంటారా?"

"అలాగే-"

"సరే బాబూ-" అబ్దుల్లా సంతోషంతో సలాంచేసి వెళ్ళిపోయాడు. కనుపించినంతసేపూ అశోక్ అతనివేపు చూస్తూవుండిపోయాడు. అతనికళ్ళలో స్నేహం, సౌహార్దం కనుపిస్తోంది.

ఈ అబ్దుల్లా తన ఏకాకిజీవితంలో ఎంత మహత్తరమైన స్థానాన్ని ఆక్రమించాడో, దాన్ని అశోక్ ఆలోచిస్తున్నాడు. ఇప్పటికి ఏడుసంవత్సరాలనుంచీ, అతను తన నౌకరీలో వుంటు న్నాడు. కాని, ఒక్కనాడుకూడా, జీతంపుచ్చుకునే నౌకరులా యజమానితో ప్రవర్తించలేదు. అతను అశోక్ యింట్లో అడుగుపెట్టినప్పటినుంచీ, ఎంతో జాగ్రత్తగా వుంటున్నాడు. నౌకరుకు యజమానికి మధ్య వుండే గౌరవాన్ని కాపాడు కోవడమే తన మొదటికర్తవ్యమనుకున్నాను.

అశోకుని మనస్సునూ, స్వభావాన్ని అతను బాగా అర్థంచేసుకుని, ఆయనయందు మంచి అభిమానంతో మెలిగే వాడు. ఎంత విశ్వాసం? ఎంత ఉదారం! డబ్బువిషయంలో

సమ్మతముంటే అతన్నే చెప్పుకోవాలి. తన యజమాని ఆరోగ్యం ఆనందంకోసం ఎన్నో ప్రయత్నాలుచేసేవాడు. అశోకుని మనసులోని ప్రతి చిన్నవిషయం అతనికి తెలుసు. ఆయన చెప్పకముందే, ఆయన యిష్టాయిష్టాలు పూర్తిచేసే వాడు. అన్నపానాదుల విషయంలో, వస్తువిషయంలో చివరకు అతని కళాభిరుచిలోకూడా, అబ్దుల్లా క్షుణ్ణంగా తెలుసుకుని ఎంతో జాగ్రత్తగా మెలిగేవాడు.

అశోక్ ఠాకూరు తన భారమంతా యీ స్వామిమీద వొదిలిపెట్టి నిశ్చింతగావున్నాడు. అతను, తన నౌకరుమాత్రమే వాడే కాదు, తన సంరక్షకుడుకూడాను. ఈ జవాబుదారిని నిర్వహించడంలో అబ్దుల్లాకుకూడా ఆనందకరమే!

అబ్దుల్లావయసు సుమారు యాభై సంవత్సరాలుంటావచ్చు. తనను గౌరవించే యజమాని దొరికాడు. మిగిలిన తన జీవితమంతా యిక్కడే గడపాలని నిశ్చయించుకున్నాడు. తనను నౌకరుగా పెట్టుకున్నవారు గొప్ప చిత్రకారుడనీ - వారి చిత్రాలు చూచేందుకూ, కొనుగోలుచేసేందుకు గొప్ప గొప్ప ఆఫీసర్లూ, రాజులూ, గౌరవకుటుంబీకులైన ఆడవాళ్ళుకూడా వస్తుంటారనీ అతను గర్వించేవాడు. తన యజమానిప్రతిష్ఠ రోజురోజుకూ పెరగడమే అతనికి కావాలిసింది. అయినా! అతనికింకొక కోరిక వుంది. తన యజమాని వివాహం చేసుకుని, ఇంటికి 'లక్ష్మి'ని తీసుకునిరావాలని. ఆ కోరిక యింతవరకూ పూర్తికాలేదు.

అబ్దుల్లా కొంచం బక్కపలచగా వుంటాడు. పాదాలు అంత పొడుగూ పొట్టిగా వుండవు. ఎప్పుడూ తెల్లచొక్కా,

తెల్లని పైజామా, తెల్లని టోపీ పెట్టుకుని వుంటాడు. నడుము చుట్టూ ఎర్రని బెల్టూ, భుజంమీద డస్టుగుడ్డ ఎప్పుడూ వుంటాయి చిన్నగడ్డానికి రంగుపూయడం అతనికి సరదాగా వుంటుంది. అందువల్ల అతనిరంగు, కాషాయరంగుగా వుంటుంది. భుజాలు కొంచం ముందుకు వంగివుంటవి. అందు వల్ల కొంచం గూనికూడా వున్నట్లు కనిపిస్తుంది. యజమానికి ధ్యానభంగంకాకుండా, ఎప్పుడూ మునివ్రేళ్ళమీద నడవడం అలవాటు. ఆయన ఆర్టిస్టు. ఆయన కళాముద్ర, ఏకాగ్రమైన భావాలూ, అక్షుణ్ణంగావుంచడమే మహత్తరమైన విషయమని అత నెరుగును. అందువల్ల అతను గదిలోనికి ఛాయాప్రకాశంలా, నిశ్శబ్దంగా, నీరసంగా వచ్చి వెడుతుండేవాడు. ఒక వేళ అశోక్ ధ్యానసముద్రలోవున్నప్పటికీ, అతని రాకపోకలు, ఆ నిశ్శబ్దవాతావరణంలోకూడా తన అంతర్దృష్టితో చూడ గలిగేవాడు. అశోకుని విశ్వాసాన్నిబట్టి ఆయనభావాల్ని గ్రహించేశక్తి అబ్దుల్లాకు వుంది. నోరు ఉపయోగించకుండానే యిద్దరికీ గంటలతరబడి వ్యవహారం జరుగుతూవుంటుంది. కాని, ఆ ఆర్టిస్టుబంగళా, సుఖవాతావరణానికి ఎప్పుడూ భంగంకలిగేదికాదు.

అబ్దుల్లాను తన నౌకరని అశోక్ ఎప్పుడూ భావించలేదు. తన ఆత్మీయుడనీ, పూజ్యుడనీ, తెలివితేటలుగలవాడైనందున తన హితంకోరేవాడనీ, పాలకుడనీ భావించేవాడు. అబ్దుల్లాను ఖర్మ్మనం నుకు ఆయన కెప్పుడూ పశ్చాత్తాపంచెందే అవసరం కలగలేదు. పైగా తన విశ్వాసంలో తన కెప్పుడూ అనిర్వచనీయమైన సుఖమే దొరికింది.

జీవితంలో అశోక్ ఠాకూరుకూడా ఒంటరిగాడే! తల్లి దండ్రులు తనకు తొందరగానే దూరమయ్యారు. కాని, వారు అతన్ని అసహాయునిగా వదిలిపెట్టలేదు. ఆ ఆర్థికబలంతోనే చిన్నతనంనుంచి, తనకు అభిరుచి వున్న కళను పొందడానికెంతో పరిశ్రమచేశాడు. మంచి మంచి చిత్రాలు చిత్రించడమే అతని ఏకైక లక్ష్యమైపోయింది బొంబాయి 'జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సు'లో శిక్షణపొందాడు. ఎందుకంటే, ఆ వేపు అతనికి స్వాభావికమైన ప్రవృత్తివుంది. అతను చిత్రకళలో తగినంత ప్రావీణ్యం సంపాదించాడు.

ఆ తరువాత మూడు నాలుగు చిత్రకళాప్రదర్శనలు చూశాడు. వాటిలో ప్రదర్శించిన మంచి మంచి చిత్రాలు ఏకాగ్రతతో అధ్యయనంచేశాడు. ప్రాచీనకళను అభ్యాసంచేసుకునేందుకు అతను, నెలరోజులు అజంతాకు వెళ్ళివున్నాడు. చిత్రకళకు సంబంధించిన మంచి మంచి నమూనాలు దొరికే ప్రతిచోటికీ వెళ్ళివచ్చేవాడు. ఇంత తిరిగాకకూడా, అతనివద్ద యింకా నాలుగైదువేలు మిగిలివున్నవి. వాటితో యూరప్ అంతా పర్యటించి, అక్కడి ఉత్తమచిత్రకళాఖండాల ఉత్కృష్ట నమూనాల్ని చూచాడు. మధ్యయూరప్‌లో అతను టస్కన్, వెనీషియన్ కళావిశారదుల చిత్రాల్ని అవలోకించాడు. రోమ్, ఫ్లోరెన్సు, మైలానాలో అతను రాఫా ఎల్ మిశేల్ ఎంజులో, సర్టి, టిటియన్, లియనార్డోదావంచీ మొదలైన చిత్రకారుల అమూల్యకళాకృతుల సౌందర్యాన్ని పానంచేశాడు. ఫ్రాన్సులో ఫ్రాన్సు ఆర్టుగాలరీ, ఫ్రెంచి అకాడమీ లూవర్‌ను దర్శించి అక్కడి కళోద్యానవనంలో కొన్నిరోజులు గడిపాడు. లండన్

న్లిసర్ జోశువా రేనాల్డ్స్, రేంబ్రాందత్, ఫ్రెంచి కళాకారుడు జాంజక్స్ హెనర్ నమూనాల్ని పరిశీలించాడు.

ఈ పర్యటనలో అతనికి మంచి మేలుకలిగింది. భిన్న భిన్న దేశాల కళాకృతుల్లో యిమిడివున్న, కళాసార్వభౌమత్వాన్ని చూడగలిగాడు. అతను స్వదేశం తిరిగివచ్చాక, తన ఉత్సాహం, అనుభూతి, ప్రేరణాసంపదలో అతనికి అభివృద్ధి కనుపించింది.

కళాతత్వాన్ని యింతగా హృదయంగమముచేసుకున్నాక, తన కళామూలధనంలోని జ్ఞానం, అనుభవమూ, నిరీక్షణాతాలూకు కొత్తపెట్టుబడిని కలిపి నాగపూరులో అతను శాశ్వతస్థిరనివాస మేర్పరచుకున్నాడు. చిత్రకళలో ఇంత ఏకాగ్రతాధ్యానం చేయాలనే నిరంతరసాధన ఫలితం లేకుండా ఎలా పోతుంది? అశోక్ ఠాకూరు చిత్రాలు యీ ప్రాంతంలోనూ బయటకూడా అనేకమంది మెప్పు పొందాయి నాగపూరులో మిస్. దినేశ్ కాంగా, సారంగపుర మహారాజా, బొంబాయిమిల్లుయజమాని వసన్ జీ ఖిమ్ జీ అతనికి ఆదరణీయమైన ఖాతాదారులు. తగిన విలువయివ్వడంలో వెనుకాడరు. అంతేకాకుండా అతనిచిత్రాలు విడిగాకూడా కొనేవారు. బొంబాయి ఫిల్ముకంపెనీలవారు మరికొన్ని చిత్రాలు కాంట్రాక్టు చేసేవారు. ఈవిధంగా అశోక్ ఠాకూరుకు జీవనోపాధి ఎప్పుడూ సమస్యగా పరిణమించలేదు.

అయితే ఒకటి! అశోక్ ఠాకూరు కానుకలోబడి తన కుంచెరంగును మలినంచేయలేదు. కాండినాణ్యాల ఆదేశంతో, తన తూలికగతిని, నియమబద్ధం చేయలేదు. అనుకున్నప్పుడే

చిత్రీకరణ కుపక్రమించేవాడు. ఇష్టంలేనిసమయాల్లో వెయ్యి రూపాయలిచ్చినా బొమ్మ వేసేవాడుకాడు. డబ్బును తిరిగి యిస్తూ—'ఏమి చేయమంటారండీ! నాలో అనుభూతి ఆవేశాల కవోష్ణప్రవాహం యింకిపోయింది' అనేవాడు.

అసలైన కళాభిలాషులు అశోక్ ఠాకూరుయొక్క యీ ఆవేశాన్ని బాగా గ్రహించేవారు. అందుచేత బలవంతంచేసే వారుకారు. ఆవేశం పొంగి పరవళ్ళెత్తినప్పుడు ఒక్క నెలలోనే పది, పన్నెండు అందమైన చిత్రాలు సునాయాసంగా చిత్రించగలడనేది అందరికీ తెలిసిన విషయమే!

'న్యూకాలనీపేట'లో, ఒక పెద్ద ఆవరణా, తోటతో కూడివున్న, అందమైన బంగళాపై అంతస్తును అద్దెకుపుచ్చుకొని అశోక్ ఠాకూరు తన నివాసం ఏర్పాటుచేసుకున్నాడు. బంగళా అంత విశాలమైనదికాకపోయినా, ఒంటరిగాడైన అతనికి మంచి వసరుగావుంది. పడమటివైపున వున్న పెద్దహాలును స్టూడియోగా చేసుకున్నాడు. వెలుతురుకోసం రెండు తెల్లని అద్దాలకిటికీలు తప్ప మిగిలినవన్నీ గరుకద్దాలుబిగించారు. గోడలకు అందమైన పసుపుపచ్చని వార్నిష్‌వేసివుంది. తలుపులకూ కిటికీలకు లేత నీలిరంగుపరదాలు కట్టబడివున్నవి. ఒకమూల ఎత్తైనప్రదేశంలో రవీంద్రనాథటాగూరు పాలరాతివిగ్రహం, రెండోమూల మహాత్మాగాంధీవిగ్రహం అందంగా అమర్చారు. మధ్యహాలులో మేజాబల్లమీదున్న పూలగుత్తి ఎప్పుడూ పరిమళాన్ని పుస్తూవుంటుంది,

గదిలో అక్కడక్కడా పూలకుండీలూ, పచ్చని మొక్కలకుండీలు వున్నాయి. ఒకవేపు గోడమీదున్న కాన్వాస్

పరదామీద విశాలమైన సూర్యోదయచిత్రం చిత్రింపబడివుంది. దానికి ముందుగా పెద్దస్టూలు ఒకటుంది. చిత్రం వేయించుకునే వ్యక్తి దానిమీద కూచుంటాడు. మిగిలిన గోడలమీద, ఇటాలియన్, ఫ్రెంచి చిత్రకారులఫోటోలు, తనఫోటోలు వున్నాయి.

స్టూడియోలో ఒకమూల ఒక స్ప్రింగ్‌సోఫా, దానికి కుడిప్రక్కగా పడకకుర్చీ, ఎడమప్రక్కగా తిరిగేకుర్చీ వుంది. అశోక్ దానిలో కూర్చుని తను చిత్రించిన చిత్రాలను చూస్తూనో లేక కళ్ళుమూసుకుని ఊహాలోకంలోనో నిమగ్నుడై వుంటాడు. బిరబిరలాడుతూ పైన పంకా తిరుగుతూ వుంటుంది. అది స్టూడియోనా లేక కళాసౌందర్యోద్యానవాటికా అనిపిస్తుంది. అందులో ప్రవేశించి అశోక్‌ఠాకూరు తన స్వప్నాల్లో సంపూర్ణంగా లీనమైపోతూవుంటాడు.

ఆ గదిముఖద్వారాని కానుకునే కూర్చునేగది వుంది. దాన్ని మూసివేసినప్పుడు స్టూడియో పూర్తిగా ఏకాంతమైపోతుంది. ఆ సమయానికి భంగంకలగరాదనీ, అబ్దుల్లా, మిగిలిన నౌకరులుకూడా దాని నసలు తట్టవద్దని ఆదేశింపబడ్డారు. అతని ఖాతాదారులుసైతం యీ నియమముచేత బయటినుంచే తిరిగిపోవలసివచ్చేది. కొంతమందికి కష్టంకలిగేది. కాని అశోక్ ఠాకూరు ఎవరినీ లక్ష్యంచేసేవాడుకాడు. కళాసాధనకు భంగం కలిగినప్పుడు తనకు మిగిలేదేమిటి? తన జీవితానికి సార్థకత ఏమిటనేవిషయంపై అతని నిర్ణయం స్థిరమైపోయింది.

అశోక్‌హృదయం దయ, కరుణ, స్నేహానుభూతులతో సంపూర్ణంగా నిండివుండేది. ఏకాంతవాసమే అతనికి ప్రియమైనది. నలుగురితో కలిసిమెలిసి తిరగడం అతనికి

సుతరాం యిష్టంవుండదు. అతని సౌమ్యమైన చూపులు సృష్టిలోని రమణీయతనూ, సుఖవిలాసాల్నే గాకుండా, ప్రపంచంలోని దుఃఖదారిద్ర్యాల్నికూడా అమితోత్కంఠతో అవలోకిస్తుంటవి. సుఖంకన్నా దుఃఖమే అధికమని, సత్యంకన్నా అసత్యం మిన్నఅనీ, న్యాయం, ప్రేమలకు బదులుగా అత్యాచారాలూ, తిరస్కారాలే ప్రపంచంలో ఎక్కువని అతను తెలుసుకున్నాడు. సమాజాన్ని యీ అవినీతినుండి పునరుద్ధరింపచేయడం, యీ ఘోరమైన అమానుషాన్ని అంత మొందించడం అత్యావసరమని అతను భావించాడు. అది జరగనినాడు ప్రపంచం సుఖశాంతులతో తులతూగే రామరాజ్యం కానేరదని అతనివాదన!

ప్రతి కళాకారుడూ—అతను కవిగాని, చిత్రకారుడుగాని, శిల్పిగాని, నటకుడుగాని, మరెవరైనా సరే యిటువంటి కలలే కంటుంటాడు. సంస్కారంతో వికసించిన అతని ఆత్మ, విశ్వంలోని ఉన్నతమైన ఆత్మతో సమరసమై, సృష్టిలోని అంతిమ సత్యాన్ని ఆకళింపుచేసుకుంటుంది. అందువల్ల అతనికి రాబోవు అవకాశాన్ని చీల్చుకుని, దానిలో దాగివున్న భవిష్యత్తునూ, అందు తనకు ప్రాప్తించే స్థానం మొదలగునవి వూహించే దృష్టి అతనికి లభ్యమవుతుంది. కళాకారుడు తన యీ స్వప్నంమీద ఎంతో విశ్వాసం, శ్రద్ధా కలిగివుంటాడు. అంతేగాకుండా, ఆ స్వప్నమే అతని ప్రేరణ, అనుభూతుల ప్రవాహమవుతూ వుంటుంది

విద్యుద్దీపాలుగులో అద్దంముందు నిలబడి చొక్కాకు గుండీలు తగిలిస్తున్నసమయంలో మాయాదేవి నీలకంఠ కాదు

హారన్ మోగిస్తూ ఆవరణలో ప్రవేశించింది. తనకోసం కారు వచ్చిందనే సంగతి అబ్దుల్లా వచ్చి చెప్పాడు.

## 3

మాయాదేవి మెట్లమీదకు ఎదురొచ్చి అశోకునికి స్వాగతం పలికింది. 'రండి, రండి; యిప్పటికి నా మనసు కుదుట పడింది. కారు ఖాళీగా మరలవలసివస్తుందేమోనని ఆఖరి క్షణంవరకూ భయపడుతూనేవున్నాను.'

'ఎందుకూ?....వస్తానని మాటయిచ్చినప్పుడు తప్ప కుండా వస్తాను. యీ మాత్రం విశ్వాసముంచండి'

'విశ్వసించడమా! మీబోటి ఆర్టిస్టులను ఎలా నమ్మాలో చెప్పండి? ఈ సమయంలో బాబుగారి ఆలోచ నోత్సాహం పరవళ్ళుత్రొక్కుతోంది. స్టూడియోలో వున్నా రని చెప్పి పంపుతారు. అటువంటప్పుడు ఉపాయ మే ముంటుందో చెప్పండి?'

అశోక్ నవ్వి అన్నాడు - 'అవునవును! అప్పుడప్పుడు అలానే జరుగుతూవుంటుంది. కాని, అది నెపంకాదు, నిజమే.'

'ఏమో!' మాయాదేవి పెంకితనంగా నవ్వుతూ అన్నది.

తన అతిథుల్ని ఎలా సంతోషపెట్టాలో, ఆ కళ పూర్తిగా మాయాదేవికి తెలుసునని అశోక్ గ్రహించాడు. తనింటికి • రావడానికి సందేహిస్తున్నాడని మాయాదేవికి తెలుసు. అందువల్ల ఆమె అతన్ని అనురక్తునిగా చేసుకోవటానికి, అతనిస్నేహాన్ని సంపాదించటానికి విశేషంగా ప్రయత్నిస్తోంది.

మాయాదేవి నీలకంఠ పట్టణంలో సామాజికంగా ఎంతో ఉన్నతస్థానంలో వుంది ధనవంతుడైన తండ్రికి ఏకైక పుత్రిక. అంతకుమించిన ధనవంతుడైన జమీందారుతో వివాహమైంది. కాని, రెండేళ్ళకే, భర్త ఆమెను సంతానహీనంగా, లక్ష్మీకటాక్షాన్ని ఆమెకు వప్పగించి, వొంటరిగా వదిలిపెట్టి పరమపదించాడు. రెండుప్రక్కలనుంచీ ఆమెకు సంపద లభించింది. జమీందారీయేగాకుండా, ఒక్క నాగపూరులోనే ఎక్కువ అద్దెలువచ్చే ఆరు బంగళాలూ, అయిదు పెద్ద పెద్ద మేడలూ ఆమెకున్నవి. బట్ట మిల్లుల్లో, బొగ్గుగనుల్లో, రైల్వేకంపెనీల్లో ఆమెకు షేర్లు వున్నవి. అందుచేత ఆమెకు 'ధనాని కేమీ కొదువలేదు. అందులో అనుభవించేది ఒక్కర్తె! భర్తమృత్యువు ఆమెను విశేషంగా సుఖపెట్టినట్లు ఎవరూ వూహించలేదు. అసలు వారిద్దరికీ సరిపడదని చాటుమాటున అంతా అనుకునేవారు.

ఆమెరూపాన్నీ, అంతకు మించిన ఆమెభాగ్యాన్నీ చూచి, కొంతమంది రసికులైన సభ్యయువకులు సనాతన రీతి రివాజులకు స్వస్తిచెప్పి, సమాజంయెదుటనే విధవావివాహం చేసుకుంటామనే ఆదర్శాన్ని తెలియబరచి, తమ యీ లక్ష్యం కోసం సమాజం విధించే అన్ని అన్యాయాల్ని, అత్యాచారాల్ని తాము సహించేందుకు సిద్ధంగావున్నామని చెప్పారు. కాని మాయాదేవి ఈ ఆదర్శవంతులైన యువకులకు తన కృతజ్ఞత తెలియజేసులేదు. తీక్ష్ణమైన బుద్ధీ, వ్యవహారజ్ఞానము కలిగివున్నదవటంచేత తన అంతరాత్మను సంపూర్ణంగా అర్థంచేసుకున్నదవటంచేత, తనకు దేనిలో మేలువుందో, అది

బాగా తెలుసుకుంది. 'మేలు' అనడంకంటే, తనకు 'సుఖం' వున్నదానినని అనడం బావుంటుంది.

మాయాదేవికి జీవితంలో భోగ-విలాసం, ఆనందం తప్ప, యింకొక ఆసక్తివున్నట్లు ఎవరికీ కనిపించదు. సమాజంలో ఘనతను చాటించుకునేందుకు, మహిళామండలి, సేవాసమితి, ఉమెన్సుక్లబ్, ఫ్రెండ్సులాడ్జి ఆసుపత్రి మొదలైన కమిటీలలో మెంబరైంది. చందాలు, విరాళాలు యివ్వడంతప్ప ఆమెకు వాటితో పనిలేదు. చందాలు యివ్వటానికి ఆమెవద్ద కావలసినంత డబ్బు వుంది. విరాళం దొరుకుతుందనే ఆశతో కొన్ని ఊరుపేరు లేని సంస్థలు ఆమెను తమ సభలకు, సమ్మేళనాలకు ఏ అధ్యక్షురాలిగానో, కార్యదర్శిగానో ఆహ్వానించేవారు. మాయాదేవికి పేరుప్రతిష్టలు కావాలి. సంస్థలకు ధనం కావాలి. అందుచేత యిటువంటి కార్యక్రమాలు ఎడతెరిపి లేకుండా వుంటాయి అంతేకాకుండా? ఆమె రకరకాల క్లబ్బులలో మెంబరుగా వుంటుంది. అక్కడి సమావేశాలకు హాజరైన గొప్పగొప్ప ఆఫీసర్లను తనింటికి విందు కాహ్వానించి, తను వారింటికి విందుకు వెళుతుండేది. ఆ యా సందర్భాలలో అప్పుడప్పుడూ ఆమెఫోటోలు పత్రికల్లో పడుతూవుండేవి.

"సివిల్ లైన్"లో విశాలమైన సుందరమయిన బంగళా వుంది మంచి ఫర్నిచరు, రేడియో, తివాచీలు, చిత్రాలు, శిల్పమూర్తులు, ఆహారసామగ్రి, రెండు కొత్తడిజైను కారులూ, అనంతమైన సౌభాగ్యం, సౌందర్యం, యవ్వనవసంతమే కాకుండా, సమాజంలో మంచి పలుకుబడికూడా వుంది. ఇంకేం కావాలి జీవితానికి? వీటన్నిటికీ మించినది ఆమెను

అదుపుల్లో పెట్టేవారు లేకపోవడమే! ఏ ఆచరణయితే, ఒక బీదరాలి జీవితంలో, లోకాపవాదుల కాఠిన్యత, తీక్షణమైన సమాజకుత్సితముల కారణంగా ఆత్మహత్యతప్ప యింకొక మార్గం వుండదో- అటువంటి ఆచారణే ధననైభోవోన్నతి కారణంగా మాయాదేవి జీవితంలో సుసంస్కారమనే పేరుతో వ్యవహరింపబడుతోంది.

మాయాదేవి విషయంలో కొంతవరకు అశోక్ ఠాకూర వినేవున్నాడు. అందువల్ల ఆమె యం దతనికి మంచిఅభిప్రాయం కలుగలేదు. అతను 'కళ'అనే చిన్నప్రపంచంలో మునిగి వున్నాడు సామాజిక ఆచారవ్యవహారాలపట్ల అతని కభిరుచి గానీ, వినియోగించేందుకు కాలంగానీ లేదు. మాయాదేవితో యింతవరకూ ఏవిధమైన స్నేహసంపర్కం లుంచుకోకుండా వుండటాని కిదే కారణం కావచ్చు. ఇప్పు డేర్పడిన సంపర్కాన్ని ముందు యిలానే కొనసాగిద్దామనే ఉద్దేశ్యం కూడా లేదు. అసభ్యత, కళంకాలనుంచి తనను తాను రక్షించు కోవాలనుకుంటున్నాడు ఈ కొత్తపరిచయ పురస్కారంనుండి ప్రక్కకు తప్పుకుందామనుకుంటున్నాడు. ఎందుకంటే, తనకూ ఈ విలాసప్రియురాలికీ పొత్తు లేదని అతని అంతరాత్మ ఏమూల నుండో ప్రబోధిస్తోంది. అందువల్ల ఆమెయం దాతని స్నేహంలో సత్యంలేదు. అవును! అతను చిత్రకారుడు. చిత్రాలు గీస్తుంటాడు. మాయాదేవి వాటిని కొంటూ వుంటుంది. ఆతను వ్యాపారి, ఆమె ఖాతాదారు.

కాని, మాయాదేవిమనసులో దీనికి విరుద్ధమైన ఆలోచనలు చెల రేగుతున్నవి. ఆమెకళ్ళకు అశోక్ ఠాకూర

పరిపూర్ణుడుగా కనుపించాడు. ఆమె ఎలాగైనా అతన్ని పొందాలని ఆశిస్తోంది. ఆమె చాలా పట్టుదలగలది. ఆమె కోరిన వస్తువు అది కారైనా, చిత్రమైనా, చీరైనా, పురుషుడైనా,—దాన్ని పొందటానికి తనకున్న శక్తినంతా ఎకుర్గొడ్డి దాన్ని పొందితీరుతుంది. ఆమె యింతవరకూ అపజయమంటూ ఎరుగనే ఎరుగదు. అవును! ఆమె అశోకుని పొందాలంటే తన ప్రవర్తనలో మార్పురావాలి. ఎందుకంటే, అతను మిగిలిన పురుషులకన్నా భిన్నమైన ప్రకృతిగలవాడు. తన రూప జ్వాలలో మిడుతలా పడేవాడుకాడు పైగా అతను కొంత అసహ్యించుకుంటున్నట్లు కన్పిస్తోంది అతనితో వ్యవహరించే టప్పుడు జాగ్రత్తపడవలసిందే!

ఇద్దరూ డ్రాయింగురూంలో సోఫామీద కూర్చున్నాక అశోక్ అడిగాడు- "యింకెవరూ రావడం లేదా?"

"లేదండీ! అలా వచ్చినట్లయితే మీవిషయంలో యింత శ్రద్ధ ఎలా చూపించగలుగుతాను చెప్పండి? మిమ్మల్ని పిలిచిన కారణంగానే, నేటి సాయంత్రం ఏమీ ప్రోగ్రాం వేసుకో లేదు."

"ధన్యవాదాలు. కాని, నాకోసం మీ రలా చేసి నందుకు నేను చాలా విచారిస్తున్నాను."

"నా కా విచారంలేదు. ఆనందంగా వుంది. ఇదంతా మీకోసం కాదు, నాకోసం ఏర్పాటుచేశాను."

ఈమాట విని అశోక్ సంతోషించాడు. కాని, ఈ పద జాలంలో ప్రతిధ్వనించే సూక్ష్మార్థం అతనికి బాగుండ లేదని పించింది. ఈ అయిష్టతకు తోడు మాయాదేవి అంటూపంటూ

లేని కృత్రిమాలంకారం మరింత కలవరపరచింది. తళతళలాడే భూషణాల మెరుపేకాకుండా, దట్టంగా పట్టించిన లిప్‌స్టిక్, కళ్ళకాటుకా, ఫేస్‌పౌడరు, తలకురాసిన సువాసననూనె, సెంటూ మొదలైన ఉపకరణాలతో మాయాదేవి తన నాజూకైన కోమలదేహాంచుట్టూ ఉన్మాదమైన వాతావరణం కల్పించడంలో ఏమాత్రం అశ్రద్ధచేయలేదు. కాని అశోకుని విషయం వేరు. ఏ ఆకర్షణ మగవాళ్ళను మత్తులో ముంచి లేవనెత్తగలదో, అటువంటి ఆకర్షణ అతనికి అయిష్టంగా వుంటుంది. మాయాదేవిని చూస్తుంటే అతని కెలాగో అనిపించింది.

అతనొక లావణ్యవతి మోహప్రభావంనుంచి తనను తాను దూరంగా వుంచగల నిగ్రహాపురుషోత్తముడుకాడనేది నిజమే! కాని ఎక్కడైతే, అతనికి కృత్రిమము, అనాత్మీయత, తన హృదయంలోని చిరంతన సంస్కారాలకు హానికలిగించేవిగా కనిపిస్తాయో, ఎంత ప్రయత్నించినా తన హృదయం అటు ఆకర్షింపబడకపోవడంకూడా నిజమే. కాని, అతను తన మనసులోని భావాలను బయటికి కనుపించనీయలేదు. తన మనసును ప్రసన్నంగానే వుంచుకున్నాడు.

తళతళమెరుస్తున్న తెల్లకోటు ధరించిన వంటవాడు పరదాను తొలగించుకొని అతివినయంగా లోపలికి వచ్చి "భోజనం తయారయ్యిం"దని చెప్పాడు.

## 4

డిన్నరు టేబులుదగ్గర కూర్చునేముందు, మాయాదేవి ఎదురుగావున్న గోడవైపు వ్రేలితో చూపించి- "అదేమిటో చూడండి!" అన్నది.

అది తను చిత్రించిన 'ప్రణయజంట' చిత్రమే! ఆ ప్రదర్శనలో ఆమె కొన్నది.

అశోక్ కేవలం చిరునవ్వునవ్వి వూరుకున్నాడు.

"ఆ ప్రదేశంలో యింతకుముందు ఏ చిత్రంవుండేదో ఎరుగుదురా? ప్రసిద్ధ కళావేత్త 'రాఫాయెల్' చిత్రించిన ట్రాన్స్ఫిగరేషన్! ఆ చిత్రాన్ని తొలగించి, మీ చిత్రాన్నక్కడ అమర్చాను." మాయాదేవి సగర్వంగా చెప్పింది.

"ప్రపంచప్రసిద్ధులైన కళాకారులను మీరెందుకీవిధంగా అవమానిస్తున్నారు?" కొద్దిగా క్షుబ్ధుడై అశోక్ ఠాకూర్ అడిగాడు.

"కాదు. యిది అవమానంకాదు. నేను బ్రతికివున్న కళాకారులను అభిమానిస్తున్నాను." కొంచెమైనా చలించకుండా మాయాదేవి తన జగన్మోహనవీక్షణాల్ని అతనిమీదకు ప్రసరింపజేసింది.

భోజనాలబల్లముందు కూర్చున్నారు. టేబులుమధ్యలో గ్రీకుదేవత వీనస్ పాలరాతి నగ్నప్రతిమ చేతిలో అగరువత్తులు వెలుగుతున్నాయి. దానిచుట్టూ వుంచిన పూలగుత్తులవర్ణాలు చూస్తుంటే, ఆ గ్రీకుదేవి ఏదో నందనోద్యానవనంలో విహరిస్తున్నట్లుంది. ఈ దృశ్యం అశోకునిమనస్సును ఆకర్షించిందనే

సంగతి మాయాదేవి వెంటనే పసిగట్టింది ఆమెకూడా లోలోపలే సంతోషించింది.

భోజనాలు మొదలుపెట్టాక మాయాదేవి ప్రారంభించింది. "మీ కళలాంటి అనుపమకళను నేనీదేశంలో ఎక్కడా చూడలేదు. నేనెంతో దూరం తిరిగి చూశాను కొంతమంది చిత్రకారుల చిత్రాల్నికూడా చూశాను. కాని మీకుసాటివారెవ్వరినీ చూడలేదు. మీ కళ నాకు చాలా ప్రియమైనది."

ఈ ఆఖరివాక్యం 'తన కళ ప్రియమైనదా? లేక కళాకారుడు ప్రియమైనవాడా—?' అన్నంత వ్యంగ్యంగా పలికింది. అశోక్కు సంకోచం కలుగకపోలేదు. పొగడ్తలు వినడానికి అలవాటుపడిపోయాడు కనుక, అత నా మాటలకు సంతోషించనూలేదు, విచారించనూలేదు. ప్రస్తుతం సమాజశిష్టాచారంతప్ప వాటికి ముఖ్యమైన విలువకూడా లేదు. అత నేమీ మాట్లాడకుండా తలొంచుకుని తింటున్నాడు.

మేజామీద, భోజనాలసామాగ్రి అంతా వెండిదే! వాటి తయారీ, డిజయినులు చూస్తుంటే, మాయాదేవి సౌందర్యపిపాసి అని తెలుస్తోంది. ఆ సమయంలో అశోక్ చుట్టూ, వైభవమూ, విలాసవాతావరణం ఆవరించి వున్నది. కాని ఇటువంటి వాతావరణం సారంగపుర మహారాజు మహాల్లోను, బొంబాయిలో ధనవంతులభవనాల్లోనూ చూసి వున్నందువల్ల, వాటి ప్రభావం అతనిమీద పడలేదు. అసలు యిటువంటి వస్తువులు అత న్నెప్పుడూ ఆకర్షించలేదు. రంగు రంగుల విద్యుద్దీపాలు, ముఖమల్ రత్నకంబళులకంటె, నిర్మ

లాకాశంలో తళతళలాడే నక్షత్రాలు, పచ్చనిగడ్డితో కప్ప బడిన నైసర్గికరూపమంటే అతని కెంతో ప్రీతి!

ఇంతవరకు అశోక్ ఎక్కువగా మాట్లాడలేదు. అతన్ని మాటల్లోనికి దించాలని మాయాదేవి ప్రారంభించింది. మీ రింత అందమైన కళను ఎక్కడ నేర్చుకున్నారు? బొంబాయి ఆర్టుస్కూలులోనేనా? మీ చిత్రాలు సజీవంగా కన్పిస్తాయ్"

"బొంబాయి ఆర్టుస్కూలులో వున్నాను. కాని, స్కూలులో నేర్పేంతమాత్రాన కళ నేర్చుకునేది కాదు. అక్కడ నేర్చుకునేదంతా కళాతంత్రమే! కళాత్మను దర్శించేం దుకు యింకొక శాలకు వెళ్ళవలసివుంది. అదే జీవితశాల. రమణీయమైన ప్రకృతివిద్యామందిర మదే! అనుపమ సౌందర్యంతో కూడిన ప్రకృతిసంపర్కంలో కలిగే అనుభూతే కళాప్రేరణ. అదే జీవితప్రవాహం!"

"నేనుకూడా ప్రకృతిసౌందర్యంతో తులతూగే ప్రదేశాలు ఎన్నో తిరిగాను. కాశ్మీర్, డార్జిలింగ్, గోవా, నీలగిరి మొదలైనవే కాకుండా అందమైన పర్వతాలూ, నదులూ, సెలయేర్లూ, ఉద్యానవనాలు చూచాను. కాని, మీ రన్న ఆ అనుభూతి, ప్రేరణ నా కెన్నడూ కలుగలేదు. ఆ ప్రదేశాలను మంచి మంచి చిత్రకారులు చిత్రించినప్పుడు, అవి నా డ్రాయింగురూంలో ఎంతో శోభాయమానంగా కన్పిస్తుంటాయి."

"మీ రసలు కాశ్మీర్, డార్జిలింగ్ ఎందుకు వెళ్ళవలసి వచ్చింది? అక్కడి ప్రకృతిసిద్ధమైన సౌందర్యం, వాటి పిలుపు

మిమ్మల్ని ఆకర్షించినందువల్ల కాదనుకుంటాను. సామాజిక వార్తాలాపాల్లో కాశ్మీరు, డార్జిలింగ్‌లవిషయం ప్రస్తావించడం, ప్రస్తుతకాలంలో సభ్యతా సంస్కారమని అనుకుంటున్నారు. అక్కడి చిత్రాలు కొన్ని మీ భవనంలో ప్రదర్శించడం, మీ కళాభిరుచిని తెలియచేస్తుందని మీ మిత్రులెవ్వరైనా చెప్పినందువల్ల అక్కడికి వెళ్ళివుంటారేమో! ఏ సౌందర్యం, ఏ ఆనందం మన హృదయాల్లో వుండదో, ఏ సత్యం మన మనసులో తిష్టవేసుకుని కూచుంటుందో, దాన్ని మనం హిమాలయపర్వతకందరాల్లో, కాశ్మీరు ప్రకృతిఉద్యాన వనాల్లో ఎంత వెదికినా దొరకదు. ఎప్పుడూ లభించదు. ఇక గోడలమీద వ్రేలాడదీసిన చిత్రాలు, మూర్తులవిషయంలో చెప్పాలంటే, దాని వెనక అసలైన కళాదృష్టి లేదు. కేవలం అందమైన ప్రతివస్తువుమీదా తమ అధికారంవుందని, మానవులు తమ క్షుదను తృప్తిపరచుకోవడానికే అవుతుంది. ఒకవేళ ఆ అందమైనవస్తువు యింకొకరిదగ్గర చూచినప్పుడు ఈర్ష్యకూడా కలుగుతుంది. అదే మనదగ్గరుంటే, అభిమానంగా వుంటుంది. ఇటువంటిదానిని కళయందున్న నిర్మలానురాగమని అనలేము.”

విషయం సరళంగా, తేటతెల్లంగానే వుంది. ఆ మాటలు తనలాటివాళ్ళని ఉద్దేశించి అన్నవేనని మాయాదేవి వెంటనే గ్రహించింది. అందుకని కొంచెం కోపంకూడా కలిగింది. కాని, యింతవరకు యింత సరళంగా ముక్కుసూటిగా చెప్పేవారెవరూ ఆమెకు తటస్థించలేదు. అందరూ తన వయ్యారాన్ని ప్రశంసించేవారే! అర్థంవున్నా లేకపోయినా పొగిడే

వారు. అందువల్ల ఆమె సంతోషించినా, కృత్రిమమైన ఆ పొగడ్తలకు విసుగుకూడా కలిగేది. అందువల్ల అయిష్టంతో కూడిన అశోకుని వాక్యాలకుకూడా, ఆమెకు ఓ విచిత్రమైన సుఖమే కలిగింది. కాని, ఆ మరుక్షణంలోనే ఆమె అహంభావం మేలుకుంది.

కొంచెం ఆవేశంతో అడిగింది- "మాకు కళయందనురాగమూ, అభిరుచీ లేవని మీరెలా చెప్పగలరు? మేము ఎప్పుడూ అందమైన వస్తువుల్నే కొంటుంటాము. మా గోడల మీద సినిమాపోస్టర్లుగాని, రైల్వే ప్రకటనలుగాని అంటించడం లేదుకదా?"

"మీరు మీ యింటిని హోటలుగానో, ధర్మసత్రంగానో పరివర్తనం చేయదలుచుకోలేదు గనుక అలాచేస్తారు. కాని, అసలు సమస్య అది కాదు. అసలది కళాదృష్టితో కూడినది. దాన్ని బాహ్యోపకరణాలతోనూ, వాతావరణంతోనూ పొందలేము. మనహృదయంతో, ఆత్మ అంతఃకరణాలతో దానికి సంబంధంవుంది. ఒకవేళ యీ భగవంతుని చేత నిర్మించబడిన అందమైన విశ్వంమీద మనకు అనురాగం లేకుంటే, మనం కళాత్మక ఆత్మను పొందలేము. దాని, నిర్మలమైన ఆనందాన్ని చేజిక్కించుకోలేము. ఇది కళాకారులకూ, కొనుగోలుదారులకూ వర్తిస్తుంది. ఒకవేళ కళాకారుని హృదయంలో యీ సృజనా ప్రేమ లేనప్పుడు, అతని చిత్రాల్లో సజీవత్వంగాని, సౌందర్యంగాని వుండవు. ఒకవేళ కొనుగోలుదారు హృదయంలో యిది లోపించినప్పుడుఅతనికి రంగూ, కాన్వాస్ మిశ్రణతో శాశ్వతమైన నిర్మలానందం దొరకదు.

మొదట దాన్ని చూచి సంతోషిస్తాడు. కాని పిల్లవాడు 'కొత్త బొమ్మను పొంది, ప్రొద్దస్తమానం దానితో ఆడుకుని చివరకు విసుగెత్తి దాన్ని కంటికి కనుపించకుండా ఒకమూలకు విసరి వేసినట్లు,—కొంచంసేపట్లోనే అది నిర్జీవమైనదని తెలుసుకుని పారవేస్తారు."

"అటువంటప్పుడు ఈ కళాదృష్టిని పొందాలంటే ఏమి చేయాలంటారు?"

"మనం జీవితాన్ని ప్రేమించడం నేర్చుకోవాలి. మన వ్యక్తిగత స్వార్థ సుఖవ్యసనాలజీవితాన్ని కాదు. సమాజ జీవితాన్ని, ప్రకృతి జీవితాన్ని, సజీవమైన జీవితాన్ని మాత్రమే ప్రేమించడం నేర్చుకోవాలి. జీవితంలోని సుఖదుఃఖాలు, కోలాహలం, కలహాలు సహజమైన ప్రకృతినుంచి పారిపోయి, జీవితంనుండి విముఖులై, ఆ జీవితానికి ద్రోహం చేసుకుని, పాలరాతి నిర్జీవప్రతిమలను, రంగూ కాన్వాస్ మిశ్రణను, గ్రామఫోనురికార్డు సంగీతాన్ని ఆశ్రయించకూడదు. దానివల్ల క్షణికమైన ఆనందం, సుఖశాంతులు దొరకడమే తప్ప, ఆశ్రయం మనకు దొరకనే దొరకదు. మనం ప్రకృతిలోని దైవికమైన సౌందర్యాన్నుంచి విడదీయబడాలని వనశ్రీచెంతనుంచి పారిపోయి, కృత్రిమ రంగుల శరణుపొందాలని చూస్తున్నాము. మానవరూపంలోని సజీవమూర్తులను వొదిలిపెట్టి, రాతి ప్రతిమలకై పరుగుతీస్తున్నాము. కోయిలపాటను, సెలయేటి కలకలనినాదాలకు విముఖులమై, బాజాభజంత్రీల మూడు పాటల్లో ఆనందాన్ని వెదుకుతూ తిరుగుతున్నాం. ఈవిధంగా నిర్మలానందం దొరుకుతుందేమో మీరే చెప్పండి?"

"ఐతే, ఈ చిత్రాలకూ, శిల్పమూర్తులకూ, సంగీతానికీ అర్థమేమీ లేదా ? ఒకవేళ అలాగైనప్పుడు, మీబోటి చిత్రకారుల ప్రయోజనమేమిటి ? వారిని ప్రోత్సహించినందువల్ల లాభమేమిటి ?"

"అవును ! ఈ చిత్రాలకూ, శిల్పమూర్తులకూ, గీతాలకు అర్థంలేకపోలేదు. ప్రయోజనంకూడా వుంది. కాని ఒక పరిమితివరకే ! విశ్వంలోని అనుపమసౌందర్యం తిలకించడానికి, మీ కళ్ళను తెరిపించడమే దాని ప్రయోజనం. ఆ సౌందర్య దృష్టి, కళాదృష్టి మీకు అలవడినపిమ్మట, వాటి పని ముగిసిపోతుంది. ఆ తరువాత మీ కళ్ళు, యీ నవీనశక్తిని పొంది స్వయంగా సృష్టిలోని అభిరామసౌందర్యరాశిలో తన ఆనందకర వస్తువుల వెదుకుతూ, వాటిని నిరంతరం పొందుతూవుంటాయి. ఆపైన శాశ్వతానందపు కోశాగారాలతలుపులు వాటంతటవే తెరచుకుంటాయి. చిత్రాలకూ, కళావస్తువులకు యింతకు మించిన ప్రయోజనమేమీ లేదు. చిత్రం ప్రాకృతికసౌందర్యం పొందాలని, రాతిప్రతిమలు సజీవమానవత్వాన్ని పొందాలని, కృత్రిమ వాయిద్యసంగీతం నభోమండలంలోని ప్రకృతి సంగీతస్థాయిని పరిగ్రహించాలనే ప్రయత్నం జరిగినట్టయితే పతంగం చంద్రుణ్ని పట్టుకోవడానికి ప్రయత్నించినట్లే పరిహాసాస్పదమై పోతుంది. ఇది కళయొక్క అనధికారయత్నం! దాన్ని అవమానించినట్లే ! నేనేదో మంచిచిత్రాన్ని చిత్రిస్తున్నానుకదా! నేనుకూడా సృష్టికర్తకు సమానమైనవాణ్ణని చాటుకుంటే, అది అహంకారం కాక మరేమవుతుంది? నేను స్వతహాగా విశ్వ సత్యం, శివం, సుందరాన్ని చూచి దానిలో యిమిడివున్న

సూక్ష్మాతిసూక్ష్మమైన కాంతిని పరికించేందుకు ప్రయత్నించి, వీలుంటే ఆ కాంతిని ప్రజలకు చూపిద్దామనుకుంటున్నాను. ఒకవేళ నా అనుభూతే నిజమై, నా దృష్టిలో దోషంలేకుండావుంటే, నేనా త్రిగుణాత్మక సౌందర్యదర్శనాన్ని మాత్రమే ప్రజలకు చెప్పగలుగుతాను. ఒకవేళ అలా చేయలేకపోతే, నా కళకూ, రంగుకూ, కుంచెకు అసలు విలువే వుండదు. నేను కళాకారుణ్ని కాకుండా కేవలం అద్దకపుపనివాడినవుతాను."

ఇదంతా అశోక్ ఆవేశంతో అనేశాడు. ఒక్కొక్క శబ్దం అతని అంతఃకరణంలోంచి బయటికి వచ్చింది. ఎందుకంటే, అతను చెప్పేదానిలో అతని కంత శ్రద్ధవుంది. మాయాదేవి మీద యీ నిశితసత్యవాక్ప్రభావం బాగా పడింది ఆమె తన కృత్రిమాభినయాన్ని మరిచిపోయి, ఏకాగ్రతతో అతని మాటలు వింటోంది. అంతా చెప్పాక, తను ఆవేశంలో పడినట్లు గ్రహించుకుని, అదంత శిష్టాచారంకాదని సిగ్గుపడి, "ఏదో ఉపన్యాసంయివ్వడానికి వచ్చినవాడిలా వాగినందుకు క్షమించండి" అన్నాడు

ఆ సిగ్గూ, సవినయమైన చిరునవ్వూ, మాయాదేవికి ప్రేమమయమైనవిగా కనుపించాయి. ఆమె వెంటనే అంది. "కాదుకాదు. మీమాటల్ని ఎంతో శ్రద్ధగా వింటున్నాను. కళాసాధనాధ్యయనంలో ఈవిధంగా తన్మయంచెందే కళాకారుల నెవరినీ చూడలేదు. మీరు సంకోచించకుండా చెప్పండి. నా కెంతో ఆనందంగావుంది. కాని, ఇదేమిటి!

మీరు మాట్లాడుతూనే వున్నారు, కాని, ఏమీ తినలేదు. తీసుకోండి. ఈ రసగుల్లా తీసుకోండి."

మాయాదేవి అన్నమాట నిజమే! కృత్రిమ మేమీ లేదు కాని, యిప్పు డతని మాటలప్రవాహానికి అంతరాయం కలిగింది, అందువల్ల మెదలకుండా తింటున్నాడు. ఈ నిశ్శబ్దాన్ని భంగపరిచేందుకు మాయాదేవి-"కళనుగురించి నేనూ కొంతవరకు చదివాను. కొంతమంది ఆర్టిస్టులు, కళయొక్క ఆనందం చిరంతనమైనదనీ; అవినాశకరమైనదనీ చెప్పారు. కాని నేను కళను ఎంతో ఆరాధించినప్పటికీ నా కా ఆనందం దొరకలేదు. అప్పుడప్పుడు విసుగుకూడా కలుగుతోంది. నాకు చిత్రకళయందు ప్రేమవుంది. ప్రపంచప్రసిద్ధులైన చిత్రకారుల చిత్రసంకలనం నావద్ద నున్నది. శిల్పమంటే నాకు తగనిప్రీతి. అందమైన శిల్పమూర్తులు నావద్ద వున్నాయి. సంగీతమంటే చెవి కోసుకుంటాను. మంచి మంచి పాటకచ్చేరీలు మా యింట జరుగుతూవుంటాయి. ఇన్ని జరిగినా, మీ రన్న ఆనందం నాకు దొరకనేలేదు. అప్పుడప్పుడూ ఉద్వేగమూ, నిరుత్సాహమూ కలుగుతాయి. మరి ఎందుచేత?"

"అవును! మంచి ప్రశ్న వేశారు. కళకు జీవితం, చైతన్యాలతో సంబంధం వుంటుందని, నేను ముందే చెప్పి వున్నాను. మానవజీవితంలో సృజనాత్మకవాంఛ ఎంతో తీవ్రంగా వ్యాపించి వుంటుంది. ప్రతిక్షణం, ఏదో ఒకటి నిర్మించాలని, అది సంగీతమో, కవిత్వమో, ఉపన్యాసమో, చిత్రలేఖనమో ఏదోఒకటి చేయాలని మనసు వుంటుంది, చివరకు భోజనపదార్థాన్ని తయారుచేయడంలో, బట్టలు

వుతకడంలో కూడాను. ఇటువంటి చిన్న చిన్న ప్రక్రియల్లో కూడా మనకు ఆ క్షుధ వ్యక్తమావుతుంటుంది. ఏదైనా ఒక మంచిపని మనం చేయగలిగినప్పుడు మన మనసు ప్రశాంతిని పొందుతుంది. ఈ ప్రశాంతత యితర ఆనందాలకంటే భిన్నమైంది. స్త్రీలకు మాతృత్వమే పరమలక్ష్యమని విద్వాంసులన్నారు. దీనికి కారణం యిదే. తల్లి బిడ్డను కన్నాక, ఆమె కూడా ఒక నిజమైన కళాకారుడివలెనే సంవేదం పొందుతుంది. 'ఈ అప్పజీవిని నా రక్తమాంసాదులతో కొన్ని నెలల పరిశ్రమతో సర్జించాను. ఇది నాదే!' అని అనుకుంటుంది. ఈ స్వయంనిర్మాణభావంలోనే ఆమెసుఖం పరాకాష్టను పొందుతుంది. మీకు చిత్రకళ, శిల్పం, సంగీతంమీద ప్రేమవుందని ఒప్పుకుందాం. ఈ కళలో గొప్ప గొప్ప నమూనాల్ని మీరు చూడటమేగాకుండా, బాగా వినివుంటారు. కాని మీరు కళను అవలోకించేప్పుడూ, గ్రహించేప్పుడూ, ఎప్పుడైనా మీ అంతరాత్మలో నివసించే సృజనాత్మకక్షుధను తృప్తిపరిచేందుకు ప్రయత్నించారా? మీరీ కళావస్తులతోపాటు, మీలో తాదాత్మ్యతను స్థాపించటం నేర్చుకున్నారా? బహుశా ఎప్పుడూ నేర్చుకోలేదనుకుంటాను. అందమైన చిత్రాలు చూడడంతోపాటు, మీరు కూడా కుంచెపట్టుకుని చిత్రించడానికి పూనుకోండి! మట్టితో చిన్న చిన్న ప్రతిమలను తయారుచేయడం మొదలుపెట్టండి! సంగీతం వినడంతోపాటు, స్వయంగా పాడడం ప్రారంభించండి! మొదట రంగూ, మట్టి వస్తువు లంత బావుండకపోయినా, పాటలు వినసొంపుగా లేకపోయినా, వాటిని నిర్మించడంలో, ఋజువ్యాదయాన్ని, ఏకాగ్ర

చింతన నుపయోగించారు. గనుక, అవన్నీ మీవే! అభ్యాసంతో ఆ చిత్రాలు, మూర్తులు, గీతలు అందంగా తయారవుతూ, మీరానందించగల నూతనవైభవం పొందినట్లనిపిస్తుంది. అప్పుడు మీ విసుగు, ఉద్వేగము నశించి. పోతుంది."

మాయాదేవికి ఈ విషయం కొత్తదిగా కనుపించింది. అంతేకాదు. నిజమైనదిగా, ఉపయోగకరమైనదిగా కనిపించింది. కళనుగురించి యింత అందమైన చర్చను ఎక్కడా వినలేదు, చదవనూలేదు. చదివినా గ్రహించివుండదు. అందువల్ల ఆమెకీ చర్చ మనోరంజకంగానే వుంది. భోజనం విషయంలో ఆమెకుకూడా ధ్యాసలేదు. ఆమె-"నేను చిత్రకళ నేర్చుకోవాలనుకుంటున్నాను. మీరు నేర్పగలరా!" అని అడిగింది.

ఈ విధంగానైనా అశోక్‌కుమారుతో సంబంధం వుంటుందనీ, అతన్ని తనవాడినిగా చేసుకోవచ్చుననే భావం ఆ ప్రశ్నలో యిమిడివుంది. ప్రణయంతోకూడిన పవిత్రత, ఉదాత్తతల విషయంలో మాయాదేవి ఎప్పుడూ ఆలోచించలేదు. కనీసం ఆలోచించాలనుకోవడంకూడా లేదు. ఒకే ఒక వ్యక్తిప్రేమకు లోబడి, ఎప్పుడూ అతనికే అణగిమణగి వుండాలనే స్వభావం ఆమెది కాదు. తన వైధవ్యాన్ని అసహ్యించుకోకపోవడానిక్కూడా యిదే కారణం! పైగా ఆమె దాన్ని ఆహ్వానించింది. ఎందుకంటే, స్వేచ్ఛావిహారానికి ద్వారం యిప్పుడు తెరచుకుంటుంది. సుఖభోగం, ఆనందం ఆమె నిశ్చిత అభీష్టాలు. అందువల్లనే, జీవితంలో తుఫానులు ఆమెను

తాకివుండవు. వాటి కామె భయపడుతుందికూడా. నిప్పు కోడిలా యిసుకలో తలదూర్చి జీవితసత్యాన్ని, తత్వాన్ని చూడదలుచుకోలేదు. జీవనసాగరంలో మునకలువేసి, దాని రహస్యాన్ని తెలుసుకోవాలనుకుంది. జీవితం ! జీవితం ! అసలు జీవితమనేది ఎటువంటి వస్తువు ?

అశోక్ ఠాకూరు ఆమెకు నేర్పేందుకు బాధ్యతవహించ దలచుకోలేదు-"నేర్పడం, నేర్పడం నా వల్లకాదు. నేనింత వరకు ఎవరికీ నేర్పలేదు. నేర్పలేను. ఒకచోటనే పాతుకుని వుంటాననే నమ్మకంకూడా లేదు. నే నెప్పుడూ తిరుగుతూనే వుంటాను. ఇహ, కళవిషయంలో నా స్వభావం ఒక ఆవేశం లాంటిది."

మాయాదేవికి నిరాశకలిగింది. దాన్ని మరుగుపరిచేం దుకు అసలువిషయం మార్చి-"మీకు యీ ప్రాయజంట వూహ ఎక్కడ దొరికింది ? దాన్ని చూడగానే హృదయంలో బాధకలుగుతుంది" అన్నది.

"ఒక స్నేహితుని మేవాడు గ్రామీణాంతంనుంచి దాన్ని కల్పనచేశాను. ఆ కల్పన నా హృదయాన్ని బాగా ఆకర్షించింది. ఆ వ్యాకులత నన్ను రాత్రింబవళ్ళు నిద్రపోనియ్య లేదు. హృదయంలోని ఆవేదనే దాని ప్రతిబింబం ! కళ కళా కారుని వ్యక్తిత్వానికీ, చరిత్రకూ ప్రతిబింబంలాంటిది. అది అటువంటిదే."

"ఐతే యీ చిత్రం తాలూకు ప్రభావం ప్రతివారిమీద యిలాగే పడుతూ, వారి హృదయాల్ని విధంగానే తాకు తుందా ?"

"చిత్రంలో ఏ మూలసందేశం వుంటుందో, అది విశ్వ వ్యాప్తమైనది. సమస్త మానవహృదయాల్లో, ప్రేమభావాన్ని అంకితంచేస్తుంది; అందువల్ల అది విద్యావిహీనుల, విద్యా వంతుల హృదయాలను ప్రభావితంజేస్తుంది. ఆ ఉత్కంఠలో సంస్కార పరిణామంలో భేదంవుంటుంది. నిజమైన కళ సర్వ వ్యాప్తమై సార్వభౌమత్వం కలిగివుంటుంది. అది కేవలం శిక్షితులూ, సభ్యమానవులను మాత్రమేగాకుండా, అశిక్షితులూ, బీదల హృదయాలమీదకూడా ప్రభావం కలిగి వుంటుంది. ఏ కళ సంస్కారులూ, ధనికులతోబాటు దీన దరిద్రుల హృదయాల్ని స్పర్శించదో, వారితో ఆశ, అనుకంప భావాల్ని యిచ్చిపుచ్చుకోలేదో, ఆ కళ పరిపూర్ణమైనది కాదు. పరిపక్వమైందికూడా కాదు. అట్టి కళ ఉన్నతశ్రేణికి చెందలేదు."

అదేసమయంలో బయట గస్తీపోలీసు విజిల్‌ధ్వని చీకటిని చీల్చుకొంటూవచ్చి గదిలో ప్రతిధ్వనించింది. అశోక్ తన గడియారంవేపు చూచి విస్మయంతో-"అరె! పన్నెండైందే! చాలా ప్రొద్దుపోయింది. ఐతే యిక వెడతాను. మిమ్మల్ని అనవసరమైన చర్చలో దించినందుకు క్షమించండి" అన్నాడు.

"ఇంత సమయంగడచినా ధ్యాసే లేకపోయింది. బహుశా మీ గడియారం ఫాస్టేమో?"

ఆ సమయంలోనే ఎదురుగావున్న గోడగడియారం టంగ్‌టంగ్‌మంటూ 12 గంటలు కొట్టింది.

అశోక్ లేచి నిల్చున్నాడు. మాయాదేవికూడా ఆహ్వానించి లేచి నిలుచుని తీయనిస్వరంతో—"తిరిగి మీరు ఎప్పుడు వస్తారు? మీరాక నాకెంతో సంతోషం కలిగించింది" అన్నది.

"ధన్యవాదాలు. కాని ఎప్పుడువస్తానో చెప్పలేను. నేను తొందరలోనే ప్రయాణం ఒకటి పెట్టుకున్నాను. వసంత ఋతువు అడవుల్లో గడపాలనుకున్నాను."

"ఓ, అదా సంగతి! వసంతకాలం వనశ్రీ శృంగారం! కాని, వసంతఋతు వింకా నెలరోజులుందికదా?"

"అవును, వుంది. కాని దానాగమనించేందుకు ముందే వెళ్ళివుండాలి. ఇక్కణ్నుంచి బయలుదేరడానికి యింకా ఒకటి రెండువారాలు పడుతుంది."

"ఏటువేపు బయలుదేరుతారు?"

"ఈమారు దూరంవెళ్ళను. మన ప్రాంతంలోనే! సాత్పూరా పర్వతప్రాంతంలో తిరగాలనుకున్నాను"

"కాని, సాత్పూరా చాలా దీర్ఘమైనపర్వతం! మరి అక్కడ ఏ ప్రాంతంలో మకాంచేస్తారు?"

మాయాదేవి యింత లోతుగా గుచ్చి గుచ్చి అడగడం అశోక్‌కు విచిత్రంగానేవుంది.

"అదింకా నిశ్చయంకాలేదు."

"బహుశా చెప్పకూడదనుకున్నారేమో!"

"నిర్ణయంలేనిదే ఏమని చెప్పమంటారు?"

"పెయింటింగ్ ఆవేశంవస్తుందేమో! సరే శుభం! కాని, వెళ్ళబోయేముందు ఒకసారి వచ్చివెళ్ళండి."

"ప్రయత్నించి చూస్తాను. సరే, నమస్కారం. మీ విందుకు ధన్యవాదాలు."

అశోక్ బయటకువచ్చి, కారులో ఎక్కబోతూ డ్రైవరు కునికిపాట్లు పడుతూండటం చూచాడు.

# 5

శిశిరఋతువు తన హంగామాను ముగించుకుని, సెలవు పుచ్చుకునేందుకు సిద్ధంగా వుంది. వసంతఋతువును నవజీవనంతో, నవచైతన్య సందేశంతో సృష్టిని ఆనందింపజేయమని ఆహ్వానిస్తోంది. వేసవికాల మింకా రావలసివుంది. దాని పరితప్త, దావానల అవతరణకు ముందుగానే, ప్రకృతి ఎందుకు నవ్వగూడదు ? ఎందుకు గొంతెత్తి పాడగూడదు ? ఎటు చూచినా పచ్చదనమే పొంగులెత్తుతోంది. వృక్షాలు, లతలు దట్టంగా పెరిగివున్నాయి. పూలతో నిండిన పొదలు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాయి. సెలయేరులూ, నదులు పొంగుతూ, కలకలమంటూ ఆనందపరవశంతో పారుతున్నట్లనిపిస్తోంది. జలపాతాలు తమ తుషారాలు సూర్యరశ్మితో కలిసినప్పుడు ఏర్పడిన యింద్రధనుస్సులోని రంగుల్ని చూచి మురిసి పోతున్నాయి.

ప్రకృతిలోని యీ వింత, ఆహ్లాదప్రభావం, జీవసృష్టి మీదకూడా పడుతోంది. కోయిల పాటలు పాడేందుకు సిద్ధమైంది. పక్షులు కిలకిలారవంచేస్తున్నవి. చిలుకలు ప్రకృతి రంగులో రంగుకలిపి, పసందుగా, ఆకాశంలో సంచారం

చేస్తున్నవి. పిట్టలూ, కుందేళ్ళు, గుంటనక్కలు అటూ యిటూ ఆనందంతో ఎగురుతూ దుముకుతున్నవి. నక్కలు, చిరుతపులులు, పెద్దపులులుగూడా తమ ఉగ్రస్వభావాన్ని విస్మరించినట్లున్నవి. ఆవులు, దున్నలు. తమ వన్యగ్రామాలను వదిలి నిర్భయంగా అడవిలో తిరుగుతూ మోరలుదించి వాడలు మరచి మేస్తున్నవి.

అటువంటి వాతావరణంలో, సాత్పూరాపర్వత వనశ్రీ సౌందర్యసామ్రాజ్యంలో పర్వతాలగుండా వీచే మందసమీరం, తనచెఱగున దాచిన ప్రసూనాల పరిమళంతో నిండి, పూర్ణ యవ్వనంలోవున్న కన్నెపడుచులా హావభావవిలాసాల హొయలుతో ఆ ప్రదేశమంతా చిందులుత్రొక్కుతున్నది. ఉదయభాస్కరుని అరుణకాంతిలో, బైతూల్ - యిటార్సీ పక్కారోడ్డుమీద ఉత్తరంగా ఒక బేబీఫోర్డుకారు నెమ్మదిగా పదిహేనుమైళ్ళస్పీడులో నడుస్తోంది అందులో కూర్చున్న వ్యక్తులు యీ ప్రకృతి రామణీయకతసంతటినీ బీరుపోకుండా తమ కళ్ళతో తృప్తిగా పానంచేస్తూ తన్మయులవుతున్నారు. కారు వెనుకనున్న కారియర్ మీద కొంత సామాను మైనపు గుడ్డలో చుట్టబడివుంది.

"ఆగు. అబ్దుల్లా! కొంచమాగు."

"సరే, బాబూ."

"ఈ దృశ్యం కనులకింపుగా వున్నది. కొంచం దగ్గర కెళ్ళి చూద్దాం."

కారు ఒక మామిడిచెట్టుక్రింద నిలబడింది. అశోక్ బాబూగారు ఒకరాతిబండమీదనో లేక గుట్టమీదనో చటుక్కున

ఎక్కేవాడు. ఎదురుగా పర్వతాలు. ఆ మధ్యలోంచి సెలయేరులు, తమ నిర్మల జలాలతో నురగలతో పొంగి పరుగులు తీస్తున్నవి. వాటి కిరుప్రక్కల గుబురుగా వృక్షాలున్నవి. వాటికి వివిధరంగుల ప్రసూనాలు. పువ్వులు అల్లిబిల్లిగా అల్లుకుని వున్నవి. మధ్యమధ్య గుట్టలపైన నీలాకాశంలో తెల్లనిమబ్బులు తేలిపోతున్నవి. అశోక్ పిచ్చివానిలా, స్తబ్ధుడై, అవిచలంగా ఏకాగ్రచిత్తంతో చూస్తూ వుండిపోయాడు. కళ్ళలో అదే స్వప్నావస్థ. అదిప్పుడు కొంచం ఎక్కువమోతాదులోనే వుంది. ముఖంలో ఆసక్తి, ఆహ్లాదభావం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. నిలుచున్నవాడు అలా నిశ్చలంగా నిలబడిపోయాడు. ఆ తరువాత ఏదో నిధిదొరికినవానిలా వుద్వేగంతో బిగ్గరగా కేకేశాడు.

"అబ్దుల్లా! ఓ అబ్దుల్లా! కాన్వాసు పట్టుకురా."

అతనికి ఎక్కువ చెప్పవలసిన పనిలేదు. అబ్దుల్లా కాన్వాస్, బ్రష్‌లు, రంగువళ్ళాలు, పాలెట్, పిన్నులు తీసుకుని వచ్చి చక్కగా అమర్చాడు. అశోకుని చేయి, కుంచెను ముట్టుకోకముందే, ఫ్లాస్కులోంచి వేడి వేడి టీతో పాటు రెండు బిస్కట్లు యిచ్చేవాడు. ఈ వస్తువులు అందించే సమయంలో-దాన్ని స్నేహమనండి, లేక వాత్సల్యమనండి, తల్లి తన ఏకైక కుమారుడు ఒక మహత్కార్యం ఆరంభించేముందు ఉత్తేజం, ఉత్సాహమిచ్చే పాలను త్రాగించినట్లు, అబ్దుల్లా ముఖం సౌమ్యమైనకాంతితో వెలిగిపోయేది. ఆ దృశ్యంలోని ప్రకృతి, ఆ రమణీయ అనుపమసౌందర్యాన్నంతా అబ్దుల్లా కళ్ళతోనే చూస్తున్నట్లు అశోక్ భావించేవాడు.

ఈవిధంగా ఆ మకాంలో చీకటిపడిపోయేది. ఒక్కొక్కప్పుడు, చిత్రం సగమేతయారైనప్పుడు, ఆ రాత్రి అక్కడే వుండవలసివచ్చేది. అటువంటప్పుడు కాన్వాస్ ఫోల్డింగు మడత వరించానికి దోమ తెరకట్టి, వజ్రాలు రత్నాలతో పొదగబడిన ఆకాశం చూరుక్రింద నిద్రపోయేవారు. అబ్దుల్లా స్టౌమీద తేలికైన ఆహారాన్ని తయారుచేసేవాడు.

ఒకసారి అతనిస్నేహితుడొకడు "అటువంటి సమయంలో, నీకు భయంవేయదా?" అని అడిగాడు.

"భయమేమిటి?"

"అదే, పులులూ-చిరుతపులులూ, భూత ప్రేతాలు..."

"భూతప్రేతా లుంటాయో లేదో నాకు తెలియదు. చిరుతపులులు, పెద్దపులులే కాదు; నాకు ఏ ప్రాణన్నా భయం లేదు. నేనీ సమస్తప్రాణుల్ని ప్రేమిస్తాను. ప్రపంచంలోని వస్తువులన్నిటినీ పొదలూ, సెలయేరులూ, రాతిగుట్టలు ఇంకా భగవంతుడు నిర్మించిన ప్రతివస్తువును ఎంతగానో ప్రేమిస్తున్నాను. అటువంటి విశ్వప్రేమయం దనురక్తుడైనవానికి ఎవరివల్లనూ భయంలేదు. అతని కెవరూ అపకారంచేయలేరు."

"అదేం ప్రయోజనం లేదు. నీ స్వభావం పులులకూ, చిరుతపులుల కేమి తెలుస్తుంది?"

"అవును! కావచ్చు కాని, తర్కంతో నిన్ను నమ్మించలేను. ఇదంతా నమ్మకంతో కూడిన విషయం. నా జీవితంలో యింతవరకూ లభించిన అనుభవాలతో నాకు యీ నమ్మకం ఎక్కువైందే కాని తగ్గలేదు."

ఈ నమ్మకనే అశోక్ జీవితపథాన్ని నిర్దేశించే మహా శక్తి!

ఈవిధంగా ఆడుతూ పాడుతూ అతని ప్రవాసం సాగి పోతోంది. అత నిదివరకు సాత్పూరావన్నసను విన్నాడు. కాని, విన్నదానికన్నా, చూస్తుంటే మరింత అందంగావుంది. అతని దృష్టిలో ఎటు చూచినా, సౌందర్యశోభే కనిపిస్తోంది. ఈ ప్రదేశంలో ఏదైనా గ్రామంలో వుండడానికి వసతిదొరికితే రెండు నెల్లుండామని, దాన్ని కేంద్రంగాచేసుకొని చుట్టు ప్రక్కలనున్న రమణీయప్రదేశాలన్నీ తిరిగిచూడాలని వుంది.

ఒకనాటి ప్రాతఃకాలానికి అశోకునికారు పదిగంటలకు 'ఫాడర్' అనే గ్రామానికి చేరుకుంది. ఈ గ్రామము బైతూల్-ఇటార్సీరోడ్డుమీద బైతూల్‌కు పది, పదకొండుమైళ్ళ దూరంలో వుంది. పర్వతాలకు దగ్గరగా, దట్టంగావున్న మామిడితోపుమధ్యగా యీ చిన్నగ్రామము విలసివుంది. ఈ ప్రదేశం క్రిస్టియనులకు పెద్ద కేంద్రం. అందువల్ల యిక్కడ ఎక్కువగా ఫాదరీలు వుంటారు. అందుకనే దాన్ని 'ఫాదర్' అనేవారు. రానురాను అది 'ఫాడర్'గా మారింది. కొంత మంది చదువుకున్నవారు దానిని 'ఫాద్రీపుర' మనికూడా అనే వారు. ఈ ప్రదేశంలో ఎక్కువగా గోండులు వుండేవారు. వారిమధ్యలో కొన్నిసంవత్సరాలవరకూ, రకరకాల మిషనరీ సంస్థలు తమ ప్రచారకార్యక్రమం కొనసాగించినవి. ఈ కారణంవల్లనే, 'ఫాద్రీపుర' జనసంఖ్యలో కొంతమంది గోండులు, కూర్మిజాతి, భిల్లుజాతివారు తప్ప మిగిలిన

వాళ్ళంతా క్రిష్టియనులే! ఆ గ్రామములో అడుగుపెట్టగానే క్రిష్టియనుసంస్కృతి మన కెదురవుతుంది. రోడ్డుకు ఎడమ ప్రక్కగా ఆంగ్లేయఫాదరీల రెండు పెద్ద పెద్ద బంగళాలు, ఒక చర్చి వున్నవి. కుడిప్రక్కగా పాద్రీపుర గ్రామము వ్యాపించి వుంది. ఇందులో ఎక్కువగా రెల్లుగడ్డియిళ్లూ, కొన్ని పెంకుటిళ్ళుకూడావున్నాయి. రోడ్డుమీద ఒక ప్రైమరీస్కూలు, ఒక ఆసుపత్రి వున్నాయి. అక్కడే చేతివృత్తుల పరిశ్రమశాలకూడా ఒకటి వుంది. అందులో నవ్వారు, ముతకబట్టలు నేసే మగ్గాలు వున్నాయి. ఒక పెద్ద రావిచెట్టుక్రింద, అంటే ఫాదరీల బంగళాలకు ఎదురుగానే, ఒక కారుస్టాండు వుంది. అక్కడే ఒక దుకాణం వుంది. దాన్లో ఆకులు, బీడీలు, సిగరెట్లు, టీ, ఆహార పదార్థాలు, కిరసనాయిలు మొదలుకుని గోధుమపిండి, పప్పు వరకూ' గుండీలు, సబ్బులు మొదలుకుని తైలుచిమ్నీలవరకు అన్ని అవుసరమైన వస్తువులు దొరుకుతుంటవి. అదే పాద్రీపురానికి పెద్ద దుకాణం! ఆ వూరికి అదొక్కటే దుకాణమున్నా ఫరవా లేదు. ఆ వూళ్లోని రాజకీయాలకూ, సామాజిక చర్చలకూ, ముచ్చట్లకు దుకాణం కేంద్రం. అందువల్ల దాన్ని దుకాణం అనేకన్నా ఒక సంస్థ అనడం బావుంటుంది.

ఆ దుకాణయజమాని ఓ వృద్ధక్రిష్టియన్. అతన్నంతా 'జోసెఫ్ కాకా' అని పిలుస్తుంటారు. అతనెంతకాలంనుంచి అక్కడుంటున్నాడో తెలియదు. కారులుగలవారూ, యాత్రికులు అతన్నింతోకాలంనుంచీ చూస్తున్నారు. అతనికూడా ఎన్నో పాతవిషయాలు జ్ఞాపకమున్నవి. ఎదురుగావున్న రావిచెట్టు వయస్సెంతో, దొరసానిగారి ఆ తెల్లబంగళా ఎప్పుడు

కట్టబడిందో, ఆ రంగుబంగళాకు పునాది ఎప్పుడు వేశారో ఇటార్సీ బైతూన్‌లమధ్య రైలుమార్గ మెప్పుడు వేయబడినదో, నాగపూరు మహారాజు ఎప్పుడు పతనమయ్యాడో - యివన్నీ తెలుసు. అంతేకాక, ఆవూరి హెడ్‌మాష్టరు నాయనమ్మ ఎప్పుడు చనిపోయింది, అబ్రహాంరైతుయింటిమీద పిడుగు ఎప్పుడు పడిందీ, బీకంగొల్లలు ఎప్పుడు విప్లవంలేవ దీసినదీ, యివన్నీ తెలుసు. దొరసానిగారిదగ్గర్నుంచి పాతపత్రికలు తీసుకువచ్చి, కొంచం కొంచం యింగ్లీషు కూడా నేర్చుకున్నాడు. దానివల్ల విదేశాల్లో ఎంతో చల్లగా వుండి, మంచుకురుస్తుంటుందనీ, అమెరికాకూడా ఎక్కడో దూరాన వుందనీ, మనకు చాలా దూరంగా వున్న దేశాల్లో, మనకు రాత్రీ, వారికి పగలుగా వుంటుందనీ తెలుసు కున్నాడు, ఆ తరువాత వాటిలో విమానాలు ఎలాఎగురుతుం డేవీ, తెగలేనిదే తంతి ఎలా వెళ్ళేదీ, బొంబాయిలో పాడిన పాట కలకత్తాలో ఎలా వినిపించేదీ, అన్నివిషయాలూ కొంచెం కొంచెంగా తెలుసుకున్నాడు. 'జోసెఫ్ కాకా' అంత చిన్న బుర్రలో యిన్ని గొప్పవిషయాలు ఎలా దాచుకున్నాడా అని పాద్రీపుర నివాసులకు ఆశ్చర్యంగావుంటుంది. ఈ కారణంగా అతన్నెంతో గౌరవించి తమకు కష్టాలుకలిగినప్పుడు, అతని సలహాలు తీసుకునేవారు. ఆ వృద్ధుడుకూడా, హాయిగా దిండ్లకు ఆనుకుని హుక్కాపీలుస్తూ మధ్యమధ్య దగ్గుతూ వారికి తగిన సలహాలిస్తుండేవాడు.

జోసెఫ్‌కాకాగడ్డం యిప్పుడు తెల్లబడుతోంది. ఒక పాత ఉన్నిపైజామా, పైన ఒక ఉన్నిచొక్కా, తల కొంక

ఉన్నిటోపీ వుంటాయి. అతని కెప్పుడూ చలిగానే వుంటుంది. అందువల్ల ఋతువులుమారినా, యీమనుస్తుల్లో ఎక్కువ మార్పేమీ వుండేదికాదు. కాళ్ళకు పాతచెప్పులో, కర్ర పావుకోళ్ళో వుండేవి. దుకాణం అందంగా వుండేందుకు, క్రీస్తుశిలువపటం, యింకా పాతపత్రికల్లో చింపి అంటించిన మూడు నాలుగు బొమ్మలు వున్నవి. ముందుభాగంలో మధ్యగా పగిలిన చిమ్నీతో ఒకలైటు వ్రేలాడుతోంది. అల మారులో వస్తువుల్ని అందంగా వుంచాడు. రెండు నిలువు కొయ్యలమీద చెక్కపరిచి బల్లగా తయారుచేయించాడు. దానిమీద ఫలహారంతినేవారూ, టీత్రాగేవారు కూచుం టారు. బాగా డబ్బున్నఆసాములకు ఒకస్టూలూ, ఒక చేయి మాసుమైన కుర్చీ వుంది. తనచేతిక్రింద పనిచేయడానికి జోసెఫ్‌కాకా ఎనిమిదేళ్లకుఱ్ఱవాణ్ణి ఒకణ్ని అట్టిపెట్టుకున్నాడు.

జోసెఫ్‌కాకాదుకాణమే ఫాద్రీపురానికి గొప్పశోభ, ఆకర్షణ. అదిలేకుంటే, నిస్సందేహంగా ఆవూరు వట్టిపోయినట్లు శూన్యంగా కనుపిస్తుంది.

అశోక్ కారు జోసెఫ్‌కాకా దుకాణానికి ఎదురుగా రావిచెట్టుక్రింద ఆగింది. ఆ చుట్టుప్రక్కల దృశ్యాలకు అతని మనసంతా వుక్కిరి బిక్కిరై, ఆ గ్రామములోనే డేరావేసి నట్లయితే బాగుంటుందనుకున్నాడు, కారులోంచి దిగాడు. ఈ చిన్న కారును చూడడానికి బడికివెళ్ళే పిల్లలగుంపు పోగైంది. జోసెఫ్‌కాకాలాంటి వృద్ధుడుకూడా దాన్ని చూస్తున్నాడు. వారికి మరి అటువంటి అవకాశం తక్కువగా దొరుకుతుంది.

మామూలుసంగతులన్నీ జోసెఫ్ కాకాతోనే విచారించ బడ్డాయి. అతను అవసరమైనవివరాలన్నీ చెప్పి తననౌక రును తోడిచ్చి అశోక్‌ను 'దొరసాని'గారిదగ్గరకు పంపించాడు. బీడీకాల్చుకునేందుకు అబ్దుల్లా అక్కడే నిలబడిపోయాడు.

అశోక్ రాకూచుకు దొరసానిగారు ఎంతో ఆదరంతో స్వాగతంపలికింది. ఆమె రోమన్ కాథలిక్ సాంప్రదాయకు రాలు. ఇక్కడ పన్నెండేళ్లనుంచీ వుంటోంది. ఆమెవయసు షుమారు యాభై అయిదు సంవత్సరాలు వుంటుంది. అశోక్ యూరోపియన్ దుస్తులూ, సభ్యతావర్తిత్వం ఆమెమీద బాగా పని చేశాయి.

తొలిమాటలయ్యాక, దొరసానిగారు అంటే, మిస్ థామస్ అడిగింది. 'మీరు టూరిస్టులా ?'

'టూరిస్టును కాదండీ! చిత్రాలు చిత్రిస్తుంటాను. ఏవైనా మంచిదృశ్యాల్ని చిత్రిద్దామని యీ ప్రదేశానికి వచ్చాను'

'ఓహో! మీరు ఆర్టిస్టు లన్నమాట! ఏమైనా నమూనా లుంటే, చూపించగలరా ?'

'ఆ...ఎక్కువగా లేవు. మూడు నాలుగు మాత్రమే వున్నాయి. మీ కవి బాగుంటాయో లేదో చెప్పలేను.'

అయిదునిముషాల్లో అబ్దుల్లా చిత్రాలు తీసుకువచ్చాడు. అశోక్ ఒక్కొక్కటే ఆమెకు చూపిస్తున్నాడు.

మొదటిచిత్రం 'సెలయేరు' చూచి మిస్ థామస్ సంతోషించింది. కళాప్రతిభకు యీ మచ్చుతునకే అతని తెలివితేటల్ని ప్రదర్శించేందుకు చాలు. కాని, అతను తన

ఆఖరిచిత్రం, క్రీస్తుశిలువచిత్రాన్ని చూపించినప్పుడు, ఆ ధర్మ నిష్ఠగల మహిళఆనందం, ఆశ్చర్యం యింతఅని చెప్పడానికి సాధ్యంకాదు. తనను తాను మర్చిపోయి, దానివేపు చూస్తూ వుండిపోయింది. నోటంట ఒక ప్రశంసావాక్యం దానంతటదే బయటకు వచ్చింది.

చిత్రంలో ప్రభువు శిలువవేయబడ్డాడు. ఆయన రెండు చేతుల్లో, రెండు పాదాల్లో మేకులుదించినందువల్ల, రక్తం కారి క్రిందపడుతోంది. తీవ్రమైన వేదనాభావం ముఖంలో ప్రస్ఫుటంగా వుంది. దానితోపాటు సౌమ్యమైన కాంతిపుంజం కనుపిస్తోంది. ఒక గొప్పతత్వంకోసం ఆత్మార్పణచేస్తున్న సమయంలో ఏభావం వుంటుందో—అదేభావం గోచరిస్తోంది. ప్రపంచంలోని సమస్త ఆనందజ్యోతి ఆ ఒక్కముఖంలోనే సంచితమై వెలుగుతోంది. ఈ అంతులేని వ్యధలో ఆయన పైకి చూస్తూ, 'అయ్యో భగవంతుడా! నన్నెందు కిలా ఆత్మార్పణలో మరణింపజేశావు?' అన్నట్లుంది.

ఆమెముఖంలో యీచిత్రంమీద అంతులేని అనురాగం ప్రతిబింబించింది. ఆమెకళ్ళు ఆర్ద్రమై, ఆ చిత్రంలోని దివ్యసందేశాన్ని అర్థంచేసుకునేందుకు నిశ్చలసమాధిలోవున్నట్లుంది. చటుక్కున ఆమె తన స్వప్నావస్థనుండి మేల్కొని— 'మీరు క్రిష్టియన్లా?' అని అడిగింది.

'కాదండి.'

'ఆశ్చర్యంగావుందే! అలాగయితే మీరు క్రీస్తుదేవుని నిర్యాణాన్ని, యింత సత్యస్వరూపంగా, భావపూరితంగా ఎలా

చిత్రించగలిగారు? అత్యంత శ్రద్ధా, భక్తి వుంటేనేగాని, యిటు వంటివి చిత్రించలేరే!'

'అది నిజమే! ఐనా యిటువంటి శ్రద్ధను హృదయంగమం చేసుకోవడానికి, క్రిష్టియనుల కఠిన సంస్కారాల్లో తిరగవలసిన అవుసరం లేదు. క్రీస్తుదేవుని సిద్ధాంతాల్ని హృదయంగమం చేసుకున్న వారు, తమకళలో దాన్ని ప్రవేశపెట్టగలరు.'

అందమైన యీ కళాప్రతిమ మిస్. థామస్ హృదయంలో అశోక్ఠాకూరుమీద స్నేహం, ఆదరం, ఆత్మీయ భావం కలిగించింది. ఆ కారణంగా వారిద్దరిమధ్యనున్న అంతరం విదేశనాగరికతావిభేదం తరిగిపోయి, తనయెదుట కూర్చున్నవ్యక్తి గొప్ప ఆర్టిస్టని తెలుసుకుంది.

'మీ రీ ప్రదేశంలో యిలాగే తిరుగుతుంటారా?'

'ఎప్పుడూ తిరగలేను కదండీ! ఒకవేళ యిక్కడెక్కడైనా వుండేందుకు నివాసందొరికినట్లయితే, దీన్ని కేంద్రంగా చేసుకుని, అడవుల్లో తిరుగుదామనివుంది'

'ఈ గ్రామములోవుండేందుకు మీ రిష్టపడతారా?'

'ఈ గ్రామము నన్నాకర్షించినందువల్లనే, నే నిక్కడ ఆగవలసివచ్చింది. ఇది అడగడానికే మీవద్దకు వచ్చాను.'

'అలాగా!' అని మిస్. థామస్ కొంచంసేపు ఆలోచించి—'మీ రెన్నిరోజులు యిక్కడ వుండాలనుకుంటున్నారు?' అని అడిగింది.

'సుమారు రెండూ-రెండున్నరమాసాలు....'

'అటువంటప్పుడు నేను మీకు కొంత సాయపడగలనని అనుకుంటాను. ఈ ప్రక్కనున్న బంగళా చూడండి! మీకు

బాన్నుంటుందా ? ఫాదర్ విలియమ్ అందులో నివసించేవారు. కాని, వా రిప్పుడు యింగ్లండు వెళ్లారు. ఆరునెలలకు తిరిగివస్తారు. చాలా బాగుంటుంది. ఫర్నిచరుకూడా వుంది. బహుశా మీకు కొంత ఉపయోగపడవచ్చు.'

'చాలా బాగుంది.' అశోక్ సంతోషంతో ఉప్పొంగి- 'ఇంతకుమించిన ఏర్పాటు యింకేముంటుంది ! మీకు ఎల్లప్పుడూ కృతజ్ఞుణ్ణి. అద్దె ఎంతవుంటుంది?' అని అడిగాడు.

'అద్దె తరువాత నిర్ణయించుకుందాం! ముందు మీరు చూడండి ! మీ కిప్పుడే చూపిస్తాను. మేరీ, మేరీ, మరియమ్!' అంటూ లోపలిగదివేపు చూచి ఎవరినో పిల్చింది.

'ఏమండీ ?' లోపల్నుంచి సన్ననిగొంతు వినిపించింది. ఆ మరుక్షణంలోనే, తెల్లనిఛాయగలిగిన యువతి ఆగదిలోకి వచ్చింది. చిన్నవయస్సే వుంటుంది. అక్కడున్న నవాగంతుకుని చూచి శక్కున ఆగిపోయి, అతనివేపు విస్మయంతో కుతూహలంతో చూస్తోంది.

ఇద్దరిచూపులు క్షణం కలుసుకున్నవి. అత నామె విశాలభావయుక్తమైన నేత్రాలను తదేకంగా చూస్తున్నాడు. మరియమ్ సిగ్గుపడి తనకళ్ళు దించేసుకుంది.

ఆమెకు యిరవై -యిరవై ఒక్క సంవత్సరాలుంటాయి. జుత్తు బంగారువన్నెగలిగి, ఆంగ్లేయపద్ధతిలో కత్తిరించబడ్డాయి. ముఖం కొంచం కోలగా, పొడవుగా వుంది. ముక్కు తిన్నగా పొడుగ్గానే వున్నది. ఆ సన్నని పెదిమలు అరుణారుణంగా అందంగా వున్నవి. పాదాలు మరీ అంత పొడవుకాదు. శరీరం సన్నగావుండటంవల్ల ఎత్తుగా కనిపిస్తోంది. గులాబీ, ఆకుపచ్చ,

నీలంరంగుపూలు అద్దిన గౌను తొడుక్కుని వుంది. కాళ్ళకు మేజోళ్ళుగాని, చెప్పులుగాని లేవు. స్వతహాగా ఆమె అందగత్తే! సౌందర్యోపకరణాలయం దామె కంత శ్రద్ధలేదు.

'చూడూ! నీవద్ద ఆ ఫాదర్‌గారిబంగళా తాళాలు వున్నవికదూ? వీరి కా బంగళా చూపించు. వీరిది నాగపూరు. గొప్ప ఆర్టిస్టు. మిష్టర్ ఠాకూరు...'

'ఆ...ర్టిస్టా' మరియమ్ తన ఆనందాన్ని దాచుకోలేక ఉల్లాసంగా అన్నది.

'అవును. యీ చిత్రం చూడు! వీరే చిత్రించారు.' అంటూ ఆమె క్రీస్తుశిలువచిత్రాన్ని చూపించింది. మేరీ మోకాళ్ళమీద వంగి, ఆ చిత్రం చూడటంలో నిమగ్నమైంది.

'మిష్టర్ ఠాకూర్! ఈమె మేరీ. మరియమ్ అని కూడా అంతా పిలుస్తుంటారు. గత పన్నెండేళ్ళనుండీ యీమె నావద్దనే వుంటోంది. ఇంకొకటి...! ఈమెకు కూడా ఆర్టులో కొంత ప్రవేశంవుంది.'

ఈ మాటలు మరియమ్ కసివినట్లూహకుంది. కాని, అశోక్ మనసులో కొంచం అశాంతిని కలిగించాయి. ఆమె అనాధావస్థకు హృదయంలో కొంచం జాలికలిగింది. కళయందున్న ఆమెప్రేమకు ఆనందించాడు. అసలామెకళ్ళను చూసే అలా అనుమానించాడు.

మరియమ్ ఎంతో ఉత్సాహంగా, బంగళా ప్రతిభాగాన్ని చూపిస్తోంది. "ఇది డ్రాయింగ్‌రూం. ఇది స్టడీరూం. దీన్ని మీరు స్టూడియోగా బాగా వుపయోగించుకోవచ్చు. ఇది పడకగది. ఇది భోజనాలగది. ఇది స్నానాలగది ఇది వెనక

వసారా. చూడండి! దీనికి ఎదురుగా కనుపిస్తున్న ఆ అంద మైన దృశ్యాల్ని చూడండి! బహుశా ఆ రెండుగదులు కూడా యివ్వడానికి దొరసానిగారు అంగీకరించవచ్చు" అంటూ వివరంగా చెప్పింది.

"వాటి అవుసరం లేదు. ఉన్నగదులే చాలు."

బంగళా పూర్తిగా చూశాక, తను స్టూడియోగా చేసు కోవాలనుకున్న గదిలోకి వచ్చాడు. తలుపులూ, కిటికీలు అన్నీ తెరిచి ఎంత వెలుతురువస్తుందోనని చూశాడు.

"ఇక్కడెంత కాలం వుండాలనుకుంటున్నారు?" మరి యమ్ అడిగింది.

"ఒకటి, రెండు నెలలు..."

"అంతేనా...? ఎక్కువకాలం వుండరా...?"

"ఎలా వుంటాను? ఫాదర్ విలియమ్స్‌కోసం బంగ ళాను ఖాళీచేయాలికదా?" ఎక్కువకాలంవుండే వుద్దేశం అశోక్‌కు కనుపించలేదు.

"వారు ఆరు నెలల అనంతరం వస్తారు. బహుశా, సెలవు పొడిగించుకోవచ్చుకూడాను. విదేశం వెళ్లి సహాస తొందరగా వస్తారా? అంతవరకు మీరు రుంటారుకదా?"

"అంతకాలం ఎప్పుడూ వుండలేను. అంతకాలం యీ ఒక్కచోటనే పీఠం వేసుకు వుండిపోలేను."

"అవును! నిజమే! మీరు గొప్ప ఆర్టిస్టులు. ఈ చిన్న కుగ్రామములోవుంటే మీకు పనెలా గడుస్తుంది?"

ఈమాట మరియమ్ సరళంగానే అంది. కానీ, దానిలో వ్యంగ్యంవుందేమోనని అశోక్ అనుకున్నాడు.

మరియమ్ స్వచ్ఛమైన హిందూస్థానీ మాట్లాడటం అశోక్ గమనించాడు. మధ్యమధ్య ఉపయోగించే ఆంగ్లేయ శబ్దాలఉచ్చారణ శుద్ధంగానూ, సాఫీగాను వుంది. ఆ మాటల తీరునుబట్టి ఆమెబుద్ధి తీక్షణమైనదని గ్రహించాడు. చేష్టల్లో, వ్యవహారంలో చపలత్వం, కలుపుగోలుతనం పూర్తిగా వుంది. వ్యర్థమైన సంకోచాలంటే గిట్టవు. అంతమాత్రంచేత అడ్డూ అదుపూ లేని పసిపిల్లకూడా కాదు. మర్యాదను పాటిస్తుంది. ఆమెకలుపుగోలుతనానికి, ఆమె వనజీవితమే కారణంకావచ్చు.

"ఇష్టమేనా ?" మరియమ్ అడిగింది.

"ఓ...భేషుగ్గా...!"

"ఐతే సామాను సర్దించండి! మీకు కావలసిందల్లా, సంకోచించకండా సన్నదగండి! కాని, ఒక ప్రార్థన మన్నించాలి. కొత్తచిత్రం తయారుచేసినప్పుడు, నాకు తప్పకండా చూపించండి".

"ఓ, అలాగే! ఆర్టులో, మీకుకూడా ప్రవేశం వుందని మిస్ థామస్ చెప్పింది. మీ సహాయం తప్పకుండా తీసుకుంటాను."

"మీ అంతటి ఆర్టిస్టులకు నే నేం సహాయంచేయగలను ? మీరు పురమాయించినప్పుడు, రంగుపళ్లాలూ, బ్రష్‌లు అందివ్వగలను. నానుండి అంతకుమించిన సహాయ్యం కోరినప్పుడు, మీ చిత్రాలు గోడలమీద అంటించే వివిధ రంగులకాగితంగా మారుతుంది." అంటూ ఆమె నవ్వింది. ఆ నవ్వులవుల్లో, తెల్లగా మెరుస్తున్న ఆమె పలువరుసలను రెప్ప వేయకుండా చూస్తున్నాడు అశోక్.

అబ్దుల్లా, మరియమ్‌లు కలిసి అశోక్ సామానంతా రెండుగంటల్లో సర్ది వేశారు.

## 6

తన కొత్తయిల్లు అశోక్ కెంతో బావుంది. చుట్టు ప్రక్కలనున్న అందమైనదృశ్యాలు, వాతావరణం, పట్టణ సందడిలోంచి విముక్తి మొదలైన కారణాలవల్ల అతని మనస్సెంతో హాయిననుభవిస్తూంది. ఇక్కడుండి కొన్ని అపూర్వ చిత్రాలు చిత్రించగలననుకున్నాడు. కళాసృష్టిలోని నిర్మలానందంకూడా అతనికి ప్రాప్తిస్తోంది.

మిస్. థామస్ అశోక్ మీద ఎంతో దయగావుంటోంది. అంత గొప్ప ఆర్టిస్టు తమ తావుకు వచ్చినప్పుడు అతని, కన్ని విధాల సుఖంకలిగించాలని ప్రయత్నిస్తోంది. అందుకని, అతనికి కావలసిన సదుపాయాలన్నీ నెరవేర్చమని మరియమ్‌కు ఆదేశించింది. మంచితనంగా వ్యవహరించడం అశోక్ కికూడా తెలుసు. అందువల్ల దొరసానిగారితో అతనిస్నేహం వృద్ధను తోంది. మొదట క్రీస్తుచిత్రంతోనే ఆమెకు సంతోషం కలిగింది. ఆదివారాలు చర్చిలో ఆమె ఉపన్యాసంవినేందుకు వెళ్లేవాడు. అప్పుడప్పుడూ చదువుకునేందుకు ఆమెవద్దనుంచి పుస్తకాలు తీసుకునివచ్చేవాడు. నాగపూరుకమలాఫలాలుపార్సెలు ఆమెకు పంపించేవాడు. మరొకప్పుడు అబ్దుల్లా తయారుచేసిన కేకులు, బిస్కట్లు బహుమానరూపంలో పంపేవాడు. అశోక్ ఆమెతో ఎంత ప్రసన్నంగావుండేవాడో, ఆమెకూడా అతనియెడ దంత దయాభావంతోను వుండేది.

ఘాద్రీపురమంతటా అశోక్ పేరు వ్యాపించింది. అతను స్కూలు చూడామని వెళ్ళి, పిల్లలకు మిఠాయికోసం అయిదురూపాయలు యిచ్చివచ్చేవాడు. ఆ డబ్బుతో జోసెఫ్ కాకాదుకాణంలోని మిఠాయంతా ఆఖరైపోయేది. ఆసుపత్రికి వెళ్ళి రోగుల మందుమాకులకు సహాయంచేసేవాడు. ఏ యింటిలోనైనా, వివాహంజరిగినప్పుడు, ఆ క్రొత్తదంపతు లకు ఒకటి రెండు వస్తువులు కానుకగా పంపించేవాడు. ఈవిధంగా అతనా గ్రామదైనిక జీవితంతో తనకుతానై సమరస భావం కలిగించుకున్నాడు. ఘాద్రీపుర నివాసులుకూడా, అతనిని తమవాడిగా చూసుకుంటున్నారు. అబ్దుల్లా, జోసెఫ్ కాకాల స్నేహంకూడా రోజురోజుకు పెరుగుతోంది. అశోక్ అడవుల్లో షికారువెళ్ళినప్పుడు, వంటచేసి అబ్దుల్లా జోసెఫ్ కాకాదుకాణంలోనే వుండేవాడు. ఇద్దరూ 'టీ' త్రాగి హుక్కా పీలుస్తూ-లోకంపోకడలు మాట్లాడుకుంటూండేవారు.

అప్పుడప్పుడూ మరియమ్‌కూడా అశోక్‌తో షికారు వెళుతూ వుండేది. క్రిష్టియన్ మతధర్మంతో నిండిన ప్రగతిశీల వాతావరణంగల ఆ గ్రామంలో, యీ విషయం స్వాభావిక మైనదేనని వొప్పుకుంటారు. మరియమ్ తనకు తోడుగా వుండడం అశోకునికికూడా యిష్టమే! కొన్ని విషయాల్లో వారిద్దరి అభిప్రాయాలు ఏకీభవించేవి.

ఒకనాటి సంధ్యాకాలంలో, ఇద్దరూ ఒకసెలయేటి వొడ్డున కూచున్నప్పుడు మరియమ్ అన్నది- "మీ రిక్కడకు వచ్చినప్పటినుండీ, యీ పల్లెరూపమే మారిపోయింది. ఇక్కడి

ప్రతిపిల్లవాడూ మిమ్మల్నెరిగివున్నాడు. మిమ్మల్ని వాళ్ళంతా మనసార ప్రేమించటం చెప్పుకోదగిన విషయం.!"

"అదంతా వారిదయతో కూడిన విషయం. ఇక నా మన సిక్కడే ఎక్కువ ఆనందం అనుభవిస్తోంది. ఇక్కడ చాలాకాలం వుండగలననుకుంటున్నాను. కృత్రిమము లేని యీ వాతావరణం, ప్రకృతిసౌందర్యం, యీ నిరహంకారులు, డాంబికము లేని యీ స్నేహశీల వ్యక్తిత్వాలూ నా మనసును మారగొన్నవి. పట్టణంలోని కృత్రిమ వాతావరణానికి ఇదెంతో భిన్నంగా వున్నది."

"అంటే, మీరు పట్టణాలను అసహ్యించుకుంటారా?"

"ఒక్క అసహ్యమన్నమాటేమిటి? కాని, అక్కడి కొన్నివిషయాలకు బాధ కలుగుతూవుంటుంది. ఒక ప్రక్క గొప్పగొప్ప మిల్లులు, ప్రాసాదాలు, రెండోప్రక్క శిథిలమైన రెల్లుగుడిసెలు; ఒకప్రక్క బహుభోజన, అజీర్ణ రోగ పీడితులూ, విషయవాంఛలలో మునిగితేలే ధనికులూ, రెండోప్రక్క ఆకలిపీడితులు, చినిగిన పాతగుడ్డలతో మాంసం కప్పుకునే కంకాళాలు. అంతేకాదు, పట్టణంలోని సంస్కృతీ, సభ్యతా అంతా ధనపూజ అనే ఏకమాత్ర సిద్ధాంతంమీదనే ఆధారపడివుంది. దానికోసం మిథ్యాచారం, పిసినిగొట్టుతనం, డంబం, కృత్రిమం, స్వార్థపరాయణత, అసహ్యం మొదలైన చెడుగుణాలతో, మనసు రోతపుట్టి, అక్కడనుంచి పారిపోదా మనిపిస్తుంది. మానవులు తమ అధఃపతనంతో ఉద్విగ్నులై ప్రకృతియొక్క సత్యం, శివం, సుందరంలో లీనమవాలని కోరుతుంటారు. ప్రకృతితాలూకు భవ్యత్వం, ప్రశాంత

సౌందర్యంలోనే ప్రేమ, శాంతి, ఆనందాలున్నవి." అంటూ అశోక్, ఈ అనుపమసౌందర్యం తన కీక్షణంలోనే సాక్షాత్కరించినట్లు, తనకెదురుగావున్న పచ్చని పర్వతాలవేపు, చూశాడు.

"మానవసమాజంలో సుఖంకన్నా, దుఃఖమే ఎక్కువగా వుండేమాట వాస్తవమే! కాని, అందుకు కారణమేమిటి?"

"కారణమా...? మానవుల యీ అంతూ పొంతూ లేని దుఃఖాలకు మానవులే కారణం! మనం మనకష్టాలకు భగవంతుణ్ణో, అదృష్టాన్నో నిందిస్తుంటాము. కాని అది తప్పు. మన సుఖభోగాలకోసం, సంపద తాలూకు విలువతే ప్రధానమనే ఒక తావీను కొత్తగా కనిపెట్ట బడింది. సంపదమీదున్న ప్రేమతోనే, స్వార్థం పెరిగింది. వాణిజ్యం పెరిగింది. పీల్చి పిప్పిచేయడం పెరిగింది. సామ్రాజ్య వాదం పెరిగింది. దానితోపాటు యుద్ధంకూడా పెరిగి పోయింది. మన సమాజవ్యవస్థను సంపూర్ణంగా మనం ధనార్జనతత్వంమీదనే అధిష్ఠింపచేశాము. ఎవరివద్ద వెండి రూకలుంటాయో, వారికే గౌరవంవుంది. పలుకుబడివుంది. వాడే సత్శీలుడు, జ్ఞాని, మనుష్యుడూను. మిగిలిన వాళ్ళంతా మనుష్యరూపంలో మననూ, భావాలు లేని, పశువులన్నమాట. బంగారంమీదున్న వ్యామోహంతో మనం ధర్మం విడిచిపెట్టాము. కర్మను విడిచాము. చివరకు మానవత్వాన్నికూడా వదిలిపెట్టాం! విశేషించి పారిశ్రామిక విప్లవం జరిగినప్పటినుంచీ, మానవజాతంతా అన్యాయాలలో పడిపోయింది. అప్పటినుంచి ప్రపంచంలోని సుఖసూర్యునికి

గ్రహణంపట్టి, భగవదాత్మకు అవమానం మొదలైంది. ఈ భయంకరమైన పాపానికి శిక్ష ఏదో ఒకనాడు అనుభవించవలసిందే."

"ఏనా, యిదంతా మనదేశానికి ఓడలమీద రవాణా అయివచ్చిన పాశ్చాత్యసంస్కృతి! హిందూదేశంలో ఎప్పుడూ యిటువంటి ఆచార విచారాల ప్రణాళికపుట్టలేదు."

మరియమ్మాటలు అశోకుని కెంతో ఆశ్చర్యంకలిగించినవి. అంటే ఆమె తప్పుగా అన్నదనికాదు. సంపూర్ణంగా ఆంగ్లేయవాతావరణంలో పెరిగాకకూడా, మరియమ్ భారతీయుల ఆచారవిచారాల్ని ఎందుకు గౌరవిస్తోందా అని ఆశ్చర్యంకలిగింది. ఆమెఅభిప్రాయం అశోక్ అభిప్రాయంతో ఏకీభవించింది.

"అవును ! ఈ తాపీదు విదేశాలనుంచివచ్చినదే. కాని, మనదేశస్థులే, దాని పునాదిని గట్టిపరిచేందుకు సాహాయ్యం చేశారు. మనదేశంలో బాగా చదువుకున్నవారిలోనే, మనసూ, బుద్ధీ, దృష్టి, యీ సంస్కృతిలో మునిగి తందనాలాడే శ్రేణి ఒకటి ఏర్పడింది. అందువల్ల, యీ విషం తిరిగి తీసివేయజాలనంతగా, వృద్ధిచెంది, ఇరాన్, ఈజిప్టు, రోములోవలె, కొన్నివేలసంవత్సరాల మన పురాతనదేశ చిరకాలసంస్కృతి సమూలంగా మట్టిలో కలిసిపోతుందేమోనని భయమేస్తోంది."

"లేదు. ఆ విష మంత లోతుగా వెళ్ళలేదు. హిందూదేశంభవిష్యత్తులో అంత చీకటిని చూస్తానసే నిరాశావాదిని మాత్రం కాను."

“నేనూ నిరాశావాదినికాను. కాని, ఆ విషం మన దేశవాసుల శరీరాల్లోకి ప్రాకిపోలేదని మీరెలా చెప్పగలరు? మన సమాజం వేపు చూడండి! మొదట ఆర్థికయిబ్బందనే రోగం వచ్చింది. తరువాత సమాజఆపదలు వచ్చిపడినవి. నలుపూ తెలుపు అనే భేదం మొదలైంది. ఏ అసహ్యాన్ని మనం విదేశీయులవల్ల సహించవలసివచ్చిందో, దాన్నే మనం తిరిగి మన హరిజనసోదరుల మీద గుమ్మరించాము. ఏ బంధనాలకు మనం కట్టుబడిపోయామో – ఆ బంధనాలనే మనం మన స్త్రీలమీద రుద్ది వారి జీవితాన్ని బానిసత్వంతో నింపేశాము. అంతటితో మనకు సంతోషం కలగలేదు. మనలో మనం ద్వేషించుకోవడం సాగించాము. హిందూ, ముస్లిం, బ్రాహ్మణ, అబ్రాహ్మణ మొదలైన స్పర్థలు కల్పించాము. తమ్ముల కుత్తుకలను కోయడానికి సిద్ధమయ్యాము. బీదతనం, బానిసత్వం పెరుగుతున్నకొద్దీ, మన దేశీయాత్మ పతితమై, మన సమాజంలో ఏహ్యమూ, స్వార్థమూ, అసహిష్ణుత పెరిగిపోయినవి. ధర్మం స్థానే, దండలు, తిలకంలాంటి బాహ్య ఉపకరణాలు పుచ్చుకున్నవి. సభ్యతస్థానాన్ని కృత్రిమత, అసత్య ఆచార వ్యవహారాలు పుచ్చుకున్నవి. సదాచారస్థానాన్ని పరదాలు, చీకటిమాటునచేసే పాపాచారం పుచ్చుకుంది. విజ్ఞానం, విషప్రపూరితవాయువును ఆవిష్కరించడమే తన లక్ష్యం, గొప్పతనం అనుకుంది. తర్కశాస్త్రం భగవంతుని అస్తిత్వాన్ని అనుమానించడంలో తన కౌశలాన్ని చూపించింది. అర్థశాస్త్రం, బీదలను, అజ్ఞానులను దోపిడిచేయడానికి ఉపాయాలు వెదికి కనిపెట్టింది. కృషిశాస్త్రం, నల్లమందు, పొగాకు పంటను వృద్ధి

చేయడమే తన సార్థకమనుకుంది. మనమంతా కలిసి మానవత్వాన్ని ఎంత తొందరగా పూడ్చిపెడదామా యని కుట్రపన్నినట్లయింది. అటువంటప్పుడు మనదుర్దశ, ఉద్ధరణ ప్రశ్న జటిలం కాదేమో చెప్పండి ?"

"అటువంటప్పుడు మన ఆశేమీ లేదా? మన ప్రారబ్ధంలో దుఃఖం, అవమానం తప్ప యింకేమీ రాసివుండలేదా ?"

"కాదు. నేను అలా ఒప్పుకోను. మానవులు, తమ మానవత్వాన్ని విడిచిపెట్టినా - భగవంతుడు తన సృష్టిని విడిచిపెట్టలేదు. మానవులు అనుభవమనే ఎసురుదెబ్బలు తినని దే గుణపాఠం నేర్చుకోలేరని ఆయనకు తెలుసు. అందువల్ల ఆయన ప్రపంచంలో యుద్ధాలు, చెడుకాలం, కలరా, రోగాలు సృష్టిస్తూంటాడు. అందువల్ల, మానవులు తమ అస్వాభావిక సమాజవ్యవస్థల పాపాల పరిణామాన్ని, స్వయంగా తమ కళ్ళతో చూస్తారు. ఎప్పుడు వారు కష్టపరంపరలతో, 'త్రాహి-త్రాహి' అని ఎలుగెత్తి వాపోతారో, ఆ సమయంలో వారికి, ఆశా, ఆనందాల సందేశాన్నిచ్చే శక్తికూడా కనుపిస్తుంది. అటువంటిశక్తి, ప్రపంచంలో ఒక్కొక్క సమయంలో అవతరించి, తన దివ్యకాంతిపుంజాన్ని వెదజల్లి వెళ్ళిపోతుంది. ప్రకాశంతో కూడిన ఆ వెలుగే శతాబ్దాలతరబడి మానవజాతికి దారి చూపుతూవుంటుంది."

"మీ రీ అంధకారంలోకూడా అటువంటి శక్తిని దేన్నైనా చూస్తుంటారా ?"

"అవును! ఎందుకు చూడను? కళ్లున్న ప్రతివారు దాన్నిచూడగలరు. భిన్నభిన్న కాలాల్లో - విభిన్నరూపాల్లో,

తన కార్యం నెరవేర్చుకునిపోయేది ఆ శక్తి ఒక్కటే! అదే ఒక మారు భగవాన్ బుద్ధనిరూపం ధరించింది. రెండోమారు క్రీస్తురూపాన్ని, యీమారు గాంధీరూపాన్ని ధరించింది. మనకు దగ్గరగావుండుటచేత, అలక్ష్యంచేత, మనం దాని దివ్యత్వాన్ని చూడలేకపోతున్నాం. చరిత్రా, కాలమే దాని జ్యోతిని వెలిగిస్తుంది. కాని, ఏది క్షితిజంమీద కనుపిస్తూందో - దేని దీప్తి మన దుఃఖాలతాలూకు ఘనీభవించిన కటికచీకటిలో వెద జల్లబడుతూందో, అదే ఏకైకశక్తి, ప్రకాశవంతమైన ఏకైక నక్షత్రం అదొక్కటే!...గాంధీజీ సత్యం, విశ్వబంధుత్వమే మన యీ ఘోరదుర్దశకు ఏకమాత్ర చికిత్స! అదొక్కటే మన నవయుగానికీ, సర్వోదయానికీ సందేశావాహం. నేడు కాకున్నా-రేపైనా తప్పకుండా మనకీ సత్యం కనుపిస్తుంది. ఈ ఒక్క బలమైన కారణంతోనే నాకు, కేవలం మన దేశమందేకాక ప్రపంచస్థితత్వంలోకూడా అపరిమితమైన అభిమానం విశ్వాసం వున్నాయి. ఆ బంగారు కల ఆశతోనే. నా జీవితానికి బలం, ప్రేరణా, ఉత్సాహం కలిగివున్నాయి. లేకుంటే, నా భావయుక్తహృదయం ఎప్పుడో, ఛిన్నాభిన్నమైపోయివుండేది".

అశోక్ఠాకూరు చెప్పేమాటల్ని మరియమ్ ఎంతో శ్రద్ధగావింటోంది. తన అభిప్రాయాలతో యీ అభిప్రాయాలు ఏకీభవించడంచూచి ఎంతో ఆశ్చర్యంచెంది. "అశోక్ బాబూ! నా అభిప్రాయాల్నే మీరు అందమైన భాషలోచెప్తున్నారు. ప్రపంచంలో దుఃఖం, అన్యాయం, విషమత్వాను ఎక్కువగా కనిపిస్తున్నాయి. కాని ప్రపంచంలో అవే సంపూర్ణసత్యాలు

కావు. లేకుంటే సోదరత్వం, సానుభూతి, సేవ మొదలైనవాటికి అర్థమేముంటుంది? జీవితంలో బాధవుంటేనే ఆనంద ముంటుంది. రాత్రివుంటేనే, పగలువుంటుంది. ఏడుపువుంటేనే, సంగీతంవుంటుంది. శిశిరంవుంటేనే వసంతంకూడా వుంది. ఒక వేళ ప్రపంచంలో దుఃఖం తప్ప యింకేమీ లేనప్పుడు, కోయిల పాడడ మెందుకు? నెమలి నాట్యమెందుకు చేస్తుంది? పూలెం దుకు వికసిస్తాయి? ఇంద్రధనుస్సెందుకు ఏర్పడుతుంది? జీవితంలో ఆశా, సుఖం, ఆహ్లాదాలు వున్నాయని, యీ తత్వాలు నిర్దే శించడంలేదా? మానవులు తమ కష్టాలెన్నింటి కంత అతి శయదృష్టితో చూచి, తమకోసం వేదనాపర్వతా లెం దుకు నిలబెట్టుకుంటారు?" అని అడిగింది.

"అసలు విషయం అదే"-అశోక్ ఆమెతో ఏకీభవించి అన్నాడు. "దురభిమానం, అవిశ్వాసమే మనయుగానికి గొప్ప శాపం. మనవస్తువులందు మనకే అభిమానం లేదు. భగవంతుని యందూ, ధర్మమునందూ, దేశంమీదా, మానవత్వంయందూ- చివరకు తనమీదతనకే విశ్వాసం లేదు. తర్కమనే ఆధారంతో మనం జీవితానికి మూలభూతమైన ప్రాచీనవిలువను భంగపరి చాము. కాని, దానిస్థానంలో మనం కొత్తవిలువను స్థాపనచేయ లేక, మన స్థితిని తెరచాప లేని ఓడలా తయారు చేశాము. విశ్వాస మనే సంజీవిని పోగొట్టుకుని మనం, నిష్ప్రాణమైన మానవ సమాజంలో చైతన్యాన్నీ, ఆనందాన్నీ పూరించాలని ప్రయ త్నిస్తూ-మనకు సుఖం యీవిధంగానే దొరుకుతుందని ఆలోచి స్తున్నాము. అదలా దొరుకుతుందా?"

మరియమ్ తలూపి, తన సమ్మతిని తెలిపింది. ఆమె మనసంతా, అక్కడికి దగ్గర్లోవున్న రాతిచట్టుమీదకూచున్న పిట్టలజంటమీద వుంది. ఒక పిట్ట తననోటిలోని ఆహారాన్ని రెండో పిట్టకు అందిస్తున్నది. చీకటిపడబోతోంది. పగలంతా. కష్టపడి సంపాదించిన తన సంపాదనంతా తనతోడిదాని కర్పిస్తోంది. ఇచ్చి పుచ్చుకోవడం పూర్తయాక, అవి తుర్రున ఎగిరిపోయి, ఎదురుగావున్న చెట్టులో దూరిపోయాయి. బహుశా అదే వాటి గూడు కావచ్చు.

ఆ దృశ్యాన్ని అశోక్ కూడా చూశాడు. ఆ ప్రేమా, ఆత్మీయభావం చూచి ఎంతో ద్రవించిపోయాడు. అదే భావం అతని ముఖంలోకూడా కనుపించింది. ఆ మరుక్షణంలో అతను మరియమ్‌వేపు చూశాడు. ఆమెకూడా అతనివేపే చూస్తోంది. ఇద్దరిచూపులు కలుసుకున్నాయి. మరియమ్‌కళ్ళలో స్నేహభావం ప్రతిబింబించింది. కాని, అశోక్ కళ్ళలోని కుతూహల భావం అలాగే నిలబడిపోయింది. మరియమ్ లేచినిలబడి, "పదండి, ఇంటికి వెడదాం. చీకటిపడబోతోంది" అన్నది.

# 7

ఆనాడు అశోక్ మంచంమీద పడుకున్నప్పుడు, అతని మనసులో మరియమ్ గురించే ఆలోచనలు రేగుతున్నవి. ఆమె బుద్ధిమంతురాలనడంలో సందేహంలేదు. ఆమె అభిప్రాయాలుకూడా తెలుస్తూనేవున్నవి. కాని, జీవితం ఎదుర్కొనే సమస్యల విషయమై ఆమె కొంత ఆలోచించివుండ

వచ్చు. ఆమెకు జీవితమంటే ద్వేషంలేదు. పైగా ప్రేమిస్తూ వుంది. ఆ పిల్ల అనాధురాలైనా కూడా, ఇటువంటి కష్టతరమైన ఆశావాదాన్ని మర్యాదగా ఎలా పాటిస్తూందో తెలియదు. ఎన్ని కష్టాలు సహించవలసివచ్చిందో? ఎన్ని అవమానాలు, ఎన్ని అంతర్ వ్యధలు సహించవలసివచ్చిందో? నేనుకూడా ఆమె మిస్ థామస్‌మీద ఆధారపడి, సంవత్సరాలనుంచీ, యీ వన్యగ్రామములో పడివుంది. ఆమె జీవితమంతా ఏకాకిగానే కనుపిస్తోంది. యవ్వన ప్రాంగణంలో, జీవితాంతంవరకు ఆమె యిలాగే కాలంగడుపుతుందా? ఇలావుండికూడా, అన్ని సుఖాలు ప్రాప్తించినట్లు, ఆమె ఎంతో ప్రశాంతంగా, సుమంగళంగా, ఆశావాదిగా, తన కన్నిసుఖాలు ప్రాప్తించినట్లుంది. ఆశ్చర్యకరమైన యువతి!

భారతదేశపు పురాతన సంస్కృతి, భవితవ్య విషయంలో ఆమె కెంత గౌరవముంది! ఆమె రూపానికి ఆంగ్లో యిండియన్‌లా వుంది. కాని, భావాలూ, శ్రద్ధా చూస్తుంటే, భారతీయయువతిలా వుంది. ఆమె అనాధ! ఆమెశరీరంలో ఏ రక్తం ప్రవహిస్తోందో, ఆమె జీవితంపై నేటి ప్రభావం పడిందో, ఆమె సంస్కారా లేమిటో...? చివరకు ఆమె పూర్వజీవితమేమిటో-అదికూడా తెలియదు. అశోక్‌కు కుతూహలం కలిగింది. కాని, ఎవరిని అడగాలి? కాని, అతని మనసు ఆమె విషయంలో ఆలోచించకుండా వుండలేకపోయింది. ఏమైనా, ఆమె వర్తమానస్వరూపం చక్కగావుంది. ఆమె సాన్నిధ్యం సుఖాన్నిస్తుందనేది మాత్రం అతనికి తెలుసు.

అందువల్ల రెండురోజులయాక, అతను పిక్నిక్ ఏర్పాటు చేసినప్పుడు, అతని మనసులో మరియమ్‌సాన్నిధ్యేచ్ఛకూడా ఒక కారణం కావచ్చు, మిస్ థామస్‌నుకూడా పాల్గొనవల సిందిగాకోరాడు. కాని, అందు కామె తన అనంగీకారం తెలుపుతూ, వృద్ధాప్యంలో బలహీనతకారణం చూపించి, అడవుల్లో పర్వతాలమీద తిరగలేననీ, తన పిక్నిక్ రోజులు గతించాయనీ, అంతకన్నా, మరియమ్‌ను వెంటబెట్టుకుని వెళ్ళడం మంచిదనీ చెప్పింది. అశోకునికీ మాటలు అంత చెడ్డవిగా కనుపించలేదు. ఎందుకంటే. మిస్ థామస్ ఎదుట అతనంత విచ్చలవిడిగా వుండలేడు.

కారు తయారైంది. అబ్దుల్లా వెంటవున్నాడు. ఆ రోజంతా కార్యక్రమము పెట్టుకున్నారు. అందువల్ల తిండి తిప్పల ఏర్పాట్లుకూడా అవసరం. కాన్వాస్, రంగూ, బ్రషులు వెంట తీసుకున్నారు. మరియమ్‌కూడా ఆరోజు సెలవుపుచ్చుకుంది. నిశ్చింతగా, ఉల్లాసంతో నిండిన మనసుతో ఆమె బయలుదేరింది!

వారి గమ్యస్థానాన్ని 'బారాలింగ్' అని పిలుస్తారు. ఆ రమణీయ ప్రదేశం, బైతూల్‌కు సుమారు పదిమైళ్ళదూరంలో తపతీనదివొడ్డున వుంది. తపతీనది ఎత్తైనపర్వతాలగుండా, పచ్చపచ్చని అడవుల్లో దాగుడుమూతలాడుతూ ప్రవహిస్తుంది. ఆ ప్రదేశంలో ఒకచోట నిలుచుని చూస్తుంటే, మూడు వేపులా పర్వతాలూ, నాలుగోవేపు తపతీనది నిర్మల కలకల ప్రవాహం కనుపిస్తుంది. రాతిప్రదేశంగుండా ప్రవహించడం చేత, అక్కడ నది ఉధృతంగా, ద్వాదశిబాలికలా క్రీడామగ్నంగా కను

పిస్తుంది. ఒకవొడ్డున శివాలయంవుంది. అక్కడ శివ లింగాలు పన్నెండువున్నవి. అందువల్లనే దాని కా పేరువచ్చింది. కారు 'ఖేడసాంవలీగఢ్' గ్రామమువరకే వెడుతుంది. ఆ తరువాత దట్టమైన అడివిలో సుమారు రెండూ - రెండున్నర మైళ్ళు నడిచి వెళ్ళాలి.

ఖేడీలో కారు వుంచి కొంత సామానుతో అశోక్, మరియమ్, అబ్దుల్లా కాలిబాటంట 'బారా లింగ' వేపు బయలుదేరారు. దారిచూపడానికీ, కొంతసామాను మోయడానికి ఒక కుర్రవాడిని వెంటబెట్టుకున్నారు. వాడు కూలి దొరుకుతుందనే ఆశతో సంతోషంగా వారి వెంట బయలుదేరాడు. వాడూ, అబ్దుల్లా ముందు నడుస్తుంటే, మరియమ్, అశోక్‌లు వెనక నడుస్తున్నారు.

ఋతురాజైన వసంతాగమన చిహ్నాలు దశదిశలా కనిపిస్తున్నవి. సృష్టంతా ఆనందోత్సాహాలతో కేళీవిలాసంగా వుంది. సగ్గు, ఇప్ప, మామిడి, గూరగచెట్లు కొత్త చిగుళ్ళతో పచ్చ పచ్చగా కొత్త కొత్తగా కనుపిస్తున్నాయి. మోదుగపూల పరిమళం ఘుమఘుమలాడుతోంది. మామిడి చెట్లు పూతతో మత్తుగా వూగుతున్నాయి. వనవాయువు విచిత్రమైన సౌరభంతో మెల్ల మెల్లగా వీస్తోంది. ప్రకృతి సామ్రాజ్యంలో ఎటు చూచినా ఆనందమే ఆనందం కనిపిస్తోంది. దీని ప్రభావం పక్షులమీదా, ఆ వనంలో తిరిగే మానవప్రాణుల మీదకూడా పడింది.

ఈ సమయంలో అశోక్ మాట్లాడేస్థితిలో లేడు. అతని సౌందర్యాసక్తమైన కళ్ళు ప్రకృతిలోని అభిరామ రమణీయ

తను అనుభవించేందుకు వువ్విళ్ళూరుతూవున్నాయి. ప్రకృతి సంబంధమైన శుద్ధ సాత్వికానందం అతనిహృదయాన్నావరించింది. అతని కళాసృష్టి జాగృతమయింది. నడుస్తూ నడుస్తూనే అతను అబ్దుల్లాను కేకవేశాడు.

అయిదునిముషాల్లో, అశోక్ ఠాకూరుకుంచె ఎదురుగా వున్న కాన్వాస్ మీద నాట్యమాడటం మరియమ్ తిలకించింది. అతని సమస్తప్రాణం కళ్ళల్లోకి దిగివచ్చినట్లనిపించింది. అతని వ్రేళ్లు అతి సునాయాసంగా, స్పష్టంగా, వాటిపని నవి చేస్తున్నాయి. ప్రపంచంలోని అన్నివిషయాల్నీ విస్మరించి, కళ అనే సత్యంమీదనే దృష్టిసారించినట్లున్నాడు. జీవితంలోని సమస్త కార్యకలాపాలు, యిష్టాలూ, కోరికలూ, లక్ష్యం అన్నీ యీ క్షణంలో కళాభినివేశంలో లీనమైపోయి, కాలం, పరిస్థితులనే ధ్యాసేలేకుండాపోయింది. సృష్టీ, దాని వ్యవహారం ఆగిపోయినట్లనిపించింది. చివరకు తన శ్వాస, హృదయస్పందనాదుల ధ్యాసకూడలేదు. సమాధిలోవున్న యోగిపుంగవునిలా. అతను తన కళాసాధనలో లీనమైపోయాడు. అతని ఆత్మ, అతని వ్యక్తిత్వంనుంచి లేచిపోయి, ఏదో మరొకలోకంలో విహరిస్తున్నట్లుంది. మరియమ్ ఎక్కడుందో, అబ్దుల్లా ఎక్కడున్నాడో, తనెక్కడవుందీ అతనికి తెలియనే తెలియదు.

కళలో అంత ఉత్కంఠమైన మనోయోగాన్నీ, అంత తన్మయాత్వాన్నీ మరియమ్ ఎప్పుడూ చూడలేదు. అశోక్ తన సాధనలోవున్నప్పుడు ఆమె అతని ప్రగాఢమైన తన్మయతను తదేక ధ్యాసతో చూస్తోంది. అశోక్ అందం ఎన్నోరెట్లు పెరిగిపోతూ, పావన కాంతిలా మెరిసిపోతున్నట్లుంది. ఆమె

ఆ విశుద్ధ లావణ్యాన్ని నిర్నిమేష నేత్రాలతో ఉపాసన చేస్తోంది. కళాకారుడు తన సాధనావధానంలో యింత ఔన్నత్యాన్ని పొందడం, ఆమె యింతవరకూ చూడలేదు. అశోక్ ఠాకూరు యదార్థానికి ఆర్టిస్టనీ, సాధారణవ్యక్తులకన్నా భిన్నమైనవాడనీ, గొప్పవాడనీ గ్రహించింది. ఈ అపూర్వదృశ్యం, ఆమెకు అనిర్వచనీయమైన సుఖాన్నిచ్చింది. తన అదృష్టానికి గర్వించింది. అశోక్ ఠాకూర్ జీవితం ఆమెకు క్రొత్తగా ఎదురై మోహపెట్టింది.

రెండు గంటలవరకూ యిలా చిత్రిస్తూనేవున్నాడు. ఆతరువాత ఒక నిట్టూర్పు విడిచి, అశోక్ తూలికను వదిలిపెట్టాడు. అతను అలసిపోయి క్రిందనున్న పచ్చికమీద పడుకుని, పైనున్న నిర్మల నీలాకాశంవేపు చూస్తూ ప్రశాంతంగా వున్నాడు. ఎదురుగావున్న ప్రకృతిదృశ్యం తాలూకు ప్రతిబింబము కాన్వాస్‌మీద అచ్చుగ్రుద్దినట్లు చిత్రించివుంది. నూటయిరవై నిముషాల స్వల్పావకాశంలో యింత అద్భుతమైన కళాసృష్టిని చూచి, ఆమె నిశ్చేష్టురాలైంది.

అశోక్ ఠాకూరు యోగావస్థ దిగిపోవడానికి గంట కాలం పట్టింది. అతనూ మరియమ్ బారాలింగ్ పర్వతంమీద ఒక మామిడిచెట్టుక్రింద ఫలహారానికి కూర్చున్నప్పుడు, అతనికి పూర్వస్థితి కలిగి మనసు తేలికపడింది. అందువల్ల ఎదురుగా జంపఖానామీద, పళ్ళెంలోని కేకు, బిస్కెట్లు, కిస్‌మిస్, మిఠాయి, పండ్లూ ఒక్కటొక్కటే తింటున్నాడు. అబ్దుల్లా క్రిందున్న శివాలయంపద్ద వంటకు కావలసిన ఏర్పాట్లుచేస్తున్నాడు.

తన ఆకలిని దాచుకునేందుకు అశోక్—"నీకు ఆకలిగా లేదా?" అని మరియమ్‌ను అడిగాడు.

ఇన్నిరోజుల పరిచయంతరువాత, ఇప్పుడే అశోక్ ఆమెను 'నువ్వు' అని సంబోధించాడు. ఆమె తనకన్నా చిన్నది. అందువల్ల తన పెద్దరికపు అధికారాన్ని వహించేందుకు సంకోచించలేదు. ఈ సంబోధనకు మరియమ్ సంతోషించింది.

"నాకు ఆకలివున్నా లేకపోయినా మీరు సంకోచించకుండా తినండి. కష్టపడి నేను చిత్రం గీయలేదుకదా?" మరియమ్ నవ్వుతూ చెప్పింది.

అశోక్ సిగ్గుపడుతూ విషయాన్ని మార్చి—"ఇదివరకు నువ్వు యిటువేపు ఎప్పుడూ రాలేదా? ఇది చాలా అందమైన ప్రదేశం" అన్నాడు.

"అవును నా చిన్నతనంలో ఒకమారు వచ్చాను. అప్పుడు నే నీ ప్రదేశానికి కొత్తదాన్ని. అప్పుడు నాకు సరిగా ఊహరాలేదు. కాని, తిరిగి యిప్పుడు చూస్తుంటే యీ నదీ, ఎదురుగా వున్న ఆ పర్వతం అన్నీ జ్ఞాపకమొస్తున్నాయి."

అశోక్ పిలుకనిపెట్టి— "నువ్వు థామస్‌వద్ద ఎంత కాలంనుంచి వుంటున్నావు?" అని అడిగాడు.

"సుమారు పదకొండు పన్నెండేళ్ళనుంచి..."

"అంతకు ముందెక్కడున్నావు?"

"లక్నో మిషనరీ అనాథాలయంలో వున్నాను. ఒకసారి మిస్ థామస్ అక్కడికి రావడం జరిగింది. ఆమె నన్ను చూచింది. బహుశా నా రూపురేఖలు చూచి సంతోషించి

వుంటుంది. నేను తీక్షణ బుద్ధిగలదాన్నని మా అనాధాలయ మానేజరు అభిప్రాయము. ఆమె నన్నుగురించి విని తనతో వెంటబెట్టుకుని వచ్చింది. అప్పటినుంచీ నే నామెతో నే వుంటున్నాను. ఆమే నాకు యింగ్లీషు నేర్పింది ధర్మోపదేశం చేసింది. ప్రార్థనచేయడం నేర్పింది. నేను రోమన్ కాథలిక్ సాంప్రదాయానుసారం దీక్షపుచ్చుకుని, ఆజన్మ బ్రహ్మచర్యంతో సన్యాసినిగా వుండాలని ఆమె ఉద్దేశ్యం. కాని, అది నా కంతగా యిష్టంలేదు. అందుకని అదుగో యిదుగో అని తప్పిస్తూ వస్తున్నాను."

"మిస్ థామస్‌వద్ద ముఖ్యమైన పనేమన్నా చేస్తుంటావా?"

"అంత ముఖ్యమైన పనంటూ ఏమీ లేదు. ఆమెగారి తిండీ, తిప్పలూ దుస్తుల విషయంలో ఎక్కువ ధ్యాసవుంచాలి. ఆమె ఆరోగ్య మంత మంచిదికాదు. అందుకని మందూ మాకుల విషయంకూడా చూస్తుండాలి. ఆమె ఏకాకిని! ఆమెకు తోడు అవసరం. నేనుకూడా ఆ లోటును పూర్తిచేయడానికి ప్రయత్నిస్తున్నాను. గ్రామములో చికిత్స చేయడమూ, అప్పుడప్పుడూ స్కూలులో బైబులు చదివిరావడమూ, చర్చిలోని మిషన్ బంగళాను చూస్తుండటం మొదలైన పనులుకూడా నేనే చూస్తుండాలి. అందుకు ప్రతిఫలంగా నాకు తిండీ బట్టా, నెలకు మూడురూపాయల అలవెన్సు లభిస్తుంది. మిస్ థామస్ బీదది. గత సంవత్సరం మా మిషను తాలూకు కేంద్ర ఆఫీసు, మధ్యఆఫ్రికాలో తన కార్యక్షేత్రాన్ని వృద్ధిపరిచేందుకు ఖర్చులో కొంత తగ్గించమని అప్పీలుచేసింది. అందుకు జవాబుగా

మిస్ థామస్ ఒకేమారు బీదజీవితాన్ని స్వీకరించి: పాదీ్రి పురంలోని అనవసర ఖర్చులన్నీ తగ్గించివేసింది. కాని, నా కా మూడు రూపాయలు కూడా అవసరానికి మించినవే! ప్రపంచంలో నా కెవరూ లేరు. అటువంటిస్థితిలో డబ్బు ఎక్కువ కావాలని ఎందు కాశించాలి?"

మరియమ్ చెప్పిన ఆఖరిమాట విని అశోక్ హృదయం దయార్ద్రమైంది. కాని, తన మనసును కూడదీసుకుని-"లక్నో రాకపూర్వం ఎక్కడున్నావో జ్ఞాపకముందా?" అని అడిగాడు.

"ఆ... కొంత జ్ఞాపకంవుంది. మరి కొంత లోకులవల్ల తెలుసుకున్నాను."

"నీ జీవితం చూస్తుంటే ఎంతో జాలివేస్తోంది. నీకు అభ్యంతరం లేకుంటే, అంతా చెప్పగలవా?"

"నా కా మాత్రం తెలుసు. అందుకనే మీకేమీ దాచకుండా చెప్పదామని బుద్ధిపుడుతోంది. మీరు ఎవ్వరినీ అసహ్యించుకోరు. ఏవిషయమూ దాచకూడదనిపిస్తోంది. క్రిష్టియన్లు కాకపోయినా క్రీస్తుతత్వాన్ని మీరు అద్భుతంగా హృదయంగమంచేసుకున్నారు."

"సరే! ఆ విషయాన్ని వదిలిపెట్టు. నన్ను నీ స్నేహితుడని అనుకో! ఒకవేళ నువ్వు నన్ను నమ్మినట్లయితే నేను దానికి భిన్నంచేయను. అలా ఎప్పుడూ చేయను."

"అది చెప్పవలసిన అవసరం లేదు. అది నేను స్వయంగా చూడగలను. సరే! వినండి."

౬

"నాకు బాగా ఊహవచ్చినప్పటినుంచీ లక్నోలో వున్నాను. అక్కడకూడా సన్యాసిక దొరసానిగారికి వొప్పగించి నా చరిత్రంతా చెప్పారు. నేను కాశ్మీరు వన్యప్రదేశంలో జన్మించాను. వృక్షాలన్నా, పూలన్నా, పర్వతాలన్నా, సెలయేరులన్నా, సరోవరాలన్నా, నా కంత సమరసభావం ఏర్పడడానికదే కారణంకావచ్చు. పెద్ద పెద్ద పట్టణాల్లో వుండడం నా కలవాటులేదు. ఐనా నేను చూచిన పట్టణాలుకూడా చాలా తక్కువే! అందువల్ల పాదీపుర అడవులంటే నా మనసున కదోరకమైన సంతోషం. నా తండ్రి స్వీడిష్ టూరిస్టు. బహుశా ప్రొఫెసర్ కావచ్చు. భారతదేశ సభ్యతా, విచిత్రాలూ, సౌందర్యఖ్యాతి విని, వాటి ప్రభావానికి ఆశ్చర్యం చెంది యిక్కడికి వచ్చారు. ఈ దేశంలో రెండేళ్ళు వుందామనుకుని వచ్చారు. ఎక్కడైనా మంచిప్రదేశం కనుపించినట్లయితే నెలంతరబడి వుండేవారు. కాశ్మీర్‌లో ఆయన వున్నప్పుడు ఒక హిందూస్త్రీతో సంబంధ మేర్పడింది. ఆ అల్పజీవి ప్రణయానికి లేదా విలాసానికి నేను అవతరించాను. ఆ ఇద్దరు విదేశీయుల ఆకర్షణకు, శారీరక సౌందర్యమో, విషయవాసనో లేక మా అమ్మ బీదతనమే కారణమో నాకు తెలియదు. కారణం ఏదైనా తత్పరిణామంగా నేను జన్మించాను. నా తండ్రికి నా వునికి తెలుసో, తెలియదో నే నెరుగను. కాని, వారు వెళ్ళిపోతూ, మా అమ్మకు చాలా పైకం, బట్టలు యిచ్చి వెళ్ళారు. మా అమ్మను అంతా కులివేశారని విన్నాను. అందువల్ల ఆమె క్రిష్టియన్ మతం పుచ్చుకుంది. నేను పుట్టిన

రెండుసంవత్సరాలకు ఆమె చనిపోయింది. ఆమె చనిపోయి నప్పుడు, ఆమెపెట్టెలో కొన్ని మంచి మంచి బట్టలూ, బంగారు గాజులూ, ఒక వుంగరం, ఎంతో జాగ్రత్తగా దాచి వుంచిన ఒక బలిష్టుడైన దొరగారి ఫొటో కనుపించాయ్. ఆ డబ్బూ, బట్టలు ఏమైపోయినవో నాకు తెలియదు. కాని, ఆ ఫొటోమాత్రం యింకా నావద్దనే వున్నది. ప్రస్తుతం దాని రంగు కొంత పాలిపోయింది. అతనే నా తండ్రిననుకుంటాను. ఆ ఫొటోను నే నెప్పుడూ శ్రద్ధగా చూస్తుంటాను అలా చూడ టంలో నా కెప్పుడూ సిగ్గనిపించలేదు. అనాథాలయంలో నా రోజులు సరిగ్గా గడవలేదు. నన్ను ప్రేమించేవారెవరూ ఈ ప్రపంచంలో లేరనే విషయం నన్నప్పుడప్పుడూ బాధించేది. కాని. అనాథాలయ జీవితం కారణంగానే ప్రపంచంలోని అఘా తాలు, గాలిదుమారాల జ్ఞానంకలిగింది. అదీ ఒకందుకు మంచిదే అయింది దానివల్ల నా కాత్మవిశ్వాసం కలిగింది. స్నేహాపు విలువ తెలిసింది. సుఖసౌందర్యం అవగతమయింది. నా కా వస్తువు దొరికినప్పుడు, దానివల్ల నే నెంతో సాత్వికా నందం పొందుతుంటాను. ఈ కారణంగానే మెరుస్తున్న సూర్యప్రకాశమూ, పాడుతున్న కోయిలా, వికసిస్తున్న పూలూ, శీతలచంద్రకిరణాలు నన్నెప్పుడూ ఆకర్షిస్తుంటాయి."

"ఊఁ..." అన్నాడు అశోక్ ఒక్క నిట్టూర్పువిడుస్తూ. ఆ ఒక్క నిట్టూర్పుతోనే అశోక్ హృదయంలో, తనయందు సహానుభూతి కలిగిందనే విషయం మరియమ్ గ్రహించింది. ఆమెకథను ఎంతో శ్రద్ధగా వింటున్నాడు. ఆమె చెప్పడం ముగించాక—"సీకు నీ వర్తమాన జీవితం ఎలావుందనిపిస్తోంది?

సన్యాసిని దీక్షనుంచి నువ్వు స్వయంగా నిన్ను కాపాడుకో గలవా?" అని అడిగాడు.

"అవును. ఆవిషయమే నన్నప్పుడప్పుడూ బాధిస్తోంది. ప్రస్తుత జీవితం నా కంత చెడ్డదిగా తోచటంలేదు. అప్పు డప్పుడూ వూరికే అకారణంగా ఉదాసీనం ఆవహిస్తుంది. ఒక్కొక్కప్పుడు నిద్రకూడా పట్టదు. తిరిగి ఒకటి రెండు రోజుల్లో మామూలు స్థితికివస్తాను. ఒకవేళ సన్యాసినిగా మారకుండా వుంటేనే బావుంటుందనిపిస్తుంది."

అశోక్ మరియమ్‌వేపు చూచాడు. ఆమె యువ్వనం, సౌందర్యం యింకా నిర్మలంగా కనుపించాయి. ఇటువంటి లావణ్యవతి, ఏదో అగమ్యగోచరమైన తత్వంకోసం, ఆజన్మ బ్రహ్మచర్యవ్రతం పుచ్చుకొని కఠినజీవితం గడపాలనేది అతని కంతగా నచ్చలేదు. ఆ తీక్షణమైన జీవితం వూహించుకుంటేనే వొళ్ళు జలదరించింది. ఐనా తన మనసులోని భావం మరుగు పరచి-"సన్యాసినిజీవితంమీద నీకు మనసు లేదంటావు. అంతేనా...?" అని అడిగాడు.

"నాకెందు కంత అయిష్టతగావుందో నేను సరిగ్గాచెప్పలేను. ఆ కఠినజీవితవ్రతంయొక్క గొప్పతన మేమిటో, దానివల్ల నాకు ఏమి దొరుకుతుందో నాకు అర్థంకావడంలేదు. మిస్ థామస్‌హృదయం చాలా మంచిది. నామీద ఆమె కెంతో దయ. కాని, ఆమెకూ నాకూ ఎన్నోమార్లు భేదాభిప్రాయాలు కలిగాయి. ఆమె నిష్కల్మషమైన ధార్మికురాలు. కాని, ఆమె ధర్మశీలం న్యాయరూపం దాల్చింది. నానాటికీ వృద్ధివుతున్న క్రిష్టియనుల సంఖ్య, వారి ధర్మప్రచారానికి ప్రత్యేక తార్కాణ

మంటుంది. కాని, ధర్మపరివర్తనతోపాటు హృదయపరివర్తనం జరగనిదే అదంతా మిథ్యయని నా అభిప్రాయం. నవ్వడం, ఆడటం, పాడటం నాకు బావుంటుంది. దీక్షపుచ్చుకునేవారి కివన్నీ పనికిరావనీ, వారు గంభీరంగా ధైర్యంగా వుండా లంటుందామె. భగవంతుడంటే మా యిద్దరికీ నమ్మక ముంది. కాని, బైబుల్‌లో వ్రాసియున్నదే ఆయన వాణి అని ఆమె అంటుంది. భగవంతుడు దీనదరిద్రులవాణిలోకూడా వుంటాడని నా అభిప్రాయం. వివాహము పాపమనీ, మగ వాడుగా జన్మించడం పాపాలకు మూలమని వారి అభిప్రాయం. స్త్రీ-పురుషుల నిర్మలమైన ప్రేమలోనే భగవంతుని ఆశీర్వాదం కనిపిస్తుందనీ, మాతృత్వంలోనే స్త్రీజీవిత శాశ్వతి వుందనీ నా అభిప్రాయం. బహుశా మా యిద్దరి దృష్టికోణాలకు భిన్నంగావుండే విషయాలు యిలాంటివే యింకా కొన్ని వున్నాయి. కాని, ఫాదర్ విలియమ్ యీ మెకన్నా ఉదారులు. మిషనరీ కాకముందు వారు గ్లాస్గోలో ప్రొఫెసర్‌గా వుండే వారు. ఐనా ధర్మాన్ని సేవిద్దామని వారు నౌకరీని వదిలి పెట్టారు. వారివద్ద మంచి లైబ్రరీకూడా వుంది. వారు నాకు బాగా చదువుచెప్పారు. నన్ను కుమార్తెగా భావించారు. బహుశా, వారే నన్ను సన్యాసినిదీక్షనుంచి రక్షించగలరని నమ్ముతున్నాను. మిస్ థామస్ పోయాక వారు నన్నెప్పుడూ విడిచిపెట్టరని నా నమ్మకము."

"అవును నిజమే." అశోక్ అన్నాడు.

ఆమెజీవితకథ విని, అతను ఆశ్చర్యం చెందాడు. కాని మరియమ్ అమాయకపుమాటలు, భయంలేని భావాలు విని,

అతని కెంతో కుతూహలం కలిగింది. ప్రపంచంలోని గొప్ప గొప్ప తత్వాల్ని ఆమె ఎంతో సరళమైన శబ్దాలతో సహజత్వంతో విశదపరచింది. ఆమె అన్వేషణశక్తి అసాధారణమైనదనడంలో అనుమానం లేదు.

"ఐతే, వివాహ వ్యవస్థయందు నీకు దృఢమైన అభిప్రాయం వుందా?" అని అశోక్ అడిగాడు.

"ఆ... ఉన్నది. కొన్ని వేల సంవత్సరాలనుంచీ యీ వ్యవస్థ నడుస్తోంది. కొంతమంది స్త్రీ-పురుషుల సుఖమూ, జీవితమూ సర్వనాశనమైపోయాయి. ఇప్పటికీ, ఏ కోణంలోంచి ఆలోచించి చూచినా దానివల్ల మానవజాతికి శుభమే కలిగిందనీ, ఒక అడుగు ముందుకుపోయామని వొప్పుకోక తప్పదు. ఏమంటారు? అందుకు మీరంగీకరించరా?"

ఈ నూటిప్రశ్నకు ఒక్కక్షణం అశోక్ గాబరాపడిపోయాడు. అతను తన భావాలమీద నమ్మకంగలవాడు. అవి ఎంత అప్రియమైనా వాటిని వ్యక్తపరచడంలో అతనికి సంకోచం కలగదు- "నీ భావాలన్నింటితో నేను ఏకీభవిస్తాను. కాని, వివాహవ్యవస్థ విషయంలో, నీ కున్నంత ఉల్లాసం నాకు లేదు."

"ఎందుకని? మీరు ఆడవాళ్ళని అసహ్యించుకోరు కదా?"

"లేదు. నే నెవరినీ అసహ్యించుకోను. స్త్రీలను అసలే అసహ్యించుకోను. అంత నికృష్టమైన పాపం నావల్ల జరుగదు. ఒక స్త్రీ, ఒక పురుషుడు మృత్యుపర్యంతం బంధింపబడి వుండాలని నేను అనుకోను. నా మనసే అటువంటిది కావచ్చు.

కొన్ని వేలూ, లక్షలమంది దంపతుల శయనాగారాల గోడల మీద, ఏడ్పులూ, వికలమైన కలల కథలు వ్రాసివున్నవి. ప్రతి ఏడు సంవత్సరాలకూ మానవశరీరంలో, ఆచార వ్యవహారాల్లో పరివర్తనం జరుగుతూ వుంటుంది. భార్యభావం భర్త భావాలకు విరుద్ధంగా వుంటుంది. అందువల్ల కలహాము, దుఃఖం, అసహ్యం కలుగుతాయి. వారి అంతర్ జీవితంలో భయంకరమైన జ్వాలలు మండుతూవుంటాయి. కాని వారు పైకి ప్రేమనాటకం ఆడుతూనే వుంటారు. ఈ అభినయం వారు జీవితం ఆఖరివరకూ చేస్తూనేవుంటారు. ఎందుకంటే, తమ అభిప్రాయ పరివర్తన సంగీకరించడానికి, వారికి ధైర్యం వుండదు. నా భావం జనసామాన్యానికి రుచించదని నాకు తెలుసు. కాని, నా స్వవిషయంలో నేను ఏ స్త్రీబంధనలోను జీవితాంతం వుండననీ, అందులో నా జీవితలక్ష్య ఫలశృతిని కూడా చూడలేనని తప్పకుండా చెప్పగలను. సమాజ శాస్త్ర దృష్టిలో నేను అరాజకున్ని. మరియమ్! ప్రస్తుతం వున్న సమాజ వ్యవస్థ ఆమూలాగ్రం పరివర్తనం చెందనిదే, మానవుడు సుఖించలేడని నా అభిప్రాయం."

"క్షమించండి! వైవాహికజీవితాన్నిగురించి, మీరు చిత్రించుకున్నది, అర్థరహితంగా కన్పిస్తోంది. ఈ విషయాన్ని గురించి పరిశీలించే వీలు నాకు ఎక్కువగా దొరకలేదని నేను వొప్పుకుంటాను. కాని, వివాహవ్యవస్థ భగవంతుని సృష్టి నియమంలో ఒక అనివార్యమైన అవసరమైవుందని నా విశ్వాసము. అది లేనిదే ప్రపంచ కార్యకలాపం జరుగదు. ఫ్రాన్సు, అమెరికా, రష్యాలో యీ వ్యవస్థను భంగంకలిగించాలనీ,

విప్లవం తీసుకొనిరావాలని ఎన్నో ప్రయోగాలు జరిగినయ్. కాని, తిరిగి అవన్నీ వాటి పాత పరిస్థితికి రాకతప్పలేదు. సరే, యీ ప్రశ్న చాలా వివాదాస్పదం. కాని, మీ జీవితలక్ష్య మేమిటో, దానికి వివాహం ఏవిధంగా బాధకలిగిస్తుందో విన వచ్చా?"

తిరిగి అమాయకమైన ప్రశ్న! జవాబుచెప్పడం కష్టమే! ఒక్క నిముషం ఊరుకుని అశోక్-"నా జీవితం, నా లక్ష్యం ఏమిటంటావా మరియమ్? నే నొక స్వప్నాదర్శ, బలహీన మానవుణ్ని నా కళ్ళముందు కనుపించే ప్రపంచంలోని దారుణ దుఃఖాలకూ, అసత్యం, అన్యాయాలకూ, హింసలకు నా హృదయం బాధపడుతోంది. నేను ఏ లోపం లేకుండా, సుఖం, సత్యం, న్యాయం, విశ్వబంధుత్వంగల ప్రపంచాన్ని చూడాలనుకుంటున్నాను. అప్పుడప్పుడూ అటువంటి ప్రపంచ శోభను చూస్తున్నాను. దాన్నే నా కుంచెతో తీర్చిదిద్ది ప్రజల యెదుట వుంచేందుకు ప్రయత్నిస్తున్నాను. నాబోటి ఆదర్శ వాదులవల్ల, ప్రస్తుత ప్రపంచానికి లాభ మేమిటి? సమాజంలో విప్లవంకలిగించేందుకు ఒక సిపాయిలా శక్తితో భాగం పుచ్చుకునేందుకు నాకు ధైర్యంలేదు. మనోవృత్తికూడా లేదు. స్వార్థమూ, సంకీర్ణమూ, బలహీనతలతో నిండిన నేను, ప్రపంచాని కేమి సేవచేయగలను ? ఒక్క సంగతుంది మరియమ్! నేను సంపూర్ణ ప్రపంచాన్నీ, జడచేతన సృష్టినీ ప్రేమిస్తున్నాను. నే నొకవేళ మానవుని అల్పాత్మకు, సమస్త ప్రపంచవ్యాప్తమైన పరబ్రహ్మాత్మతో సంబంధం ఏర్పరిస్తే, మానవుడు మానవునికీ, ఆ మహాత్యం తాలూకు

అంశమేనని, దాన్ని మనలో మనం తిరస్కరించగూడదనీ, ఆ పరబ్రహ్మాని ఉపేక్షించగూడదని చెప్పగలిగినప్పుడు, నేను ధన్యుడనని భావిస్తాను. నేనొకవేళ పీడితులైన ప్రజలకు వారి బాధలు, మోసాలలో వారు వొంటరివారు కాదనీ, నాబోటి మానవుని హృదయంకూడా సహావేదనతో ద్రవించి పోతుందనే సందేశం యివ్వగలిగిన చిత్రాలలో సానుభూతి భావం చిరస్థాయిగా వ్యక్తీకరించినప్పుడు, నా జీవితం వ్యర్థం కాదనుకుంటాను. నేనొకవేళ బీదవారి దైన్య దారిద్ర్యాన్ని చిత్రించి మానవత్వాన్నింత ఘోరంగా అవమానిస్తున్నారని ప్రపంచదృష్టిని ఆకర్షింపచేసినట్లయితే- నా చిత్రాలు వ్యర్థం కాలేదని అనుకుంటాను. ఒకవేళ నేను నా చిత్రాలలో దయ, కరుణ ప్రేమ, సేవ మొదలైన ఉదాత్త, ఉన్నత భావాలతో పరిపోషణచేయగలిగి స్వార్థం, కలహం, నీచత్వం కన్నా-గొప్ప ఉద్దేశ్యాలూ కర్తవ్యా లున్నాయని, మానవునికి చెప్పగలిగినప్పుడు, నాకు మానవత్వం ప్రసాదించిన భగవంతుణ్ని అవమానించలేదనీ, నా అవసానకాలంలో కొంచెం సంతోషిస్తాను. నాదగ్గర చిత్రకళతప్ప యింకేముంది? నా వ్యక్తిత్వాన్నీ, ఆత్మను ప్రకటించుకునేందుకు ఏకైకసాధన అదొక్కటే! అంతఃకరణంలోని జ్వాల, హృదయావేదన దాని వల్లనే వ్యక్తమవుతాయ్! ఇది చెడ్డదికాని, మంచిదికాని యిదే నా ధనం! ఇదే నా సర్వస్వం."

అశోకునిమాటలు మరియమ్ హృదయాంతరాళాన్ని తాకినవి.

"ఇటువంటి జీవితం సార్థకమవుతుందని నాకూ విశ్వాసంగా వుంది అశోక్ బాబూ–" మరియమ్ స్నేహార్ద్రమై అన్నది. "కాని, వివాహం యీ లక్ష్యసాధనలో ఏవిధంగా విఘ్నం కలిగిస్తుందో మీరు చెప్పనేలేదు?"

"ఎందుకు కలిగించదు? కళ, స్త్రీ ఈ రెంటికీ నే నెలా సేవచేయగలను? కళంటే నాకు పిచ్చిఅభిమానమని నీకు తెలుసు. ఏ స్త్రీ తల్లిదండ్రులను విడిచిపెట్టి నాయింటికి వస్తుందో, ఆమెకు కొన్ని కోరికలూ, ఆశలూ, అవుసరాలు వుంటాయి. కళాప్రాబల్యంవల్ల, ఆమె సుఖదుఃఖాలకు అనాదరణ కలుగుతుంది. నే నొకవేళ ఆమెను సుఖపెట్టేందుకు నా శక్తిని వినియోగించినట్లయితే, కళకు అనాదరణ కలుగుతుంది. నేను దీన్ని సహించలేను. ఈవిధంగా నా జీవిత ప్రేరణా ప్రవాహం ఎండిపోతుంది. నేను రెండు దేవతలను పూజించలేను మరియమ్."

ఈ మాటలతో మరియమ్ హృదయం ఎందుకో వ్యాకులపడింది. అతని యీ సూక్ష్మవ్యధకు కారణమేమిటో గ్రహించలేకపోయింది. కాని, అశోక్ చెప్పింది నిజమే! ఈ సంగతి రెండుగంటలకు పూర్వమే అతను చిత్రం చిత్రించే సమయంలో కళాముద్ర యోగావస్థలో బాహ్యజగత్తును పూర్తిగా మరచి తన్మయమైపోవడం చూచింది. ఆ కళాంనివేశం చూచాక, అతనికి తన కళతప్ప యింకేమీ అవుసరలేదని మరియమ్ అనుకుంది. అందువల్ల ఆమె అశోకుని విధానాన్ని నిరోధించలేదు. ఐనా, ఆమె తన అభిప్రాయానికి ప్రతికూలంగాకూడా వెళ్ళదలుచుకోలేదు–"ఐతే, యీ రెంటికీ

సుఖప్రదమైన సమన్వయం జరగదా అశోక్ బాబూ? ఈ సమన్వయం జరిగినట్లయితే-రెండూ ఒకదాని కొకటి ప్రాణత్వాన్ని కల్గించేవిగా నిరూపితమై,ధన్యమైతీరగలవు. ఒకవేళ సమన్వయం జరగనప్పుడు, జీవితకళను మీరింకా ప్రత్యక్షంచేసుకో లేదని చెప్పవలసివస్తుంది. అలా చెప్పటం దుష్టత్వమే! కాని, అంతకు మించి మరోవిధంగా ఊహించలేముకదా!"

ఆమాటలు అశోకునికి విద్యుత్ షాక్‌లా తగిలాయి. అతని మనసులో పెద్ద అల్లకల్లోలం బయలుదేరింది. తనింతవరకూ ఆలోచించని ఒక కొత్తప్రశ్న ఎదురైందని తెలుసుకున్నాడు చిత్రకళ కానీయండి, మరింకే కళైనా జీవితకళతో సంబంధం లేకుండా వుండ లేదు. ఒకవేళ దురదృష్టవశాత్తు, అలా జరిగినట్లయితే ఆ కళ నిరుపయోగమైపోతుంది. మరటువంటప్పుడు మాయాదేవి కళాసృష్టికీ, తన కళాదృష్టికి భేదమేముంది? కాదు. అలా కాదు. మరి, మరియమ్ ప్రశ్నకు జవాబేమిటి? కొంచంసేపు మౌనంగావుండి అశోక్-"నేను ఋషినికానని వొప్పుకుంటాను మరియమ్! జీవితకళయందు పారంగతుడనవ్వాలనికూడా వాంఛించను. నువ్విప్పుడు చర్చించిన సమన్వయం అసంభవమైనది కాదు. కాని, చాలా కఠినమైనది. నాకది మృగజల్ (ఎండమావులు)లా దుర్లభంగానే కనిపిస్తోంది. దానిని వెంటాడటంలో అపాయముంది. నాకున్న ఈ స్వల్పమైన కళాసాధనకూడా నశించిపోయి, చివరకు చేతిలో మిగిలేదేమిటోకూడా నమ్మలేకుండా వున్నాను. ఇంత పెద్ద అపాయాన్ని కొనితెచ్చుకునే సామర్థ్యం నాలో లేదు మరియమ్. తెలిసివున్న గమ్యాన్ని వదిలి, తెలియని, అగమ్యసుఖం వెంట

పరుగెత్తే సాహసం వుంటే వుండవచ్చు. కాని, బుద్ధిమంత తన మనిపించుకోదు. ఇదంతా నేను సర్వసాధారణ సిద్ధాంత రూపంలో చెప్పడంలేదు. కేవలం నాకోసమే అంటున్నాను." అన్నాడు.

అశోకని భావాలలో పరివర్తనం కలిగించడం కష్టమని మరియమ్ అనుకుంది. అతను చెప్పినదానిలో నిజంలేదు. అందుకు అతని మనస్సు నాక్యంకూడా చెప్పలేకపోయింది. అందువల్లనే అతను మెదలకుండా వూరుకున్నాడు. అతను జవాబు చెప్పాడు. కాని, ఆ ప్రశ్న అతనిహృదయాన్ని కదిలించి వేసింది. అత నా విషయమే ఆలోచిస్తున్నాడు.

సంధ్యాసమయానికి, యింటికిరాగానే మిస్ థామస్ అశోక్ చేతిలో ఒక విజిటింగ్ కార్డు పెట్టింది. దానిమీద 'మాయాదేవి నీలకంఠ, ప్రస్తుత మకాం సివిల్ లైన్సు, బైతూల్' అనివుంది.

ఆమె కారులో, మధ్యాహ్నం నాలుగుగంటలకు వచ్చి, మూడోనాడుదయం తొమ్మిదిగంటలకు వస్తానన్నదనికూడా మిస్ థామస్ చెప్పింది.

ఈ సంగతి విని అశోక్ ముఖం నిర్వికారమయిపోవడం మరియమ్ గమనించింది. అతను ఏమాత్రం సంతోషించలేక పోయాడు. అశోక్ తాకూరు మరియమ్‌వేపు చూచాడు. ఆమె వీక్షణాలు ఈ మాయాదేవి ఎవరు? అని అడుగుతున్నట్లున్నాయి.

## 9

బారాలింగ్ నుంచి తిరిగివచ్చాక, మరియమ్‌కు ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. ఈనాటి అనుభవమంతా ఆమెకు అభూతపూర్వమైనది. పన్నెండుగంటల యీ కొద్దికాలంలోనే అంతసుఖం ఆమెకు ఎప్పుడూ దొరకలేదు. అంటే అందమైన బారాలింగ్ చూడడం తటస్థించిందనికాదు. అంతకంటే మించిన కళాకారుని సాధన చూడగలిగినందుకూ, ఆ కళాసాధనకన్నా అతని హృదయంలో వుండే అసలు మానవత్వాన్ని చూడగలిగినందుకూ ఆనందపడింది. ఆ మానవుని హృదయంలో కరుణాప్రవాహం, ఎంత నిర్మలంగా, అవిరళంగా ప్రవహిస్తోంది? కాని, ప్రపంచంలోని దుఃఖాలు, బాధల గాయాలనుండి స్రవించిన రక్తంతో నిండివుం దా మానవ హృదయం. ఇంత తీవ్రమైన వేదన, కరుణను భరిస్తూ-ఆ భావనాశీల యాత్రికుడు వొంటరిగా ఎంతకాలం ప్రయాణం చేయగలడు? అతని దగ్ధహృదయాన్ని ప్రేమాశ్రువులతో చల్లపరిచే ఏ స్త్రీకూడా అతని వ్యక్తిగతజీవితంలో దొరకదా? తన మనసనే కవాటాన్ని ఏ స్త్రీకోసంకూడా, తెరిచివుంచని విచిత్ర మానవు డతను. కాని, అతను పొరపాటుపడుతున్నాడు. అతని ఆత్మను, అంతఃకరణను అతని ప్రియురాలు గ్రహించి మెలగినట్లయితే, అతని భావుక హృదయం పవిత్రప్రణయానుభూతితో, ఎంతో సంపన్నమై సంస్కరింపబడుతుంది. అతని జీవితంలోని శూన్యం చెదిరిపోయి అతనిమనసుకు సాత్వికసుఖం దొరుకుతుంది.

నాటి ఉదయం సాత్పూరా అడివిలో ప్రపంచాన్ని మరచిపోయి, అతను తన కళాసాధనలో లీనమైవున్నప్పుడు, కళాశిరోమణి పరమేశ్వరుడు సృష్టించిన తానెంత అద్భుతమైన కళాకృతో కూడా మరచిపోయాడు. ఆ రెండుగంటలూ ఆమె చూచినది, ఆమె హృదయాన్ని కదిలించి, తన ఆత్మతాలూకు అంతరాంతరకోణంలో ఓ సూక్ష్మసంవేదనను పొందినట్లనిపించింది. అతనికి తన మీ దెంత దయ! ఇంత ఆత్మీయతా సానుభూతి యింతవరకు ఎవరూ ఆమెమీద చూపించలేదు. అతను నోటితో ఏమీ చెప్పలేదు. కాని, అతని ప్రతి హావభావమూ, కళ్ళలోని అంతర్వ్యథా, హృదయంనుంచి వచ్చే నిశ్వాసాలూ, అన్నీ ఆమెకు చక్కగా చెప్పాయ్. ఈ సూక్ష్మ భావాలు స్త్రీదృష్టినుంచి ఎప్పుడూ తప్పుకోలేవు. ఎందుకంటే ఆమెదృష్టి అంతర్మనప్రతిభతో దివ్యశక్తిపొంది ఎంతో దీప్తివంతమై తీక్ష్ణంగా వుంటుంది.

నేడు ఆమెహృదయంలో ఉత్పన్నమైన సంవేదన ఎన్నడూ ఏ స్త్రీహృదయంలోనూ, ఏ పురుషుని కారణంగాను ఉత్పన్నమైవుండదు. కాని, దానికి అర్థమేమిటో, దాని పర్యవసానం ఏమవుతుందో ఈ ప్రశ్నకు జవాబు ఎంతవెదికినా ఆమెకు దొరకలేదు.

నేడామె చూచిన అతని రూపం ఏ దేవదూతో యీ నశ్వరప్రపంచంలో దివ్యత్వంతో, అపూర్వమైన పావనత్వంతో తిరుగుతున్నట్లనిపించింది. కొన్ని దేవతలకథలు చదివివుంది. నేడు వారిలో ఒకరిని తన కళ్ళతో చూచింది. ఈ దివ్యదర్శనానికి ఆమె గర్వించింది. భవిష్యత్తులో తన

నుమట ఎలా వ్రాసుంటే అలా జరుగుతుంది. కాని, నేడామె చూచిన దృశ్యంతాలూకు స్మృతి, తనకు బ్రతికివున్నంత కాలం ప్రేరణా-బలం యిస్తుందనే విషయంలో ఆమెకు ఏమాత్రం సందేహంలేదు.

అటు అశోక్ హృదయంలోకూడా మరియమ్ విషయంలో రకరకాల ఆలోచనలు రేగుతున్నాయి. ప్రకృతిలోని యీ యువతిమీదా, ఆమె అనాధస్థితిమీదా, వేదనామయమైన కథమీదా ఎంతో జాలికలిగింది. దానితోపాటు ఆమె తీక్షణబుద్ధికి, పరిశుద్ధభావాల కారణంగా అతనికెంతో ఉత్సాహంకూడా కలిగింది. ఆమె జీవితమంతా ముందు అనాధాలయంలో, ఆ తరువాత సాత్పూరా అడవుల్లోనే గడిచిపోయింది. ఆమెకున్న ప్రపంచానుభవం, సమాజానుభవం ఏపాటిది? పుస్తకాలుకూడా ఎక్కువ చదవనట్లుంది. ఫాదర్ విలియమ్స్‌వాత్సల్యఛాయలో, చదివి నేర్చుకున్నదేదో అదే ఆమె సొత్తు. ఐనప్పటికీ ప్రపంచ వ్యావహారజ్ఞానం ఆమెకెంతో ఎక్కువ. అదే ఆశ్చర్యకరమైన విషయం!

ప్రకృతే, మానవునికు తల్లిఅనీ, అదే మన జ్ఞానం, పుష్టి, భక్తి, చైతన్యానికి ప్రవాహమని విద్వాంసులంటుంటారు. మనం దానినుంచే పుట్టి చివరకు దానిలోనే కలిసిపోతాము. మనం ప్రపంచంలోనికి వచ్చేప్పుడే, మన జీవనపథాన్ని నిర్దేశించే ఆశీర్వాదంతో పవిత్రమైన జ్యోతిని పుచ్చుకుని వస్తాము. కాని, మనం మన లౌకికజీవితంలో ఈ శక్తిని నివారించి, భౌతిక మూఢవాదమాయలో చిక్కుకుని, మన జీవితాన్ని ఎంతో నీచంగా దుఃఖమయంగా చేసుకుంటున్నాము. ప్రకృతికి దూరం

మైనవారు, జ్ఞానహీనులు, చైతన్యహీనులు, సుఖహీను లౌతారు. ప్రకృతికి దగ్గరున్నవారు జ్ఞానం, సుఖం, శాంతి పొందుతారు. అటువంటి శిష్యులకు ప్రతిరోజూ ప్రకృతిదేవి, యదార్థ జీవనతత్వపాఠాన్ని నేర్పుతూ వుంటుంది. అందు చేతనే వారికి దివ్యదృష్టి ప్రాప్తిస్తుంది. మరియమ్ సర్వజ్ఞతకు యిదే కారణం కాదుకదా ?

ధర్మశాస్త్రము, సమాజశాస్త్రము, జీవితకళయందు ఆమెభావాలు ఎంత స్వాభావికమై, పరిపక్వం చెందాయ్ ! వివాహవ్యవస్థయందామెకున్న శ్రద్ధలో ఎంత సాత్వికత్వము ఎంత ధార్మికత్వమున్నవి ? ఈ రూప, గుణ, శీలవతి భవిష్యత్తు ఏమవుతుంది ? క్రైస్తవమత కఠినసంస్కారాలకు భక్ష్యమై, ఆజన్మసన్యాసినిగా మారడమే ఆమె జీవిత సార్థకమా ? ఒకవేళ అలా జరిగినట్లయితే ఆమెజీవితం ఎంత రసవిహీనమై, ఎంత కఠోరమవుతుంది ? అటువంటి పరిస్థితిలో, ఆమెకు స్వతహాగా ఆ జీవితంలో విశ్వాసంలేదా ? ఆమెకు ఇంతకుమించిన దౌర్భాగ్యము ఇంకేముంటుంది ?" నాసలు యిదే వ్రాసుంటే, దీనికి ముఖ్య కారణం ఆమె అనాధావస్థకాదు. ఈ దౌర్భాగ్యాన్నుంచి రక్షించేవారు ఆమె కెవరూ లేరు. ఆమెకు తిండీ బట్టా యిచ్చి ప్రాణాలను కాపాడుతున్న వారే, ఆమె జీవితంమీద పూర్తిగా తమ కధికారం వుందని చెప్పినా ఆశ్చర్యమేముంది ? మిస్ థామస్ అంత చెడ్డదికాదని వొప్పుకుందాం. ఆమె ఏది ఆలోచించినా, మరియమ్ మంచికోసమే ఆలోచిస్తుంది కాని, ధర్మముపేరిట అలా కొనసాగినట్లయితే దానికి మించిన దౌర్భాగ్య మింకే

మంటుంది ? ఈ దౌర్భాగ్యాన్నుంచి మరియమ్‌ను రక్షించ లేమా ? ఒకవేళ మరియమ్మే మిస్ థామస్‌లాంటి ధర్మాంధతతో, ఈ జీవనవ్రతంలో తన యిహలోక, పరలోకసుఖాన్ని చూచినట్లయితే పరవాలేదు. కాని, ఆ జీవితమంటే స్వయంగా ఆమెకే నిరుత్సాహంగా వుంది. అలాగయితే రమ్యమైన ఆవిడ సహృదయ జీవితాన్ని యీ కఠినవ్రతాగ్నిలో మాడ్చివేసి నందువల్ల లాభమేమిటి ?

ఇటువంటి ఆలోచనలు అశోక్‌ను బాగా వ్యాకులపరిచాయి. తన కళ్ళెదట ఇటువంటి కోమలజీవితం నాశనం కావడం అతను సహించలేడు. ఐనా తనెలా ఆపగలడు ? మిస్ థామస్ ఛత్రఛాయలనుంచి మరియమ్‌ను బయటికిలాగడ మంత కష్టంకాదు. కాని, ఆ తరువాత బాధ్యత ఎలా నిర్వహించగలడు ?

ఎక్కడ మరియమ్, మరెక్కడ మాయాదేవి ? వీరిద్దరికీ ఎంత వ్యత్యాసముంది ?

ఒకరిజీవితం వేదనతో కంటకావృతమైవుంటే, రెండో వారి జీవితం సుఖ, విలాసాలతో నిండివుంది. ఒకరు పరావలంబకులు, పరతంత్రులు. రెండోవారు విపుల ఐశ్వర్యంతో, జీవితస్వేచ్ఛగలవారు. ఒకరు ఎంతో ఆలోచనాపరురాలు, సహృదయురాలు; రెండోవారి స్వభావం తాడుతెగిన గాలిపటం లాంటిది. ఒకరు స్వర్గలోకంలోని పవిత్ర అప్సరస; రెండోవారు మాయాలోకంలోని మాయావిని.

ఐనప్పటికీ. జీవిత సమృద్ధికోసం, అపార దుఃఖంనుంచి మరియమ్‌ను, అంతులేని సుఖంనుంచి మాయాదేవిని రక్షిం

చడం అవసరమనుకున్నాడు. ఏది వారికి యథేష్టంగా ప్రాప్తిం చిందో, అది వారికి శత్రువుకూడాను!

అశోక్ వీరిద్దరినీ పోల్చకుండా వుండలేకపోయాడు. అతనికి మాయాదేవి విజిటింగ్ కార్డు జ్ఞాపకంవచ్చింది. ఆ రహస్యమయ రమణివిషయమే అతనిమనసు ఆలోచిస్తోంది.

మాయాదేవి వింతస్వభావంగలది! తనను వెదకుతూ వచ్చి ఈ అడవిలోకూడా వెంటపడింది. ఆమె తనను వెంటాడే తీరు చూస్తుంటే, ఆమెకు కళకన్నా, కళాకారుని మీదనే ఎక్కువ మోజుగావుందని తెలుస్తోంది. ఈమారామె కోపంతో వచ్చినట్లుంది. ఎందుకంటే, ఆరాత్రి విందుతరువాత తనామెయింటికి వెళ్ళలేదు. నాగపూరు వొదిలేముందు కలుసుకోనూలేదు. ఒకమారామె స్వయంగా తనింటికి వచ్చింది. ఆ సమయంలో తను స్టూడియోలో వున్నాడు. నియమానుసారంగా అబ్దుల్లా ఆమెను వెనుకకు పంపించాడు. అందుకామె ఎంతో కోపించింది. ఆ కోపం కారులో కూర్చున్నాక, దభీలుమని తలుపేసుకోవడంలోనే వ్యక్తమైంది. ఇటువంటి చిన్న చిన్న కారణాలకు మాయాదేవిలాంటి గర్విష్టు రాలికి కోపంరావడం అస్వాభావికంకాదు. కాని, తనేం చేయ గలడు? ఆమెమీద తన మనస్సు ఎందుకో అయిష్టతగావుంది. ఈ కఠినవ్యవహారంలోగూడా కొంత అయిష్టత వ్యాపించింది. తను సమాజంలో మసలాలనుకుంటే, యింత అయిష్టత కనుపరచకూడదు, దీన్ని పరిష్కరించాలని వెంటనే నిర్ణయించు కున్నాడు.

ఆ మరునాడుదయం అబ్దుల్లా టీ మేజామీదవుంచి వెడుతున్నప్పుడు అశోక్ దోమ తెరలోంచి-"అబ్దుల్లా" అని కేక వేశాడు.

వెడుతున్నవాడల్లా వెనుకకుతిరిగి నిల్చుని "బాబూ!" అన్నాడు

"రేపుసాయంకాలం ముగ్గురు, నలుగురకు భోజనం ఏర్పాటుచేయగలవా?"

ఒక్కనిముషం ఆలోచించి-"చిత్తం! కాని, కొన్ని సామానులకోసం నేడే బైతూల్ వెళ్ళాలండి" అన్నాడు.

"ఐతే, వెళ్ళు. నీతోపాటు విందు ఆహ్వానాన్నికూడా తీసుకుని వెళ్ళి మాయాదేవి నీలకంఠగారికి యిచ్చి రా."

"ఆ రాత్రి మీకు విందుచేసినవారేకదూ?"

"అవును వారే! ఆమె బైతూల్ వచ్చింది. సివిల్ లైన్సులో ఏదో బంగళాలో వుంది. అడిగిచూడు."

"సరే బాబూ! నాగపూరు వదలకముందే వారిని భోజనానికి తిరిగి పిలవమందామనుకున్నాను. కాని, వీలు దొరకలేదు ఇది మంచి అదనులెండి! నేను పనులన్నీ నెరవేర్చి పన్నెండుగంటలకు బైతూల్ వెళతాను"

"మంచిది."

అబ్దుల్లా వంగి సలాంచేసి మునిగాళ్ళమీద బయటికి వెళ్ళిపోయాడు.

# 10

నాగపూరునుంచి ఒక ధనికురాలు, భోజనానికి వస్తుందని, అబ్దుల్ చెప్పగా విని, మరియమ్ అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ ఎవరికీ తెలియకుండా చక్కగా చేసింది. భోజనాల గదిలో తోరణాలు మామిడి, అరటి, కదలీ ఆకులతోనూ; వివిధ రకాల పూలతోనూ అలంకరించింది. వసంతఋతువులో సాత్పూరా పర్వతం, ఏస్వరూపంలో వుంటుందో అదే స్వరూపంతో గదంతా ప్రతిబింబించుతోంది. ఇది వంటపనిలో వున్న అబ్దుల్లాకుగాని, స్టూడియోలో నిమగ్నుడైన అశోక్ కు గాని తెలియదు.

అశోక్ ఆగదిలో నిర్మింపబడిన ఉపవనంచూచినప్పుడు ఆశ్చర్యంతో–"ఇదంతా నువ్వెందుకు చేశావు మరియమ్?" అని అడిగాడు

"బాగానేవుంది, ఎందుకు చేయను? నాగపూరునుంచి అంత గొప్పవారు వస్తున్నారు. పైగా మీకు స్నేహితులు. వారికి తగినట్లుగా స్వాగతం చెప్పాలికదా?"

"ఊఁ! వీటి అవసరం లేదు. సరే; జరిగిందేదో జరిగింది. చాలా బాగుంది. నీ కళాదృష్టి, చాలా దివ్యమైనది మరియమ్!" అతనిముఖంలో ప్రసన్నతా, కుతూహలం వికసించాయి.

తన శ్రమంతా ఫలించి, బహుమతి లభించిందికదా అనుకుంది మరియమ్.

"ఏమిటి? ఈ మూడుకుర్చీలేనా?" అశోక్ అడిగాడు.

మిస్ థామస్ రాలేదు. ఆమెకు తలనొప్పిగావుంది. నేను ముందే చెబుదామనుకున్నాను. కాని మీరు స్టూడియోలో వున్నారు."

"అలా...గా" అశోక్ ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఆమె రావడానికింకా గంటన్నర ఆలస్యముంది. అంతలో స్నానంచేసివస్తాను" మరియమ్ చెప్పి గెంతుకుంటూ బయటికి వెళ్ళిపోయింది.

తనేమీ చెప్పకముందే, మరియమ్ ఎంతో నేర్పుగా ఇదంతా చేయడం చూచి, అశోక్‌కి మనసులో అవ్యక్తానందం కలిగింది. ఆ భావంలో కేవలం కృతజ్ఞతేకాదు, సరిగ్గా చెప్పలేని భావమేదో వుంది.

సరిగ్గా రాత్రి ఎనిమిదిగంటలకు స్వీడన్ బ్యూక్‌కారు హారన్ వినిపించింది. అందువల్ల ఒక్క అశోకునికే కాదు; పాద్రీపురమంతటికీ మాయాదేవి నీలకంఠ వచ్చినట్లు తెలిసింది. అశోక్ ఆమెను మందహాసంతో ఆహ్వానించాడు.

నేడు మాయాదేవి శృంగారం, అదివరకటికంటే మిన్నగా వుందని అశోక్ గ్రహించాడు. అందులో ఆశ్చర్యంలేదు. మనిషి పరాయిఊరు వెళ్ళినప్పుడు అతని తలమీద సమాజం సవారిచేయదు. అతను స్వయంగా, వ్యక్తిగత ఆనందవిలాస భావాలతో క్రీడిస్తుంటాడు. అందులో యిది వసంతకాలం. మెడలో డైమండ్ డిజైను నెక్‌లెస్, చెవులకు నిండుచంద్రాకృతిగలిగిన దిద్దులూ, అధరాల రంగు ఎక్కువగా మెరుస్తున్నాయి. నల్లని కాటుకతో నిండిన కళ్ళూ, పౌడరుతో

మునిగి తేలిన ముఖంతో మాయాదేవి తన లక్ష్యంవేపు పరుగు తీస్తోంది. తన కా లక్ష్యం దూరమవుతున్నకొద్దీ పట్టుదల ఎక్కువవుతోంది.

కుశలప్రశ్నల తరువాత మాయాదేవి అంది. "మీరు బలే దగాచేసి వచ్చేశారు."

'లేదే! నేను యిక్కడికి వెడుతున్నట్టు చెప్పే వచ్చానుకదా ?"

"కాని, మీరు బయలుదేరకముందు నన్ను కలుసుకోలేదు. ఐతే మీరు నన్ను అసహ్యించుకుంటున్నారా ?" ఆమె అదోక భావంతో అడిగింది.

ఇటువంటి సూటిప్రశ్న సమాజంలో అడగకూడదు. ఒకవేళ అడిగినా దానికి సరైన జవాబు చెప్పకూడదు. దాని వల్ల కష్టం కలుగుతుంది.

"లేదులేదు. మీరలా ప్రశ్నిస్తారేమిటి మాయాదేవీ ? నేను మిమ్మల్నెందుకు అసహ్యించుకుంటాను. నా పనుల వల్ల తీరికలేక మిమ్మల్ని కలుసుకోలేకపోయాను."

"అవును, కావచ్చు. మీరు ఆర్టిస్టు. కాని, మీ యింటికి వచ్చే మహిళలను మిమ్మల్ని కలుసుకోనీయకుండా పంపించడం, మీ హెచ్చరిక ననుసరించే ననుకుంటాను. ఈ విధంగా గొప్పింటిస్త్రీలను నౌకరులతో అవమానించడం ఆర్టిస్టని పించుకోదు."

"కాదు. అలా ఎప్పుడూ జరగదు. అబ్దుల్లా, అలా ఎవరినీ అవమానించడు. వాడు నా పాతనౌకరు. నాకు

బాగా తెలుసు. వాడిక్కడే వున్నాడు. మీరు చెప్పినట్లయితే యిప్పుడే పిలిపించి కనుక్కుంటాను."

"అక్కర్లేదులెండి! అంత అవుసరం లేదు" అని మాయాదేవి తన భావంమార్చి-"అవమానం జరగలేదని మీరంటున్నప్పుడు నేను వొప్పుకుంటాను. సరే, మీ రెలా వున్నారో చెప్పండి?"

"బాగానేవున్నాను" ప్రసంగం మారడంచూచి అశోక్ బ్రతుకుజీవుడా అని సంతోషించాడు. అత నింతవరకూ తనేదో తప్పుచేసినట్టూ, అందుకుగాను కోర్టులో వకీలు తనను ప్రశ్ని స్తున్నట్లూ, ఆ ప్రశ్నలనుంచి తనను రక్షించుకునేందుకు ప్రయ త్నిస్తున్న ట్లనిపించింది. ప్రతిపక్షానికి ఎక్కడ బలహీనతవుందో అది కనిపెట్టి దెబ్బకొట్టడం మాయాదేవికి బాగా తెలుసు. అటువంటి స్త్రీని జాగ్రత్తగా కనిపెట్టివుండాలి. ప్రసంగాన్ని పెంచాలనే ఉద్దేశ్యంతో-"నే నిక్కడవున్నానని మీ కెలా తెలిసింది?" అన్నాడు

"అది చెప్పకుండానే పారిపోయి వచ్చేశారు. కాని నన్ను మోసగించడం అంత తేలికకాదు. మీ యింటి పార్శీ యజమానికూడా మీ వునికి చెప్పలేకపోయాడు. పోస్టాఫీసులో మీ అడ్రసు తెలుసుకున్నాను. నేను బైతూల్ రావలసివుంది. మీరుకూడా యిక్కడికి దగ్గరలోనే వున్నారని విని కలుసు కుందామనుకున్నాను."

"అలాగా...?" అశోక్ నోటంట యీ అక్షరాలే వెలు వడ్డాయి.

"మీరు నా కొక పని చేసిపెట్టాలి. నే నిక కాదు కూడదనే మాట వినను."

అశోక్ భయపడిపోయాడు. ఈ విచిత్రరమణికోరిక ఎంత విచిత్రంగా వుంటుందో ననుకుంటూ "చెప్పండి" అన్నాడు.

"మీరు లైఫ్సైజు చిత్రం నేను చెప్పిన పోజులో రాసి పెట్టాలి. నేను చనిపోయాక, ప్రపంచంలో నా సౌందర్యానికి చిహ్నంగా వుండాలి. దాని కెంత ఖర్చుఅయినా వెనుకాడను. కాని అది కల్పనాపూర్వకమైనదిగా వుండాలి...ఒక వెయ్యి రూపాయలు సరిపోతాయా ?"

"డబ్బువిషయం చెప్పనని మీా రెరుగుదురు. నా కళకు పారితోషికం నేను రసికుల ఔదార్యానికే వదిలిపెడతాను."

"మంచిదే" అని సమాధానంగా మాయాదేవి నవ్వింది. ఆ నైపాచికపారింది. అశోక్ సమ్మతించాడు. అస లతని సమ్మక మేమిటి ? ఆర్టిస్టులకు ఆవేశంరావడం పరిపాటి !

"ఐతే నాగపూరు వచ్చాక, నా స్టూడియోలో పని మొదలు పెడతాను."

"కాదు, కాదు. అన్నిరోజులు నేను ఆగలేను. బైతూల్ లోని, నా బంగళాలో ఒక పెద్ద వెలుతురువచ్చే గదివుంది. దాన్ని స్టూడియోగాచేసుకుని, పని తొందరగా మొదలు పెట్టండి".

"అలాగయితే యీా పాద్రీపుర బంగళాలో నే నొక గదిని స్టూడియోగా ఏర్పరిచాను, మీారు పోజు యిక్కడే ఎందుకివ్వకూడదు ?"

"అక్కర్లేదు. ఇదికూడా అక్కర్లేదు. మీరు మా యింటికిరావడానికి భయపడతారేమిటి? నేను మంత్రకత్తెను కాదు. మీరు పసిబిడ్డడుకూడా కాదే."

"కాదు. నా అభిప్రాయ మది కాదండి". అశోక్ సిగ్గు పడుతూ అన్నాడు. "ఇక్కడ తయారైన స్టూడియో వుండగా, తిరిగి కొత్తది ఏర్పాటుచేయడ మెందుకని అన్నాను. మీ రంతగా చెపుతున్నారు, అలాగే కానీయండి"

అందుకు మందస్మితవదనారవిందంతో ఆమె అతనికి తృప్తికలిగించింది. తను విజయంపొందినందుకు సంతోషించింది.

అబ్దుల్లావచ్చి, భోజనంతయారైందని చెప్పాడు. అశోక్ "మరియమ్ ఎక్కడ?" అని అడిగాడు.

"భోజనాలగదిలో వుంది బాబూ"

ఇద్దరూ భోజనాలగదిలోనికి వెళ్ళేసరికి మరియమ్ టేబులువద్ద, వినయంగా నిలుచునివుంది. బాదామీరంగుచీర కట్టుకుంది. తెల్లనిశరీరంమీద ఆ చీర ఆమెను మరింత అందంగా చేసింది. వేషభూషణాలు సాధారణమైనవే! కాళ్ళకు మామూలుచెప్పులే వున్నాయి. కాని, ఆమె సహజ సౌందర్యం, ఆమెకు బాహ్యోపకరణాల అవుసరంలేదన్నంతగా వికసించివుంది. అందం తక్కువగావుండేవారు కృత్రిమసౌందర్యం మీద ఆధారపడవలసివస్తుంది. ముఖంమీద పౌడరులేదు. కళ్ళకు కాటుకలేదు. పెదిమలకు లిప్‌స్టిక్ లేదు. పాప మామె నేర్చుకోనిదే యివన్నీ యీ నా డెక్కణ్నుంచి పొంద గలదు! బహుశా వీటి లేమివల్లనే, ఆమె సహజసౌందర్య

నిర్మలంగావుంది. ఆ యిద్దరాడవాళ్ళలో మరియమ్ సౌంద ర్యమే అతి మనోహరంగా వుందనటం నిర్వివాదాంశం.

మరియమ్ చీరకట్టుకునుండగా అశోక్ ఎన్నడూ చూడ లేదు. ఆంగ్లేయపద్ధతిలోవుండే గానుకంటే, భారతీయ సాంప్ర దాయసిద్ధ వేష భూషణాలే ఆమెకు అందాన్నిస్తాయనడంలో సందేహంలేదు. మరియమ్ కొత్తస్వరూపాన్ని అశోక్ తాకూరు నిర్నిమేషనేత్రాలతో చూస్తున్నాడు. మరియమ్ క్రిందున్న జంబుఖానావైపు చూస్తోంది. అశోక్ కళ్ళలోని కుతూహల భావాన్ని మాయాదేవి గ్రహించకపోలేదు. ఆమెమనసులో అస్పష్టమైన యీర్ష్యాభావం రేకెత్తింది. ఇదంతా రెండు క్షణాల్లో జరిగిపోయింది. కాని, ఆమె తనను తాను సంబా ళించుకుని,-"బ్యూటిఫుల్ ! చాలా అందంగా వుంది" అంటూ కన్నార్పకండా ఆ గదిఅందాన్నీ, మరియమ్‌లోని మార్పును గమనిస్తోంది. ఈ విశ్లేషణ, ఆ గదిఅలంకారానికో లేక మరియమ్‌కో చెప్పడం కష్టం. కాని, ఈ అందమైన ఏర్పాట్లన్నీ అశోక్ తనకోసమే చేశాడనే విషయం మాయాదేవిని సంతోషపెట్టింది. ఆమె అహంభావం దానితో సంతృప్తి చెందింది. తనను అశోక్ యీ మాత్రమన్నా లెక్కచేస్తు న్నాడుకదా అనికూడా సంతోషించింది.

మరియమ్‌ను చూచి, దర్వాజావద్దనే మాయాదేవి ఒక సామ్రాజ్ఞిలా నిలబడిపోయింది. అంటే తనముందున్న ప్రతి వస్తువూ, చివరకు మరియమ్‌కూడా తుచ్ఛమనే భావం కను పించింది. అశోక్‌కు యిదంతగా రుచించలేదు.

"ఈమె మరియమ్." అశోక్ మాయాదేవికి మరియమ్‌ను పరిచయంచేస్తూ, మరియమ్ వేపు తిరిగి చూచి-"ఈమె మాయాదేవి నీలకంఠ" అని పరిచయంచేశాడు.

ఆ స్త్రీలిద్దరూ కళ్ళలో కళ్ళుకలిపి, స్త్రీలు స్త్రీలనే గుర్తించగలరన్నట్లు ఒకరినొకరు చూచుకున్నారు.

"మరియమ్...!" మాయాదేవి అస్పష్టస్వరంతో ఆ పేరును ఉచ్చరించి-"మరియమ్ అనేది క్రైస్తవుల పేరు కదూ!" అన్నది.

"అవునండి ..." మరియమ్ మెల్లగా జవాబిచ్చింది. మరియమ్‌కంఠస్వరంకూడా మధురమైనదని మాయాదేవి తెలుసుకుంది. అశోకునిలాంటి కళాకారులహృదయంలో ఆమె మీద సానుభూతి కలగడంలో ఆశ్చర్యం లేదు.

భోజనాలు మొదలైనవి. మొదటినుంచీ చివరవరకూ, మరియమ్‌కు సంకోచం కలుగుతూనేవుంది. తనొక పల్లెటూరి పిల్ల. పట్టణవాసినియగు ఒక నవనాగరిక స్త్రీ తనముందు కూర్చుంది. తను గొప్పవారితోపాటు భోజనంచేయాలి. వారితో మాట్లాడాలంటే ఆమెకు ధైర్యం లేదు. అందుకనే ఆమె సంకోచిస్తూ కూర్చుంది.

ఆమె భావం అశోకునికి అర్థమయింది. అందుచేత మధ్యమధ్యలో ఆమెను భోజనంచేయమని, మిఠాయితినమని చెపుతూనేవున్నాడు. మరియమ్‌లో కలిగే ప్రతిభావంలో సంబంధం, ఆత్మీయతా, స్నేహం వుంది. ఇదంతా మాయాదేవి తదేకంగా చూస్తోంది.

భోజనసమయంలో వాతావరణంగూర్చి, నాగపూరు లోని మిత్రులనుగురించీ, క్లబ్బా, కళ, శిల్పం, సినిమా మొదలైన విషయాలమీద సాధారణచర్చ జరిగింది. కేవలం మరియమ్ మాత్రం వింటూ కూర్చుంది. అప్పుడప్పుడూ తనను ప్రశ్నించే ప్రశ్నలకు సంక్షిప్తంగా, అవుననో కాదనో జవాబుచెప్పి వూరుకునేది. ఆమెను నిర్లక్ష్యంగా చూడడమే తన ఠీవికి సరిపోతుందని మాయాదేవి అనుకుంది.

భోజనాలయ్యాక, మాయాదేవి బైతూల్ వెళ్ళడానికి బయటికి వచ్చినప్పుడు, అశోక్ ఒక్కడే ఆమెను సాగనంప డానికి కారుదాకు వచ్చాడు. మరియమ్ అతిథిగదిలోనే ఆగి పోయింది. మాయాదేవి, అక్కడనుంచే ఆమెవద్ద వీడ్కోలు పుచ్చుకుంది. అశోకునితో కొన్నిక్షణాలు ఏకాంతంగా వుండా లనుకుంది. అందుకని—"ఈ మరియమ్‌ను ఎక్కడనుంచి పట్టు కునివచ్చారు? మీతోపాటు యీ బంగళాలోనే వుంటోందా?" అని ప్రశ్నించింది.

ఈ ప్రశ్నవెనక దాగివున్న కుత్సితాభిప్రాయానికి అశోక్‌కు కోపమూ, క్లేశమూ కలిగాయి. కోపాన్నాపు కోవడం కష్టమనిపించింది. ఐనా మనసును తమాయించుకుని— "ఆమె నాతో ఎందుకుంటుంది? మిస్ థామస్ పెంచిన అనాథబాలి కామె. ఆమెవద్దనే వుంటోంది" అన్నాడు.

"అవును! అనాథకావడంచేతనే మీ దయకు పాత్రు రాలైంది. ఆర్టిస్టుల భావహృదయం వీరికోసం ద్రవించకుండా, నాబోటి స్త్రీకోసం ద్రవిస్తుందా?" ఈ మాటల్లోని తీక్షణమైన వ్యంగ్యానికి అశోక్ యింకొకసారి విచలితుడయ్యాడు.

"మీకు నా కరుణా, సానుభూతి అవసరమేమిటి. మీకు స్వయంగా, మీ జీవితాన్ని బాగుచేసుకోగలరు. ఇంకా నాబోటివాడితో మీ కవసరమేముంటుంది ?"

"అవును! పాపం, అందంగా యవ్వనంలో వున్న క్రిష్టియన్ పిల్లకు మీ సానుభూతి అవసరముంటే చూపించండి. ఆమె అంపమైనదనడంలో సందేహంలేదు. కాని, వట్టి పల్లెటూరిది."

తిరిగి యింకొక వ్యంగ్యోక్తి కీమాటు అశోక్ తాకూరు తమాయించుకోలేక-"అప్పుడప్పుడూ పల్లెటూరివారి సరళ హృదయాల్లో, మన పట్టణవాసులకన్న ఎక్కువ శిష్టతా, సంస్కారం, శీలం వుంటాయి మాయాదేవి! వారిని పరిహాసంచేయడం సుళువుగానే వుంటుంది. కాని, వారితో సమానంగా వుండడం కష్టం" అన్నాడు.

"ఓ, మీకు కోపంవచ్చిందా ?" మాయాదేవి తమాయించుకొని-"మీ మనసు కష్టపెట్టినందుకు క్షమించండి! మీ మనసులో ఆ పిల్ల అంతగా నిలిచిపోయిందనే విషయం నే నెరుగను. సరే పోనీయండి; వెరీ సారీ! నా చిత్రం ఎప్పుడు ప్రారంభిస్తాను ?" అంటూ ప్రసంగం మార్చింది.

"ఆలోచించి కబురుచేస్తాను" అశోక్ కోపంతో అన్నాడు. వీలున్నంత తొందరగా ఈమెను వదిలించుకుంటేనే బావుంటుందని తోచిందతనికి. కాని, ఆమె అంతమాత్రాన విడిచిపెడుతుందా ?

"ఓహో! మీకు నిజంగా కోపంవచ్చిందే. అశోక్ బాబూ! నేను క్షమాపణకోరుతున్నాను. మీ ఆర్టునుంచి

వంచితురాల్ని చేసి, నా మీద యీవిధంగా కోపంచూపించ కండి ఆర్టిస్టుగారూ! నేను నిజంగా చనిపోతాను. ఆ హత్యా దోషం మీకు తగులుతుంది. మీ కళంటే నేను ఎంతగా పడిచస్తున్నానో మీకు తెలియదు. పెద్ద మనుష్యులు మాటన్న తరువాత, తప్పుకోలేరు. మీరు నా చిత్రాన్ని రాయవలసిందే. చెప్పండి, ఎప్పుడు దయచేస్తారు!''

అలా మాట్లాడుకుంటూ, వారు చీకటిలోంచి పక్కా గోడ్డుమీదకు వచ్చారు. తీరా చూస్తే, కారులో డ్రైవరు లేడు. అతను బహుశా జోసెఫ్ కాకాదు కాణంలో బీడీదమ్ము లాగుతున్నాడేమో!

మాయాదేవి, అశోక్ఠాకూరు దేహానికి దగ్గరగా వచ్చి "చూడండి! నామీద కోపం పెట్టుకోకండి! మీ కోపం నేను సహించలేను. నేను యీ అడివంతాగాలిస్తూ, మీకోసమే వచ్చాను. కోపంలేదని మీరు చెప్పనంతవరకూ మిమ్మల్ని వదలను." అంటూ అతని చేయిపట్టుకుంది.

అశోక్ భయపడి, ఒక్కసారి వెనక్కుతగ్గాడు. ప్రసంగాన్ని అక్కడితోనే ఆఖరుచేయాలని వెంటనే-"లేదు, నాకు కోపంలేదు" అన్నాడు.

"ఐతే మరి ఎప్పుడు వస్తారు?" మాయాదేవి చేతినివదలి అడిగింది.

"మూడు నాలుగు రోజుల్లో_"

"వచ్చే మంగళవారంనాడా...?"

"ఆ... వస్తాను."

"సరే, ఉదయం ఎనిమిదిగంటలకు కారు పంపుతాను. మీరు అక్కడే ఫలహారంచేశాక చిత్రం మొదలుపెట్టవచ్చు. మెనీ థాంక్స్!"

ఈ విచిత్ర స్త్రీతోపాటు చీకటిలో ఎక్కువసేపు వుండడం ఉచితంకాదనుకుని అశోక్ ఠాకూరు హారన్ మోగించాడు. డ్రైవరు ఎక్కడో దూరంనుంచి చీకటిలో పలికాడు—"వస్తున్నానండీ."

"సరే, వెడుతున్నాను. నమస్తే."

"నమస్తే!"

రెండు నిముషాల్లోనే కారు చీకటిలో లీనమైపోయింది. అశోక్ మనసు తేలికైంది.

## 11

ఆ రాత్రి భోజనాలయాక మరియమ్ అమితంగా వ్యాకులపడింది. అశోక్‌ను పొందడానికి కా ధనవంతురాలు అతనివెంట తిరగడం చూచి మరియమ్ హృదయంలో ఏదో భయంకరమైన అల్లకల్లోలం బయలుదేరింది. అశోక్ ఠాకూరును, తనకు ప్రియమైన అశోక్ ఠాకూరును లాక్కునిపోవడానికి మాయాదేవి ఆమెకు ఒక ప్రతికక్షిరూపంలో నిలుచుంది. తను అశోక్ ఠాకూరును ప్రాణసమానంగా కోరుతున్నట్లు యీనాడే ఆమె తెలుసుకోగలిగింది. ఒకవేళ, యీనాడామె భావనారంగస్థలంమీదకు మాయాదేవి రాకుండావుంటే, ఆమెకు యీ నూతనానుభూతి అనుభవంలోకివచ్చేదికాదు. మాయాదేవి

వచ్చి తన హృదయంలో అశాంతిని రేకెత్తించిపోయింది. హృదయంలోని ఆ మధురస్పందన యిప్పు డంతా వ్యథతో వేదనతో నిండిపోయింది ఆ దివ్యప్రణయ ప్రథమదర్శనంలోనే అసఫలత్వమనే బీజాలు నాటబడ్డాయి. అశోక్ ఆమె కేగాక, యింకే యువతికైనా అప్రాప్యుడు. ఈసంగతి మరియమ్‌కు బాగా తెలుసు. కాని హృదయంలోని ఉద్వేగాన్ని ఎలా ఆప గలదు? అది ఒక రాపితే ఆగేదికాదు. ఈ ప్రణయభావాల ముందు, మానవుడు ఎప్పుడూ అసహాయుడు, అసమర్థుడు. ఈ ఒక్క-భావనే ఎంతో కాలంనుంచీ, ఎంతోమంది స్త్రీ-పురుషుల జీవిత నాటకాన్ని దుఃఖాంతం చేసింది. ఐతే, అదృష్టంలో విధి యీ దైవదుర్విలాసమే లిఖించాడా? అని మరియమ్ అనుకుంది.

మాయాదేవియందు మరియమ్‌కు సదభిప్రాయంలేదు. అంటే మాయాదేవి తనకు ప్రతిస్పర్థిరూపంలో వచ్చిందని కాదు. మాయాదేవి అశోక్‌ను తన భోగవిలాసాల్లో ఒక ఆట బొమ్మగా చేయాలనుకుంది. ఆమె మనసులో అశోకుపట్ల యించు విరక్తి కలిగినప్పుడు, చీకిపారేసిన మామిడిటెంకలా, అతన్ని విసిరిపారేస్తుంది. ఇదంతా—ఆమెలోని స్త్రీహృదయం యింకొక స్త్రీహృదయాన్ని అల్పకాలంలో తెలుసుకొనగలిగింది. పూర్తిగా గ్రహించిందికూడా! ఆ స్వేచ్ఛాపరాయణి, అనుపాజ్ఞలు లేకుండావున్న ఆమె అశోకుని విశుద్ధానంద సుందర జీవితంతో పాటు కేవలం దాగుడుమూతలాడాలనుకుంటోంది.

ఐతే యీ వంచనునుంచి అశోక్‌ను రక్షించగలదా? అశోక్-తన అశోక్! ఎంత ఉదారంపంతుడు! ఎంతటి మహాను

భావుడు! మాయాదేవి వంద జన్మలెత్తినా, ఆయన కాలి చెప్పులు విప్పడానికికూడా యోగ్యతపొందలేదు. నేడామే ఆ పురుషరత్నంతో పరిహాసాలాడుతోంది. అదామెకు మర్యాద కాబోలు. ఐతే, తను ఈ సుందర పుష్పపరాగాన్ని మాయా దేవిలాంటి విలాసినిచేత దోపిడీచేయనీయవలసిందేనా?

కాని, ఎలా ఆపగలదు? మాయాదేవిని ద్వేషిస్తున్నట్లు అశోక్ మనసులో అనుమానపడగూడదు. ఆయన తన విషయంలో ఎప్పుడూ చెడుగా అభిప్రాయపడడు. అటువంటి సంగతి ఆమె భావించనుకూడా! అశోక్ ముందు ఆమె నీచంగా కనుపించకూడదు. ఆమె అంతా సహించగలదు. కాని అశోక్‌కి తను నీచురాలిగా కనిపించడం ఆమె సహించలేదు.

మాయాదేవి తనచిత్రాన్ని వ్రాయమని ప్రాధేయపడిందనీ, వెయ్యిరూపాయ లివ్వడానికి సిద్ధపడిందనీ, వచ్చే మంగళవారంనాడు ఆమె పోజుతీసుకునేందుకు బైతూల్ వెళ్ళవలసివుందనీ, బహుశా అలా నాలుగురోజులు వెళ్ళవలసివుంటుందనీ, అశోక్ మరియమ్‌తో చెప్పాడు. ఆ చిత్రం అద్భుతంగావుండాలని మాయాదేవికోరిక! ఒక వుత్తమోత్తమమైన పోర్ట్రెయిట్‌ను చిత్రించాలనే అభిలాష అశోక్‌ను చాలా కాలంనుంచీ పీడిస్తోంది. ఇంతకాలం అతను భావచిత్రాలలో, ప్రకృతిదృశ్యాలలోనే ఖ్యాతిపొందాడు. కాని, యిప్పుడతను వ్యక్తుల చిత్రక్షేత్రంలోకూడా అడుగు పెట్టాలనుకున్నాడు. ఆ సువర్ణావకాశం దానంతటదే ప్రాప్తించింది.

ఇందులో అపాయముంటనే సంగతి మరియమ్మకు తెలుసు. మాయాదేవి తన మాయాజాలాన్ని పన్నుతోంది. కాని తనెలా అశోక్ కీ విషయం తెలియపర్చాలి? తెలియపరచినప్పుడు తనను అపార్థం చేసుకుంటాడేమో! అశోక్ కోరికలనూ, సంపాదనామార్గాన్ని అరికట్టేందుకు తన కధికారమేముంది? కాని, మాయాదేవి కళోపాసన వెనుక, కలి ఉపాసన దాగుందని ఆమె నిశ్చితాభిప్రాయం! ఈవిషయం ఆలోచిస్తుంటే ఆమెమనసు కంపించిపోయింది.

అశోక్ మాయాదేవి ప్రస్తావనను, వ్యవహారిక వ్యాపార దృష్టితో చూచాడు. అతను వ్యక్తులచిత్రక్షేత్రంలో ప్రావీణ్యం సంపాదించాలనుకున్నది నిజమే! ఎందుకంటే, ప్రస్తుతం ధనికుల యిండ్లలో, ఎవరిదో ఒకరిచిత్రం వ్రాయించుకునే పద్ధతి నడుస్తోంది. సంపాదనదృష్టితో చూస్తే, అది లాభదాయకమైనదే; అతను ఆర్టుస్కూలులో విద్యనభ్యసిస్తున్నప్పుడూ, ఆతరువాత కూడా కొన్ని పోర్ట్రెయిట్‌లు చిత్రించాడు. కాని, వాటిలో సరిదిద్దవలసిన లోటుపాట్లు ఎన్నో వున్నాయి. మాయాదేవి చిత్రంతోనే యీక్షేత్రంలో పదార్పణ ఎందుకుచేయకూడదు? ఇంతకుమించిన సమయం యింకెప్పుడు దొరుకుతుంది? ఈ అవకాశాన్ని వినియోగించుకుని లాభం సంపాదించాలనుకున్నాడు.

మాయాదేవి అసలభిప్రాయం అతనికి తెలియనిది కాదు. అతనిలాంటి బుద్ధిమంతుడైనవ్యక్తి, యీ వెయ్యి రూపాయల ఉదారత్వంలోని మర్మాన్ని గ్రహించలేకపోలేదు. ఆరాత్రి ఫాద్రీపురంవిందులో మాయాదేవిమాటలకు అతని మనసు కష్టపడింది. అతని కామెమీద అయిష్టతకలిగింది.

కాని, ఈవిషయాలన్నీ వ్యర్థంగా తనమనసులో ఎందుకు పెట్టు కోవాలనుకున్నాడు. మాయాదేవి తనను మాయాజాలంలో యిరికించాలనుకుంటే, దాన్నుండి విముక్తిపొందే అవకాశం తనచేతుల్లోనే వుంది. అతను జాగ్రత్తగావున్నప్పుడు ఎవరేమి చేయగలరు? కొనుగోలుదారొకడు తనచిత్రం గీసినందుకు వెయ్యిరూపాయలు యివ్వడానికి తయారయాడు. అందుకు మారుగా తను వారిచిత్రం గీసియివ్వాలి. ఆనాడు కళాప్రదర్శనలో హిమాంశుబాబు "మాయాదేవి ఎవరిమీద మోజు చూపుతుందో వారికి ధనమేఘనం" అని చెప్పినమాటలు అతని కిప్పుడు జ్ఞాపకంవచ్చాయి.

మంగళవారంనాడు అతనికోసం మాయాదేవికారు వచ్చింది. అతను బయలుదేరుతున్నసమయంలో మరియమ్ "ఎప్పుడు తిరిగివస్తారు?" అని అడిగింది.

ఆమె అడిగిన యీ ప్రశ్న వెనుక, స్వాభావికమైన ఆమె ఉల్లాసం లేదని అశోక్ గ్రహించాడు. ఆమె తనభావాల్ని అణచుకునేందుకు ప్రయత్నిస్తున్నట్లుంది.

"మధ్యాహ్నానికి తిరిగివస్తాను. ఏం...? వొంట్లో బావుండలేదా?...ముఖమంతా వాడిపోయినట్లుంది"

"ఎక్కడ...? లేదే? నాకు బాగానేవుంది. తిరిగిరావడానికి ఆలస్యంచేయకండి! సాయంత్రం మీతోపాటే భోజనం చేస్తాను."

ఆమె నిర్వికార, ఉదాసీనముఖం చూచేసరికి అతనికి కొంచం బాధకలిగింది. కాని, అతని మనసులోని ఉల్లాసాన్ని మాత్రం భంగంచేయలేదు. తన కళాసాధనతాలూకు మరొక

క్షేత్రంలో పాదం పెట్టబోతున్నాడు. అతని ఆనందాని కదే కారణం! ఆ ఆనందానికి, మాయాదేవితో కాని, వెయ్యి రూపాయలతో కాని, యింకే భౌతికవస్తువుతో కాని సంబంధమే లేదు.

మాయాదేవి నీలకంఠ కళాకారునికి స్వాగతం చెప్పేందుకు తన స్టూడియోగదిని అందంగా అలంకరించింది. ఫలహార సమయంలో మాయాదేవి గ్రామఫోను రికార్డు వేసింది.

"ఏ తెంచెను లే ప్రియుడు..."

"భాగ్యం మనకే పండింది..."

ఫలహారానంతరం యిద్దరూ స్టూడియోలోనికి వెళ్లారు. పదీ పదిహేనునిముషాల్లో, అశోక్ మాయాదేవి కూర్చునేందుకు స్థలమూ, చిత్రఫలకం వుంచే ప్రదేశమూ, ఏ కోణంలో కూర్చోవలసినదీ, వెలుగు-నీడలు మొదలైన ఏర్పాట్లన్నీ చేసి కోటువిప్పి ఎప్పుడూ తొడుక్కునే నల్లనిగౌను తొడుక్కున్నాడు.

"రండి! మిమ్మల్ని ఆ స్టూలుమీద కూచోపెడతాను. చిత్రం ఏ పోజులో రాయమంటారు?"

మాయాదేవి నిగనిగలాడుతున్న సిల్కుగౌను తొడుక్కునివుంది. అశోక్ ఆదేశించగానే గౌనువిడిచింది. ఆశ్చర్యం!

ఆమె అర్ధనగ్నావస్థలో వుంది. తల విడిపోయివుంది. వక్షస్థలం, ఊర్ధ్వభాగంకూడా వివస్త్రంగా నేవున్నై.

అశోక్ ఆమె యీ నిర్లజ్జస్వరూపాన్ని చూచి నిశ్చేష్టుడయాడు. ఆ మాయావినికళ్ళలో ఉన్మాదభావం కనుపిస్తోంది.

"ఐతే? మీరీ పోజులోనే చిత్రం తీయించుకుంటారా" స్తంభించిపోయి అశోక్ అడిగాడు.

"నష్టమేముంది? గ్రీకు దేవతల చిత్రాలు యిలాగే వుండేవిగా?"...అన్నది.

"హుం..." అని అతనలాగే స్తంభీభూతంగా నిల్చున్నాడు. మనసులో సంకోచమూ, అస్వస్థభావం ఉత్పన్నమయ్యింది. ఆ కామిని ఉన్మాదస్వరూపాన్ని చూచి అశోక్ ఒక్క-క్షణంపాటు విచలితుడయ్యాడు. అతను పురుషుడు. మానవునికుండే సహజమోహావేశంతో నిండివున్నాడు. తన ఆత్మనిగ్రహం జారిపోతున్నదని గ్రహించాడు. మాయాదేవి అశోక్ భావాన్ని పసిగట్టింది. "మీరు విచలితులయ్యారా అశోక్ బాబూ! డాక్టరు సైంటిస్టనీ, చిత్రకారుడు ఆర్టిస్టనీ ఎవరి శరీరాన్ని, ఏ అవస్థలో చూచినా, తాకినా విచలితులు కారనీ నా అభిప్రాయం. కాని మీరు..." మాయాదేవి ఆగిపోయింది. అశోక్ ముఖం సిగ్గుతో రక్తసిక్తమైంది. అతనికి చెంపపెట్టు తగిలినట్లయింది. వుద్రేకం కలిగింది. కాని తమాయించుకున్నాడు. ఆ మరుక్షణమే అతని కళాదృష్టి పురుషదృష్టిని ఓడించింది. మనసులోని మథనం శాంతించింది. మాయాదేవి ఒక ఉన్మత్త స్త్రీకిమారుగా, ఒక సుందర కళావస్తువురూపంలో అతనికి కనుపించింది. అతని కళ్ళలోని చాపల్యం దిగజారిపోయింది. అతనిలో కళాకారుని విశుద్ధావలోకనం జాగృతమయింది. కోరిక కళముందు తన పరాజయం స్వీకరించింది.

ఆమె శరీరంలోని ప్రతిభాగానికి వెలుతురు తగిలేట్లుగా అశోక్ ఆమెను, అయిదడుగులదూరంలో స్టూలుమీద కూర్చో పెట్టాడు. ఆ వెలుతురులో ఆమె అంగప్రత్యంగాల సూక్ష్మాతి సూక్ష్మ రేఖలు, స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈ విధంగా కూర్చో పెట్టడంలో అతను రెండుమూడుసార్లు మాయాదేవిని స్పర్శిం చాడుకూడా. అంచేత మాయాదేవికి ఎటువంటిభావాలు ఉద యించినా, అశోక్ అందుకు భిన్నంగా, నిర్లిప్తుడుగావున్నాడు. కళాభినివేశనాకవచం అతని సంరక్షణభారం పుచ్చుకున్నది.

చిత్రఫలకంమీద అశోకునికుంచె ఆడుతోంది. వెను వెంటనే అతను తన కళాసాధనలో లీనమయ్యాడు. మాయాదేవి నిశ్చలంగా కూచునివుంది. అతను మాయాదేవివేపు చూసే వాడు. కుంచెను ఆడించేవాడు. తిరిగి చూసేవాడు...మరల కుంచెను ఆడించేవాడు...ఈ క్రమమే నడుస్తోంది.

అశోకుని తన్మయత్వము అతనికి కాలం, స్థానం తెలియ నంతగా తీవ్రరూపందాల్చింది. చివరకు మాయాదేవి అనే పేరుగల స్త్రీ తనెదుట అర్ధనగ్నంగా కూచుందనే విషయం కూడా మరచిపోయాడు. మాయాదేవి ధన మిప్పు డతనికి, తను వ్రాసిన 'సంధ్య', లేక 'ఉష', 'సెలయేరు', లాంటి చిత్రాల్లా కనుపించింది. గదిలో నిశ్శబ్దం తాండవించింది. మాయాదేవికి అశోకుని శ్వాస సూక్ష్మంగా వినిపిస్తోంది.

బాగా అలసిపోయి, విశ్రాంతితీసుకుందామని అతను తూలికను రంగుపళ్లెంలో వుంచి పైకి చూస్తూ నిలుచున్నాడు.

"ఇంకెంతసేపు యీ శిక్ష అమలుజరుపుతారు? రెండు గంటల పదిహేనునిముషాలైంది. కూర్చుని విసుగెత్తిపోయాను."

"ఆ! రెండుంబావైందా ?" అశోక్ విస్మయంచెంది అడిగాడు. "అరగంటకు మించి కాలేదనుకున్నాను."

"మీ రసలు యీలోకంలో వుంటేగా ? మీ గడియారం చూడండి."

అశోక్ గోడగడియారం చూచాడు. ఆ తరువాత తన రిస్టువాచ్ చూచాడు. మాయాదేవి చెప్పింది నిజమే!"

"ఐతే నేటి కింతవరకే ముగింపుచేదాం. తిరిగి రేపు మొదలుపెడదాం. దీన్నిక్కడే మూతవేసివుంచుతాను."

"చెడిపోదుకదా ? స్థూలరేఖలన్నీ వచ్చేశాయి. ఇక రేపు. నేనూ అలసిపోయాను."

"రేపు పూర్తవుతుందా ?"

"కాదు. ఈవిధంగా ఎల్లుండికూడా కూర్చోవలసి వుంటుంది. ఆ తరువాత నేను దీన్ని ఫాద్రీపురంలోని, నా స్టూడియోలో పూర్తిచేస్తాను. ఆ తరువాత మీ పోజు అవసరం లేదు" అని అశోక్ లేచి మాయాదేవికి గౌనుతొడిగాడు.

అశోక్ ఫాద్రీపురం తిరిగివచ్చేసరికి, మరియమ్ భోజనం చేయకుండానే, అతనికోసం ఎదురుచూస్తోంది. అశోక్ రాగానే, తనను భోజనంవిషయం అడుగుతాడనీ, ఆ తరువాత యిద్దరూ కలిసి భోజనంచేద్దామనుకుంది. కాని, ఆమె ఆశలన్నీ నిరాశలైనవి. ఆమెవిషయంలో అశోక్ ఒక్కమాటకూడా పలకలేదు. ఈ ఎనిమిదిగంటల విరహం, ముఖ్యంగా యీ ఎనిమిది గంటల మాయాదేవి సహవాసం ఆమె సహించలేకపోయింది. అయినా ఆమె పెదలకండా అన్నీ సహించింది. కాని, ఉదాసీనత ప్రవేశించింది. స్త్రీ నిజానికి సహనమూర్తికదా!

నేడు చిత్రించినంతవరకు చిత్రం సఫలీకృతమైనదని అశోక్‌కు సంతోషంకలిగింది. అతను కళావిషయంలోనే లీనమై వున్నాడు. అందువల్ల మరియమ్‌లోని సూక్ష్మపరివర్తన చూచాడు కాని, అంతగా పట్టించుకోలేదు.

ఈ నిరాదరణే మరియమ్‌ను ఎక్కువగా బాధించింది. మరునాడు వెళ్ళిన అశోక్ సాయంకాలం ఆరుగంటలకు యింటికి వచ్చాడు. మూడవనాడు తనకోసం భోజనానికి ఎదురు చూడవద్దని చెప్పి వెళ్ళాడు.

ఆనాటితో మాయాదేవి పోజుయివ్వడం ముగిసింది. కేవలం రెండుమూడురోజుల పనిమాత్రం మిగిలివుంది. దానికి మాయాదేవి అవసరంలేదు.

ఆనాడు మాయాదేవి అశోకుని రాత్రిభోజనానికి ఆహ్వానించింది. మరి రెండురోజులవరకు యిక్కడికి రాదుకదా!

అశోకునిమనసుకూడా నేడు సంతోషంగావుంది. కళాసృజనానందంతో అతని హృదయం నిండిపోయింది.

లతలు, పూలతో సుశోభితమై, ప్రకాశవంతమైన దీపాలగరువత్తుల సుగంధవాసనల వాతావరణంలో, వెండి చంచాలు, చాకులతో చక్కగా అలంకరించిన మేజాబల్లమీద భోజనాలు ప్రారంభమైనాయి.

"మీరు నా చిత్రంరాసి, నామీద ఎంతో అనుగ్రహం చూపించారు. మీరు కనబరచిన ఏకాగ్రతకు, అది అపూర్వమైనదిగా తయారవుతుందని నా విశ్వాసం."

"దీనిలో అనుగ్రహమేముంది? చివరకు ఇది వ్యాపార ధర్మమేకదా?"

"అలా ఎందుకంటారు అశోక్ బాబూ!" మాయాదేవి కృత్రిమకోపంతో, "నేను మీతో ఎప్పుడూ వ్యాపారసంబంధం పెట్టుకోలేదు. నేను మీస్నేహాన్నికోరుతున్నాను. ఆదృష్టితోనే నేను మొదటినుంచీ మన సంబంధం నిర్వహించుకొంటున్నాను. మీరలా అనుకోలేదా?" అన్నది.

"ఒప్పుకుంటాను. అందుకు మీకు కృతజ్ఞుడనై వుంటాను. మీరు నా కళను బాగా ప్రోత్సాహపరుస్తున్నారని కూడా నమ్ముతున్నాను." ఈ మాటలు అశోక్ నిష్కల్మషంగా అన్నాడు. అందుకు మాయాదేవి సంతోషించినా, సమాధానపడలేదు.

"నేను మీకోసం ఏమైనా చేయగలను అశోక్ బాబూ! ఒకవేళ మీరు నాకు అవకాశంయిచ్చినట్లయితే" మాయాదేవి ఆవేశంతో అంది "మిమ్మల్ని చూచినప్పటినుంచీ, నా హృదయం ఒకవిచిత్రమైన అస్వస్థతలోచిక్కుకుపోయింది". అని ఒకనిట్టూర్పు విడిచి, "నా జీవితంలోని శూన్యాన్ని మీరే దూరంచేయగలరు అశోక్ బాబూ! కాని, మీరు నావేపు కన్నెత్తికూడా చూడటంలేదు. మీరొకవేళ ఒప్పుకుంటే, నా సర్వస్వం మీ చరణాలమీద అర్పణచేసేందుకు సిద్ధంగా వున్నాను."

ఈ ప్రత్యక్ష ప్రణయారాధనలో నిజముందా లేదా, అని అశోక్ అనిమేషనేత్రాలతో మాయాదేవిముఖంవేపు చూస్తున్నాడు. కాని తనహృదయాంతరాళంలోంచి ఎవరో లేచివచ్చి, ఇదంతా కృత్రిమము, కల్పితమని చెపుతున్నారు. వెంటనే అతనిమనసు తిరస్కారంతో నిండిపోయింది. ఈ విలా

సిని, యిలా ఎంతమంది పురుషుల్ని ప్రణయయాచనచేసిందో! అశోక్ ఈ మాటల ప్రభావానికి లొంగేస్వభావంకలవాడు కాడు. అతనిజీవితంలో యింతవరకు ప్రణయానుభూతి కలగ లేదు. ఇకముందు కలుగుతుందో లేదో తెలియదు. కాని, అసలైన బంగారమేదో, రోల్డుగోల్డేదో తెలుసుకోవడం ఏమంత కష్టంకాదు.

ఈ అనుకోనిప్రశ్నకు జవాబేమనిచెప్పాలనే సందిగ్ధంలో పడిపోయాడు అశోక్. అయినా, అతను తన మనసులోని సమస్తభావాల్ని సంబాళించుకుని క్రిందకు చూస్తూ, "మిమ్మల్ని సేవించే సామర్థ్యం నాలో లేదు మాయాదేవి! నేను నా కళా రాధన అనే లక్ష్యంతో పిచ్చివాడినై పోయాను. దానిలోనె నన్ను బ్రతుకనీయండి! అదే నా సర్వసుఖాల సమృద్ధికి సంచ యము. అవును, మొదట నాగపూరులోకూడా మీ జీవితం శూన్యంగావుందనేవిషయం తెలుసుకున్నాను. మీ హృదయ దాహానికి అంతులేకపోవచ్చు. అయినా ఒక యోగ్యుడైన పురుషుణ్ని వివాహంచేసుకుని మీ రతనితో ఎందుకు సుఖించ గూడదు? మీ జీవితంలో ఆనందోల్లాసాలు తిరిగి పొందవచ్చు కదా?" అన్నాడు.

అశోక్ఠాకూరు యీ మాటలు ఎంతో శాంతంగానే చెప్పాడు. కాని వాటి పరిణామము, మాయాదేవి హృదయం లోని శాంతిని భగ్నపరిచేందుకు దారితీశాయి. ఇంతవరకూ ఆమెముందు ఎంతోమంది పురుషులు తలలువంచారు. వారిలో తనకు యిష్టమైనవారికి ఆమె ఆశ్రయమిచ్చింది. అయినా నేడు తను ఒకపురుషునిఎదుట తలవంచినప్పుడు, అతను తన యాచనను

యీవిధంగా నిరాకరించాడనే అవమానం రూపం, ధనంతో గర్వించివున్న ఆమె సహించలేకపోయింది. మనసులోనే మండి పడింది. మగవాళ్ళు యింత నిర్మొహమాటంగా వుంటారనే విషయం ఆమెకు నేటివరకూ అనుభవానికి రాలేదు. అయినా యీ అనాసక్తి వెనుక మరియమ్మమీద ఆసక్తి కారణంకాదు కదా? కోపానికి తోడు యీ ఆలోచనకూడా ఈర్ష్యా భావాన్ని కలిగించింది. ఆమె కోపంతో వ్యంగ్యంగా నవ్వుతూ "వివాహమా...? వివాహంచేసుకోవాలా? నేనా? ఒక వివాహంచేసుకున్నాను. కాని, దాని స్మృతులు సుఖదాయకం కాలేదు. ఆ విషయంలో మనసుకలవని వ్యక్తితో సంసారం చేయడంలోని దుఃఖప్రదమైన సంఘటన యింకొకటివుండదని తెలుసుకున్నాను. అది శరీరం యిచ్చిపుచ్చుకోవడమనే అసహ్య భ్రష్టాచారంకాక మరేమిటి? కేవలం భిక్షువుల మంత్రాలవల్ల ఆ పాపం పుణ్యం కాజాలదుకదా?" అన్నది.

కఠినమైన అనుభవంలోని కఠినత్వమే మాయాదేవి నోటంట యీమాటలు పలికించింది. ఇవి సంపూర్ణంగా నిజం కాకపోయినా పూర్తిగా మిథ్యమాత్రం కాదు. ఈకారణంగా అతనిహృదయంలోని అసహ్యాభావం తగ్గిపోయి, కొంత సాను భూతి ఏర్పడింది.

"అవును. అటువంటప్పుడు వివాహం దుఃఖప్రదమవు తుందని నేను వొప్పుకుంటాను. కాని, యిప్పుడు మీరు స్వేచ్ఛాజీవులు. మీ మనసుకలిసినవారిని వివాహంచేసుకుని, ఇప్పుడుకూడా సుఖపడవచ్చు. సమాజంలో మీరు చొరవగా

తిరుగుతున్నారు. అటువంటి అవకాశం దొరకడం మీకు కష్టం కాదుకదా ?"

"మనసుకలిసినవారినా...? నా మనసు మీతో కలిసిందంటున్నాను. నన్ను వివాహంచేసుకునేందుకు మీ రిష్టపడతారా ?"

"నే...నే...నేనా !" అశోక్ తడబడుతూ, యీ ప్రశ్నకు భయపడి సంకోచంతో "నేను అందుకు తగనని మీకు ముందే చెప్పాను మాయాదేవీ ! నా బాట విలక్షణమైనది."

"అటువంటప్పుడు, మీ యీ ఉపయోగంలేని సానుభూతికి, సలహాకు విలువేముంది చెప్పండి ? మీబోటివారివల్ల ఎవరికి మేలుకలుగుతుంది ? మీరేమో ఆర్టువెంటబడి పిచ్చివారై పోయారు. ఆర్టు ! మీరు ఆడదాని 'హార్టు'ను గుర్తించలేనప్పుడు ఆర్టు ఏమిచేయగలదు ? ఇక ఇతరులకు ఉపదేశించడానికి పూనుకున్నారు. వారి హృదయాల్లో ఎంత భయంకరమైన జ్వాలలు రేగుతున్నాయో తెలుసుకునేందుకు మీ రెన్నడైనా ప్రయత్నించారా ? మీరు నన్ను మనసులో అసహ్యించుకుంటున్నారని నే నెరుగుదును. ఎందుకంటే, లోకాపవాదమైన నా చరిత్ర మీ చెవుల్లో పడింది. అవన్నీ అబద్ధాలుకావని నేను వొప్పుకుంటాను. కాని, నా ప్రవృత్తి వెనకవుండే మనఃస్థితిని మీరు గ్రహించగలరా ? యవ్వనప్రాయంలో అడుగుపెట్టగానే, లక్ష్మీపుత్రుడైనకారణంగా విషయ విలాసాల్లో తన శరీరాన్నీ, ఆత్మను చంపుకున్న వ్యక్తితో వివాహంజరిగింది. అతను నన్నొక భోగవిలాసవస్తువులా తప్ప, వేరే దృష్టితో చూడలేదు, నన్ను గృహలక్ష్మిగా

చూచేందు కెప్పుడూ ప్రయత్నించలేదు. వైవాహికజీవితంలో నే నెన్నో మధురమైన కోరికలతో వున్నాను. వాటిస్వప్నా లతో ఎన్నోరాత్రులు గడిపాను. ఆ దాంపత్యసుఖంకోసం, నే నెంతో త్యాగంచేయడానికి సిద్ధంగావున్నాను. కాని, ఆ రమణీయస్వప్నాలన్నీ, బూడిదలో పోసిన పన్నీరుగా మారి పోయాయి. నా వివాహం ఒక ప్రేమికునితో కాకుండా, ఒక పశువుతో జరిగిందని గ్రహించాను. నా హృదయంలో అతనిపట్ల క్రమేణా అసహ్యభావం ఏర్పడింది. రెండేళ్ళ అనంతరం అతను చనిపోయాక నాకు సంతోషమే కలిగింది. శరీరం, హృదయంలోని దాహం రోజురోజుకూ పెరుగుతోంది. సంపత్ సాధనాలకు కొదువలేదు. అట్టిపరిస్థితుల్లో నే నెంతకాలం ఓర్చుకోగలను ? నా చుట్టుప్రక్కల తుమ్మెదలుతిరుగాడుతున్నాయి. వాటిలో కొన్ని అందమైనవికూడా వున్నాయి. నేను పతనం చెందాను, కాని, వాటిలో ఒక్కటికూడా నా ఆత్మను హృదయాన్ని కనిపెట్టేందుకు ప్రయత్నించలేదు. అన్నీ నా శరీరం మీదా, నా ధనంమీద కన్నేసివున్నాయి. అన్నీ స్వార్థం, సుఖవ్యసనాలతోకూడివున్నాయి. ఒకదానిమనసులోకూడా నిజం లేదు. స్వాభిమాని, సచ్చరిత్రుడైన వ్యక్తి నావద్దకు రాకుండా, నా సంపదే నా చుట్టుప్రక్కల అడ్డుగోడకట్టింది. ఇలా సంవత్సరాలు గడిచింది. కాని, నాకు శాంతిదొరకలేదు. నాజీవితం ఎంతో తిరస్కారపూరితమైనదనీ, నా విషయంలో సమాజంలో వ్యాపించిన వదంతులు అబద్ధంకావని నేను వొప్పుకుంటాను. కాని, న న్నేంచెయ్యమంటారో మీరే చెప్పండి? నావయ స్సిప్పుడు ముప్పైఐదుసంవత్సరాలు. కాని, హృదయ

దాహం యింకా అలాగేవుంది. ప్రారంభంలో నే నంత చెడ్డదాన్ని కాను. పరిస్థితులూ, నా సంపదే నన్ను చెడ్డదానిగా తయారుచేశాయి. ఆడది ప్రేమకోసం ధనం, వైభవం అంతా విడిచిపెట్టగలదని నే నెరుగుదును కాని, నేటివరకది నాకు లభ్యంకాలేదు. ఆలోటుతో, సంపదనుకూడా వదిలిపెట్టినట్లయితే- నేటి సమాజవ్యవస్థలో కుక్కలుకూడా నా ముఖం చూడవు. అటువంటప్పుడు నే నేమిచేయగలనో చెప్పండి. అశోక్ బాబూ! ఇదంతా మీతో ఎందుకు చెప్తున్నానను కున్నారు? బహుశా నా మనసును తేలికచేసుకుంటా నేమోననే! అల్లా ప్రపంచం నాకు కళంక మాపాదించింది. కాని, నేను నాహృదయంలో గౌరవిస్తున్న ఒకవ్యక్తి, సరిగ్గా నన్ను గుర్తించినట్లయితే అది నాకు కొద్దిపాటి సుఖంకాదు”.

భావావేశంలో మాయాదేవికంఠం రుద్ధమైపోయింది. కళ్ళవెంట అశ్రువులు రాలాయి. ఆమె చెప్పే ఒక్కొక్క విషయం, ఆమెహృదయంలోంచి దూసుకువచ్చినట్లున్నవి. అందువల్ల అవి అశోక్ హృదయాన్నికూడా ఆకట్టగల్గాయి. మాయా జీవిజీవితంతాలూకు యీవిషయంగురించి అతను ఆలోచించకపోవడం నిజమే! అది అతనికంత అవసరమనిపించలేదుకూడాను. ఈ కళంకితురాలైన యువతిజీవితంలోకూడా, సానుభూతి, కరుణాపాత్రమైన విషయాలు కొన్నివున్నాయనిపించింది. కాని, అతనేం చేయగలడు? సానుభూతి తప్ప అతని హృదయంలో యింకేభావం కలుగలేదు. మాయాదేవి భోగవిలాసాల్లో పడినకారణం నిజమైనదైనా, అతను ఆమె ప్రణయయాచన స్వీకరించలేదు. ఇంత విన్నాకకూడా అతని

మనసు నేవిషయమూ తాకలేకపోయింది. ఇక ప్రణయం తాలూకు తర్కం, ఆలోచన అసలు కలుగనేలేదు. అతని మనసు ఏ స్త్రీమీదకూడా లగ్నంకాలేదు. అంతే! దీనికి ఏదైనా కారణం చెప్పవలసివస్తుందా? అవును! అతను మాయాదేవికి స్నేహితుడుగావుండగలడు. నిజమైన హితుడు! అంతకు మించిన జోక్యం యింకేమీ కలిగించుకోలేదు!

మాయాదేవి అతనిమీద విసిరిన ఆక్షేపణ అంత చెడ్డదిగా కనుపించలేదు. అతను అవిచలితభావంతో—"మీ పరిస్థితులే మీ మార్గంలో మోహమనే పూలు పరిచాయను కుందాం! కాని, కావాలనుకుంటే మీ రా మార్గాన్ని విడిచి పెట్టలేరా? మనతప్పులకు అప్పుడప్పుడు మన బాహ్యపరిస్థితులనే నిందిస్తుంటాము. కాని, దానికి జవాబుదారులం మనమే కదా? మీరు అనుభవించినంతవరకు సరైనదైనప్పటికీకూడా మీరు మీ యీ నిర్బంధజీవితంతో యెవరికి నష్టం కలిగిస్తున్నారు?

"నేను ఒకరి లాభనష్టాలు చూడడంలేదు. నేను సమాజంమీద పగతీర్చుకోవాలనుకుంటున్నాను. వెండినాణ్యాలకు లోబడి పెద్దపెద్దవారే తమ నైతికజీవితాలకి తిలోదకాలిస్తారని నే నెరుగుదును. వారి పతనావస్థ చూచి నేను సంతోషించాలనుకుంటున్నాను."

"కాని, సమాజంమీద మీ కంత పగఎందుకు? మన పాపాలకు సమాజం సర్వదా దోషిగానేవుంటుందని, దానికి ప్రతిహింసచేయాలనుకోవడం పొరపాటు. అనుకున్నంతమాత్రాన పగతీర్చుకునే అధికారం దొరకదు మాయాదేవి!

దాన్నికూడా సంపాదించుకోవాల్సిందే. స్వయంగా పతనమై, ఎవరూకూడా ఈ సమాజంమీద పగతీర్చుకోలేరు. మనం స్వయంగా మనల్నిగురించి విచారిస్తాము. సమాజం దాన్ని గురించి విచారిస్తుంది. సమాజంలో అమూలాగ్రం విప్లవం రానంతవరకు, వ్యక్తి తను స్వయంగా తిరగబడవలసివుంది. మనం మన దోషాల్ని చూడాలనుకోము ఎందుకంటే, ఆ దృశ్యం చాలా కఠినంగావుంటుంది. కాని, దీపంక్రింద ఎప్పుడూ చీకటిగానేవుంటుంది, మాయాదేవి! నేనింత స్పష్టంగా చెప్తున్నందుకు క్షమించండి! కాని, నా నమ్మకం అదే! మానవుడు తవ్వుకున్నగోతిలో తనే పడి, ప్రపంచాన్ని నిందించడానికి సిద్ధమవుతాడు.

"మీ రీవిధంగా నన్ను నిందించకండి అశోక్ బాబూ! నేను సహించలేను. నేను పతితురాలినని నేను వొప్పుకుంటాను"

"కాదు. కాదు. నేను మిమ్మల్ని నిందించడంలేదు మాయాదేవీ! మీ రలా అనుకుంటే మీ హృదయాన్ని బాధించినందుకు క్షమించండి! నేనుకూడా దోషాలతో నిండిన మానవుణ్ణి! నన్నెవరికి న్యాయాధీశుణ్ణవమంటారు? భగవంతుడు తప్ప యింకెవడు న్యాయంచేయగలడు?" ప్రేమావేశంతో, అతను తనకుడిచేతిని, ఆమెకుడిచేతిమీద వేశాడు.

ఈ స్నిగ్ధమైన స్పర్శతో మాయాదేవిమనసులో రేగిన తుఫాను శాంతించినట్లయింది. ఆమె అదేపనిగా అశోకుని ముఖంలోనికి చూస్తోంది.

చీకటిపడింది. అశోక్ వెడదామని లేచినిల్చున్నాడు. ఈ చర్చవల్ల మాయాదేవిపట్ల అతనిమనసు కొంతమారింది. ఈసంగతి మాయాదేవికూడా పసిగట్టింది. అశోక్‌తోపాటు ఆమెకూడా డ్రాయింగురూంలోకి వచ్చింది. భోజనాలగదిలో మేజామీదున్న లైటుకాంతులతుకే యీగదిలోకూడా మసకగా పడుతోంది. ఆమె అశోక్‌కు మరింత దగ్గరకువచ్చి, అతని రెండుచేతులు పుచ్చుకుని "నన్ను మీరు అసహ్యించుకోరు కదూ?" అని మృదువుగా అడిగింది.

"లేదు. అసహ్యించుకోను" అతను తనచేతిని లాగుకొనలేక.

"నా భ్రాంతితో కూడిన మనసుకు మీ స్పర్శ ఎంతో సంతోషం కలిగించింది అశోక్ బాబూ! మీరు నా హృదయాభ్యర్థన స్వీకరించలేదు కాని, మీరు యీ దుఃఖమయ జీవితంలో కొంచెంకూడా సుఖం కలిగించలేరా?"

"....." అశోక్ ఏమీ అర్థంచేసుకోలేకపోయాడు.

"ఒక్కమారన్నా నన్ను మీ బాహుపాశం మధ్య బంధించుకోకుండా వెడతారా?" అని అశోక్ ఏమీ జవాబు చెప్పకముందే, ఆమె తన రెండుచేతుల్ని అశోక్ మెడలో వేసి తనను అతనిరొమ్ముమీద ఆనించింది.

అశోక్ ఒక్కనిముషం పాటు నిశ్చేష్టుడయ్యాడు. అతను కూడా తన రెండుచేతుల్ని మాయాదేవిశరీరం చుట్టూ పెనవేసి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

మాయాదేవి యీ కరవిలాసంతో ఉత్తేజంపొంది, తనముఖం పైకెత్తి, దొండపండులాంటి అధరాల్ని అశోక్ కి అందిచ్చింది.

ఈమారు అశోక్ తన ఆవేశాన్ని అణచుకోక, ఆ అధరప్రదానాన్ని స్వీకరించాడు.

మాయాదేవి అనిర్వచనీయ సుఖసంవేదనతో తన కళ్ళుమూసుకుంది.

కాని అరనిముషంలో అశోక్ ఆ మోహంనుంచి మేల్కొని మాయాదేవిని వెనుకకు త్రోసివేశాడు.

వ్యాకులుడై, తొందరగా బయటికి వచ్చి, కారులో కూచున్నాడు. "డ్రైవర్, కొంచం వేగంగా పోనియ్" అన్నాడు. మాయాదేవివేపు తిరిగిచూడనైనా లేదు.

## 12

బైతూల్ నుంచి తిరిగివచ్చాక, మూడు నాలుగు రోజులవరకు అశోక్ అస్వస్థమనస్కుడై వున్నాడు. అతని ముఖం లోని శాంతి, సంతోషభావం మాయమై, చింత, మానసిక అశాంతి బాగా కనుపిస్తున్నాయి.

ఇప్పుడతను షికారుకుకూడా వెళ్ళడంలేదు. ఎక్కువ కాలం స్టూడియోలోనే వుంటున్నాడు. అతను మాయాదేవి చిత్రాన్ని పూర్తిచేయడంలో నిమగ్నుడైనమాట నిజమే! కాని ఆ నిహృదయంలో ఏదో గందరగోళం రేపు తున్న సంఘటన జరిగిందని మరియమ్, అబ్దుల్లా వూహించారు. అశోక్ మనస్వాస్థ్యం భంగపరిచే సంఘటన ఏదో మాయా

దేవివద్ద జరిగినట్లు మరియమ్ అనుమానించింది. ఈ ఆలోచనతో, ఆమెహృదయం శంకించింది. కాని యీవిషయంలో ఆమె ఆతన్నేమీ అడగలేదు. మెదలకండా, విచారంగా అంతా చూస్తూ వూరుకుంది

ఇప్పు డామె తన కాలా న్నెక్కువగా అశోక్ బంగళాలోనే గడుపుతోంది. మిస్ థామస్ పని ముగించాక ఒక్క నిముషంకూడా అక్కడ వుండడంలేదు అశోక్ స్టూడియో లోంచి బయటికి రాగానే, అతని కామె కాఫీనో, లేక షరబత్తో కలిపియిచ్చేది. ఆమెకళ్ళలోని స్నేహభావం చూచి, అశోక్ ద్రవించిపోయేవాడు. ఎంతో ప్రేమగా మరియమ్ యిచ్చిన వాటిని తీసుకునేవాడు. ఇద్దరూ ఎక్కువగా మాట్లాడుకునేవారు కాదు. ఈవిధంగా మౌనంగా సేవచేయడంలో మరియమ్కు సంతోషం కనుపించింది. దాన్ని మౌనంగా స్వీకరించడంలో అశోక్కీ సంతోషంగావుండేది. కాని అతని హృదయంలో అల్లకల్లోలం రేగినసంగతి స్పష్టంగానే కనిస్తోంది.

అతను చిత్రాలు చిత్రించడంలో లీనమైవుండవచ్చు. అది అతను కళాభినివేశంలో తన్మయుడైనప్పుడు అలాగే జరుగుతూవుంటుంది. కాని, యిప్పుడు కొంత మార్పు అబ్దుల్లా కూడా కనిపెట్టాడు.

"ప్రస్తుతం మీా బాబుగారు బయటికే రావడంలేదే? ఆరోగ్యం సరిగా లేదా అబ్దుల్లా!" పంచదారకోసం వచ్చినప్పుడు జోసెఫ్ కాకా అబ్దుల్లాను అడిగాడు.

"కాదు ఆరోగ్యం సరిగాలేకపోవడం కాదు. ప్రస్తుతం వారు గొప్ప చిత్రం వ్రాయడంలో మునిగివున్నారు. అట్టి సమయాల్లో ఆయన బయటిప్రపంచాన్ని మర్చిపోతారు. చిత్రకారులుకదూ."

"అవును! అంతేకావచ్చు! రా...! కూచో! టీ తాగువా? అరె కుర్రాడా? ఓ కుర్రాడా? అరె ఎక్కడికెళ్ళాడు? అల్లరివెధవ, వీడితో చస్తున్నాను. అడుగో, ఆ చెట్టుక్రింద రేగుపండ్లు తింటున్నాడు. ఒరేయ్! బేరంసమయంలో వెడతావేరా? వెళ్ళు, రెండుకప్పుల టీ తయారు చేయి! నువ్వూ తాగుతావా? అవును! ఎందుకు తాగవు. నువ్వు దొరసానిగారిబిడ్డవేగా! వెళ్లు, మూడుకప్పులనీళ్ళు మరగబెట్టు. తొందరగా...! ఇవాళ చాలా వుక్కగావుంది. అబ్బ..."

"మరి ఎండలో 'టీ' ఎందుకు జోసెఫ్‌కాకా? షోగాకు తాగుతాను, చాలు" అన్నాడు అబ్దుల్లా.

"ఎండలోనే టీ మజాగావుంటుంది. ఎండలోనే వేడి వేడి 'టీ' చల్లదనం కలిగిస్తుంది...అదిగో చూడు." అంటూ జోసెఫ్‌కాకా గోడమీద 'టీ' ప్రకటనలోని 'టీ' తాగినందువల్ల లాభాలు అనే పదాన్ని చూపించాడు.

"కాని, నేడు ఎండ ఏది జోసెఫ్‌కాకా? నిన్న మొన్నటినుంచి కొంత చల్లదనం తగ్గింది. అంతే..." అబ్దుల్లా నవ్వుతూ అన్నాడు.

"బాగానేవుంది. ఎండకాకుంటే మరేమిటి...? అరే తమ్ముడూ! మీరు పట్టణవాసులు. మిల్లులువుండడంవల్ల

మీా కెప్పుడూ వేడిగా నేస్తుంటుంది. మే మక్కడికి వెడితేచస్తాం. ఇక్కడ చల్లగావుంది కాని ప్రతియేటికన్నా, యీా యేడు వేడి యెక్కువనిపిస్తోంది.

"ఇక్కడ సుమారు యెంతటెంప రేచరు వుంటుంది. కాకా...?"

"పందడిగ్రీలు."

"ఎలావుంటుంది. కాకా? బైతూల్‌లో 103 డిగ్రీల వరకూ వుంటుందని అంటారు. ఇక్కడికి బైతూల్ పదిమైళ్ళ దూరంలోనే వుంది. ఇక్కడ యింత తేడ యెలావుంటుంది? మధ్యలో పర్వతాలుకూడా లేవుకదా?"

"బాబోయ్, 103 డిగ్రీతే! ఎప్పుడూ వుండదు. మనిషికి 106 డిగ్రీల జ్వరంవస్తే చనిపోతారు. మరి 108 డిగ్రీల వేడిలో బ్రతికవుంటారా?"

"సలాం కాకా!" ఒక స్త్రీ తీయనికంఠం ఆ ప్రసంగాన్ని భంగపరిచింది; ఆ వచ్చింది మరియమ్మ.

"సలాం తల్లీ...! ఈ సమయంకానిసమయంలో యెక్కడి కెళుతున్నావమ్మా?"

"సైమీాభార్యకు జబ్బుగావుందట. దాన్ని చూద్దామని వెడుతున్నాను." మరియమ్ చేతిలో మందులపెట్టె వుంది.

"ఓహో! వెళ్ళు తల్లీ! వెళ్లు. మంచియిచ్చిరా. మన క్రీస్తుదేవుడు నీకు మేలుచేస్తాడులే-"

మరియమ్ తిరిగి సలాంచేసి వెళ్ళిపోయింది.

"వహ్వా! ఏమి పిల్ల...మరియమ్ దేవత అబ్బుల్లా..." జోసెఫ్ కాకా అన్నాడు. "వయసు యెంతవుంటేనేం...?

గ్రామానికంతా తల్లిలాంటిది. తల్లి...ఎక్కడెవరికి ఎటు వంటి కష్టం వచ్చినా, తన పనంతా మానుకుని పరుగెత్తుకుని వెడుతుంది. ఆ పిల్ల పదమూడో యేట- కిసన్ కున్‌బీ తల్లికి ప్లేగ్ వచ్చినప్పుడు, రాత్రంతా ఆమెపక్క వదల్లేదు. దొరసాని గారు వారించింది అంటువ్యాధి అంటుకుంటుందని. కిసన్ క్రిష్టి యన్ కూడా కాదని చెప్పినప్పుడు మరియమ్- "హిందూ-క్రిష్టియనులకు భేదంలేదు. ఇది అంటువ్యాధి అంటారా? నిజమైన సేవచేసేవారిని క్రీస్తుదేవుడు కష్టపెట్టడు. ఒకవేళ అటు వంటి సేవలో చావువచ్చినా ఆ భగవంతునిపాదాలముందు చోటు దొరుకుతుంది." అన్నది. ఆశ్చర్యమైన అమ్మాయి అబ్దుల్లా తమ్ముడూ! మనసుగట్టితనంలో తన ప్రాణాన్నికూడా లెక్కచేయదు. అందుకనే ఆమె పాద్రీపురానికి వెలుగు! లేకుంటే........అదుగో, అటు చూడు-, ఆమె వెనక, పిల్లలు ఎలా పరుగెడుతున్నారో........" అన్నాడు.

అబ్దుల్లా అటువేపు చూశాడు. నలుగురైదుగురు నల్లని పిల్లలు ఆమెచుట్టూ గెంతుతూ- "మరియమ్ చలాం. మరియమ్ చలాం" అని అంటుంటే ఆమె ఎంతో ప్రేమతో వారి బుగ్గల్ని నొక్కి 'చలాం నాయనా - చలాం' అంటోంది.

*　　　*　　　*

మాయాదేవివద్దనుంచి ఆనాడు అలా తిరిగివచ్చాక, అశోక్ హృదయం ఎంతో వ్యాకులపడిందనడంలో సందేహం లేదు. మాయాదేవితో తనకున్న పరిచయ పర్యవసానం, ఆమె వల్ల యీవిధంగా పరిణమిస్తుందని అత నూహించి ఎరుగడు.

ఆ మోహావేశమంతా కలిపి అనవిమ్మన్మైనా వుండలేదు. కాని, ఆ యాభై అరవై సెకన్లుకూడా అతనలా ఎందుకు పొరపాటు పడింనీ అర్థంకాలేదు. అతనా సంఘటనకుపూర్వం జరిగిన దాన్ని తిరిగి నెమరువేయడానికి ప్రయత్నించాడు.

మాయాదేవి సుఖవ్యసనాల ఉద్రేకంలోకూడా, హృదయావేదన పొందిన ఒక స్త్రీ దాగివుంది. ఆకారణంగా, అతనికి మాయాదేవిమీద జాలికలిగింది మనుష్యులదోషాల నెప్పుడూ అతను ఉదారబుద్ధితో చూస్తుంటాడు. అందువల్ల కేవలం అతను మాయాదేవి జీవనప్రవాహకారణంగా ఆమెను తిరస్కరించలేదు. కాని అతనిలాంటి కళాసాధకుణ్ని యీ విధంగా స్త్రీమోహం లక్ష్యహీనుణ్ని చేస్తుందనీ, వీలున్నంతవరకు ఆ ప్రవాహానికి దూరంగావుండాలనికూడా తెలుసు.

ఒక ఆడదాని ప్రణయయాచన స్వీకరించలేకపోయానని యతనికి విచారంగానే వుంది. ఒకవేళ యీ ప్రణయయాచన వెనక ఉదాత్తమూ, ఉత్కంఠమైన ప్రీతిభావం వున్నట్లయితే అటువంటి సఫల ప్రేమవ్యథతో పీడితురాలైన స్త్రీతో సమానమైన కరుణామూర్తి ప్రపంచంలో యింకెవరూ వుండరని కూడా తెలుసుకొని, మాయాదేవి భావాల విశుద్ధతవిషయంలో అతనికి సందేహంగానే వుంది.

అతను సెలవుపుచ్చుకుంటున్నప్పుడు, ఆమె ఎంతో వినయంగా, తన హృదయానికి శాంతి, సుఖం దొరికే చిన్న భిక్షను కోరింది. దాని నతను పూర్తిచేశాడుకూడా. ఆ యనుభవం, అతనికి అభూతపూర్వకమైనది. కాని, యీ పని వెనుక, కేవలమూ దుఃఖితురాలిని వూరడించడానికి సుఖాన్ని

వ్యాగల పరోపకారభావ మేమన్నా వుందా? లేక యింకే మన్నా వుందా? ఐతే, యతని మోహావేశం అందులో సమ్మిళితం కాలేదా? అది యతని యధఃపతనానికి తొలి చిహ్నం కాదా?

ఈ ప్రశ్నకు అతనికి సరైన సమాధానం దొరకలేదు. మానవ మనసులో ఆందోళన యింత సూక్ష్మంగా, నిగూఢంగా వుంటుంది. దాన్ని కనిపెట్టడం అసంభవం. ఎన్నోమార్లు మానవులు తమ భావాల్నే విశ్లేషణచేయలేరు. తమ మనస్సులోని సమస్యను తెలుసుకోలేరు. ఈ సమస్యే - ప్రపంచ ప్రారంభంనుంచీ నేటివరకూ - శాస్త్రాలు, విజ్ఞానము విజయవంతంగా సవాలుచేస్తూవస్తోంది.

అతని మనసులో ఏ భయముందో అది ఎప్పుడూ మదనపడడమే దానికి కారణం! తన మనసు నిష్పక్షంగా వుండాలనీ, అతని భావాలు పూర్తిగా శుద్ధంగా నిష్పాక్షికంగా వుండాలని కోరాడు. ఇది పొందడమే అతనికి కష్టంగా వుంది.

మాయాదేవి చిత్రాన్ని చూడాలని కుతూహలంగా వుందని మరియమ్ రెండు మూడు సార్లు అడిగింది. కాని, ఆ చిత్రం పూర్తికానిదే చూపించనని, అతను చెప్పాడు. నేడే ఆ చిత్రం తయారైంది. దానిమీద కప్పిన పరదాను అతను విప్పాడు తొలగించాలి.

ఈ చిత్రం కొరకు, ఎనిమిది రోజుల పరిశ్రమ, ఏకాగ్ర చింతనానుభూతి జరిగాయి. వ్యక్తిచిత్రక్షేత్రంలో మన నుంచి తయారుచేసిన చిత్ర మిది. దీని విజయంమీదనే,

భవిష్యత్తులోని గొప్పగొప్ప ఆశలు ఆధారపడి వున్నవి. అందు వల్ల దాన్ని ప్రపంచంముందు వుంచేందుకు ఉత్సాహపడుతున్నాను. ఇంతవరకూ, యీ చిత్రం కేవల మతని ఏకాంత సాధన. ఏకాగ్ర శక్తికి కేంద్ర బంధువు మాత్రమే! కాని, యిప్పుడు దాన్ని మరియమ్ చూస్తుంది. మరియమ్ దృష్టితో ప్రపంచం చూస్తుంది.

తన ప్రతిస్పర్థురాలిని, తన ప్రీతిపాత్రుని చేతులతో తయారుచేసిన చిత్రాన్ని చూడడానికి మరియమ్ హృదయం తొందరపడుతోంది. అందువల్ల, అశోక్ స్టూడియోలోనికి పిలిచినప్పుడు ఆమెహృదయం దడదడలాడింది.

అశోక్ ఆ భవ్యచిత్రంముందు నిలుచున్నాడు. అతని చేతిలో, చిత్రంమీద కప్పిన సిల్కుపరదా దారం వుంది. అతను మరియమ్‌ను చిత్రానికి ఏడడుగుల దూరంలో స్టూలు మీద కూర్చోపెట్టి– 'ఒకటి...రెండు...మూడు...' అంటూ సర్రున దారాన్ని లాగాడు.

మరియమ్ ఉత్తేజంతో స్టూలుమీదనుంచి దిగి, నిలబడి ఏకాగ్రతతో చిత్రాన్ని చూస్తోంది.

కాని, ఆమెలో కుతూహలం సడలి దాని స్థానంలో ఆశ్చర్యభావం కలిగింది. వివిధ రంగులలో చిత్రించబడిన ఆ సుందర సజీవ చిత్రాన్ని చూచి స్తంభించిపోయింది. సాక్షాత్తు మాయాదేవి నీలకంఠ్ అర్ధనగ్నావస్థలో తన ఎదుట స్టూలుమీద కూచున్నట్లుంది.

కాని, యీ కుతూహలభావం ఎక్కువకాలం లేదు. ఆ స్థానాన్ని గాంభీర్య మాక్రమించింది. కళ్ళలోని సౌమ్యమైన వెలుగు - అగాధమైన జలరాశితో నిండిపోయింది.

ఆ తరువాత ఆ ముఖంలో ద్వంద్వభావం అంకితమైంది. కొంత తొట్రుపాటు కూడా కలిగింది.

ఆ పిమ్మట అయిష్టత - తిరస్కార భావం.

ఆపైన నిగూఢవేదన ఆమెముఖంలో ప్రతిబింబించింది. ఆ చిత్రం ఆమె హృదయాంతరాళాన్ని బాధపెట్టినట్లుంది. విషాదచ్ఛాయలు ఆమెముఖా న్నావరించాయ్!

ఆమెకళ్ళు ఆమెకు తెలియకుండానే క్రిందకు వంగిపోయాయి.

ఈ సూక్ష్మభావాలన్నీ కనిపెట్టి - "ఏం మరియమ్! బావుండలేదా ?" అని అడిగాడు అశోక్.

"బావుండలేదని ఎవరన్నారు ? బాగానే వుంది." మరియమ్ రుద్ధమైన కంఠంతో జవాబు చెప్పి, ముఖం పైకెత్తింది. ఆమె కనుకొలకులు తడిసివుండడం అశోక్ గమనించాడు.

"నువ్వు అబద్ధం చెపుతున్నావు మరియమ్! ఎప్పుడూ అబద్ధంచెప్పేదానివి కావు. మరిప్పుడు నీ మనసులోని భావాన్నెందుకు దాస్తున్నావు ? నీ అభిప్రాయాన్ని నేను కాదననని నీకు తెలియదా ? చెప్పు మరియమ్! నిజంచెప్పు! నీ అభిప్రాయం ఏమిటి ? అందుచేతనే, అందరికన్నా ముందు నీ కీ చిత్రాన్ని చూపించాను."

"కోపగించవు కదా ?"

"లేదు........"

"అపార్థం చేసుకోరు కదా?"

"ఎప్పుడూ లేదు"

"నన్ను అసహ్యించుకోరు కదా?"

"లేదు లేదు. కాని, యివన్నీ నువ్వెందుకు కడుగుతున్నావు. మరియమ్? నీకు నా స్వభావం తెలియదా? చెప్పు! తొందరగా చెప్పు! నిన్ను నేను అభ్యర్థిస్తున్నాను."

"అయితే వినండి! ఈ చిత్రం నాకేమీ బావుండలేదు. ఈ చిత్రం ఒక సిగ్గులేని ఉన్మత్త విలాసినిది. దీన్ని చూచినంత మాత్రాన్నే, విషయాసక్త - కామభావం రేకెత్తిస్తుంది. ఇది మన ఉన్నతికి మూలంకాదు. మన పతనానికి మొదటి మెట్టు"

"చాలు. చాలు. ఇక ఆపు......" అశోక్ పిచ్చి వానిలా, ఆమెను వారించాడు. విచారమేఘాలతనిముఖాన్ని ఆవరించాయి!- "అర్థమైంది. బాగా అర్థమైంది. నువ్వన్నది నిజమే! అబ్దుల్లా! అరే అబ్దుల్లా-" అతను వెర్రిగా పిలిచినప్పుడు అబ్దుల్లా - జవాబు చెప్పలేదు. అతను అడ్డంవచ్చిన కుర్చీని ఒక్క త్రోపుతో పడవైచి. వంటగదిలోకి పరుగెత్తాడు. ఒక అరనిముషంలో అక్కడనుంచి తళతళ మెరుస్తున్న రొట్టెలు కోసే కత్తితో తిరిగి వచ్చాడు.

మరియమ్ భయవిహ్వలయై కంపిస్తోంది. అశోక్ తాకూరు కేమైంది? నిజంగా పిచ్చెత్తలేదు కదా!

అతని అభిప్రాయం కనిపెట్టకముందే, అశోక్ ఆ చిత్రం ముందు నిలుచుని, కుడిచేత్తో కత్తిని పట్టుకుని, పండ్లుకొరుకుతూ

అన్నాడు. "పాపమూ స్త్రిని కలిగిస్తుంది. పతనానికి దారితీస్తుంది. మాయావిని.........." అంటూ పళ్ళునూరాడు.

నిర్మమతతో ఆ చిత్రాన్ని చీల్చివేయడం మరియమ్ చూసింది.

తన హృదయాన్నే ఆ కత్తితో కోసినట్లు బాధ పడింది.

ఆ చిత్రంలో కూర్చున్న మాయాదేవి ఒక్క నిముషంలో చిరిగిపోయి, కురూపిగా, అసహ్యంగా కను పించింది. ఇదంతా రెప్పపాటుకాలంలో జరిగిపోయింది.

మరియమ్ తొందరగా వెళ్ళి అశోక్ చేతిలోని కత్తిని లాక్కునేందుకు ప్రయత్నించింది.

అశోక్ దాన్ని గట్టిగా పట్టుకున్నాడు. అందువల్ల దాన్ని లాక్కోలేకపోయింది.

పెనుగులాట జరిగింది.

అశోక్ కుడిచేతి బొటనవ్రేలినుంచి రక్తం కారడం మరియమ్ చూచింది. కత్తికూడా రక్తంతో తడిసింది.

మరియమ్-"అయ్యో-" అని క్రింద కూలబడిపోయింది. అశోక్ రక్తపుబొట్లు కొన్ని మాయాదేవి నీలకంఠ శిథిల చిత్రంమీదకూడా పడ్డాయి.

# 13

అశోక్ తన బంగళా వెనకనున్న వరండాలో పేము కుర్చీలో కూచున్నాడు. మరియమ్ అతని వ్రేలిగాయాన్ని

కడిగి కట్టుకడుతోంది. ఉదయపుగాలి మనోహరంగా వీస్తోంది. ఎదురుగా వున్న సాత్పూరా నీలిపర్వతాలు, మనసుకు చల్లని సుఖాన్నిస్తున్నవి. దూరంగా చిగురుటాకులతో పూతతో నిండిన మామిడిచెట్టుమీద కూర్చున్న కోయిల 'కుహూ-కుహూ' అని రాగాలాపనచేస్తోంది. వాతావరణంలో సౌమ్యమైన ఆహ్లాదం వ్యాపించివుంది. అశోక్‌ను మరియమ్‌ను ఉద్విగ్న పరచిన ఆనాటి భయంకరమైన తుఫాను యిప్పుడు శాంతించింది. ఇప్పుడు యిద్దరి భావాలు మధురమైన స్నేహంతో ఆలోకితమయ్యాయి. అందువల్ల వారిద్దరూ యిప్పుడు ప్రశాంత మనస్కులై ఆలోచిస్తున్నారు.

వ్రేలికి కట్టుకడుతూ మరియమ్ అంది. "ఈ దుర్ఘటనకు క్షమాపణకోరుకుంటున్నాను. నేనొకవేళ అలా చెప్పకుండావుంటే-అంత అందమైన చిత్రాన్ని నాశనంచేసేవారు కాదు. నేనెంతో సిగ్గుపడుతున్నాను." అంటుంటే ఆమె ముఖం ఎర్రబడింది. ఆ కారణంగా ఆమెసౌందర్యం యింకా ద్విగుణీకృతమైనట్లు కనిపించింది

"కాదు. అందులో సిగ్గుపడవలసిందేమీలేదు. గర్వించవలసివుంది. నువ్వు సత్యాన్ని చూపించి ఆత్మవంచననుండి కాపాడావు. అందుకని నేను నీకు కృతజ్ఞత తెలుపాలి. ఆనాడు ఆ గాయంకలగకుండావుంటే, ఈనాడు నీ అనుపమైన శుశ్రూష సుఖాన్ని ఎలా పొందగలిగివుండేవాణ్ణి?"

"ఆ గాయం మీ చేతికి కాదు. నా హృదయానికి తగిలింది." మరియమ్ అప్రయత్నంగా అంది. ఈ మాటకు

స్వయంగా ఆమె కొంచం సంకోచంలోపడింది. ఐనా వెంటనే-"మరి ఆ చిత్రాన్ని ఎందుకు చింపివేశారో యిప్పుడైనా చెప్పండి" అని అడిగింది.

"ఆ చిత్రం మాయాదేవిది కాదు. అది నా పతనానికి నాంది. అటువంటిదాన్ని నామరూపం లేకుండా చేయడమే మంచిది. దాన్నలానే వుంచి, నన్నింకా సిగ్గుతో చావమంటావా ?"

"అది మీ అధఃపతన మెలా అవుతుంది? ఒకవేళ అలా జరిగినప్పుడు అది మాయాదేవికే అవుతుంది. మీరు కేవలం, ఆమె చరిత్రతాలూకు సజీవచిత్రాన్నిమాత్రమే చిత్రించారు. యిందులో దోషమేముంది ?"

"కాదు. అలా అనుకుని మనస్సును సంతృప్తిపరుచుకోలేము. కళ కేవలం ఏదైనా వస్తువిశేషాన్నే ప్రతిబింబింపచేయదు. పైగా అది కళాకారుని చరిత్రను వ్యక్తపరుస్తుంది. ఆర్టిస్టుసంస్కారం ఎంత శుద్ధంగా, సాత్వికంగా వుంటుందో, అతని చరిత్ర ఎంత ఉజ్వలంగా వుంటుందో అతని కళావస్తువు అంత ఉదాత్తత, సత్యం, శివం, సుందరం అనే తత్వంతో భూషితమవుతుంది. ఒకవేళ ఆ చిత్రం ప్రేక్షకులలో విషయవాంఛలను రేకెత్తించేదిగా వున్నట్లయితే ఆ దోషం ఒక్క మాయాదేవిదే కాదు. అశోక్ ఠాకూరుదికూడాను. ఆచిత్రాన్ని చూడగానే, నాకుకూడా మోహావేశంకలిగిందనీ, నేను నా ఉదాత్తనిర్మల భూమికనుంచి పతనంచెందానని అర్థమవుతుంది. ఆ చిత్రంద్వారా నేను కళారాధనకాక, కళనే భ్రష్టం చేసినట్లవుతుంది. ఈ బాధ్యతనుంచి, నేను తప్పుకోలేను మరి

యమ్!" ఆనాడు మాయాదేవియింట్లో జరిగిన సంఘటన జ్ఞాపకంవచ్చి, అతనిహృదయం సిగ్గుతో, పరితాపంతో నిండి పోయింది.

"కాని, నా అభిప్రాయం సరైనదికాకపోవచ్చు. నేను కళాజ్ఞానంకలదాన్ని కాదు. చిత్రకళయందు కొంచం అభిమానం వుంది. కాని, కేవల మా అధికారంతో మీబోటి చాతుర్యం గల ఆర్టిస్టుచిత్రాల్ని విమర్శించే హక్కు నాకు లేదు. నా విమర్శకు అంత గొప్పస్థానమివ్వడంలో మీరు పొరపాటు పడివుంటారు."

"పొరపాటా...? ఎప్పుడూ కాదు. నిజమైన కళచేసే అప్పీలు కేవలం కళాకోవిదులకేకాదు. అది సాధారణజనానికి కూడా వుంటుంది. కళాదేవాలయాలతలుపులు కేవలం ఫలానా వ్యక్తులకే తెరవబడివుంటాయని, యితరులకు లేదనడం తప్పు! కళతాలూకు భాష విశ్వవ్యాప్తమైనది. అందరూ దాన్ని అర్థం చేసుకోగలరు. ఎవరిహృదయాల్లో మానవస్వభావంలోని సాధారణ, సరళభావాలు వికసించివుంటాయో, పవిత్రతా, ప్రేమా, దయా, ఆశా, శాంతిలాంటి మూలప్రవృత్తుల అనుభూతుల్ని ఎవరు పొందివుంటారో, వారే నిజంగా కళను తెలుసుకొన్న వారూ, నిజమైన విమర్శకులైవుంటారు. ఏ కళకు యీ మూల భావాలతో సంబంధంవుండదో అది సజీవమైనది కాలేదు. ఈ భావాలు నీ సంస్కారహృదయంలో జీవించివున్నాయనే సంగతి నాకు తెలుసు! అందుకనే నీ యభిప్రాయాన్ని లెక్క చేశాను."

మరియమ్ నిరుత్తరురాలైంది. "మీరు వూరికే నన్ను

పొగడుతున్నారు" అని అనడంతప్ప యింకేమీ అనలేక పోయింది. అశోక్ విస్పష్టవాదనా, ఆత్మశోధనాప్రవృత్తి - తక్షణం తన తప్పును వొప్పుకునే సూక్ష్మజ్ఞానం ఆమెను సంతృప్తిపరచాయి ఈ అసాధారణ పురుషరత్నంముందు, ఆమె మనసులోనే తలొంచుకుంది.

ఆ సంఘటన జరిగిన నాలుగైదు రోజులతరువాత, అశోక్ బంగళాముందు మాయాదేవి కారు రాగింది. కాని అందులో దాని యజమాని లేదు. యూనిఫారమ్ తొడుక్కున్న డ్రైవరు కారుదిగి, అశోక్ చేతికి అందమైన ఆకుపచ్చనికవరొకటి యిచ్చాడు. ఆ రంగు మాయాదేవి సిల్కుగౌనురంగును పోలి వుంది. అదిజ్ఞాపకంరాగానే అశోక్ మనస్సెలాగో అయిపోయింది. ఆ ఉత్తరం మాయాదేవి స్వహస్తంతో, అందంగా రాసింది. అందులో "నేను చిత్రంచూసేందుకు ఎంతో ఆత్రుతపడు తున్నాను. ఒకవేళ అది తయారైనట్లయితే, స్వయంగా మీరు తీసుకువస్తే ఎంతో సంతోషంగావుంటుంది. కాదు ఎంతసేపు వుండమన్నా వుంటుంది." అని వ్రాసింది. చివరలో "ఆనాటి సంఘటన నా హృదయాన్ని ఎన్నో మృదుమధుర స్మృతులతో నింపివేసింది. మీ పునర్దర్శనంకోసం, కళ్ళు ఎదురు తెన్నులుచూస్తున్నాయి." అని వ్రాసి చివరకు తన చీకటియింటిలో వెలుగుప్రసరింపచేయమని ప్రార్థించింది.

ఉత్తరం అందంగావ్రాయడం మాయాదేవికి బాగా తెలుసని అశోక్ గ్రహించాడు. ఆ కాగితం సెంటుతో పరిమళిస్తోంది. ఆ పచ్చనికాగితంమీద, ఎర్రని గులాబిపువ్వు చిత్రించి

వుంది. దాని కది ఎంతో అందాన్నిచ్చింది. మాయాదేవికి మనోవిజ్ఞానంకూడా చక్కగా తెలుసు. మగవారిమనస్సుపై, ఏ ఏ సూక్ష్మభావాలు పనిచేస్తాయో ఆ విషయం క్షుణ్ణంగా తెలుసు.

కాని యిప్పుడు అశోక్ వీటన్నిటినీ అధిగమించాడు. అతను కేవలం మూడుపంక్తుల ఉత్తరాన్ని వ్రాసి పంపించాడు– మాయాదేవిచిత్రం తయారుచేసియివ్వనందుకు తనకు విచారంగావుందనీ, అది చెడిపోయిందనీ, తిరిగి చిత్రించలేననీ, ఈ పనికోసం యింకొక ఆర్టిస్టును నియమించితే బావుంటుం దనీ సలహాయిచ్చాడు.

మరునాడు ఆ డ్రైవరే, ఆ కారులో యింకొక ఉత్తరం తీసుకునివచ్చి యిచ్చాడు. "ఎల్లుండి నా పుట్టినరోజు పండుగ; ఈ శుభసమయాన్ని పురస్కరించుకుని మీరు మాయింటికి భోజనానికి వచ్చినట్లయితే, ఎంతో దయచూపిన వారవుతారు. మిస్ మరియమ్‌నుకూడా వెంటబెట్టుకుని వచ్చినట్లయితే, యింకా సంతోషంగావుంటుంది"అని వ్రాసింది.

అశోక్ మరియమ్‌అభిప్రాయంతీసుకుని వెంటనే జవాబు వ్రాసి పంపించాడు. "మీ పుట్టినరోజుపండుగసందర్భాన మా అభినందనలందుకోండి. వింములో పాల్గొనేందుకు అవకాశం లేదు. నా ఆరోగ్యం బావుండడంలేదు. అందువల్ల నేను రాలేకపోతున్నాను. మరియమ్ కూడా రాలేనంటూంది. అందుకు క్షమించండి. మీ ఆహ్వానానికి ధన్యవాదాలు"

ఈమారుకూడా వృథాఅయింది. కాని, మాయాదేవి

యింతటితో భయపడేరకం కాదు. మూడోనాడు యింకొంక ఉత్తరం పంపించింది. "నిన్నరాత్రి అకస్మాత్తుగా ఆరోగ్యం చెడినందువల్ల విందుకార్యక్రమం రద్దుపరిచాను. ఒకవేళ మీకు స్వాస్థ్యం చిక్కినట్లయితే - దర్శనమిచ్చేందుకు దయ చేయండి. జబ్బులో ఒంటరితనం బాధపెడుతోంది. ఇటు వంటిసమయంలో మీ సాన్నిధ్యంవల్ల చాలా సుఖం ప్రాప్తిస్తుంది. ఈమారు నిరాశ కలిగించరని ఆశిస్తున్నాను."

అశోక్ డ్రైవరును అడిగాడు. "ఐతే మీ అమ్మగారికి జబ్బుగావుందా ?"

"లేదండి ! వారు ఉదయం బజారుకుకూడా వెళ్ళారు." అంటే మాయాదేవి వాడి కేమీ చెప్పలేదని తెలుస్తోంది. ఆ తరువాత వాడు గాబరాపడి తన తప్పును తెలుసుకొని "అవును. నిన్నరాత్రి వారి ఆరోగ్య మంతగా బావుండలేదు" అన్నాడు.

"ఆనందించవలసిన విషయమే." సానుభూతిచూపించేందుకు ప్రయత్నించాడు. తను ఆరోగ్యంపొందుతున్నాననీ, ఇంకా పూర్వపుస్థితికి రాలేదనీ, అందువల్ల మాయాదేవి క్షమించినట్లయితే, ఎంతో దయచూపినవారవుతారనీ, ఆతరువాత ఎప్పుడైనా రావడానికి ప్రయత్నిస్తాననీ వ్రాశాడు.

ఈమారు మాయాదేవి మండిపడింది. కాని, ఆమె అంత తేలికగా ధైర్యంకోల్పోయేది కాదు. ఆ మరునాడుదయం తొమ్మిది గంటలకు, స్వయంగా కారులో వచ్చేసరికి, అక్కడ అబ్దుల్లాతప్ప యింకెవరూ కనుపించలేదు. అతన్ని విచారించగా, తన యజమాని ఉదయమే అడవుల్లోకి షికారు

వెళ్ళినట్లు చెప్పాడు. ఆయన వొంటరిగానే వెళ్ళారా అనే ప్రశ్నకు 'కాదు, వెంట మరియమ్‌కూడా వెళ్ళింది' అనే జవాబువచ్చింది. తిరిగి ఎప్పుడు వస్తారనే ప్రశ్నకు 'రెండు మూడు గంటలలో' అని జవాబువచ్చింది. 'ఇప్పుడు వారి ఆరోగ్యం ఎలావుంది?' అనే ప్రశ్నకు 'అదివరకన్నా చాలా బాగుంది.' అని జవాబువచ్చింది.

మాయాదేవి కోపంతో వెళ్ళి కారులో కూచుంది. కాని, ఆమె తన విజిటింగ్ కార్డు వదిలిపెట్టడం మాత్రం మరిచి పోలేదు. కారుతలుపు గట్టిగా మూసింది. ఆ చప్పుడు చుట్టు ప్రక్కలవారికి వినిపించింది. మాయాదేవి నాగపూరులో, అశోక్‌తో మాట్లాడేందుకు వీలుపడలేదనే కోపంతో, ఈవిధం గానే కారులోకూర్చుని తలుపు దభాలునవేసుకున్న సంగతి అబ్దుల్లాకు జ్ఞాపకంవచ్చింది.

ఆమెకారు వెళ్ళిపోయాక, అబ్దుల్లా భుజాలెగురవేసి — "తప్పదు..." అనుకున్నాడు.

సుమారు వారంరోజులవరకూ మాయాదేవి విజిటింగ్ కార్డుకు సమాధానంవస్తుందేమోనని ఎదురుచూచింది. కాని, నిరాశకలిగింది. రోజురోజుకూ ఆమెకోపం ఎక్కువై పోతోంది. అశోక్ మీద కోపంవున్నా అంతకుమించిన కోపం మరియమ్ మీద వుంది.

ఒకనాడు అబ్దుల్లా సామానుకోసం బైటూల్ వెళ్ళి నప్పుడు, మాయాదేవి తమ కాతా సుస్తాచేసి వెళ్ళిపోయిం దనే సంగతి దుకాణంవారు చెప్పారు.

ఈ సంగతి అశోక్ విని బ్రతుకుజీవుడా అనుకున్నాడు.

# 14

అశోక్ చేతికి తగిలినగాయం అంత పెద్దదికాదు. కాని మరియమ్ ఏదో భయంకరమైన దుర్ఘటననుంచి రక్షింపబడి నట్లు, దానికి శుశ్రూష చేసింది. మరియమ్ స్నేహభావమంతా పరిచర్యరూపంలో పొంగులువారింది. మలాంపట్టీవేయడమనే ప్రక్రియలోనే, ఆమెవ్యక్తిత్వంతాలూకు సంపూర్ణకోరికలు యిమిడివున్నట్లుంది.

ఈ ఏకాగ్రసేవ అశోక్ హృదయంమీద ప్రభావం చూపింది. ఆ అర్ధనగ్నచిత్రాన్ని విమర్శించి సత్యాన్ని నిర్దేశించింది. అశోక్ కళ్ళమీద కప్పబడిన మాయపొరను తొలగించి అతన్ని విస్మయంతో - కుతూహలంతో నిశ్చేష్టునిగా చేసింది. శైలవనాల్లో నివసించిన యీ ప్రకృతికన్య, యింత జ్ఞానం ఎక్కడ సంపాదించింది ? ఆధునికమైన సభ్యతారంగంలో ఆమె రాణించకపోయినా, ఆమె జీవితగ్రంథాన్ని-సజీవమైన ప్రకృతిఅనే గొప్ప గ్రంథాన్ని మాత్రం చదివింది. ఈ కారణంవల్లనే, ఏ వస్తువుతత్వానైనా - యిట్టే సుగమంగా తెలుసుకుంటూంది. అటువంటి విషయాలను తెలుసుకునేందు కింకొకరైతే ప్రయోగశాలలోనో, పాఠశాలలోనో కాలంగడపవలసివస్తుంది. మరియమ్ యీ దివ్యదృష్టికారణంగానే, అతన్ని అప్రతిహతంగా ఆకర్షించింది.

ఈ ఫలితం మరియమ్‌కు సుఖ స్వర్గద్వారం తెరచినట్లుంది. అశోక్ కూడా, స్నేహాదరాలతో చూస్తుండడమే ఆమెఆనందానికి మొదటికారణం ! తనకు సంబంధంవున్నంత

వరకు, ఆ మెకున్నదంతా అతని పాదాలముందు అర్పించేందుకు సిద్ధంగావుంది. అశోకే ఆమెకు దేవుడు. తన హృదయసింహాసనాన్ని అధిష్టించగలవాడు అతనే! ఆమెసర్వం అతనికి దానం చేయగలదు. కాని, దాన్ని స్వీకరించడం స్వీకరించకపోవడం అశోక్ చేతిలోవుంది.

మరియమ్ భావాల సూక్ష్మపరివర్తనం అశోక్ గమనించకపోలేదు. దీనిలో అతనికి ఒక తీయని సుఖానుభూతి కలిగింది. మరియమ్‌వ్యక్తిత్వముద్ర అతనిమీద రోజురోజుకూ ఎక్కువగా గాఢమవుతోంది. ఆమెఆకర్షణాప్రభావంతో నెమ్మది నెమ్మదిగా లోబడుతున్నదికూడా అతను గమనిస్తూనే వున్నాడు.

ఒకనాటి ఉదయం వారిద్దరూ షికారుచేస్తున్నసమయంలో ఒక చిన్న సెలయేటిని దాటుతున్నారు. కలకలమంటూ దానిలో నీరు ప్రవహిస్తోంది. దాన్ని దాటడానికి రాళ్ళమీద నడచి వెళ్ళాలి. మరియమ్ ముందు వెడుతోంది. అశోక్ వెనుక వస్తున్నాడు. ఇంతలో మరియమ్‌కాలు జారింది. ఆమె కెవ్వుమని కేకవేసింది. "పడిపోయాను"అని అరచింది. అశోక్ మహావేగంతో ముందుకు దూకి, ఆమెను తన బాహుపాశంతో బంధించాడు. అతనుకూడా రాళ్ళమీదనుంచి నీటిలోకి దిగాడు. చెప్పులూ, మేజోళ్ళు తడిసిపోయినవి. కాని మరియమ్‌ను నీళ్ళలో పడకండా రక్షించాడు. కొంచెంసేపటివరకలాగే నిలుచున్నాడు. భయంతో మరియమ్ తన తలను అతని యెదలో దాచుకుంది. ఆ ఒకే ఒక అంగవిన్యాసంలో తన జీవితభారాన్నంతా అశోక్ మీదవేయడానికి తయారుగా

వున్నట్లు సూచించింది. అశోక్ మెల్లమెల్లగా తనచేతివ్రేళ్ళతో ఆమెజుట్టును సవరిస్తూ, ఆమెచెవిలో నెమ్మదిగా "బాగా భయపడిపోయావా మరియమ్!" అన్నాడు.

"ఊఁ" కళ్ళు తెరవకుండానే తలను అలాగేవుంచి అంది. తన ఆ సుఖావస్థ సమాప్తమవకుండావుండాలని ఆమెకోరిక.

అశోక్ మెల్లగా ఆమెతలను తన ఛాతీమీదనుంచి వేరుచేసి, చేయిపట్టుకుని నడిపిస్తూ ముందుకు తీసుకువెడుతున్నాడు.

ఆ చేయి, తన జీవితాంతంవరకూ ఆధారమైవుంటే ఎంతో బాగుండుననని మరియమ్ అనుకుంది.

"ఐతే బాగా భయపడిపోయావా?"

"లేదు. భయపడలేదు. మీరు వెంటవున్నప్పుడు భయమెందుకు?"

"మరి అంత భయపడినట్లున్నావేం?"

"నీటిలో చీర తడిసిపోతుందేమోనని భయపడిపోయాను"

అశోక్ యింకేమీ అనలేదు. కేవలం ఆమె అందమైన కళ్ళనూ, సన్నని పెదాల్నీ చూస్తూవుండిపోయాడు.

"నా కళ్ళలో ఏమిటలా చూస్తున్నారు?" మరియమ్ అడిగింది.

"మరియమ్‌ని..."

"అక్కడ మరియమ్ కనుపిస్తోందా? అక్కడ మీకు మీ మూర్తే కనుపిస్తుంది" అన్నది. కాని, సంకోచం, సిగ్గుతో ఆమెబుగ్గలు ఎర్రబడి – కళ్ళు క్రిందికి వాలిపోయాయి.

తటాలున ఆమె బుగ్గల్ని....అశోక్‌కి అందించింది.

కాని, తనను తాను సంబాళించుకుని యింకొకవేపు చూస్తున్నాడు. అతనినోటంట ఒక వేడినిశ్వాసం బయటికి వచ్చింది. ఆ వేడినిట్టూర్పు మరియమ్‌శరీరాన్ని తాకే ఏర్పాటు కలిగించింది.

ఇంతలో మరియమ్ అరిచింది "ఓహో! పొగడచెట్టు"

ఎదురుగా పొగడపూలతో నిండివున్న చెట్టును అశోక్ చూశాడు. అక్కడి శీతలమందసమీరం పొగడపూల మధుర పరిమళంతో నిండిపోయింది.

"ఈ పూవు లెంత అందంగావున్నాయి!" మరియమ్ ఉల్లాసంగా అన్నది. "కోసియివ్వరూ?"

అశోక్ ప్రవృత్తికూడా ఆహ్లాదమయమైనదే. వెంటనే అతడు చెప్పులువిడిచి చెట్టుఎక్కాడు. ప్రకృతిసౌందర్యవాతావరణంలో అతనుకూడా బాలకునిలా క్రీడారతుడయాడు.

అతని చపలత్వం చూచి, మరియమ్‌కు సంతోషం కలిగింది.

అశోక్ తొందరతొందరగా పూలు త్రుంచుతున్నాడు. మరియమ్ క్రిందుండే, వ్రేలితో – "అవి...అవి చూడండి! అవి కావు...ఆ...అవే! ఇదా యీ కొమ్మను చూడండి." అంటోంది.

పూలతో అశోక్ పిడికిలి నిండాక – "ఇవి పుచ్చుకో–" అన్నాడు.

మరియమ్ చేతులుచాపింది. కాని, ఆ పూలన్నీ అశోక్ మరియమ్‌తలమీద పోశాడు.

"ఓహో! భగవంతుడు, నామీద పుష్పవర్షం కురిపించాడు-" అని క్రిందపడిన పూలను ఏరుకుంటోంది.

"వద్దు. వాటిని ఏరవద్దు మరియమ్, వాటికి విలువ లేదు. నేను తాజాపూలు కోసియిస్తాను."

అశోక్ అన్న యీమాటలకు మరియమ్ ఆనందవిహ్వాల అయింది. తిరిగి పిడికిలినిండా పూలు పోగయ్యాయి.

"ఇక వీటిని, నీ చేతుల్లోకి తీసుకో-"

మరియమ్ మునివ్రేళ్ళమీద నిలుచుని, తన దోసిలి చాపింది. అశోక్ ఒకచేత్తో కొమ్మపట్టుకుని వంగి, రెండో చేతిలోని అందమైన ప్రసూనాల్ని మరియమ్‌దోసిలిలో పోశాడు.

ఆ సురభిళపుష్పాలసాక్షిగా రెండోమారు వారిచేతులు కలుసుకున్నాయి. వారిశరీరాల్లో ఒక మధురస్పందనం కలిగింది.

ఒకరినొకరు చూచి నవ్వుకున్నారు. కళ్ళలో కళ్ళు కలిసిపోయినై.

ఒకమారు యిద్దరూ సూర్యాస్తమానపు రంగుల్ని చూద్దామని ఎండలోనే బయలుదేరారు. ఆ దృశ్యాన్ని చూద్దామనుకున్నప్రదేశం అక్కడికి రెండున్నరమైళ్ళ దూరంలో వుంది. అది పర్వతాలమధ్యస్థంగా ఏటవాలుగా వుంటుంది. దానికి దగ్గరగా ఒక జలాశయమూ, చుట్టుప్రక్కల మామిడి, యింకా రకరకాలైన పెద్దపెద్ద వృక్షాలు వున్నవి. ఆ ప్రదేశం నిర్జనంగా, ప్రశాంతంగా, ఎంతో అందంగా చల్లగా వుంటుంది. అక్కడనుంచి పర్వతాలవెనుక అస్తమిస్తున్న సూర్యుడు, తన స్వర్ణరశ్మివైభవంతో, అతి

మనోహరంగా కనుపిస్తాడు. సూర్యకిరణాలతో మబ్బుతునకలు ఎర్రగా, పచ్చగా ఎంతో అందంగా వుంటాయి. ఈ అపూర్వ దృశ్యాన్ని చూడటానికే, అశోక్ మరియమ్‌ను తీసుకుని బయలుదేరాడు. వెంట ఫ్లాస్కులో నిమ్మషరబత్తు- కొన్ని రొట్టెముక్కలు తీసుకునివచ్చారు.

పడమటిదిక్కున దిగిపోతున్న ఎండలో రెండున్నర మైళ్ళు నడిచినందువలన మరియమ్ కోమలమైన తెల్లనిముఖం ఎర్రబడి, గొంతెండిపోయింది. ఆ అందమైనప్రదేశం చేరగానే ఆమె శాంతంగా నిట్టూర్పువిడిచి "హమ్మయ్య! ఈ ఎండ ఎంతో కష్టపెట్టింది. శరీరమంతా వేడెక్కింది. ముఖ్యంగా తల మాడిపోయింది." రుమాలుతో విసనకర్రలా విసురుకుంటూ అన్నది.

"ఏదీ చూస్తాను?" అంటూ అశోక్ తన కుడిచేత్తో, మరియమ్‌తల తాకాడు. "అవును! చాలా వేడిగానే వుంది. నువ్వు కొంచెంసేపు యిక్కడ విశ్రాంతితీసుకో! కాస్త నిమ్మ షరబత్ త్రాగినట్లయితే తగ్గుతుంది."

"సరే! కొంచంసేపు యిక్కడే పడుకుంటాను" అంటూ ఆమె అక్కడే నేలమీద దులిపి నిజంగానే ఒరిగింది.

అశోక్ ఆలస్యంచేయకుండా వెంటనే, తనచేతిని ఆమె తలక్రిందకు చాపి-"వద్దు, నేలమీద తల ఆనించవద్దు. బాధగా వుంటుంది. రా! ఇక్కడ నావొద్దకు రా-" అంటూ మరియమ్ తలను తనవొడిలో వుంచుకున్నాడు.

మరియమ్‌కూడా దీనికోసమే చూస్తున్నట్లుంది. ఆమె సంతోషంతో తనతలను అశోక్‌వొడిలో వుంచి, నిమీలిత

లోచనిద్రమై, హాయిగాపడుకుంది. అశోక్ ఆమెతలను తన చేతితో నిముకుతున్నాడు.

"ఇప్పు డెలా వుంది ?"

"చాలా బాగుంది." కళ్ళు తెరవకుండానే మరియమ్ పెదిమలను కదిలించింది. "ఈ సమయంలో నాకన్నా సుఖవంతురాలైన స్త్రీ ప్రపంచంలో ఎక్కడా వుండదు."

"ఊఁ...అంతా అబద్ధం."

ఆమె యీమాట వినన్ట్లు- "ఒక వేళ నా కీ క్షణంలో మృత్యువువచ్చినా అదృష్టవంతురాలినే" అన్నది

"అప్పుడప్పుడు పిచ్చిగా మాట్లాడతావెందుకు మరియమ్?" అశోక్ అడిగాడు.

"కాదు. పిచ్చిగాకాదు. నేను భగవంతుణ్ని కోరుతున్న నా జీవితంతాలూకు పరమసుఖ మిదే" మరియమ్ చలించకుండా "నాబోటి అనాథపిల్లలకు జీవన్మరణాలంటే ఏముంది ? నేను బ్రతికినా చచ్చినా ఎవరి కేమి నష్టం ? మీ ఒడిలో నాకు చావుదొరికినట్లయితే నా దురదృష్టజీవితంలో కూడా పరమసౌభాగ్యం వికసిస్తుంది."

అశోక్ నిశ్చేష్టుడయాడు. అతను నోటితో ఏమీఅన లేదు. కాని, మరియమ్తలను తనగుండెకు అదుముకుని మెల్లగా చేతితో నిముకుతున్నాడు.

తనశరీరం ఒకయువతి కోమలస్నేహాలింగనంకొరకు తహతహలాడుతోందనీ, ఇంతవరకూ ప్రేమశూన్యంగావున్న హృదయం, ఈ మధురభావనానుభూతితో పిపాసితమైనట్లు గ్రహించాడు. రోజురోజుకు మరియమ్ ముఖకమలాకర్షణ

అతన్ని మోహింపచేస్తున్నట్లు, ఆమె హృదయావేదన అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నట్లుంది, ఇది పాశవికతృప్తి కాదు. అతనిహృదయంలోని సుదూరకోణాన్ని ఆందోళనపరిచే ఒక మహత్తరమైన భావనవుంది. ఈ పిలుపును యింకెన్నిరోజులు నిర్లక్ష్యంచేస్తాడో తెలియదు.

తన స్వంతవిషయం వచ్చినప్పుడు, లైంగికసంబంధమైన ప్రశ్నల విషయం సరిగ్గా ఆలోచించడం ఎంతో కష్టంగా వుంటుంది.

అశోక్ మనసులో ఆలోచనలు పరుగులెత్తాయి. తన యీ ముప్పదిసంవత్సరాల వయసువరకూ తనెక్కె స్త్రీలతో గాఢమైన సంబంధం లేకపోయింది. తన విశ్చలమైన వ్యక్తిత్వాన్ని తనెప్పుడూ ఒక స్త్రీ ప్రేమార్జనకోసం వినియోగించ లేదు. అతనిమనసులో కోరికలు లేవని కాదు. కాని, యింత వరకూ అతను వాటితో విజయవంతంగా పోట్లాడుతూ వచ్చాడు. అతని మార్గంలోని, యీ క్షేత్రంలో విశేషంగా ప్రలోభం లేకపోవడమే కారణంకావచ్చు. అందువల్ల తను యింద్రియాల్ని జయించాననీ, సాధారణ మనుష్యులకన్నా గొప్పవాడినని ఎన్నడూ చెప్పుకోలేడు. ఐనా నిగూఢమైన కోర్కెలుండున్నాయనం ఇంతవరకూ అతనిజీవితంలో తప్పటడుగు వేసేంత అవకాశాను కల్పించలేదు. ఇంతవరకు అతను తన వ్యక్తిత్వాన్ని లంగరువేసి నిలబెట్టగలిగాడు.

అపును ! ఇప్పుడిప్పుడే అతనిజీవితంలోనికి మాయాదేవి నీలకంఠ తనంత తానే వచ్చింది. ఆమె స్పష్టమైన అభిప్రాయంకూడా అతను తెలుసుకున్నాడు. కాని, మాయాదేవి

చరిత్రయం దతనికి మొదటినుంచీ అయిష్టతగానేవుంది. అంటే ఆమె లౌకిక ఆచార, వ్యవహారదృష్ట్యా పతితురాలని కాదు. పాపకృత్యాలవిషయంలో అతని ఆలోచన ఎంతో ఉదారమైంది శరీరగుణధర్మాలే కాకుండా, మానవునిలో యింకొక గొప్ప శక్తివుంది. అదే ఆత్మ అని అతను వొప్పుకుంటాడు. ఎంతవరకు ఆ ఆత్మ పతనంచెందదో, అంతవరకు శరీరం భ్రష్టాచరణచేసినా అతన్ని పాపి అనలేము. కనీసం అది అతన్ని దోషిగా ఎంచదు. ఒకరివల్ల ఏదో తప్పుజరిగిందని వొప్పుకుందాం. ఐతే, తిరస్కరించి అవమానంచేసి, అతన్ని నిరాకరించవలసిందేనా ? దానికి సానుభూతి, స్నేహమే పని చేస్తుంది.

కాని, యీ స్నేహం, సానుభూతి పొందికూడా మాయాదేవి సంతుష్టిచెందే స్త్రీ కాదు. అశోక్ అంతర్యం లోని ఆత్మయం దామెకు ఆదరణవున్నా లేకపోయినా, అతని శరీరంమీదనే విపరీతమైన ఆకర్షణ ఆమెకు ఏర్పడింది. కేవలం మోహం, కోరికల ఆధారంగా సంబంధాలుపెట్టుకునేందుకు అశోకుని కెప్పుడూ యిష్టంలేదు. దీని నతడు అధఃపతనానికి చిహ్నమని భావిస్తాడు. అందువల్లనే అతడు మాయాదేవి అంటే ముఖం తిప్పుకోవాల్సివచ్చింది. ఆ త్రోవ తనబోటి వాడికి కాదని, అతని నిశ్చితాభిప్రాయం.

కాని, యీ మరియమ్ అతనిజీవితంలోకి ఒక అపూర్వమైన బాటలోంచి వస్తోంది. ఆమె అంతఃకరణ స్ఫటికంలా నిర్మలంగా వుంది. ఆమెభావాలు ఈశ్వరభక్తిలాంటి శుద్ధమైనవి. స్నేహం స్థితప్రజ్ఞలా నిర్హేతుకము, అనాసక్తమైనది.

ఆమె ఏదీ అడగదు. ఏదీ కోరదు. ఇవ్వడంలో, అర్పించడం లోనే ఆమెకు సుఖం దొరుకుతుంది. ఆమె ఎప్పుడూ అశోక్ శరీరాన్ని మోహింపచేయటకు ప్రయత్నించలేదు. ఆమె భాష ఆత్మలోని మూగభాష! క్షుధ వుంటే హృదయానిదే కాని శరీరానిది కాదు. అటువంటి విశుద్ధ గాఢ స్నేహప్రభావాన్నుంచి అతను ఎలా దూరంగావుండగలడు?

మనసుతో, తనువుతో మరియమ్ తనకు దగ్గరగా వచ్చింది. మనస్సునూ, హృదయాన్నీ ఎప్పుడో అశోక్ కర్పించి, నిశ్చింతురాలైంది. శరీరవిషయంలో ఆమెకు చింత లేదు, తగవూ లేదు. ఏకాంతంగా అశోక్‌ను కలుసుకోవడంలో ఆమెకు సంకోచమూ లేదు, భయమూ లేదు.

కాని, అశోక్? అశోక్ మనసు అల్లకల్లోలమై అతన్ని వ్యాకులపరుస్తోంది. మరియమ్‌ను రోజురోజుకూ ఆకర్షిస్తున్నాడు. ఒంపుసొంపులుతీరిన ఆమె కోమలశరీరంమీద మోజు కలుగుతోంది. ఆమెహృదయ స్వచ్ఛందత, నిజాయితీ, సంస్కారంకూడా అతన్ని ఆమెవేపు బలవంతంగా లాగుతున్నాయి. ఎంతకాలం అతను ఆమెను కాదనగలడు? ఈ స్వాభావికమైన ప్రవృత్తులకు విరుద్ధంగా అతని దుర్బలత్వము బుజువుకాదా?

ఇక యీవిషయం యిక్కడితోనే అంతంకాదు. ఆ తరువాతనే జవాబుదారీ మొదలవుతుంది. ఆ ఘోరమైన బాధ్యత తను ఎలా నిర్వర్తించగలడు? అతని పరమప్రియమైన జీవితోద్దేశ్యం, అతని సత్యం-శివం-సుందరం తాలూకు పరమానందమేమవుతుంది? అతని ఉన్నతమైన కోరికలేమవుతాయి?

కళ- స్త్రీ- ! ఈ రెంటినీ అత నెలా ఆరాధనచేయగలడు ? ఒకేఒరలో రెండుకత్తు లెలా వుంటాయి ? ఈ రెంటికీ చక్కని సమన్వయం కుదురుతుందని, మరియమ్ ఎన్నైనా చెప్పవచ్చు. ఒకవేళ ఎవరైనా చేయగలరేమో ! కాని, ఈ సమన్వయం అసాధ్యమైన ఆదర్శమని అతను భావించాడు. ఈ సాధన అతని వల్ల కాదు.

ఇటువంటి ఆలోచనలు అతని అనుమానాల్ని వృద్ధి చేస్తున్నాయి. అతని మనఃస్వాస్థ్యం విచలితమైపోయింది. ప్రస్తుతం అశోక్ మనసులో ఏమి చెలరేగుతోందో, ఆ విషయం మరియమ్‌కు తెలుసు కాని ఏమీ మాట్లాడ లేదు.

ఈవిధంగా మానసికవ్యథతో అశోక్ కాలం గడిచి పోతోంది. తర్కం, ఆలోచనా, భావనా, ఆత్మక్షుధా, శరీర దాహం, లక్ష్యనిష్ఠ, సుఖాసీనత, కళ, స్త్రీ అనే సమస్యలతో మథనపడుతూ, ఆ ముడిపడిన సమస్యను విప్పలేకపోతున్నాడు. ఈ తీగెమీద కసరత్తు ఎంతకాలం సాగుతుందో అతనికి స్పష్టంగా తెలియదు.

## 15

వెన్నెలరాత్రి నలువైపుల వ్యాపించింది. అర్ధరాత్రి శీతలపవనం చల్లగా, మెల్లగా వీస్తూ, నిద్రపోతున్న పల్లవుల్ని మేల్కొలిపి . మెల్లగా వూపుతోంది. బంగళా ఆవరణలో సన్నజాజులు విరబూసి పరిమళిస్తున్నవి. వాటిసువాసన ఆ వాతావరణంలో మత్తుగా కదులుతోంది. దూరంగా ఎక్కడో పాద్రీపురసరిహద్దున రెండుకుక్కలు, ఒకదాని తను

వాత ఒకటి మొరుగుతున్నది. గ్రామం, మిషన్ అంతా నిద్ర పోతోంది. ఎక్కడ ఎటువంటి జనసందడికూడా లేదు. అవును, కేవలం ప్రతాప్‌గఢ్ మాతాప్రసాద్ అను బ్రాహ్మణుని యింటిలో మద్దెలచప్పుడుతో భజన జరుగుతోంది. ఆ నిశీథ నిశ్శబ్దంలో కేవలం ఆ ధ్వనే వినిపిస్తోంది. ఎదురుగా సాత్పూరా నీలపర్వతాలు, వెన్నెలలో నిండుగా పరిశుభ్రప్రకాశమాన మైన పార్శ్వభూమిలో కాపలావానిలా నిలుచుని తునికిపాట్లు పడుతున్నాయి

ఆ రాత్రియందు ఆహ్లాదమూ, శాంతిభావాలను రేకెత్తించే శక్తివుంది.

ఇంతవరకూ అశోక్ ఎందుకో నిద్రించలేదు. అతను బంగళాలోని పెద్దగదిలో పడుకున్నాడు. అబ్దుల్లా ఆవరణకు కొంచందూరంలో నౌకరులుండే గదిలో పడుకుంటాడు. అశోక్ లైటువత్తి పెద్దదిచేసి ఒక నవల చదవడం మొదలు పెట్టాడు. అతికష్టంతో అరగంట చదివివుంటాడు. అతనిమనసు విసుగెత్తింది. తిరిగి వత్తితగ్గించి పడుకున్నాడు. సుమారు అర గంట అలాగే పడివున్నాడు. తిరిగి అటూయిటూ పొర్లి, తటాలున లేచి తలుపు తెరచుకునివచ్చి బంగళా వెనక వరండా లోని పడకకుర్చీలో కూర్చుని, ఎదురుగావున్న పర్వతమాలనీ, శుభ్రాకాశాన్నీ, వెదజల్లబడిన వెన్నెలను చూస్తున్నాడు. అక్కడంతా ఏకాంతంగా వుంది. ఆ దగ్గర్లోనే రావిచెట్టుక్రింద కొంచం చీకటిగావుంది. మనుష్యులు ఆలోచనల్లో మునిగి పోయినప్పుడు, యీ చీకటి, యీ ఏకాంతం ఎంతో బాగుం టాయి. అశోక్‌కుకూడా యిదే అనుభవమైంది.

అతనిభావాలు యీ నా డెందుకో చలించిపోతు న్నాయి. హృదయంలో ఏదో ఆశ్చర్యమైన స్పందన కలి గింది శరీరంలో మధురమైన చల్లదనం కలిగింది. మస్తిష్క మంతా చంచలంగా వుంది. ఆ ఆలోచనలే, కొన్నిరోజుల నుంచీ అతని మెదడులో మెదులుతున్న ఆ ద్వంద్వవిషయాలే తిరిగి పరుగెడుతున్నాయి.

ఎదురుగా రావిచెట్టునీడలో ఒక ఆకృతి మునికాళ్ళ మీద తనవేపు మెల్లమెల్లగా రావడం హఠాత్తుగా చూచి భయపడ్డాడు.

తదేకధ్యాసతో చూచి ఆశ్చర్యం చెందాడు. ఆ వ్యక్తి హరిణమ్...!

అతని నోటివెంట విస్మయంతో ఒక అస్పష్టశబ్దం వెలు వడింది.

"సమయంకానిసమయంలో యిక్కడికి వచ్చావేం హరిణమ్?" మెల్లగా అడిగాడు.

"ఏమిచేయమంటారు? నాకు నిద్రే రావడంలేదు. అసలు కొన్నిరాత్రులనుంచీ నాకు నిద్రపట్టడంలేదు. అయినా, నేడెంతో వ్యాకులంగావుంది. నేను నా గదికిటికీలోంచి మీ గదివేపు ఎప్పుడూ చూస్తుంటాను. అక్కడనుంచి అంతా కనుపిస్తుంది. మీకుకూడా యివ్వాళ నిద్రపట్టనట్లుందే! మీరు లైటు పెద్దదిచేయడం, తగ్గించడం, నిద్రపోవడానికి ప్రయత్నించటం, తిరిగి లేవడం, తలుపు తెరుచుకుని బయటికి రావడం నేను చూశాను. ఇవ్వాళ మీ మనసుకూడా బావుండలేదని గ్రహించాను."

"ఊ" కేవలం యీమాత్రం అన్నాడు.

మరియమ్ తిన్నగా వచ్చి పడకకుర్చీచేతిమీద కూర్చుంది.

ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"ఎంత మనోహరమైన సమయం! ఆ రావిచెట్టూ, అర్ధనిద్రలోవున్న పర్వతాలూ, చంద్రుని చల్లనికిరణాలు, సన్నజాజుల పరిమళం, పొగడ, పత్తిలాంటి మేఘాలతో భూషితమైన నీలాకాశం, సుదూరంలో మందంగా మిణుకు మిణుకుమంటున్న తారలు - సంపూర్ణ ఆత్మ స్పందితమైపోయి నట్లనిపిస్తోంది."

"అవునండీ! హృదయంకూడానా?" మరియమ్ అన్నది.

అశోక్ ఆశ్చర్యంతో మరియమ్‌వేపు చూచాడు. ఆమె విశాలనేత్రాలు, ఆ ఛాయా ప్రకాశంలోకూడా అద్భుత మైన వెలుగుతో మెరిశాయి. కోమలమైన మరియమ్‌శరీరం తేలికగా వణకడంకూడా గ్రహించాడు. ఆమె అవయవాల్లో రక్తవాహిని పరవళ్ళుత్రొక్కింది.

అతను తన కుడిచేత్తో మరియమ్ నడుమును చుట్టి దగ్గరగా లాక్కున్నాడు. మరియమ్ తన యెడమచేతిని, అశోక్ యెడమభుజంమీద వేసి, కుడిచేత్తో అతని వొత్తుగావున్న జుత్తును సవరిస్తోంది.

"ఇటువంటి సమయంలో నువ్విక్కడకు రాకూడదు మరియమ్." అశోక్ అన్నాడు. కాని, ఆ గొంతులో కొంచం తొట్రుపాటు కనుపించింది.

"ఎందుకని ?"

"నేను...నన్ను దగవద్దు"

"ఐతే నేనంటే మీకు భయమా ?"

"లేదు. నన్ను చూచి నేనే భయపడతాను."

"ఊహు - మీరు వసారాలోనికిరావడం చూసి, నేనూ మెదలకుండా వచ్చేశాను. నా కెంతో ఒంటరితనమనిపించింది."

"ఒంటరితనమా...?" సన్నగా గొణిగాడు.

"అశోక్ బాబూ......" భయపడుతూ మరియమ్ పిల్చింది.

అశోక్ మడతకుర్చీలోంచి లేచాడు. మరియమ్‌కూడా లేచి నిల్చుంది. ఇద్దరూ ఎదురుబొదురు నిల్చున్నారు.

"అశోక్ బాబూ !" కంపిస్తున్నస్వరంతో మరియమ్ తిరిగి పిలిచి-"మీ రెందుకు అర్థంచేసుకోలేరు...ఎందుకు...?" అన్నది.

ఒక్క-క్షణం సందేహించాడు. ఆతరువాత మరియమ్‌ను తనబాహువుల్లోకి తీసుకుని గట్టిగా పొదవిపట్టుకున్నాడు.

మరియమ్ తన అర్థనిమీలితనేత్రాల్ని మూసుకుంది. ఈ ఆనందమయక్షణాల సర్వసంచితసుఖాన్ని అనుభవించేందుకు ఆమె సర్వేంద్రియాలు తన్మయమైనవి.

ఆమెకు మధురమైన గ్లాని కలిగింది. ఆమె మనసు, శరీరం, హృదయం - ఒక అభూతపూర్వకమైన ద్రవపదార్థ రూపంలో ప్రవహించాయి. ఆమె చైతన్యరహితమయింది.

అశోక్ శరీరంలోకూడా విద్యుత్ప్రవాహం సంచారం చేసినట్లనిపించింది. అతని ప్రతిరోమమూ గగుర్పొడిచింది. ఈ అనుభవ మతనికి అపూర్వమైనది.

మరియమ్ స్వప్నావస్థలో చెపుతున్నట్లుగా అన్నది. "అశోక్ బాబూ! ఈ అందమైన రాత్రి మనయిద్దరికోసమే!"

అశోక్ ఏమీ మాట్లాడలేదు.

ఈ తన్మయస్థితిలో వారెంతసేపు వున్నారో తెలియదు. వారి యీ అనుపమ ప్రణయానుభూతికి సాక్ష్యంగా ఏ మానవుడూ లేడు. సాక్ష్యం ఆ రావిచెట్టూ, సాత్పూరా నీలపర్వతాలూ, త్రయోదశినాటి చంద్రుడూ, అనాసక్తదృష్టితో నిత్యం చూస్తుండే సనాతన తారలు మాత్రమే.

మరియమ్ చేసిన యీ అశేషమైన ఆత్మసమర్పణ శకుంతల దుష్యంతునికి చేసిన సమర్పణను గుర్తుకు తెస్తోంది. శకుంతల దుష్యంతుణ్ని వరమడిగింది కాని, మరియమ్ అశోక్‌నూ ఏమీ అడగలేదు. కోరకముందే, అంతా అర్పించడంలోనే ఆమెజీవితప్రకటన యిమిడివున్నట్లుంది.

మరియమ్ తనగదికి వచ్చేసరికి, మద్దెలధ్వని ఆగిపోయింది. కాని, ఒక కుక్క యింకా గట్టిగా ఏడుస్తుండడం వినిపిస్తోనేవుంది. గాలిచలనం ఆగిపోయింది. ఆ పాతరావిచెట్టు తనకొమ్మలతోసహా స్థిరంగా నిశ్చలంగా నిలబడివుంది.

* * *

ఆమరునాడు అశోక్ ఆలస్యంగా లేచేసరికి, కొన్నిసంవత్సరాలనుంచి మధురమైన స్వప్నంకన్నవాడిలా వున్నాడు.

అబ్దుల్లా, అతనిమంచానికి దగ్గరగా 'టీ' ట్రే వుంచి సామాను కోసం జోసెఫ్ కాకాదుకాణానికి వెళ్ళాడు. అశోక్ టీ త్రాగి తిరిగి మంచంమీద పడుకుని, రాత్రి జరిగిన సుఖస్వప్నాన్ని కళ్ళుమూసుకుని మనసులోనే నెమరువేస్తున్నాడు.

ఇంతలో మరియమ్ గులాబీపూలగుత్తి పట్టుకుని, కూని రాగంతీస్తూ లోపలికివచ్చి, అశోక్ మంచంమీద కూర్చుంది. ఆ పూలగుత్తిని అశోక్ చేతుల్లో వుంచింది. అశోక్ తన అల సినకళ్ళతో, ఆమెను చూస్తూ స్నేహపూర్వకంగా - "ఐతే... ఐతే అది నిజమేనా...?" అని అడిగాడు.

మరియమ్ జవాబేమీ చెప్పలేదు. అటూయిటూ పరికాయించిచూచి, తటాలున వంగి అశోక్ నొసలు ముద్దు పెట్టుకుంది.

"ఐతే అది నిజమేనన్నమాట...!" అశోక్ వేడి నిట్టూర్పు విడిచాడు.

"అంటే-అది నిజంకాదనుకున్నారా? మీరు నన్ను కోరుతున్నారని నే నెరుగుదును. మరి నేనో...? ఓహో! ఏమైపోయినాసరే, నే నీ పుణ్యపర్వాన్ని ఎప్పుడూ మర్చిపోను. దాని కెప్పుడూ పశ్చాత్తాపం చెందను."

"నిజమేనా?"

"నిజం. మీరు కనుపించకపూర్వం నేను జీవితంలో నిజమైన ఆనందాన్ని ఎరుగను. ఇప్పుడా దివ్యానుభూతి పొందినట్లయింది. పురుషుడు స్త్రీకోసం, స్త్రీ పురుషునికోసమనేది పరమసత్యం అశోక్ బాబూ! వీరిద్దరూ సంయోగంచెందనిదే

జీవితం పరిపూర్ణత చెందదు. ఐతే, యిప్పుడు నన్ను మీ మనసు లోంచి మరుగుపరచగలరా?''

అశోక్ ఏమీ మాట్లాడలేదు. మరియమ్ స్వయంగా తన ఉల్లాసంలో తను నిమగ్నమైంది. ఆమె జవాబుకోసం ఆశించలేదు. అసలు జవాబురా లేదనే ధ్యాసే లేదు.

తనజీవితం, అద్భుతమైన రసాయనాల ప్రతాపంతో, ఎంతో అందంగా, ఎంతో ప్రతిభావంతంగా మంగళమయమై పోయిందని తలచింది. ఇంత పరమసుఖం, తనజీవితంలో ప్రాప్తిస్తుందని, ఆమె వూహించలేదు. నేడు దొరికిన నిధితో ఆమె అఖిలప్రపంచానికి సామ్రాజ్ఞి అయినట్లు భావించింది. శరీరంలో క్రొత్త సంవేదనా, మనసులో నవీన ఆలోచనలూ, హృదయంలో నూతన స్పందనా, తన సంపూర్ణజీవితంలో నవ జీవితం, నవచైతన్యమే సంచారంచేసినట్లు భావించింది.

ఆమె అంతరాళంలో, ఒక దివ్యజ్యోతి వెలిగింది. ఆ పావనమైన ప్రకాశంలో ప్రపంచమంతా కనిపిస్తోంది. దాని వెలుగు ఆమెకు కేవలం చుట్టుప్రక్కల స్త్రీ-పురుషులు, పిట్టల మీదనే కాక ఫలాలూ, పూలూ, వృక్షాలూ, గడ్డిపరకలు, రాళ్ళూ, పర్వతాలమీదకూడా కనపడుతోంది. సృష్టంతా యీ దివ్య ఆలోకనంతో తళుక్కున మెరిసినట్లనిపించింది.

హఠాత్తుగా ఆమెకు కళ, కవిత్వం, సంగీతంమీద అపూర్వమైన ఆసక్తి గలిగింది. ఉష, సంధ్య, పగలు, రాత్రీ అన్నీ నూతన సౌందర్యంతో కనుపించాయి. చంద్రకిరణాలలో ఆమెకు మధురమైన చైతన్యం కనుపించింది. తారకల్లో ఆమె అక్షరాలు చూడగలిగింది. పుష్పాల్లోని మూగభాష సంకేతం

వినిపించేది. గాలి పాటగా వినిపించేది. ఏదైనా పిట్ట పాడి నప్పుడు, దానికూజితం ఆమె ఆత్మనూ, హృదయాన్నీ తాకినట్లు భావించేది. ఆకాశంమీంది రంగు రంగుల మబ్బుల్లో ముఖాలు కనుపించేవి. చెఱువులోని నీటిలో మధురమైన ప్రతిబింబాలు కనుపించేవి. వనంలోని వృక్షాలూ, లతలూ, పల్లవులూ, ప్రసూనాలు తన హృదయ రహస్యాన్ని తెలుసుకున్నా యేమోనని, వాటివేపు సంకోచంగా చూచేది. వాటికి అభి వాదంకూడా చేసేది. వాటి క్షేమసమాచారాల్ని విచా రించేది. కాళ్లు కడుక్కుంటూ, సెలయేటిలో తన మనసు లోని విషయాన్ని విప్పి యేకరువుపెట్టేది ప్రకృతి ఏకాం తంలోకూడా, ఆమె యిప్పుడు ఒంటరిది కాదు.

ఆమె కిప్పుడు అశోక్ ఒక పురుషుడుకాడు దేవదూత. సాకారమైన దేవదూతకూడా కాడు. నిరాకార దైవ మయ్యాడు. అతన్ని మనుష్యులతో పోల్చలేదు. ఆయన వారందరికన్నా ఉన్నతమైనవాడు. అందర్నీ మించినవాడు. అందరికీ భిన్నమైనవాడు. అతన్ని పోల్చాలంటే, వసంతంలోని ప్రభాతంతోనో, స్వర్ణమయమైన సంధ్యతోనో, నిర్మలమైన యింద్రధనుస్సుతోనో, కోయిలపాటతోనో పోల్చవలసిందే.

అతని బంగళా కిటికీలో భగవంతుని మూర్తి కని పిస్తోంది. అతనిగదివేపునుంచి వచ్చే గాలితెర, మలయానిల యంలా మధురంగా వుంటుంది. అతని కిటికీలోంచి వచ్చే లైటు వెలుతురు కిరణాలు బాలసూర్యకిరణాలకన్నా ఎక్కువ ఆహ్లాదకరంగానూ, ప్రాణదాయకంగానూ వుంటున్నవి. అతని వాణిలో స్వర్గీయ ఆనందం వుంది. దృష్టిలో విశ్వసౌందర్యం

వుంది. అతని స్పర్శలో పరశువేదిలా బంగారంచేయగల శక్తి వుంది.

ప్రపంచంలో ఎక్కడ చూచినా మరియమ్‌కి ఆనందమే కనిపిస్తోంది. ఏడవడానికి కారణమేముంది? దుఃఖించడానికేముంది? అబ్దుల్లా ఆమెకు తండ్రిలా కనిపించాడు. మిస్ థామస్ స్వభావంకూడా ఆమెయందు ఉదారంగా కనుపించింది. జోసెఫ్ కాకా తనను 'అమ్మా' అని పిలవడం ఆమెకెంతో సుఖమనిపిస్తుంది. జడచేతనమైన సమస్త సృష్టి స్థితి మారినట్లనిపించింది. ఇది స్వర్గంకాకుంటే మరేమిటి?

# 16

మరియమ్ విమలానందం అశోక్‌కికూడా సంక్రమించింది. అతని జీవితంలో అంతకుముందెన్నడూ కలగనట్లు మనోదశకూడా ఉల్లాసంతో నిండిపోయింది.

ఈ సంతోషావస్థలో, అతని మనసు నాలుగైదు అందమైన చిత్రాల్ని వ్రాయించింది. మూడు ప్రకృతి దృశ్యాల కళాకృతులు, 'తపతి', 'ఉష', 'వనశ్రీ' లాంటివి వెలువడినయ్. మొదటిది సాత్పురాపుత్రికరూపంలో భారతదేశానికి నైసర్గికసంపదను వొనగూర్చిపెట్టే పావనసలిలధార. రెండోది: పర్వతాలవెనుకనుంచి ఉదయించే అంశుమాలి వివిధ రంగుల మనోహర చిత్రం. మూడోది: ప్రకృతిదేవి అనుపమ సౌందర్యం—దాని వివిధవర్ణ విలాస అనుపమ ప్రతిబింబం.

అశోక్ చిత్రించిన రెండు భావచిత్రాలు, అతని కరుణామయ సంస్కారహృదయానికి ప్రతిబింబాల్లాంటివి. వాటిలో అతను తనకళయొక్క పవిత్రసందేశాన్ని ప్రపంచానికి అందించాడు.

ఒకచిత్రానికి 'కంకాళం' అని నామకరణంచేశాడు. అందులో ఒక బీదరైతు కుటుంబాన్ని చిత్రించాడు. పాడు పడిన ఒక గడ్డికొంపలో ఒకరైతూ, అతనిభార్య, యిద్దరు పిల్లలు కూర్చునివున్నారు. రైతువొంటిమీద ఒక చిన్న అంగ వస్త్రంతప్ప యింకేమీ లేదు. జుట్టు బాగా పెరిగిపోయి, తైల సంపర్కంలేదు. విచారకారణంగా ముఖమంతా ముడతలుపడి వుంది. బుగ్గలు లోపలికి పీక్కుపోయినవి. కళ్ళలో శూన్యత్వం తొణికిసలాడుతోంది. అతనిభార్యకూడా కేవలం తనమానాన్ని కాపాడుకునేందుకు, చినుగుల పాతగుడ్డ మొలకు చుట్టు కుంది. స్తనాలుకూడా బయటికి కనిపిస్తున్నయ్. ఎడమ స్తనానికి పిల్లవాడ్ని అంటించుకుని పాలుపడుతోంది. కాని పాలు లేని కారణంగా, బిడ్డ వెక్కెక్కి ఏడుస్తోంది. రెండో పిల్లవాడు సంపూర్ణంగా నగ్నంగా వున్నాడు. వాడి శరీరంలోని ఎముకల్ని సునాయాసంగా లెక్కించవచ్చు. తల్లిదండ్రుల శరీరాల్లోని ఎముకలు బయటికి పొడుచుకువచ్చాయి. ఆ దగ్గర్లో రెండుకుండలూ, అయిదారు చిన్నచిన్న మట్టిపాత్రలు వున్నాయి. వాటిలో ఎక్కువగా పగిలిపోయినవే ఉన్నాయి. మన అభాగ్యదేశంలోని దరిద్రుల సజీవచిత్ర మిది. మానవత్వం తాలూకు హృదయవిదారక ఆక్రందన దానిలోంచి వుట్టిపడు

తోంది. అది చూస్తుంటే, అతిప్రయత్నంమీద కళ్ళనీళ్ళు ఆపుకోవలసివస్తుంది.

రెండో చిత్రం: 'కరుణామూర్తి' జోసెఫ్ కాకాచిత్రమది. జోసెఫ్ కాకా 105 డిగ్రీల మలేరియాజ్వరంతో పడున్నాడు. మరియమ్ తన మనసంతా కేంద్రీకరించి అతనికి పరిచర్య చేస్తోంది. జోసెఫ్ కాకా పక్కమీద, పెద్ద తలగడదిండు పెట్టుకుని, చినిగినదుప్పటి కప్పుకుని పడివున్నాడు. జ్వరంవేడికి అసలే జీర్ణించిపోయిన అతనిముఖం, మరింత ఎండిపోయింది. గడ్డంకూడా చిందరవందరగా వుంది. మరియమ్ ఎడమచేత్తో అతన్ని లేవదీసి పట్టుకుని, కుడిచేతితో పగిలిన కప్పులోని మందును త్రాగిస్తోంది. జోసెఫ్ కాకాముఖంమీద విశేషించి అతనికళ్ళలో, కృతజ్ఞత, స్నేహం, సౌమ్యమైన దీప్తి వ్యక్తమౌతున్నాయి. మరియమ్‌కళ్ళలో సేవ, ఆత్మీయత, ప్రేమ, కరుణ, సానుభూతిభావాల మధురమిశ్రమము ప్రతిబింబిస్తోంది. సమస్త స్త్రీజాతికీ, అనాదికాలంగా వస్తున్న సేవాభావం, ఆమె సాత్వికమైనకళ్ళల్లో అంకితమైవుంది. ఈ సమయంలో మరియమ్ ఒకవ్యక్తి కాదు. సమస్తప్రపంచానికి పరిచారిక. ఆమెముఖంలోని పావనకాంతి చూస్తుంటే ప్రపంచంలోని ఒక సాధారణస్త్రీ కాదనీ, తన నారీత్వమనే దివ్యకర్తవ్యంలో సంలగ్నమైన స్వర్గలోకదేవత అనిపిస్తోంది. ఈచిత్రంలో అశోక్ తన కళనంతా ధారపోసినమాట నిజమే! అందులో జోసెఫ్ కాకా, మరియమ్ వ్యక్తివిశేషంకాదనీ, మానవజాతిలో రెండు వుదాత్తప్రవృత్తుల ప్రతినిధుల స్వరూపాలను చిత్రించి

ఆ యిద్దరూ శాశ్వతమైన సనాతనులనీ నిరూపించాడు. ఈభావంతో ఆ చిత్రం అమరమైపోయింది.

ఈవిధంగా కళానిర్మాణంలోనూ, ప్రణయానుభూతితో పొంగిన ఆనందంలోనూ అశోక్, మరియమ్ల రోజులు గడిచి పోతున్నాయి. ప్రొద్దుపొడిచేదీ, అస్తమించేదీ చీకటిపడేదీ ఎవరికీ తెలియడంలేదు. జీవితం ఒక బంగారు మనోహర స్వప్నం.

తన యజమాని, మరియమ్ల ఆనందంచూచి అబ్దుల్లా ఎంతో సంతోషించాడు. తనమనసులో కొన్ని సంవత్సరాల నుంచీ చేస్తున్న తపస్సు ఫలించే సూచన కనిపిస్తోంది.

అశోక్ తనభావాలతో పోట్లాడటం మానుకుని తనను తాను నిండు ప్రవాహంలో వదిలిపెట్టుకున్నాడు. దాని పర్యవసానం ఏమవుతుందో. అతని బాధ్యత ఎక్కడ మొదలై ఎక్కడ ఆఖరవుతుందోననే ప్రశ్నలు అప్పుడప్పుడూ మనసులో మెదిలి వ్యాకులపరచేవి. కాని వాటికి సముచితమైన జవాబు చెప్పే సామర్థ్యం యిప్పుడతనిలో లేదు. ఎందుకంటే అతని మస్తిష్కమూ, వివేకమూ యీ సమయంలో అంత తీక్షణంగా, అంత చురుకుగా పనిచేయటంలేదు. భావాల తుఫాను ఆవేగంతో తనలో తను బలహీనత పొందుతున్నాడు.

స్త్రీ-పురుషుల యీ స్వర్గీయ కలయకే, అన్ని ధర్మ-కర్మల ఆనందాలకు మూలమని మరియమ్ అభిప్రాయం. అందువల్ల స్త్రీ-పురుషుల జీవితానికిదే స్వాభావిక అనివార్య ఫలశ్రుతియని అతని కప్పుడప్పుడూ అనిపించేది. కాని, తిరిగి అతని కళపైని ఏకాగ్రభక్తి మేలుకునేది. తను లక్ష్యభ్రష్టుడ

నవుతున్నా ననుకునేవాడు. అప్పు డతనిహృదయంలో దుఃఖం, అశాంతి వ్యాపించేవి.

ఇంత జరిగాకకూడా అశోక్ హృదయంలో ద్వంద్వం వున్నది. అది చూచి మరియమ్ ఉదాసీనమయ్యేది. కాని, ఆమె వ్యర్థంగా ఒకరిమీద తన భారం మోపి వారికి బాధ కలిగించే స్వభావం కలదికాదు. అందువల్ల ఆమె ఆఖరినిర్ణయం తాలూకు బరువుభారాలన్నీ అశోక్ కే విడిచిపెట్టింది.

ఒకనాటి ఉదయం షికారు వెళ్ళివచ్చేసరికి బైతూలు పోస్టుజవాను టెలిగ్రాంకవరు పట్టుకుని నిలుచున్నాడు. ఫాద్రీపురంలో టెలిగ్రాఫ్ ఆఫీసు లేదు. అబ్దుల్లా టెలిగ్రాం పుచ్చుకుని అతణ్ణి పంపించివేద్దామనుకున్నాడు. కాని వాడు బాబుగారినుంచి బహుమానం పుచ్చుకోనిదే తిరిగివెళ్ళడానికి యిష్టపడలేదు. ప్రతి టెలిగ్రాం సంతోషవార్తలనే మోసుకొస్తుందని వాని అభిప్రాయం.

అశోక్ షికారునుంచి రావడం చూచి, ఆ టెలిగ్రాం ఏమిటో చూద్దామని మరియమ్ పనివదిలిపెట్టి వచ్చింది. అసలు టెలిగ్రాంపేరు వినగానే ఆమెకు భయంవేసింది.

అశోక్ కవరు చించాడు. నాలుగుపేజీల వుత్తర మది. వచ్చేనెల యిరవయ్యోతారీఖున యువరాజుగారి వివాహం వైభవంగా చేయబోతున్నట్లు సారంగపూరు మహారాజుగారి ప్రయివేటు సెక్రటరీ రాశాడు. అందులో "అన్నిప్రక్కలనుంచి, రాజులు, మహారాజులు వస్తారు. ఆ సమయంలో సారంగపూరు మహారాజు తన కుటుంబంలోనివారందరి తైలవర్ణచిత్రాలు వ్రాయించాలనుకున్నారు. అందువల్ల, అశోక్

ఠాకూరును వెంటనే, ఒక్క నెలరోజులు వుండే ఏర్పాటుతో రావల్సిం"దని వ్రాశారు. కారుకూడా స్టేషనుకు పంపుతామని, ఎప్పుడు బయలుదేరేది, యీ టెలిగ్రాం అందగానే తెలియ చేయమని వుంది. గతవారం మహారాజుగారు నాగపూరు వెళ్లినప్పుడు, అశోక్‌ను కలుసుకుందామనుకున్నారు. కాని, అతను ఫాద్రీపురం వెళ్ళిపోయినట్లు తెలిసింది.

ఇంత పెద్ద వుత్తరాన్ని టెలిగ్రాంరూపంలో పంపవలసిన అవుసరమేమిటోనని అశోక్ ఆశ్చర్యం చెందాడు. ఇదంతా భారతదేశ రాజులు మహారాజుల ఆవేశమనుకున్నాడు. పట్టణం నుంచి సోడావాటరు పెట్టెల్ని తీసుకునిరావడానికి టెలిగ్రాంతోపాటు మనిషినికూడా పంపుతారు. అలాగే యీమారు ఆర్టిస్టునుకూడా పిలిపించవలసివచ్చింది.

"వెళ్ళవలసిందేనా ?" మరియమ్ వ్యాకులపాటుతో అడిగింది.

"అవును, వెళ్ళవలసిందే! మహారాజుగారు నా కాతాదారు."

మరియమ్‌ముఖం నల్లబడింది.

"ఎప్పుడు బయలుదేరుతారు.?"

"మూడురోజులకు లోపుగా బయలుదేరలేను. అందుకా వలసిన ఏర్పాట్లుచేయాలి."

అబ్దుల్లాను నాగపూరు పంపించి, బ్యాంకులోంచి కొంత పైకం తెప్పించాడు. ఆ తరువాత మిగిలిన ఏర్పాట్లు చేసుకుంటున్నాడు. టెలిగ్రాంచూచినప్పటినుంచీ మరియమ్ అచేతను

రాలైది. ఆమెముఖం ఉదాసీనమైంది. ఏ పనిలోనూ ఆమెకు మనసుకుదరడం లేదు.

ఆ సాయంకాలం యిద్దరూ పర్వతంమీద కూర్చున్నప్పుడు మరియమ్ చెప్పింది, "గత మూడునాలుగువారాలు, ఒక మనోహరమైన స్వప్నంలా గడచిపోయాయి. తిరిగి ఎప్పుడు కలుసుకుంటామో చెప్పలేను." ఆమె అప్రయత్నంగా ఒక నిట్టూర్పు విడిచింది.

తనజీవితంలో గొప్ప సుఖదాయకమైన కాలఖండం యిప్పుడు ఆఖరవుతున్నందుకు అశోక్‌కుకూడా విచారంగానే వుంది. అతనుకూడా పరితపించాడు. కేవలం "ఊఁ" అని వూరుకున్నాడు.

మృత్యుదండన లభించినట్లనిపించింది మరియమ్‌కు! ఈ ఒక్క స్వల్ప అస్పష్టశబ్దంతో, అశోక్ తనను వెంటబెట్టుకుని వెళ్ళడని తేలిపోయింది. ఆమె పాలిపోయిన ముఖం యీ జవాబు విని మరీ శుష్కించిపోయింది.

"మీ జీవితలక్ష్యం- కళఅని నే నెరుగుదును అశోక్ బాబూ! మిగిలినవన్నీ అప్రధానమైనవనికూడా ఎరుగుదును. మీరు దానిలోనే ప్రావీణ్యం సంపాదించండి! పేరుగడించండి! అందుకు నేనూ సంతోషిస్తాను. కాను...నేను దుఃఖించను. నా మనసును సమాధానపరుచుకుంటాను. ఈ నెలలోనే నా సుఖం పరాకాష్ఠనందుకుంది. దాని మంగళమయ స్మృతే ఇక నాకు అన్నిటినీమించిన సుఖం"

మరియమ్‌మాటలకు అశోక్ హృదయం బాధపడింది. మరియమ్‌విషయంలో తనబాధ్యత యేమిటో, నేడుకూడా అతనికి తెలియదు. వివాహవ్యవస్థవిషయంలో ముందున్నట్టి ఉదాశీనతే యిప్పుడుకూడా వుంది. ఇవ్వాళ మరియమ్ తనను ప్రేమిస్తోంది. రేపు తప్పకుండా ఆ ప్రేమకు పరితృప్తికలుగుతుంది. తరువాత దానిమీద విసుగుపుడుతుంది. ఆపైన అభిప్రాయభేధాలు వస్తాయి. అసహ్యంపుడుతుంది. జీవితమంతా వ్యర్థమవుతుంది. అటువంటి అపాయాన్ని తెచ్చుకున్నందువల్ల లాభమేమిటి? నేడతనిమనసులో గొప్ప గొప్ప కోరికలున్నవి. ప్రపంచఆర్టుగ్యాలరీలో భారతదేశ కళా-సంస్కృతిని గొప్పదిగా నిరూపించడమే అతని ముఖ్యోద్దేశ్యం. తన బానిసత్వ దౌర్భాగ్యంతరువాతకూడా, యీ ముసలిదేశం బ్రతికివుందని, ప్రతిభావంతంగా బ్రతికివుందని చాటించాలనుకున్నాడు. స్త్రీ మోహంలోపడి, యీ అత్యున్నతమైన ఆదర్శశిఖరాన్ని ఎలా అందుకోగలడు?

కాని, అప్పుడప్పుడు తనలో ఎవరో-'తప్పుచేయడం లేదుకదా? ఈ సరళ స్నేహమైన బాలికను ప్రపంచంలో తిరిగి వొంటరిగా వదలిపెడుతున్నావు. ఐతే, అది స్వార్థం, పిరికితనంకాదా?' అన్నట్లనిపించేది.

"నీవల్ల నాకు ప్రాప్తించినసుఖం ఎంతో అపూర్వమైనది మరియమ్! అందుకు నేను సదా కృతజ్ఞుణ్ణి. కాని, మానవుని జీవితంలో ఒక ఉదాత్తమైన లక్ష్యంవుంటుంది. దానిపిలుపును అతను వినిపించుకోకుండా వుండలేడు. ఆ తరువాత అతనొక దుఃఖప్రదమైన నిర్ణయం చేయవలసేవుంటుంది."

"మానవులకు కాదు....పురుషుల కనండి. పురుషులకు ప్రేమే గొప్పదికాదు. అంతకన్నా ఆత్మను ఆశ్చర్యవంతంగా చేసివేసే లక్ష్యం యింకొకటుంది. దానినుంచి అతను ముఖం తిప్పుకోలేడు. అదే అతని జీవితయంత్రం. ఈసంగతి నే నెరుగుదునా అశోక్ బాబూ! అందువల్లనే నేను మీ దారికి అడ్డు రాదలుచుకోలేదు. బహుశా మీ కీ ముప్పదిరోజుల కొద్దికాలం విలువైనది కాకపోవచ్చు. కాని, నాకు యీ ముప్పదిరోజులే అమూల్యమైనవనీ, వాటి స్మృతే నా జీవితంలో అన్నిటికీ మించిన సంపదని మీ రెప్పుడైనా గ్రహించగలరా?"

అశోక్ తలొంచుకుని ఉద్విగ్నుడై యిదంతా వింటున్నాడు. మరియమ్ చెపుతున్న స్త్రీ-పురుషుల జీవిత చరమ తత్వాన్నిగురించి పూర్తిగా ఆకళింపుచేసుకున్నాడో, లేదో తెలియదు. ఈ సమయంలో అతనిమనసులో రేగుతున్న ఆలోచనలు ప్రణయానికి సంబంధించినవి కావు. భవిష్యత్తులోని మహత్తరమైన కోరికలు...! కొంచంసేపూరుకుని అడిగాడు "ఇక నువ్వేమి చేస్తావు మరియమ్?...ఇక్కడే వుంటావా? ఎక్కడవున్నా సరే. భిక్షుణీదీక్ష పుచ్చుకోవద్దు. అదే నేను నిన్ను వినయంగా కోరుతున్నాను."

"నేనా...? నే నేమిచేస్తానో నాకే తెలియదు. జీవితప్రవాహం ఎటు లాక్కునివెడితే అటు వెళ్ళవలసిందే. నే నీ ప్రపంచంలోనికి వొంటరిగా వచ్చాను. ఇంతవరకు వొంటరిగానే వున్నాను. ఏదో ఒకనాడు వొంటరిగానే యీ ప్రపంచంనుంచే ఎగిరిపోతాను. నాజీవితమెంత?...నీటిబుడగ

లాంటిది. ఎప్పుడు పుడుతుందో, ఎప్పుడు పోతుందో దానితో ప్రపంచానికేం పనుంది ?" ఆమె కళ్ళు విషాదంతో నిండిపోయి, కొన్ని అశ్రుబిందువులు జారిపడినవి కూడా !

"అలా అనకు మరియమ్" ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుని మృదువుగా వొత్తుతూ-"నన్ను నీ స్నేహితుడని అనుకోవా ? నువ్వు అవసరమైతే నాకు ఉత్తరం వ్రాయి! నేను వెంటనే నీకు సహాయపడడానికి పరుగెత్తుకుని వస్తాను. ఈవిధంగా నిన్ను నిండుసముద్రంలో వొంటరిగా వదిలి వెడతానా ?" అన్నాడు.

"ఊఁ..." అని మాత్రం మరియమ్ అన్నది. కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయి. అశోక్ ప్రేమతో ఆమెను దగ్గరకు లాక్కుని, తనరుమాలుతో ఆమెకన్నీళ్ళు తుడుస్తున్నాడు.

"ఇక నా కన్నీళ్ళెవ రీవిధంగా తుడుస్తారు ? ఇక నేను వొంటరిదాన్ని. నా ఆక్రందన ఏకాంతమైనది" ఆమె ఏడ్పు కట్టలు తెగింది. అశోక్ వొడిలో తల దాచుకుని వెక్కి-వెక్కి ఏడుస్తోంది. అశోక్ ఆమెజుట్టును మమతతో మెల్లగా సవరిస్తున్నాడు. అతనిహృదయం విదీర్ణమైనట్లనిపించింది. తను నిజంగా భయంకరమైన తప్పుచేయడం లేదుకదా ?

ఆమె విచారంతగ్గాక, కళ్ళుతుడుచుకుని, సరిగ్గా లేచి కూర్చుని అన్నది-"చాలు. ఇక నేను ఏడవను. నన్ను క్షమించండి ! నన్ను నేను ఆపుకోలేకపోయాను. కేవలం, మీ యీ రుమాలును నా కివ్వండి ! ఇంకా మూడురోజులు మిగిలి వున్నాయి. మనం వాటికి ఎందుకు బాధకలిగించాలి ? ఒకవేళ

మనం వాటినికూడా సుఖానందాలతో పరిపూర్ణంచేసినట్లయితే బావుంటుంది."

మూడురోజుల నిర్మలానందం! అపార అనుపమసుఖం! ఆ తరువాత వీడ్కోలుఘడియలు.

మరియమ్, జోసెఫ్ కాకాలవద్ద సెలవుపుచ్చుకుని, అబ్దుల్లా ముందే సామానంతా లారీమీద ఎక్కించి బైతూల్ వెళ్ళిపోయాడు. అక్కడ యింకా, వెన్న, చిల్లర వస్తువులు కొనవలసి వుంది. అక్కడనుంచే అశోక్ అతన్ని కారులో తీసుకుని వెడతాడు.

మరియమ్ అశోక్‌కు బంగళాలోనే వీడ్కోలుచెప్పననీ ఒకమైలుదూరంలో వంతెనసమీపాన తానతనికోసం నిరీక్షిస్తుంటాననీ, అక్కడినుంచే వీడ్కోలిస్తాననీ చెప్పింది.

అశోక్ మిస్ థామస్, జోసెఫ్ కాకా, యింకా యితర పరిచితులను కలుసుకుని బయలుదేరడానికి సిద్ధమయాడు. బడిపిల్లలకు మిఠాయికోసం పదిరూపాయలు దొరసానిగారికిచ్చి, మిగిలిన తన నౌకర్లందరికీ, యథోచితంగా బహుమానాలు పంచిపెట్టి, లేచినిల్చుని ఫాద్రీపుర బంగళాను, ఆ చుట్టుప్రక్కల దృశ్యాలను ఆఖరిసారిగా చూచి కారును ముందుకు సాగనిచ్చాడు. ఆ అందమైన వాతావరణాన్ని విడిచి పెడుతున్నందు కతనికి దుఃఖం కలుగకపోలేదు.

మైలుదూరాన, వంతెన మలుపువద్దనున్న మామిడిచెట్టుక్రింద మరియమ్ నిలబడి, చేసైగతో కారాపింది.

మరియమ్ తనదోసిలిలోని పొగడపూలు అశోక్‌కర్పించింది. వాటిని ముద్దుపెట్టుకుని అశోక్ తన సిల్కు

రుమాలులో మూటకట్టుకున్నాడు. ఆతరువాత అశోక్ ఒక నీలికవరు మరియమ్ చేతిలో పెట్టాడు. అందులో వందరూపా యలనోట్లు నాలుగున్నాయి. ఈ పైకంతో మరియమ్ స్వంత వ్యాపారం చేసుకుంటే బావుంటుందని చెప్పాడు. మరియమ్ ఏమీా మాట్లాడలేదు.

"ఇక ఇక్కడనుంచే మనం విడిపోవాలి మరియమ్" అతనికంఠంలో విచిత్రమైన తొట్రుపాటు నిండివుంది, వియోగం యింత కఠినంగా, యింత వేదనామయంగా వుంటుందని అత నెన్నడూ వూహించలేదు కాని, మరియమ్ తనహృదయాన్ని దృఢపరుచుకుంది.

"నేను మిమ్మల్ని యీరాత్రి జ్ఞాపకంచేసుకుంటాను. ప్రతిరాత్రి జ్ఞాపకంచేసుకుంటాను. నిత్యమూ చేసుకుం టాను..." ఆమె కన్నీళ్లు బలవంతంగా ఆపుకుంటున్నట్లుంది. అశోక్ కూడా ద్రవించిపోయాడు.

"సరే, మరియమ్..."

"మంచిది."

తరువాత వియోగంతాలూకు సుదీర్ఘ సుకోమల స్నేహాలింగనం...!

కారు స్సగ్రు స్సరుమన్న శబ్దం !

మరియమ్ తనరుమాలు వూపింది. అందుకు జవాబుగా అశోక్ కారులోంచి చేయి బయటికిపెట్టి వూపాడు.

కారు బయలుదేరింది.

తన ప్రాణమే తనలోంచి లేచి పారిపోతున్నట్లు మరి యమ్‌కు అనిపించింది, తను గొప్ప తప్పుచేస్తున్నట్లు, వెనుకకు

తిరిగివచ్చి మరియమ్‌ను ఎందుకు వెంటతీసుకుని వెళ్ళకూడదని, ఒక్క-క్షణం అనుకున్నాడు అశోక్.

కాని కారు ముందుకుపోతూ నేవుంది. ఒక్క-నిముషంలో మలుపుతిరిగి కారు కళ్ళకుకనిపించకండా మాయమైంది. అశోక్ నాసిక పొగడపూలవాసనతో నిండిపోయింది.

కాని మరియమ్‌నాసికను పెట్రోలువాసన, రోడ్డు మీాదున్న దుమ్ము ఆవరించినై.

# 17

సారంగపూరు మహారాజుగారి ఆతిథ్యాన్ని అశోక్ సుమారు రెండున్నర నెలలు స్వీకరించవలసివచ్చింది. స్వీకరించ వలసివచ్చిందనడంకన్నా, ఆ ఆతిథ్యంమీాద అతనికి మోజుకలి గిందని చెప్పడం బావుంటుంది. అందుకు ముఖ్యకారణం మన జమీాందారుల గడియారాలు ఎప్పుడూ వెనకకు (స్లో) నడు స్తుండడమే! ప్రతిపనీ అక్కడ ఎంతో విశ్రాంతిగా, తాపీగా జరుగుతూవుంటుంది. ఊరేగింపు సాయంకాలం నాలుగు గంటలకని దండోరావేయిస్తారు. అది రాత్రి తొమ్మిదిగంటలకు బయటికివస్తే ఎంతో గొప్ప విషయం! సాయంకాలం భోజనం రాత్రి రెండున్నరగంటలకు పూర్తవుతుంది. ఆతరువాత ఆట పాటలతో ఆ రాత్రి గడిచిపోతుంది. తిరిగి మరునాడు పది గంటలకు కార్యక్రమము మొదలవుతుంది. యువరాజు చిత్రం కోసం పోజుయిచ్చేనాడు ఆయనకు తలనొప్పి పట్టుకుంది. ఆ మరునాడు ఆయన వేటకు వెళ్ళాడు. మూడోనాడు సారాయి

ఎక్కువగా త్రాగాడు. అందువల్ల చాటున పడివుండడంకన్నా యింకొకవిధంగా కూర్చునేస్థితిలో లేనప్పుడు, స్టూలుమీద కూర్చోవడ మసలే పడదు. ఈ మధ్యకాలంలో గవర్నమెంటు వారివద్దనుంచి, ఒక్కనాటి కార్యక్రమంతో, పొలిటికల్ ఏజంటు జమీందారీ తనిఖీకై వస్తున్నట్లు ఉత్తరంవచ్చింది. ఇక జమీందారీ వ్యవహారమంతా ఆగిపోయింది. చివరకు వివాహపు ఏర్పాట్లుకూడా ఆగిపోయాయి. అటూ యిటూ హడావిడి ఎక్కువైంది. గెస్టుహౌస్‌కు సున్నం వేయించడం, పందిళ్లూ, బాదం, కోడిమాంసం, వేట, ఫొటోగ్రఫీ, టీపార్టీ మొదలైనవాటికి ఏర్పాటుచేయడం మొదలైంది. మహారాజు వెంటనే "పొలిటికల్ ఏజంటుగారి సతీమణిగారిచే స్త్రీ వైద్యశాలకు శంఖుస్థాపన చేయింపబడుతుంది" అని చాటింపించారు.

"యువర్ హైనెస్! ఆసుపత్రివిషయం గెజెట్‌లో ప్రకటించలేదు" మంత్రిగారు భయపడుతూనే అన్నారు. ప్రస్తుతం సారంగపూరు ఆదాయం నాలుగైదులక్షలకు మించదు. ఇక రాజాగారి హోదా ఒక మామూలు రూలింగ్ చీఫ్ హోదా కన్నా మించిలేదు ఐనప్పటికీ జమీందారీప్రజలకు మహారాజుగారిని 'హిజ్ హైనెస్' అని సంబోధించమని హెచ్చరిక చేశారు.

"మీరు భలేమాటన్నారు మంత్రిగారూ! పి. ఎ. గారు ట్రాన్స్‌ఫర్ అవుతున్నారనే వదంతి మీరు వినలేదా? వారు మారిపోయినట్లయితే, యీ ఆసుపత్రి నెవరు కట్టిస్తారు? ఇది కేవలం ఓ హడావిడి! వారికి సెక్రెటేరియట్ ఆఫీసును తనిఖీచేసే వీలు లేకండాచేయడానికే! వారి కాలాన్నే విధంగానైనా బిజీగావుంచడమే. అంతే! అర్థమైందా?"

"చిత్తం మహారాజా!"

మహారాజుగారు పొలిటికల్ ఏజంటూ, ఆయన సతీమణిగార్ల శుశ్రూషభారం వహించారు. మంత్రిగారు ఆయన పెద్ద గుమాస్తాభారం పుచ్చుకున్నారు. ఏ విషయం వారిచెవుల్లో పడకూడదు.

పొలిటికల్ ఏజంటు వస్తున్నకారణంగా, దేశీ గెస్టు హౌసునుంచి, అశోక్‌ను ఖాళీచేయించారు. ఎందుకంటే అక్కడ ఏజంటుగారి బ్రాహ్మణ హెడ్‌క్లర్కు వుంటాడు. ఈ పని మహారాజుగారికి తెలియకుండా దివాన్‌గారివల్ల జరిగింది. అశోక్ తన సరంజామా అంతా తీసుకుని స్టేషనుకు వెళ్ళేందుకు కారు తెప్పించాడు. ఈ సంగతి మహారాజుకు తెలిసి ఆయన తన ప్రయివేటుసెక్రటరీని స్టేషనుకు పంపించి, అశోక్‌ను తిరిగి వెనకకు రప్పించాడు. ఈవిషయమై విచారణ జరిగింది. ప్రయివేటు సెక్రటరీకి, దివాన్‌గారికి శత్రుత్వంవుందనీ, అశోక్‌ను ప్రయివేటు సెక్రటరీ పిలిపించాడు గనుక, దివానుగారికి శత్రువుగా మారినందున, యీ పన్నాగం పన్నాడని తెలిసింది.

రాజాంతఃపురంలోకూడా చిత్రాలుగీసేందుకు అశోక్ వెళ్ళవలసివచ్చేది. అతనిఎదుట మహారాణులుకూడా ఘోషా లేకుండా కూర్చోవలసివచ్చేది. మొదట పెద్దరాణీగారి చిత్రం తయారయాక, చిన్నరాణిగారు తనచిత్రం మొదటివారిచిత్రం కన్నా పొడుగు, వెడల్పులో రెండడుగులు పెద్దదిగావుండాలని చెప్పి పంపింది. అది పూర్తయాక యింకొకామె చిత్రంగీయమని వచ్చింది. ఈమె ఎవరని అడిగాడు. అందుకు నౌకరు "యీమెగారుకూడా, రాణిగారే"నని జవాబుచెప్పాడు. మహా

రాజుగారికి యిటువంటి రాణు లెంతమందివున్నారని అడిగా డతను. అందుకు నౌకరు "వివాహమైతే యిద్దరినే చేసుకున్నారు. మూడో ఆమె చచ్చిపోయింది. ఇప్పుడా లోటును యీామె పూర్తిచేసింది అంటే వివాహంచేసుకున్నామె కాదు."— అన్నాడు ఇలా యింకెంతమంది చిత్రాలు గీయవలసివస్తుందో నని అశోక్ భయపడి—ఈ నెంబ రెంతవరకు పోయి ఆగు తుంది? అని అడిగాడు. నౌకరు వెంటనే "లేదు బాబూ! ఇక ఫొటో రాయదగినవా రెవరూ లేరు" అన్నాడు. అంతే చాలను కున్నాడు అశోక్ !

ఒకనాటిసంగతి: మహారాజుగారు వేటనుంచి తిరిగి వచ్చారు. పులిపిల్లను చంపి తీసుకువచ్చారు. కాని, అదెవరి తుపాకీగుండుతో చనిపోయిందో తెలియదు. కాని తనగుండుతో చావలేదని మహారాజుగారికి తెలుసు! తన అంగరక్షకుడు నిజాంసింగ్ గుండుతో చనిపోయింది. అందుకని యిప్పుడు ఒక చిన్నదర్బారు ఏర్పాటుచేసి, ఆ వేటవిషయమే చర్చిస్తున్నారు.

"ఈరోజు మహారాజులుంగారు గొప్పపులిని చంపారు." నిజాంసింగ్ దర్బారువేపు చూచి విజయోత్సాహంతో అన్నాడు.

"అవునవును! ఎందుకు కాదు. ఇంతవరకు ఇంత గొప్ప పులిని ఎవరూ చంపలేదు."-దివాను అన్నాడు.

"అంతే-" తొంభై ఏడురూపాయల ఎనిమిదణాల జీతం పుచ్చుకుంటున్న పోలీసు ఐ. జి. ఉత్సాహంగా "ఇంత పెద్ద... పులి మధ్యఆఫ్రికాలోకూడా లేదు. అంటే మన అడవి అంత సంకీర్ణమైవుంటుంది." అన్నాడు.

"కాని, ఆఫ్రికాల్లో పులులు లేవనీ, సింహాలే వున్నాయని విన్నాను." ఐ. జి. కీ తనకు సరిపడని అడివిదొర అన్నాడు.

"ఇప్పుడెలా వుంటాయి?" పోలీసు ఐ. జి. తొట్రుపడలేదు- "మహారాజులుంగారు ఎప్పుడో అక్కడికెళ్ళి, వాటన్నిటినీ చంపివచ్చారు ఇప్పుడక్కడ ఆ జాతే నశించిపోయింది" అన్నాడు.

"అంతే...అంతే..." అయిదారుగురు అన్నారు.

మహారాజుగారు మీసం మెలివేశారు.

"ఏం గురి! సరిగ్గా కణతమీద ఒకే గుండుకు పడిపోయింది." పోలీసు సూపరింటెండెంటు అన్నాడు. ఆయన కూడా రాజుగారితో షికారు వెళ్ళారు. ఈయన ఆ పులినికూడా చూడలేదు. ఇతను నెలకు అరవైరూపాయలజీతగాడు జీతం రెండేళ్ళకు రెండురూపాయలు పెరుగుతూవుంటుంది.

"కాదండి. కణతమీద కాదు, పిఱ్ఱమీద..." పశువుల దొడ్డికాపలాదారు అన్నాడు. "ఇంతకూ మీరు షికారు వెడితే తెలిసేది."

"వెళ్ళకుంటేమాత్రం తెలుసుకోలేనా? ఫారెస్టుకాపలాదానునా లేక పాకీవాడినా?" కోపంతో "ఒకవేళ పిఱ్ఱమీదనే తగిలిందనుకుందాం. అది మాత్రం కణతకు దగ్గరకాదా! రెండూ రెండున్నర అడుగులతేడాయేగా వుంటుంది."అన్నాడు.

"అవును! అంతే! అంతే!" బి. ఏ. ప్యాసైన హెడ్ మాస్టరు అన్నాడు.

"అరే, ఎందు కలా పోట్లాడుకుంటారు ?" మహారాజు గారికంఠం పలికింది. "పులి చనిపోయింది. అదీ పెద్దది. ఆమాత్రం చాలు".

"అవును మహారాజా ! అవును మహారాజా ! అంతే" సభంతా పలికింది. "ఆ నెత్తురుత్రాగేజంతువే బ్రతికివున్నట్లయితే, ఎంతమందిని పొట్టన పెట్టుకునేదో ! జమీందారీ, ఒక ఆపదనుంచి రక్షింపబడింది". సారాయిమత్తులో కమీషనర్ అన్నారు. అతనిమాటంటే, 'హిజ్ హైనెస్'కు ఎంతో అభిమానంగా వుంటుంది.

ఇంతలో నౌకరు లోపలికి వచ్చి వినయంగా వంగి నమస్కరించి చెప్పాడు.-"ప్రభూ ! ససురా మాదిగవాడు పులిచర్మం వొలవలేనంటున్నాడు. దానికి పందొమ్మిది తుపాకీ గుండ్ల బెజ్జాలున్నాయట. అది పెద్దదికూడా కాదు, పులి పిల్లంటున్నాడు."

ఆ సభాగృహంలో ఒక్కమారు స్తబ్ధత అవరించింది. అశోక్ఠాకూరుకు నవ్వాపుకోనడమే కష్టమనిపించింది.

"అరేయ్ ! పందొమ్మిదిగుండ్లు తగిలినట్లు ఆ మాదిగ గాడిదకు ఎలా తెలుసు ? అంత చిన్నపిల్లను అన్నిగుండ్లతో ఎవరైనా చంపుతారా ? వాడు కనిగుంతలను కూడా రంధ్రాలనుకున్నాడేమో ! తన్నండి వెధవను. మాదిగవాడు మాకు నేర్పడమా ? ఎక్కడేమి చెప్పాలో, ఆ మాత్రం బుద్ధికూడా లేదు."పోలీసు యిన్స్పెక్టర్ జనరల్ అన్నాడు.

ఈరకమైన అనర్గళ ప్రలాపాలతో రెండున్నర గంటలు గడిచిపోయాయి.

అశోక్ ఠాకూరు మనసు ఈ విచిత్ర వాతావరణానికి విసుగెత్తి ఎన్నోమార్లు సారంగపూరునుంచి జారుకుందామని ప్రయత్నించినా, మహారాజుగారు తన్ని బ్రతిమిలాడినందువల్ల త్రోసివేయలేకపోయాడు.

ఒక్క విషయంలో మహారాజుగారు చాలా మంచి వారు. ఆయన యువరాజుగారి వివాహంకోసం ఒకలక్ష రూపాయలు అప్పుచేశాడు. ఆయన అశోక్ కష్టానికి తగిన ప్రతిఫలం అందచేశాడు. కాని, అశోక్ ఠాకూరుకు డబ్బే ప్రధానంకాదు. అతను దీనితో సుఖించలేదు. సారంగపూరులో రోజులు అసహ్యంగానే గడిచిపోయినై. అవును! ఇంకొంతమంది రాజులు, మహారాజులతో పరిచయమైంది. కొంత లాభంకూడా కలిగింది. కాని, అక్కడి వాతావరణం కూడా సారంగపూరులాగే వుంటుందేమో! అటువంటప్పుడు అది నిర్వహించడం కొంచం కష్టమే.

భారతదేశ నరేశుల హీనదశ చూస్తుంటే, అతని మనసు 'మారిపోతున్న కాలానికి వీ రెంత వెనుకబడివున్నారు! ప్రపంచంలోని ప్రగతివాదంలో వీరికి స్థానముంటుందా? లేక వీరు దేశాభ్యుదయానికి అడ్డుపడి, దాన్ని బాధలకు గురిచేయడమే తమప్రవర్తనలో రుజువుచేసుకుంటారా?' అనుకునేవాడు. ఇటువంటి ఆలోచనలు, మరియమ్ జ్ఞాపకం, అతని జీవితాన్ని ఎంతో విచారవంతంగానూ, ఉదాసీనంగానూ చేశాయి. ఇటువంటి అప్రియమైన విషయాలకు విసుగెత్తి అతను ఎక్కడికైనా దూరంగా, తనమనసుకు శాంతి, ఆనందము దొరికే ప్రదేశానికి వెడదామనుకున్నాడు.

మహాత్మాగాంధీజీ సెక్రటరీ మహాదేవ దేశాయి వద్దనుంచి తన ఉత్తరానికి-ఎప్పుడైనా సేవాగ్రాం రావచ్చుననీ, ఎన్నిరోజులుండాలనుకుంటే అన్నిరోజులుండవచ్చునని జవాబు అందాక, అతనిమనసు సంతోషించింది. మహాదేవ భాయి-ఎండలు ఎక్కువగా వున్నందువల్ల 'బాపూ' ఆరోగ్యం అంత బావుండలేదనీ, అందువల్ల ప్రత్యక్షంగా చర్చించాలనుకునే అభిప్రాయం మార్చుకుంటే బావుంటుంది అనీ రాశాడు.

గాంధీజీతో మాట్లాడవలసిన విషయాలు అశోక్ కేమీ లేవు. కేవలం భారతాత్మకు ప్రాతినిధ్యం నిర్వహిస్తున్న యీ మహాపురుషుని, కొంచం దగ్గరలోవుండి చూడాలని, ఆయనచిత్రాన్ని చిత్రించాలని అనుకున్నాడు. అతను నోరుకదపవలసిన పనిలేదు. కేవలం కళ్ళే వాటిపనంతా చేసుకుపోగలవు. ఈవిధంగానైనా నాగపూరు ధనికుడూ, గుజరాత్ వ్యాపారస్తుడైన శ్రీ కాన్‌జీ ధరమ్‌జీకి గాంధీజీ చిత్రం వ్రాసియిస్తానన్న మాటకూడా పూర్తవుతుంది.

# 18

అశోక్ సాయంకాలం, సేవాగ్రాం చేరేప్పటికి గాంధీజీ పిల్లలతో, ఆశ్రమవాసులతో షికారుచేసి తిరిగివస్తున్నారు. ఆయన తన లాఠీని నేలకుపొడుచుకుంటూ, పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడుస్తున్నారు. కాని, ఆయనతోపాటున్నవారు రమారమి పరుగెత్తవలసివస్తోంది. ఆయనవెనక, ఒక ఉత్కళ ప్రాంతపు హరిజన కార్యకర్త ఆయన్ను ప్రశ్నిస్తూ, దానితో

పాటు తన తలమీాది చెమటను తుడుచుకుంటూ వెడు తున్నాడు. బుద్ధితో పాటు, తన అడుగులుకూడా వేగంగా వేయవలసివస్తోంది. ఏమిచేస్తాడు పాపం? గాంధీజీ, అతను చర్చించడాని కదే సమయమిచ్చాడు.

మహాదేవభాయి, అశోక్‌కు స్వాగతంచెప్పి "మీారు ప్రార్థనలో పాల్గొంటారా?" అని అడిగాడు.

"తప్పకుండా..."

"ఐతే రండి. వేళయిపోతోంది."

పగలూ రాత్రుల సంధికాలం. సూర్యాస్తమయమైంది. చీకటిచాయలు క్రమక్రమంగా వృద్ధవుతున్నాయి. ఆనాటి వేడిమి, పగటి హడావిడి, కోలాహలం తగ్గిపోయాయి. రాత్రి శీతలం, శాంతి ఏర్పడుతున్నాయి. సమస్తవాతావరణం ఒక అపూర్వ స్తబ్దత, ప్రశాంతి, పావనత్వంతో నిండిపోయింది.

గాంధీజీ ఒకపీఠంమీాద ధ్యానముద్రలో నిశ్చలంగా, మౌనంగా కూర్చున్నారు. ఆయనకెదురుగా, కుడివైపు ఆశ్రమ వాసులూ, దర్శకులు, అతిథులు; ఎడమవైపు మహిళలు కూర్చున్నారు.

ప్రార్థన ప్రారంభమైంది. 'హరి ఓం...'

"ఈశా వాస్య మిదం సర్వమ్..."

తరువాత ఆశ్రమవాసి ఒకరు ఎంతో మధురంగా—

"యం బ్రహ్మ వరుణేంద్ర రుద్రమరుతః—" అన్నారు.

ఆ తరువాత రెహనా తైయబ్ భాయి కురాన్‌లోని కొన్ని వాక్యాలు చదివి, దాని అర్థం హిందీలో అనువదించి చెప్పాడు.

ఆపైన ఒకయూరోపియన్ మహిళ కార్డినల్ న్యూమాన్ వ్రాసిన —"Lead, Kindly Light" అనే గీతం పాడింది.

ఆ పిమ్మట అంతా కలిసి గీత ద్వితీయఅధ్యాయంలోని— "స్థిత ప్రజ్ఞస్య..." మొదలైన శ్లోకాలు వల్లించారు.

పిదప ఆశ్రమవాసి ఒకరు తంబురామీద సూరదాసు వ్రాసిన - "సునేరి మైనే-నిర్బలకే బల్ రామ్" అనే భజనపాట పాడాడు.

తరువాత నరసింహమెహతా విఖ్యాతగీతం - "వైష్ణవ జనతో తేణే కహియే..." పాడారు.

ఆ తరువాత - "రఘుపతి రాఘవ రాజారాం" పాటలో అంతా పాల్గొన్నారు. ఆ పాటలో ఎంతో భక్తిభావం, ప్రేమ విహ్వలత దాగున్నట్లు, భక్తగణమంతా ఏకాగ్రమనసుతో భగవంతుని ఆహ్వానిస్తున్నట్లుంది.

సమస్తవాతావరణంలోనూ, ఒక విచిత్రమైన నైర్మల్యం వ్యాపించింది.

అశోకుని భావయుక్తహృదయంకూడా ఆనందంతో పెల్లుబికింది. అతనెదుట అయిదడుగులదూరంలోనే, గాంధీజీ ధ్యానముద్రలో కూర్చునివున్నారు. ఆయనను చూస్తే-భగవంతుడైన బుద్ధుడూ, మహావీర్, క్రీస్తు శ్రేణిలోని, యీ మహాత్ముడు గాంధీగా జన్మించినట్లున్నాడు. అందువల్ల, ఈ పీడిత భారతదేశ దైన్య, దారిద్ర్యాల్ని పారద్రోలడానికీ, కేవల మీ దేశమేకాకుండా, సమస్తప్రపంచాన్ని ఉద్ధరించి, శాంతీ సుఖమూ, విశ్వబంధుత్వభావం కలిగించడానికీ నేడీ అభాగ్య దేశంలో జన్మించాడు- అనిపిస్తుంది.

ఈ అస్థిపంజరంలాంటి బక్క-చిక్కిన మానవుడు ఎన్నెన్ని బాధలు సహించలేదు. ఎంత దుఃఖం అనుభవించ లేదు. ఆయన ఆత్మ, సమస్త మానవజాతి బాధలకు, అవ మాన వేదనలకు ప్రతినిధియై మూలుగుతోంది.

భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మ గీతలో ఎప్పుడు ధర్మాలకు హానికలుగుతుందో, సజ్జనులమీద అత్యాచార మెప్పుడు పెరుగుతుందో, దుష్టప్రాబల్యం ఎప్పుడు మితిమీరు తుందో, అటువంటి సమయంలో తను అవతారమెత్తి, సాధు వుల్ని రక్షించి, దుష్టుల్ని సంహరించి, ధర్మాన్ని తిరిగి స్థాపన చేయగలనని చెప్పాడు.

ఐతే, యీ మహాత్ముని అవతారం ఆ ప్రతిజ్ఞను పూర్తిచేయడానికి కాదుకదా !

ఇటువంటి ఉదాత్తమైన విషయాలు అశోక్ని ద్రవింప చేశాయి. అతనికళ్ళల్లో నీరునిలిచింది.

అతను, గాంధీజీ ప్రార్థనసమయంలోని సమాధి ముద్రను, సుందరంగా చిత్రించి దానికి బ్రహ్మలో విలీనం (Intune with the Infinite) అని పేరు పెట్టాడు.

ఆ చిత్రంలో గాంధీజీ సచ్చిదానందములో లీనమై పరబ్రహ్మ పరమేశ్వరునితో ఐక్యం చెందుతున్నట్లు కను పించింది.

ఆయనముఖంలో ఎంతో ఆత్మవిస్మృతితాలూకు పవిత్రకాంతి వెలిగిపోతోంది.

ఆయనతలచుట్టూ సౌమ్యమైన దివ్యకాంతి చక్రా కారంలో తేజరిలుతోంది.

మానవజాతి అధఃపతనాంధకారంలో అదొక్కటే ఆశాకిరణంగాను, ఉద్ధరించే కిరణంగానువుంది.

తమసో మా జ్యోతిర్గమయ !

ఈ చిత్రంతాలూకు మూలప్రతిని ధరమ్‌సేఠ్ కొన్నాడంటే అందులో ఆశ్చర్యంలేదు. వాటి ప్రతిచిత్రాలు కొన్నివేలు అమ్ముడైనవి. గాంధీజీవ్యక్తిత్వంలోని యింత భావపూర్ణ, సజీవచిత్రణను త నెక్కడా చూడలేదని మహాదేవ భాయికూడా అన్నారు.

ఈచిత్రం చిత్రించాక, అశోక్ విహ్వాలత, హృదావ్యథ దూరమైనట్లనిపించింది. అతనికి సాత్వికానందం లభించింది. మరియమ్‌ను తను అన్యాయంచేయలేదు కదా అనే అనుమానంకూడా తీరిపోయింది తను యిచ్చిన నాలుగువందల రూపాయలతో, గౌరవంగా ఏదో ఒక వ్యాపారంచేసుకుని జీవించగలదనేది అతనికి సంతృప్తికారకమైంది.

# 19

ఈ సంవత్సరం నాగపూరులో వర్షాలు ఎక్కువగా కురిశాయి. దానిపరిణామము ఎవరి కెలా జరిగిందో కాని, అశోక్‌కు మాత్రం మలేరియా పట్టుకుని చాలారోజులు పీడించింది. అతను సుమారు మూడుమాసాలు జబ్బుతో వున్నాడు. మూడునాలుగురోజులు జ్వరముంటుంది. ఆతరువాత దిగిపోతుంది. తిరిగి ఎనిమిదిరోజుల తరువాత జ్వరంపట్టుకునేది. క్రమక్రమంగా బలహీనత ఏర్పడి, వ్యాకులపడుతున్నాడు.

డాక్టర్లు నాలుగైదు యింజక్షను లిచ్చారు. క్వినైన్ వాడు తూనేవున్నాడు. కాని రోగం సమూలంగా పోయిందని ఎవరూ చెప్పలేకండావున్నారు. కాసులో తిరగగలడు, కాని, ఆ పూర్వ బలం, ఉత్సాహం లేదు. గాలిమార్పిడి జరిగినట్లయితే బావుం టుందని డాక్టర్లు సలహాయిచ్చారు. సముద్రపుగాలి బాగా వచ్చే ప్రదేశానికి వెళ్ళమనికూడా చెప్పారు. అశోక్ డాక్టర్లతో-"నన్నేదైనా పర్వతంమీద వదిలిపెట్టండి. నాకు స్వాస్థ్యం చిక్కుతుంది. కేవలం సముద్రపుగాలీ-ఎప్పుడూ అటు వంటి దృశ్యాలతోనే నా మనసు నిండదు. వీలుంటే, యీ మారు సహ్యాద్రిపర్వతాల్లోని ఏదైనా కొండప్రదేశానికి వెళ్ళా లనివుంది. మాథేరాన్, మహాబలేశ్వరం, లేక యింకెక్కడి కైనా సరే" అన్నాడు.

డాక్టర్లు బాగా ఆలోచించి-"లోనావలా" అన్నిటికన్నా మంచిప్రదేశమని సలహాయిచ్చారు. ఆ ప్రదేశం సముద్ర తీరానికి సలభైమైళ్ళదూరంలో వున్నా, సముద్రపుగాలి అంత వరకు వస్తుందనీ, అక్కడనుంచే సహ్యాద్రిపర్వతాలు మొద లవుతాయని చెప్పారు. ఐనా అక్కడ వర్షాలు ఎక్కువగా వుండడంవల్ల, వసరాతరువాత వెళ్ళమని సలహాయిచ్చారు. అందువల్ల ఆ పండుగకోసం, అశోక్ ఎదురుచూస్తున్నాడు. ఈ జబ్బులో తాపం ఎక్కువగా వున్నప్పుడు అతనికి మరియమ్ జ్ఞాపకంవచ్చేది. అతని కిప్పుడు జ్వరంతగ్గింది. బలహీనత మాత్రం బాగా వుంది. మనస్సూ, హృదయంకూడా బల హీనంగానేవున్నాయి. ఇప్పుడుకూడా అప్పుడప్పుడూ, హృద

యాన్ని ఒక అవ్యక్త సూక్ష్మభావం కప్పివేసి, అతన్ని ఉదాశీనంగా చేస్తోంది. కాని, దానికి చికిత్సేముంది ?

ఈమధ్య అత నేమీ చిత్రించలేదు. ఎవరినీ కలుసుకోలేదు. ఒకమారు మాత్రం క్లబ్బులో మాయాదేవి కలిసింది. కాని, ఆమె తననుంచి తప్పుకుంటున్నట్లు తెలుసుకున్నాడు. ఆమె యిప్పుడు ఒక అందమైన ఐ. సి. యస్. ఆఫీసరు వెంట వుండడంకూడా చూశాడు. పోనీ! ప్రాణాలు రక్షింపబడ్డాయనుకున్నాడు. ఇప్పు డతను నిశ్చింతుడయ్యాడు.

'లోనావలా' చేరేసరికి అశోకునిజబ్బు సగం నయమైంది. ఇక తనకు ఆరోగ్యం కలుగుతుందనే నమ్మకం ఏర్పడింది. అక్కడి ప్రకృతిసౌందర్యం, స్వాస్థ్యవర్ధక వాయువుతో అతనిమనసు ఉల్లాసంతో నిండిపోయింది.

'లోనావలా' బొంబాయి - పూనా ముఖ్యరైల్వేలైనులో వుంది. సహ్యాద్రిపర్వతమాలల చుట్టుప్రక్కల అనుపమసౌందర్యం వెదజల్లబడివుంది. కళ్ళున్న ప్రతివారూ దాన్ననుభవించవచ్చు. తాతా హైడ్రోవిద్యుచ్ఛక్తి కంపెనీ జలాశయము—'వలవణ' తటాకము అక్కడే వుంది. అక్కడే ఒక పెద్దరైల్వేకాలనీ వుంది. ఆ దగ్గర్లో రెండుమైళ్ళదూరాన ఖండాలాస్టేషనుంది. ఈ రెంటిమధ్య పారశీ, గుజరాతీ, బిహారీల శానిటోరియమ్‌లు ఎన్నో వున్నాయి. అక్కడికి వందలాది రోగులు వాయుపరివర్తనంకోసం వస్తుంటారు. కొంతమంది బొంబాయి ధనికులు అక్కడందమైన బంగళాలు కట్టించుకున్నారు. తమపనిలో ఏ కొంచం తీరుబడిదొరికినా అక్కడికి

వాళు పరుగెత్తుకుని వస్తుంటారు. అక్కడి నీరుకూడా మంచిదే.

ఆచుట్టుప్రక్కలా, దగ్గర్లోను ఎన్నో అందమైన ప్రదేశాలున్నవి. 'వలవణ' తటాకానికి మూడువేపులా ప్రకృతిసిద్ధమైన పచ్చనిపర్వతాలు, స్వాభావికమైన ఆనకట్టలా వున్నాయి. నాలుగోవేపు తాతాకంపెనీ కట్టిన పక్కా ఆనకట్టవుంది. మానవులచేత నిర్మించబడిన కృత్రిమఆనకట్టలా కనుపించకండా విస్తీర్ణమైన నీలవర్ణతటాకంచుట్టూ పర్వతాలున్న అపూర్వ దృశ్యం అద్భుతంగా వుంది. ఆదగ్గర్లోనే తుంగర్లీ చెఱువులోంచి 'లోనావలా'పట్టణానికి నీటిసప్లయి జరుగుతూవుంటుంది. అదికూడా ఒకపర్వతంమీదనే వున్నది. మీరు ప్రకృతి సౌందర్యాన్ని మనసార అనుభవించగల 'ఖండాలా బయరాంజీ పాయింట్', 'డ్యూక్‌నోజ్ పాయింట్', 'టైగర్సు లీప్', మొదలైన రమణీయప్రదేశాలుకూడా అక్కడికి నాలుగైదుమైళ్ళ దూరంలో వున్నవి. ఏడెనిమిదిమైళ్ళదూరంలో 'లోహగఢ్' అనే ఖిల్లావుంది. పధ్నాలుగుమైళ్ళదూరంలో శివాజీ ఉజ్వల చరిత్రను జ్ఞాపకంచేసే 'రాజమాచి' దుర్గంవుంది. ఈ సహ్యాద్రి పర్వతాలల్లోనే—ఈ గిరికందరల్లోనే, వీరులైన మహారాష్ట్ర ఉజ్వలదేశభక్తి, ఆత్మత్యాగం, స్వామిభక్తితో కూడిన వీరగాధలు చరితార్థంగా లిఖించబడినవి. గర్వించతగిన ఆ కాలమెక్కడ...? పతనంతోకూడిన యీ కాలమెక్కడ?

'లోనావలా'కు ఆరుమైళ్ళదూరంలో బౌద్ధకాలంనాటి స్వర్ణయుగచిహ్నాంగా యీ పురాతనదేశ సంస్కృతీ, ధర్మనిష్టా, శిల్పకళా, శతాబ్దాలనుంచీ జరుగుతున్న ఆక్రమణల

విస్మృతులతరువాతకూడా, నేడు అక్షుణ్ణంగావుండి, భవిష్యత్తులోకూడా, సుస్పష్టంగావుండే సౌందర్యవిలసితమైన 'కార్లా' గుహాలు వున్నాయి. నేడుకూడా యీ భగ్నహృదయదేశంలో, భూతకాలవైభవాన్ని జ్ఞాపకంచేసి, భవిష్యత్తులో ఆశ, ఊరడింపు సందేశాన్నిచ్చే కొన్ని అవశేషాలుకూడా వున్నాయి. అవే లేకుంటే, వర్తమానకాలంలోని కటికిచీకటిలో జ్యోతిని పుచ్చుకుని దారిచూపించే శక్తి మనకేముంది?

అశోక్ ఠాకూరు మనసు 'లోనావలా'లో పూర్తిగా ఆనందంపొందింది. ఇక మలేరియారోగం తనశరీరంలోంచి పారిపోతుందనే నమ్మకం కలిగింది. బొంబాయి పూనారోడ్డుమీదున్న బంగళాలో సగభాగం అద్దెకుపుచ్చుకున్నాడు. దాని రెండోభాగంలో మధ్యప్రాంతీయుడైన డిస్ట్రిక్టు జడ్జి - శ్రీ అధికారి సపరివారంగా వుంటున్నాడు. అశోక్‌ను తమప్రాంతంవాడైనందువల్ల, నాగపూరులోని తనస్నేహితులు కొందరతన్నెరిగివుండటంవల్ల, ఆయన అశోక్‌ను ఆత్మీయునిగా చూస్తున్నాడు. అధికారికుటుంబం చాలా చిన్నది. అతను, అతనిభార్య! ఆఁ, ఆయనగారి ఏకైకకుమార్తె దీపావళిసెలవులకు 'లోనావ్‌లా' రాబోతోంది. ఆమె నాగపూరు వుమెన్సుకాలేజీలో ఎం. ఏ. ఫైనల్ చదువుతోంది. అధికారి యిప్పుడు నాలుగునెలలు సెలవులో వున్నాడు. అతనికి మలబద్ధకరోగం వుంది. ఆయన గాలిమార్పుకోసం, 'లోనావలా'లో తన సెలవంతా గడపాలని వచ్చాడు. కాని, ఆయనకూతురు అయిణ ఎంతో కష్టంమీద ఆయనతో ఒక్కనెల వుంటుంది.

అధికారి అప్పుడప్పుడూ అశోక్‌తో షికారువెళ్ళే వాడు. అతన్ని తనింట్లో భోజనంచేయమని ఎన్నోమార్లు బలవంతంచేశాడు. అశోక్ స్వభావమూ, వృత్తీ, ఆదాయం అడిగి తెలుసుకున్నాడు. ముఖ్యంగా అతను అవివాహితుడనే సంగతి శ్రీమతి అధికారికి తెలిసినప్పటినుంచీ, ఆమెవ్యవహారంలో విచిత్రమైన పరివర్తనం కలిగింది. ఆనాటినుంచీ మాటలసందర్భంలో అరుణపేరును మాటిమాటికీ ఎత్తుతుండేది. ఆమెను పొగడుతూ—దానికిగూడా ఆర్టుయందు ప్రేమవుందనీ, ఈ టేబుల్ క్లాత్ ఆమె తయారుచేసినదేననీ, ఆ చిత్రం ఆమెచిత్రించినదేననీ, దిల్‌రుబా వాయిస్తుందనీ ఏకరువుపెడుతుండేది. ఒకనాడు వారికుటుంబం తాలూకు ఫోటోఆల్బమ్ తీసి, శ్రీమతి అధికారి ఎంతో చతురతగా అరుణఫోటోను అశోక్‌ముందుంచింది.

యథార్థంగా ఫోటో అందంగానేవుంది. తప్పకుండా, ఆమె అందంగావుంటుందని వూహించవచ్చు. అశోక్ ఆ ఫోటో వేపు అదేపనిగా కొంచంసేపు చూస్తూవుండిపోయాడు. శ్రీమతి అధికారి తనవేపు చూస్తోందని గ్రహించినప్పుడు, అతను సంకోచంతో ఆల్బమ్‌పేజీ తిప్పాడు.

ఈమారు అశోక్ ధ్యాసగా శ్రీమతి అధికారివేపు చూచాడు. ఆమెకూ, ఆచిత్రంలోని యువతికి బాగా పోలిక కనుపించింది. శ్రీమతి అధికారి తన తరుణవయసులో ఎంతో అందంగావుండివుంటుందనేది నిర్వివాదం. ఇప్పుడామె వయసు నలభై మూడు నలభై నాలుగు సంవత్సరాలుంటుంది అయినప్పటికీ ఆమె అందం, ఆరోగ్యం, యీనాటికీ బాగానేవున్నాయి.

అరుణఫోటో చూచాక, ఆ మెను ప్రత్యక్షంగా చూడాలనే కోరిక అశోక్ మనసులో కలిగింది. కుతూహలంకూడా కలిగింది అందువల్ల తను ఆమరునాడు ప్రాతఃకాలం పూనా ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నానని అరుణ అధికారికి టెలిగ్రాం యిచ్చినప్పుడు, వారిసంతోషం ఎలావున్నా, అశోక్‌కు మాత్రం ఆనందం కలిగింది. కాని ఆ భావం కనుపించనీయ లేదు. అరుణతల్లిదండ్రులు ఆమెకోసం స్టేషనుకు వెళ్ళినప్పుడు అతను 'వలవణ' తటాకంవేపు షికారు వెళ్ళాడు.

అశోక్ ప్రత్యక్షంగా అరుణను చూచాక ఆమె ఫోటోలోకన్నా ఎక్కువ అందంగానే వుందనుకున్నాడు. తల్లిదండ్రుల గారాబంతో, ధనవైభవాలవాడిలో ఆమె పోషింపబడింది. ఆమె స్వతహాగా అందమైనది. ఆమె నడత మంచిది. విశేషంగా సౌందర్యాన్ని పోషించుకుంటుంది. ఇప్పుడామెకు యిరవై మూడేళ్ళ వయసుంటుంది. వివాహం కాలేదు. ప్రణయజీవితస్వప్న మామె ఎప్పుడూ చూస్తుండేది. ఆమె హృదయంలో ఎల్లప్పుడూ విచిత్రమైన స్పందన కలుగుతుండేది. అధికారి ఆమెకు తగిన వరునికోసం తిరుగుతున్నాడు. ఇద్దరుముగ్గురు ఐ. సి. యస్. యువకులనుకూడా చూశాడు. కాని యింతవరకు ఏదీ నిశ్చయంకాలేదు. ఈ విషయంలో ఆయన విచారపడుతున్నాడు. కాని, ఆరోగ్యవంతుడు, అందమైనవాడు, సంస్కారి, సంపాదనాపరుడైన అశోక్‌ను చూచినప్పుడు, ఆయనకూ, ఆయనకన్న ఎక్కువగా ఆయన భార్యకు తిరిగి ఆశ చిగురించింది. అశోక్ వ్యక్తిత్వం అరుణ మనసులో పడినసంగతి తెలిశాక వారిఆనందం యింకా ఎక్కు-

వైంది. ఇక వున్నదల్లా అశోక్ అభిప్రాయమొక్కటే కాని, అతను రహస్యమయమైన యువకుడు. అతని అభిప్రాయాల్ని సరిగ్గా తెలుసుకోవడంకూడా కష్టమే! అతని అంతర్జీవితంలోని, నిగూఢ గాంభీర్యాన్ని తెలుసుకోవడం కష్టం.

వివాహితులైన యువతులు తమ అందమైన కల్పనలతో, స్వప్నలోకంలో విహరించేవయసులో యిప్పుడు అరుణ వుంది. ప్రేమకోసం ఆతురతా, యవ్వనఉద్యానవనంలో విహరించేందుకు ఉత్కంఠా, హృదయంలో విచిత్రమైన మాధుర్యం వ్యాపించివున్నుండేవి. రవీంద్రనాథ్‌టాగూరు ఆమెకు, కులదేవుడన్నా ఆశ్చర్యంకాదు. కీట్స్, షెల్లీ, బైరన్ ఆమెకు దేవదూతలు. ఎలిజబెత్తు, రాబర్టు బ్రౌనింగ్ ప్రణయకథ ఆమె జీవితాన్ని అభిభూతంచేసింది. దాంతే. బియాట్రిస్ ప్రణయ భంగ కరుణగాథ చదివి ఆమె కన్నీరుకార్చేది. రోమియో - జూలియెట్‌లాంటి చిత్రపటాలు ఆమెకు ప్రపంచంలో కనుపిరిచడంలేదు. ఉమర్ ఖయ్యామ్‌పద్యాలు ఆమెకు కంఠతా వచ్చు. లైలా-మజునూ విరహవ్యథతో ఆమెహృదయందగ్ధమైపోతుంది. కాళిదాసు శకుంతలనాటకాన్నామె ఎన్నోమార్లు చదివింది. రేనాల్డ్స్, 'మిస్ట్రీస్ ఆఫ్ ది కోర్టు ఆఫ్ లండన్'కూడా ఆమె ఎంతో ధ్యాసతో చదివింది. అరుణజీవితం రొమాన్సువెదకుతూ పరుగెడుతోంది. తనప్రణయం యితరులకన్నా భిన్నంగా, అపూర్వమైనదిగా, సాధారణ స్త్రీ అదృష్టానికి వేరైనదిగా వుండాలని కోరుతోంది.

ఆ స్వప్నప్రణయవిహ్వలరమణిమనసులో, అశోక్ ఠాకూరులాంటి చిత్రకారుడు నిలిచిపోయాడంటే, ఆశ్చర్యపడ

నవుసరం లేదు. అతను ఆర్టిస్టు. అందువల్లనే యింకా ఆశ! ఎందుకంటే, వెయ్యిలో ఒకరే ఆర్టిస్టులవుతారు. అరుణ స్వప్నదృష్టిలో దీనికెంతో శక్తి వుంది.

అశోక్ సౌందర్యాసక్త చూపులలో, అరుణ అందం నిండిపోయింది. అందులో అనుమానం లేదు. అతని పెద్ద పెద్ద కళ్ళు ఎన్నోమార్లు ఆత్రుతగా, ఆమె రమణీయ ముఖకమలం వేపు చూశాయి. ఈ దృష్టిలో కేవలం కళాదృష్టే వుందో, లేక యింకేముందో చెప్పడం కష్టమేగాని, అరుణ సహవాసం వల్ల అతని కానందం కలుగుతోందనేది నిశ్చయం!

అప్పుడప్పుడూ అధికారీ, అశోక్ కలిసి పిక్నిక్‌కు పర్వతాలమీదకు వెళ్ళేవారు. 'కార్లే' గుహలను చూసేందుకూడా తోడుగా వెళ్ళేవారు. అక్కడ బౌద్ధకాలంలోని, స్త్రీ-పురుషుల అంగవిన్యాసాల శిల్పాల్ని వారు ధ్యానంగా చూసేవారు. అరుణ వొంటరిగా ఎంతోసేపు వారిముందు నిలుచుండేది. కొన్ని శతాబ్దాలకుపూర్వం బౌద్ధసన్యాసులు ఆచార్యులద్వారా ధర్మజ్ఞానదీక్ష పొంది, ప్రపంచంలోని స్వార్థ, మోహ, అజ్ఞానాలను పారద్రోలే మార్గాన్ని చూపించిన స్థానమిదేనని, అశోక్‌కు తెలిసింది. ఏతే వారి సూక్ష్మాత్మలు, నేడుకూడా యిక్కడ తిరుగాడడం లేదా? ఈనాడు మన యీ పతనోన్ముఖ దేశంకోసం, అవి ఏ మూగ సందేశాన్నిస్తున్నవో!

కొన్నిమారులు ఆ దంపతులు అశోక్-అరుణలను వొంటరిగా వొదిలి వెళ్లేవారు. వీలున్నంతవరకు వారిద్దరూ వొంటరిగా తిరిగేందుకు ప్రోత్సాహమిచ్చేవారు. అశోక్ చరిత్ర

వా రెరుగుదురు. ఈ సహవాస పరిణామము చెడుగా వుండ దని వారికి తెలుసు.

అంతే, యీ సూక్ష్మవిషయాలు అశోక్‌కు తెలియక పోలేదు. అతనూ, అరుణా ఏకాంతంగా సెయింట్‌పీటర్సుకాన్ వెంట్ వెనక ఒక సెలయేరు ఒడ్డున కూచున్నప్పుడు, యీ అందమైన యువతి సాన్నిధ్యంలో తనకు తిరిగి మోహావేశం కలుగుతున్నట్లు గ్రహించాడు. స్వాభావికమైన అరుణ స్వాస్థ్యమూ, సౌందర్యమూ యథార్థంగా అద్భుతమైనవే. నల్లని పెద్ద కళ్ళూ, సన్నని నాజూకు పెదిమలు, కోమలమైన సన్నని దేహలతా- వీటన్నిటినీ మించి, ఆమె వేష భూష ణాలూ, సౌందర్య సాధనలూ వీటి మోహప్రభావంతో తనను తాను నిర్లిప్తునిగా నిభాయించుకోలేకపోతున్నాడు. అతని మనసులో సూక్ష్మమైన గందరగోళం చెలరేగింది.

అటువంటి సమయంలో అతనికి మరియమ్ జ్ఞాపకం వచ్చేది. మనసులోనే, ఆ యిద్దర్నీ పోల్చేందుకు ప్రయత్నించే వాడు. వీరిలో అరుణే అందంగా వుంటుంది. అందులో సందేహంలేదు. ఎం. ఏ. చదువుతోంది. గొప్ప చదువే! తల్లి దండ్రులు ప్రతిష్టగలవారు. ఈ విషయంకూడా ఆలో చించవలసిందే! అశోక్ తన హృదయాన్నెంతగానో వెదకి చూచాడు. ఏ సమస్యవల్ల మరియమ్‌ను వివాహంచేసుకుందా మనే ఆలోచన రేకెత్తలేదో అదేసమస్యపై అరుణ విష యంలో అప్పుడప్పుడూ యీ ఆలోచన రేగుతోంది. ఐతే మరియమ్‌తోనే తన జీవిత అధ్యాయం ముగియలేదా ?. స్త్రీ- పురుషుల ఆనందంతాలూకు ప్రథమానందానుభవం తనకు

కలిగించింది మరియమే! అది నిజం! ఆ సుఖాను భూతి యీనాడుకూడా అతనికి క్రొత్తగానే వుంది. ఆ ఆనందానికి ప్రతిఫలంగా, అతనుకూడా మరియమ్‌ను సన్యాసిని దీక్షనుంచి రక్షించి, స్వతంత్ర జీవనయాపనచేసే మార్గం తెరిచి, భవిష్యత్తులో సహాయంచేసేందుకు మాటయిచ్చాడు. ఈవిధంగా ఆమెను బంధవిముక్తనుగా చేయడంమాత్రం తక్కువ సేవా?

పాద్రీపురం వదిలిపెట్టినప్పటినుంచీ మరియమ్‌వద్దనుంచి ఉత్తరంరాలేదు. ఆమెవిషయం ఏమీ తెలియలేదు. ఐనప్ప టికీ ఆమె జీవితంలో అసహాయురాలుకాదనీ, ఆమెవద్ద నాలుగు వందలరూపాయలున్నాయనీ, వర్తమాన సమాజవ్యవస్థలో ఆ పైకం కొంతమంది జీవితంలో మహాత్మ్యంకలిగివుంటుందనీ, మరియమ్‌లాంటి మూడురూపాయలవేతనంపొందే పరావలంబిని జీవితంలో తప్పకుండా, అది మహత్తుకలిగించగలదని అతను సమాధానపడ్డాడు.

అవును! అలాగే అనిపిస్తోంది. మరియమ్‌తో గడిపిన అతని జీవితాధ్యాయం నిజంగా ఆఖరై పోయింది. ఇప్పు డతను క్రొత్తజీవితపుటను తెరవాలి.

అరుణ......! అరుణ......!

అరుణవిషయమే యిప్పు డతనిమనసు ఆలోచిస్తోంది. దానితోపాటు అతను తిరిగి వివాహవిషయంకూడా ఆలో చిస్తున్నాడు. వివాహమా? ఐతే అతను వివాహంచేసు కుంటాడా?

స్త్రీ- కళ-? కళ- స్త్రీ!

ఈ రెంటికీ అతనెలా సమన్వయం కుదర్చగలడు? అతనిలో ఆ పాత హృదయమథనం జరుగుతోంది.

ప్రపంచంలో గొప్ప గొప్పవారంతా వివాహం చేసుకున్నారు. రాజకీయవాదులూ, విజ్ఞానవేత్తలూ, కళాకారులూ, వర్తకులూ, వ్యాపారులు చేసుకున్నవారే! ఎవరిపుటలు బాగున్నవో, వారు తమ ప్రతిభతో ప్రపంచంలో పేరుప్రతిష్టలు సంపాదించారు. వారూ, వారిభార్యలు అమరులైయారు. కాని, ఎవరిఅర్థాంగి వారిలక్ష్యంతో సామరస్యం పొందలేక పోయిందో- వారిజీవితం 'సుకరాత్, టాల్‌స్టాయ్'లలా దుర్భరమైపోయింది.

కాని అవన్నీ అపవాదుస్వరూపాలుమాత్రమే! ఆ యిద్దరు మహాఋషులలో ప్రతిభవుంది. అందువల్ల వారి సాంసారికజీవితం దుఃఖమయమైనదైనప్పటికీ, వారు ప్రపంచానికి, క్రొత్తభావాలఅమృతాన్ని రుచిచూపించి, దాని ప్రగతికి తోడ్పడ్డారు. ఇక కొన్నివేలు—లక్షల సంవత్సరాల నుండీ, సంస్కృతి జన్మకాలంనుంచీ, స్త్రీ-పురుషులు వివాహసూత్రంలో బంధింపబడుతూ వస్తున్నారు. వారిలో ఎంతోమంది జీవితాలు కష్టమయమైపోయాయని వొప్పుకోవాలి. కాని ఎక్కువమంది వాటిద్వారా ధర్మార్థకామమోక్షాలు సంపాందింపచేసుకున్నారు.

ఏవస్తువులోను లేక సంస్థలోనూ, జాతిలోను, రివాజు ప్రకారం మంచి చెడ్డలు వుండవు. వాటి మంచిచెడ్డలు వాటిని ఉపయోగించుకునేవారిమీద ఆధారపడివుంటాయి. మంటకు వెలుతురువస్తుంది. కాని, దానితో చేయికూడా కాలుతుంది.

ఇక అరుణ బుద్ధిహీనురాలైన ఆడదికాదు. వివాహము నిశ్చయంచేసుకోకముందే, తన లక్ష్యానికీ, స్వభావానికీ భిన్నంగా ప్రవర్తించననే మాటతీసుకోనిదే, తను వివాహానికి వొప్పుకోదు. ఆ తరువాతకూడా తను సుఖపడలేనప్పుడు తన ప్రారబ్ధంలో సుఖమే వ్రాసిలేదనుకుంటాడు. ఇంత అనిష్టత తను నెత్తినవేసుకోనవలసిందే, ఎందుకంటే, అనిష్టత లేనిదే, ప్రపంచంలో ఏమి లభ్యమవుతుంది ?

వివాహం చేసుకోనప్పుడు తను ప్రపంచంలోని అర్ధ సత్యాన్ని- ఆడదాన్ని అర్థంచేసుకోలేడు. తన దృష్టికోణం వ్యాప్తిచెందదు. ప్రపంచంలో వొంటరిగానే వుండాలి. ఈవిధంగా తన జీవితం పూర్ణత్వాన్నెలా పొందుతుంది?

మానవమనసు విచిత్రమైనది!

ఈనాడు అతనిహృదయంలో వివాహంచేసుకుందామనే కోరిక మేలుకొన్నప్పుడు, అతనిహృదయంకూడా అటువంటి తీర్పే యిస్తున్నది. తను అద్దెకుంటుండే యింటి పార్శ్వయజమాని కుటుంబజీవిత మతనికి జ్ఞాపకమొచ్చింది. ఆయన మిల్లులో అలసిపోయి, యింటికి వచ్చేప్పటికి, అతనిభార్య తన ఏకైక కుమార్తె నర్గిస్‌ను చంకనెత్తుకుని ఎదురుచూస్తూ వరండాలో నిలుచుండేది. ఆయన ఆవరణలోనికి రాగానే నర్గిస్, ఆ మెతల్లి యిద్దరూ కిలకిలమంటూ ఆనందంతో నవ్వుతుండేవారు. నర్గిస్ తన చిన్నిచేతుల్ని ముందుకు చాపినప్పుడు, అతని పరిశ్రమంతా పరిహారమైపోయేది. భర్తచేతిలోనిటోపీని తీసుకునేది భార్య. ముగ్గురూనవ్వుతూ "టీ" త్రాగడానికి లోపలికి

వెళ్ళేవారు. ఆ బంగళా అంతా వారి నిర్మలానందపు కిలకిలనవ్వులతో ప్రతిధ్వనించేది.

ఆ పార్సీ మహాశయుడు ఎన్నోమార్లు అశోక్‌తో, తన జీవితానికి నర్గీస్ వెలుగువంటిదనీ, దాని పవిత్రప్రకాశంతోనే తన గార్హస్థ్యజీవితం, సుఖానందాలతో డోలాయమానంగా వుందని చెపుతున్నప్పుడు అతనికళ్ళలో వాత్సల్యంతో నిండిన అపూర్వదీప్తి ఎంతో నిండుగా కనుపించేది.

ఐతే, తన ఏకాకిజీవితంలో ఎప్పుడైనా ఒకబిడ్డ యీ రకమైన ఆనందాన్ని కల్గిస్తుందా ?

అతని కళ్ళెదట ఒక స్వప్నం నాట్యమాడినట్లయింది. తనూ అరుణా యిద్దరూ వివాహసూత్రంలో బంధింపబడినట్లూ, వారిప్రణయానికి ప్రతిఫలంగా ఒక అందమైన శిశువుతో అరుణ గర్భంధరించిందనీ, ఆ పుట్టబోయే శిశువు ఎవరిలావుంటుందా అనే విషయంలో యిద్దరూ పోట్లాడుకుంటున్నట్లూ వచ్చిం దాస్వప్నం.

అశోక్ ఆడపిల్లయి అరుణలా వుండాలంటున్నాడు.

కాదు. మగవాడై అశోక్‌లా వుండాలి; లేకుంటే, ఆ శిశువును ముట్టుకోనంటుంది అరుణ.

ఆ పోట్లాట పెద్దదయేసరికి అశోక్ మేలుకున్నాడు.

# 20

షుమారు నాలుగు వారాలు ఆనంద కోలాహలంలో మునిగితేలిన తరువాత అరుణ కాలేజీకి తిరిగి వెళ్ళిపోయి

నప్పుడు, అశోక్ హృదయం వియోగంతో బాధపడకుండా వుండలేకపోయింది. ఇంకా అతను 'లోనావలా'లోనే వుండా లనుకున్నాడు. ముందు కార్యక్రమ మింకా నిశ్చయించుకో లేదు. అధికారిదంపతులు యింకా రెండునెలలు అక్కడే వుంటారు. వారితో పాటు ఇంకా కొంతకాలం అక్కడే వుంటే బాగుంటుందనికూడా ఆలోచించాడు. ఆ ప్రౌఢదంప తులమీద, అతని హృదయంలో ఆత్మీయభావం ఏర్పడింది. అందువల్ల ఒక్కసారిగా వారికి దూరంగా పోదామనే కోరిక కలగలేదు. పరివారంతో కలిసిమెలిసివుండే జీవితం అతని కనుభవంలేదు. కాని, ఇప్పుడు ప్రథమంగా ఆ రుచి చూడ గలిగాడు. అతని భావుకహృదయంమీద దాని మాధుర్య ప్రభావం పడింది. అతని మనసు యీ గార్హస్థ్య జీవిత సుఖాన్ని పొందాలని ఆశపడింది. మానవుని మనసుకూడా ఎంత జటిలమైనది! నిన్నటివరకూ మనసులో మెదలని విష యమే యీనాడు సాకార కోరికై, అశోక్ సంపూర్ణ వ్యక్తి త్వాన్ని మొదలంటా ఆందోళనపరిచింది.

అరుణ షుమారు యిరవై ఎనిమిదిరోజులు అతని పొరుగున వున్నది. ఈ అల్పకాలంలో ఆమె జీవితంలోని ఏ చెడు అంశంకూడా అశోకునికళ్ళపడలేదు. అవును! అప్పు డప్పుడూ నౌకరులమీద మాత్రం అవుసరానికి మించిన కోపం చూపుతుండేది. అది అతనికి బాగుండేదికాదు. అంతే! బహుశా తన నడవడికవిషయంలో అరుణ స్వయంగా జాగ్రత్తపడిందేమో! ఆమె ఎప్పుడూ అశోక్‌తో వాగ్వి వాదానికి దిగలేదు. అతని యిష్టా యిష్టాలు గమనించి వాటికి

పీలుగా ఆచరించడానికి ప్రయత్నించింది. అతని చిత్రాలమీద ఆమె ఆసక్తి కనపరిచింది. వాటిని మెచ్చుకుంది. తన వృత్తి ఆమె జీవితలక్ష్యంతో ఏకీభవించిందని అశోక్‌కు అనిపించింది. అశోక్‌కి టీలో పంచదార తక్కువగా ఉండాలి. ఆమె ఆ విషయం దృష్టిలో పెట్టుకుని శ్రద్ధగా టీ తయారుచేసేది. అతనికి ద్రాక్ష, దానిమ్మ ఎక్కువ యిష్టం. ఇంట్లో యిద్దరు ముగ్గురు నౌకరులున్నా, ఆమె స్వయంగా బజారువెళ్ళి తీసుకునివచ్చేది. పర్వతాలమీదా, వనాల్లోను తిరగడం అతని కిష్టమున్నప్పుడు స్వయంగా తను వెంటబెట్టుకుని వెళ్ళేది. ప్రతి రాత్రి భోజనాలయాక, దిల్‌రుబా వాయించి, తన తల్లిదండ్రుల్ని, విశేషించి అశోక్ మనసును రంజింపచేసేది. మరి ఇవన్నీ అరుణ స్వాభావికరీతిగా చేస్తుందో లేక అంతా తెలుసుకుని ఏదో నిశ్చితమైన హేతువుతో చేస్తుందో చెప్పడం కష్టం! ఈ సూక్ష్మ కుశలప్రవర్తన ప్రభావం అశోక్ మీద పడలేదంటే, అది సంశయమే!

అందువల్ల అరుణ 'లోనావలా' నుంచి వెళ్ళిపోతున్నప్పుడు, అరుణ-అశోకుల వివాహవిషయం ఎవరినోటంట బయటపడలేదు. ఈ వివాహం నిశ్చయమైనట్లేనని అందరి మనసుల్లోనూ స్థిరపడింది.

నాగపూరు వెళ్ళగానే, అరుణ అశోకునికి ఒక అందమైన ఉత్తరం రాసింది. అందులో, ఆ యిరవై ఎనిమిది రోజుల సహవాస స్వర్గీయ ఘడియల్ని ప్రస్తావించింది. చివరలో— తను 'లోనావలా'లో ఒక అమూల్య నిధిని వదిలివచ్చాననీ, తన హృదయాన్ని ఉదాశీనత కప్పివేసిందనీ, తనకు అశోక్ స్నేహ

పూర్వకమైన వుత్తరం అందనిదే హాయిలేదని రాసింది. చిట్ట చివర రవీంద్రనాథటాగోరు వ్రాసిన రెండు పంక్తులు రాసింది.

అశోకుని మీాద యీా వుత్తరం పనిచేసింది. వెంటనే దానికి జవాబురాశాడు. అందుకని తను స్వయంగా బజారు వెళ్ళి అందమైన లెటరు పేపరూ, కవర్లపెట్టె కొని తీసుకుని వచ్చాడు.

అయిదోనాడు తిరిగి అరుణవుత్తరం వచ్చింది. అందులో అరుణ అస్పష్టంగా తన ప్రణయభావాన్ని వ్యక్తం చేసింది. అతని చిత్రకళయందు అత్యంత శ్రద్ధాపూర్వకమైన అనురాగం చూపించి, ఆ కళాభినివేశాన్ని ప్రోత్సహించడంలో తను అల్పమైన సేవచేయగల్గినా, ధన్యురాలిననుకుంటా నంది. ఈమారు ఆమె తన లేఖలో షెల్లీ ప్రణయగీతాన్నొక ద్యాన్ని నాలుగుపంక్తులు వ్రాసి పంపించింది.

"Nothing in the world is single'
All things by a law divine
in one another's being mingle-
Why not I with thine?"

అందుకు జవాబుగా అశోక్, తన జీవితధ్యేయంవిష యంలో చాలా సంగతులు వ్రాశాడు. తనహృదయంలో రేగుతున్న సంశయం—స్త్రీ-కళ లేక కళ-స్త్రీ అనే విషయం అరుణఎదుట పెట్టాడు. వీటికి సమన్వయం కుదురుతుందా? అని ప్రశ్నించాడు.

అరుణ వెంటనే వీటి సమన్వయమే జీవితకళ, చరమ ఫలశృతిఅనీ, ఇది సునాయాసంగా సంభవమవుతుందనే దృఢ విశ్వాసం తనకున్నదనీ, ఒకవేళ కళ - స్త్రీ మధ్య కలహామే సంభవించినట్లయితే, తను స్వయంగా అతనిమార్గంలోంచి తప్పుకుంటూనే కాని, అతనిలక్ష్యంతో కేనెప్పుడూ జోక్యం పెట్టుకోననీ వ్రాసింది.

ఐతే, అరుణ తన సహావాసాధిక్యతతో విసుగెత్తి తిరస్కరించదుకదా అని అశోక్ తిరిగి వ్రాశాడు. ఆ మరు టపాలో జవాబు అందింది. 'ప్రణయం అమరమైనది. ప్రణయమే భగవంతుడు. దాని కెప్పుడూ భంగంకలుగదు. తను కేవలం, యీ లోకంలోనే కాదు, పరలోకంలోకూడా అశోక్‌ను వదిలిపెట్టనని, చివరలో రాబర్ట్ బరన్స్ వ్రాసిన కొన్ని పంక్తులు వ్రాసింది.

"Till a' the seas gang dry, my dear,
and the rocks melt wi' the sun;
And I will love thee still, my dear,
While the sands o' life shall run."

అరుణకు ప్రేమలేఖలు అందంగా వ్రాయడం తెలుసుననడంలో సందేహం లేదు. ప్రతిలేఖలో బైరన్, కీట్స్, బ్రౌనింగ్ మొదలైన కవుల ప్రేమగీతాలను చేర్చుతుంది. ఒకప్పుడు ఏదో అందమైన ఫోటోను, యింకొకప్పుడు గులాబీ పూరేకుల్ని లేఖల్లో పెట్టి పంపుతూవుండేది. ఇటువంటి ప్రేమ

లేఖలు వ్రాయటం, ప్రేమించడం ఎక్కడ నేర్చుకుందో చెప్పడం కష్టం! కాని, మీ రామె తోలుసంచి విప్పి చూచినట్లయితే, అందులో అశోక్ వుత్తరాలు, కొన్ని అందమైన ఫోటోలు, రెండు యింగ్లీషుపుస్తకాలు – 'How to make love' (ఎలా ప్రేమించాలి?) How to write love letters (ప్రేమలేఖలు ఎలా వ్రాయాలి?) అనేవి మీకు కనుపించగలవు.

ఆమె తనెదట యిప్పుడు లేదు. ఎక్కడో దూరంలో వుంది. అందువల్ల, ఆమెస్వరూప మతని చూపులకు, ఎంతో అందమైనదిగా, ఉదాత్తమైనదిగా, భవ్యమైనదిగా కనుపించింది. ఆమె ఒక సాధారణ స్త్రీ కాదు. దేవతలస్థానంలో వుండవలసినది. ఆమె వ్రాసిన ప్రేమలేఖలూ, వాటిలో పెట్టి పంపించిన బహుమానవస్తువులూ, అరుణనుగురించిన ఆలోచనలూ – అన్నీ కలసి అతనిహృదయాన్ని పూర్తిగా ఆమెకు వశీభూతునిగాచేశాయి. తనిప్పుడు తన భవిష్యత్తులోని జీవితంతాలూకు రెండో అధ్యాయం అరుణతోనే ప్రారంభించగలడు. అరుణ లేనిదే అతని జీవితం లేదు.

అందువల్ల, అధికారి దంపతులిద్దరూ తాము 'లోనావలా'లో వున్నంతకాలం అతన్నికూడా తమతో వుండమని చెప్పినప్పుడు వారిమాట కాదనలేకపోయాడు. వారంతా అక్కడనుంచి వచ్చాక — అరుణ, అశోక్‌ల వివాహం నిశ్చయంచేశారు. అరుణపరీక్షలయ్యాక, ఏప్రియల్ మొదటివారంలో జడ్జిగారిని బదిలీచేసిన రాయపూరులో చేయాలనికూడా నిశ్చయించుకున్నారు.

# 21

అశోక్ కారు తన దృష్టిపథంనుంచి మాయమయ్యాక మరియమ్ విషణ్ణ, శూన్యహృదయంతో బంగళాకు తిరిగి వచ్చింది. బంగళా వేపు కన్నెత్తిచూచింది. కళ్ళు చెమ్మగిల్లాయి. ఆ బంగళాలోని ఆత్మే పోయినట్లనిపించింది. దానితో పాటు తనశరీరంలోని ఆత్మనుకూడా లాక్కునిపోయినట్లనిపించింది. జీవితంలో యిక మిగిలిందేమిటి ? ఏ ఆశ ? ఏ మోహం ?

కాని, మరియమ్ అచంచలమైన విశ్వాసమూ, శ్రద్ధా గలది. సుఖదుఃఖాల హెచ్చుతగ్గులు, బీదరికం, అవమానము, విరహం మొదలైన దెబ్బలవల్లకూడా, ఆమెకున్న విశ్వాసం చలించలేదు. అందువల్ల ఆమె అంతర్యంలో, జరిగేది తన మంచికే జరుగుతుందనే సూక్ష్మాశ దాగివుంది. విధివిధానంలో జరిగే ప్రతికార్యానికీ, ప్రసంగానికీ మహత్తూ, అర్థం వుంటుంది.

ఈ కల్పనతోనే ఆమె తన వేదనాభారాన్ని ప్రోది చేసుకుని ధైర్యంగా నిలబడింది. ఏవిధంగా అశోక్ వెళ్ళిపోవడం తన జీవితంలో వ్రాసివుందో, ఆవిధంగానే ఆమె యీ పాద్రీపురంలో వొంటరిగా వుండడంకూడా వ్రాసుంది. ఆమె తన మనోనిశ్చయమార్గాన నడవవలసిందే !

ఆ బంగాళాలోని ఒక్కొక్క అణువులో, దాని ఆవరణలోని పూలమొక్కల్లో, వనాల్లో, ఆ వాతావరణంలోని ప్రతి అణు, పరమాణువులో, అశోక్ తన మధురస్మృతులను వదిలి వెళ్ళాడు. మధుర ఘడియల పూర్వస్మృతితోనే మరి

యమ్ ఎంతో సమయాన్ని గడిపేది. రాత్రి తనపనులన్నీ పూర్తిచేసుకుని పక్కమీద నడుమువాల్చినప్పుడు, మనసులో ఆలోచనాప్రవాహం పొంగివచ్చేది. ఆమె దానిలోనే ఆనంద విహ్వాలయై, వాటిస్వరూపాల్నే కలలుకనేది. మొదటిసారి ఆమె అశోక్ ఛాతీమీద తలఆనించిన సెలయేటివద్దకు ఎన్నో మార్లు వెళ్ళింది. తనమీద పుష్పవృష్టికురిపించిన పొగడచెట్టు మీదకు ఎన్నోమార్లు ఎక్కింది. ఆమె అక్కడనుంచే, నేల మీద నిలుచునివున్న కాల్పనిక అశోక్ మీద పొగడపూలను కురిపించింది. మొట్టమొదట అశోక్ తనతలను వొడిలోకి తీసుకున్న, ఆ ఏకాంత జలాశయందగ్గరకెళ్ళి నిదురించింది. సరిగ్గా ఆ ప్రదేశంలోనే ఆమె తన తలక్రింద పెద్దరాతిని పెట్టుకుని, అదే అశోకుని వొడిఅనీ, ఎంతోకోమలం, ఎంతోసుఖప్రదమైనదనీ తన్మయంచెందేది. ఆ వరండా, ఆ పడకకుర్చీ, ఆ రమణీయ నిశీథకాంతిలో ఆ యిద్దరూ కలిసిన ప్రదేశం- ప్రియుడు, ప్రియురాలి ప్రథమ స్వర్గీయానందకలయిక జరిగిన ప్రదేశ మామెకు తీర్థదేవాలయంలా, పవిత్రమైపోయింది. నిశ్శబ్ద రాత్రివేళ ఎన్నోమార్లు అచ్చటికి వెళ్ళి, నేలమీద తల ఆనించి ఎంతసేపు కన్నీళ్ళుకార్చిందో! కాని, ఆమె ఎంత యేడ్చినా, ఆమె కన్నీటిసాగరం యింకిపోవలసిందే కాని, వాటి నీనాడు తనరుమాలుతో తుడిచి, ఓదార్చేవా రెవరున్నా రక్కడ?

మరియమ్మకు పిచ్చిపట్టలేదుకదా? ప్రపంచం ఆమెను పిచ్చిదని అనవచ్చు. కాని ఎవరైనా ఆమెమనసును అడిగినట్లయితే యీ ఏకాంత విలాపంలోనే, ఈ మూగ ప్రణయ

పూజలోనే ఆమెకు ఎంతో సుఖంకలుగుతుందనే జవాబు వారికి వస్తుంది.

ఉత్కంఠతతో కూడిన విశుద్ధానందంతాలూకు ఒక్క నెల ముప్పదిరోజుల స్వప్నమయ కాలఖండ సౌభాగ్యం తనబోటి అనాధురాలికి, తక్కువైనదా ? ఈ పుణ్యదినాల స్మృతి, ఆమెకు జన్మంతా సుఖానందాన్ని కలిగించలేదా ? ఐతే ప్రణయజీవితపు ప్రబల పరమానందం, దాని కాలం మీదనే అవలంబితమైవుంటుందా ? దాని సుఖజీవితము ముప్పదిరోజులలోనే సమాప్తమైపోయినప్పుడు - దానివల్ల ఆ ఒక్క నెలరోజుల వ్యవధిలోని పరమసుఖమయ ప్రచండా వేగంకూడా తగ్గిపోతుందా ? కాదు. భావాల సంపదలో ఆమె దరిద్రురాలు కాదు. ఆమె పొందినవీ, అనుభవించిన సౌభాగ్యం చాలా కొద్దిమంది స్త్రీలకు ప్రాప్తిస్తుంది.

ఈ కల్పనలోనే ఆమె అభిమానంతో, ఆత్మవిశ్వాసంతో తలెత్తుకుని తిరగగలిగింది.

కాని, చాలాకాలంవరకు అలా తలెత్తుకుని తిరగలేక పోయింది. ఆ తలమీద పడిన దెబ్బకు క్రిందకువంచుకోవలసి వచ్చింది. చివరకు దాన్ని సహించటమే కష్టమనిపించింది.

అశోక్ వెళ్లిపోయిన మూడు నాలుగు మాసాలతరు వాత, మరియమ్ తనలో యింకొక జీవిని దాచుకునివున్నదనే సత్యం దాగలేకపోయింది. మొట్టమొదట ఆమె కీ సత్యం అను భూతికివచ్చినప్పుడు, ఆమెహృదయం ఆ నిర్వచనీయ, నిగూఢా నందంతో ఉప్పొంగిపోయింది. ఎందుకంటే అది అశోక్ నిర్మల ప్రణయానికి చిహ్నం! ఆమెశరీరంలోని ప్రతిరోమమూ మాతృ

త్వంతాలూకు పవిత్ర, మంగళదాయకమైన బాధ్యతను పూర్తి చేసేందుకు ఆతృత చెందింది. అశోక్ ఆమెజీవితంనుంచి బొత్తిగా వెళ్ళిపోలేదు. ఆయన ఓ చిన్న ప్రతిమరూపంలో, ఆమెలో ఏకరూపమైవున్నాడనే జ్ఞానం, ఆహ్లాదం ఆమె కంతి తక్కువది కాదు. అదే మంచిది. ఆ రాబోవు జీవి బాలకుడే కావాలి. అశోక్‌లాగే కనుపించాలి. ఆమె యీ భవిష్యద్విషయాన్ని గురించి కలలుకంటోంది.

కాని, యీ సుఖసంఘటనను యింకొక దృష్టితో కూడా చూడవచ్చు. ఆ దృష్టి క్రూరంగానూ, నిర్మమతగానూ వుండవచ్చు. మిస్ థామస్ గర్జిస్తూ ఆమెను ప్రశ్నిస్తున్నప్పుడే ఆ విషయం మరియమ్‌కు అర్థమైంది.

"ఇది నిజమేనా ?"

మరియమ్ తలొంచుకుని, "అవును ! నిజమే" నని వొప్పుకున్నది.

"అందుకు నీకు సిగ్గువేయడంలేదా ?" ఆమె తిరిగి కఠినంగా అడిగింది.

"సిగ్గా...?...ఇందులో సిగ్గెందుకు ?" మరియమ్ అమాయకమనసు దీనికి తగిన జవాబుచెప్ప లేకపోయింది.

"దీన్ని వ్యభిచారమంటారని నీకు తెలుసా ?" మిస్ థామస్ వణకుతున్నకంఠంతో అన్నది. "ఈ గర్భాన్నిపరిమార్చకుంటే, నువ్వీ బంగళాను వదిలిపెట్టవలసివస్తుంది. నేను మిషనును అపకీర్తిపాలుకానీయలేను."

మరియమ్‌ముఖం తెల్లబడింది. ఆమెకళ్ళముందు తారకలు మెరిశాయి. ఎటుచూచినా కటికచీకటే కనుపిస్తోంది.

ఏ అనుభూతిని పరమపవిత్రమైనదని ఆమె భావించిందో, దాన్ని వ్యభిచారమనే పరమ అసహ్యాకరమైన శబ్దాలతో కూడా ఎన్నించవచ్చునేది ఆమె కర్థంకాలేదు. ప్రపంచంలో సత్యం యింత తారుమారవుతుందనేది తెలిసి, ఆమెమనసు వ్యథచెందింది.

మరియమ్ మాట్లాడకుండావుండడం చూచి, మిస్ థామస్ యింకా మాట్లాడుతూనేవుంది. ఎందుకంటే, ఆమె చెప్పవలసింది చాలావుంది. "ఆ ఆర్టిస్టు యింత పతితుడవుతాడని నే ననుకోలేదు. అతన్ని నేను పెద్దమనిషనుకున్నాను. మనుష్యులు యింత నీచులుగా..."

"కాదుకాదు, వారిని అలా అనకండి! నేను మీ కాళ్లు పట్టుకుంటాను. వారికీ విషయం తెలియనే తెలియదు. వారొకరివంటివారు కాదు. ఆయన వేరు."

"అలా అయితే, యిప్పుడూ ఒక దారివుంది. అతన్ని వెంటనే క్రిస్టియన్ మతం పుచ్చుకుని, వివాహంచేసుకొమ్మని వుత్తరంవ్రాయి! అప్పుడే యీ పాపానికి పరిహారమంటూ వుంది. అలా కానప్పుడు నువ్వికక్కడనుంచి వెళ్ళిపోవలసి వుంటుంది. తెలిసిందా?" అని కాళ్ళచెప్పులు టకటకలాడిస్తూ గదిలోంచి బయటికి వెళ్ళిపోయింది.

భవిష్యత్తులో నొసట ఎలా వ్రాసుంటే, అలా జరుగుతుంది. కాని, ఆమె అశోక్ కు అటువంటి వుత్తరం వ్రాయలేదు మొదటిది-మతపరివర్తనం విషయంలో అతని అభిప్రాయం దీనికి భిన్నంగా వుంటుంది. రెండోది-అశోక్ తనకు తానై,

తనవాడు కాలేనప్పుడు, అతన్ని బలవంతంగా ఆపుచేయ డానికి, ఆమె కేమాత్రం యిష్టంలేదు. ఒక అవకాశం వుంది. అతను కావాలనుకొని ఆమెను వెంటబెట్టుకుని వెడితే, తప్ప కుండా ఆమె, అతని ఆశ్రయం స్వీకరించేది. కాని, అలా చేయ నప్పుడు, జలగలా, బలవంతంగా అతన్ని అంటిపెట్టుకుని వుండ లేదు. ఇది ఆమెవల్ల ఎప్పుడూ జరగదు.

అటువంటప్పుడు మరియమ్ పాద్రీపురంనుంచి బహిష్క రించబడక తప్పదు. మిస్ థామస్ దండనాజ్ఞ జారీఅయి నప్పుడు దాన్నెవరూ కాదని త్రోసివేయలేరు. జోసెఫ్ కాకా అనునయంకాని, పాద్రీపుర నివాసుల సిఫార్సులుకాని, ఆ చిన్న బస్తీలోని కురూపులైన పిల్లల నిర్మలప్రేమగానీ, ఏదీ కాదన లేదు.

ఎంతో ఏడ్చి మొరపెట్టుకున్నాక ఆమె మాతృత్వాన్ని రహస్యంగా వుంచమని, మిస్ థామస్ ఇటార్సీ మిషన్ ఆసు పత్రికి ఒక సిఫార్సుఉత్తరం వ్రాసియిచ్చింది. కాని, మరియమ్ వెళ్ళబోతున్నప్పుడు మిస్ థామస్, పూర్తిగా పేరు మార్చు కోవాలనీ, భవిష్యత్తులో ఎప్పుడూ పాద్రీపురంలో తనవిషయం గాని, మిషన్ విషయంగాని చర్చించగూడదని హెచ్చరించింది.

ఒక చిన్న పక్కచుట్టా, చిన్న ట్రంకుపెట్టె తీసుకుని మరియమ్ ఇటార్సీవెళ్ళే బస్సులో కూర్చుంది. ఇక ఆమెకు తిరిగి పాద్రీపురం ఎప్పుడు కనుపిస్తుందో ? పన్నెండు సంవత్స రాల ఆమె మధుర, కఠిన మిశ్రమచరిత్ర యీ చిన్న అడివి గ్రామములో వ్రాయబడింది. ఆమె నీరసజీవితంలో సుఖ క్షణాలు ఇక్కడే గడిచినయ్. బహుశా ఆ క్షణాలు యిప్పుడు

తుదివేకావచ్చు. ఆ గ్రామములోని ప్రతివస్తువుతో—ఆ పెద్ద మామిడితోపుతో, రావిచెట్టుతో, అక్కడి గుట్టలతో, రెల్లు గడ్డి, పూరిగుడిసెలతో, దొడ్లతో, కాలిబాటలతో, ఆ పూరి గుడిసెలలో నివసించే స్త్రీ-పురుషులతో, పిల్లా జెల్లలతో, ప్రతి అణువుతోనూ ఆమెకు అంతులేని ప్రేమవుంది. ఈనా డంతవంది ప్రేమపాత్రులన్నీ వొదలి వెళుతూవుంటే, ఆమె హృదయం వేదనపడుతోంది. ఆమెకన్నీరు చూచి, తిరిగి అవి కూడా కన్నీరుకారుస్తున్నట్లూ, ఆగిపొమ్మన్నట్లూ అనిపించింది.

కాని, విధాత ఆదేశంలా కారు కదిలేందుకు డ్రైవరు హారన్‌వాయించాడు. భ-ర్-ర్-ర్ మంటూ కారు బయలు దేరింది. తన హృదయాన్నెవరో త్రుంచివేసి తీసుకుని వెడు తున్నారేమోనని మరియమ్ భ్రమించింది. ఆమె అశ్రుధార లలో యింకా దట్టమైన పొంగువచ్చినట్లనిపించింది. ప్రయాణీ కుల పరిశోధక చూపులనుంచి తననుతాను రక్షించుకునేందుకు, ఆమె రెండుఅరచేతులతో ముఖాన్ని కప్పుకుంది. ఆ తరువాత కొంతసేపయాక, కన్నీళ్ళుతుడుచుకునేందుకు, అశోక్ యిచ్చిన రుమాలు తీసింది.

రుమాలుతీస్తున్నప్పుడు మరియమ్‌చేతికి, దానినున్న మూట తగిలింది. దానిలో ఆమె స్వంతసంపాదన పదహారు రూపాయల పదమూడుఅణాలు వున్నాయి.

## 22

పనిచేయగలిగినంతకాలం మరియమ్ ఇటార్సీ మిషన్ ఆసుపత్రి వంటవిభాగంలో పనిచేసింది. అందువల్ల ఆమెకు

తిండీ, కొంత జీతంకూడా దొరికింది. ఆమె పేరిప్పుడు 'ఫ్రీటా ఫ్రాంకలిన్'...ఆమె ఎక్కణ్నుంచి వచ్చిందో, ఎక్కడి కెడు తుందో ఆ సంగతెవరికీ తెలియదు. ఆమె భూతకాలాన్నెవరో బలవంతంగా చెరిపేసినట్లుంది. అదేమంచిదనుకుంది మరియమ్.

ఆమె ఆసుపత్రిలో ప్రవేశించినప్పటినుంచీ, తన మాతృ త్వాన్ని శుద్ధమైనదిగా, సానుభూతిదృష్టితో చూచేవారెవరూ లేరని తెలుసుకుంది. అవును. ఒక నర్సువుంది. మీనా బెంజ మన్. బహుశా ఆమె కొంచెం తెలుసుకునివుండాలి. మిగిలిన వారంతా నెమ్మదిగా గుసగుసలతో, చూపులతో, వ్యంగ్యంగా తను వ్యభిచారిణనీ, తన మాతృత్వం పాపపంకిలమనీ, తనకు తెలియచేశారు. కొంతమంది నర్సులూ, రోగులూ, తనతో మాట్లాడ్డానికీ, యింకొకవిధంగా వ్యవహరించడానికీ నిరాక రించారు. తనవేపు వస్తుప్రదర్శనశాలలోని వింత వస్తువులా చూచేవారు. ఎంతోమంది తన కథ వినాలని కుతూహల పడేవారు. కాని, ఆమె వారి యెదుటనుంచి వెడుతున్నప్పుడు అదేపనిగా చూస్తూ 'ఛీ' అని ఛీత్కరించి, ముఖాన్ని ఒక ప్రక్కకు తిప్పుకునేవారు.

ఈ అవమాన తిరస్కారాల కారణంగా మరియమ్ ఎవరితోనూ మాట్లాడేదికాదు. అంతులేని వేదనా, దుఃఖా లతో ఒక బొమ్మలా మారి, మౌనంగా అణగిపోయినదానిలా ఎలాగో కాలం వెళ్ళబుచ్చుతోంది. కళ్ళలో భయంకరమైన విషణ్ణతా, శూన్యత్వమూ, ముఖంలో గాంభీర్యం తప్ప నవ్వు లాంటిది శాశ్వతంగా లేకుండాపోయింది.

వీణా బెంజిమన్, తనకుతానుగా మరియమ్‌తో వేరుగా వుండలేకపోయింది. ఆమె మనసులో, ఆ దుఃఖితురాలిపట్ల ఎందుకో దయకలిగింది. ఆమె చింధ్‌వాడ్ జిల్లాలోని భోర్ దయీ గ్రామపు పిల్ల. ఇటార్సీలోనే నర్సుశిక్షణ పూర్తిచేసింది. ఇక్కడ ఒక్క సంవత్సరం నౌకరీ పూర్తిచేయాలి. ఎక్కడైనా మంచిజీతం దొరికే ప్రదేశంకోసం గాలిస్తోంది. ఆమెకు యింటివద్ద, తమ్ముడూ, చెల్లెలూ, ముసలి తల్లీ వున్నారు. సంపాదన తక్కువ. ఆమె తన ఖర్చును తగ్గించుకుని పెద్దపెద్ద మొత్తాలు యింటికి పంపిస్తూవుంటుంది. వివాహపు ప్రసంగం ఎత్తనేఎత్తదు. ఎందుకంటే యీ సంపాదన ఆగిపోతుంది. అటువంటప్పుడు ఆ చిన్నపిల్లల గతేంగాను ? తన పరివారాన్ని బతికించుకునేందుకు ఆమె యీ ఆత్మత్యాగాన్ని ఎంతో సంతోషంగా చేసింది.

రాత్రి పన్నెండు గంటలకు మరియమ్ తన గదిలో పడుకునివుంది. పడుకునివుండడ మేమిటి ? పక్కమీద పడివుంది. ప్రస్తుతం ఆమెకు నిద్ర ఎక్కడనుంచి వస్తుంది ? ప్రసవించే సమయం దగ్గరకు వస్తోంది. ఇంకా వారం పట్టవచ్చు. వంటయింటికి దగ్గర్లోనే ఆమెకు ఒక చిన్నగది యిచ్చారు. అది యింతకుముందు స్టోరురూంగా వుండేది. అది ప్రత్యేకంగా వుంటుంది. మరియమ్ దానిలోనికి వచ్చి తలుపేసుకున్నప్పుడే ఆమెకు శాంతి దొరికేది. ప్రపంచంలోని వ్యంగ్యోక్తులూ, అపవాదులూ, ఆక్షేపణలు అక్కడికి రావు. ఆమె గదిలోనికి వచ్చి, మోకాళ్ళమీద కూచుని ప్రతిరోజూ ప్రార్థనచేసేది– 'ఓ భగవంతుడా ! ఇక నువ్వే దిక్కు !'.

ఆమె గోడవేపు ముఖంపెట్టి, పడుకునివున్నప్పుడు, ఎవరో తలుపుతీసుకుని మెల్లగా లోపలికి వస్తున్నట్లనిపించింది. ఈ అర్థరాత్రి చీకటిలోనా...! మరియమ్ లేచికూర్చుని కంపిత స్వరంతో—"ఎవరూ...?" అంది.

"నేనే...వీణను..."

"వీణా...! ఇటువంటి సమయంలోనా ? ఉండు చెల్లీ దీపం వెలిగిస్తాను."

"అక్కర్లేదు...అక్కర్లేదు...దీపం వెలిగించవలసిన అవుసరంలేదు. మేట్రన్‌కు అనుమానం కలుగుతుంది."

మెల్లగా తలుపుమూసి వీణ మరియమ్ పక్కమీద కూర్చుని—"ఈ పాలు కొంచెం త్రాగు మరియమ్" అన్నది.

"పాలా? పాలు నేనేంచేసుకోను ? ఇంత రాత్రప్పుడు నువ్వింత కష్టపడడం ఎందుకు ?"—మరియమ్ బేలగా అన్నది.

"నువ్వు పాలు త్రాగి చాలారోజులైంది దక్కయ్యా ! కాస్త పుష్టికరమైన ఆహారం పడకుంటే, లోపలున్న పసిగుడ్డు ఆరోగ్యం ఎలా బాగుంటుంది ? నీకోసం కాకపోయినా ఈ పసిగుడ్డుకోసమైనా, నువ్వు పుచ్చుకోవాలి. ఎంతో జాగ్రత్తగా వీటి నివ్వాళ మిగిల్చాను. రేపు ఎక్కువ తీసుకువస్తాను".

"మరియమ్ ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది. ఆమె కళ్ళ వెంట టపటపమంటూ కన్నీళ్ళు కారినయ్. అశోక్‌నుండి విడిపోయినప్పటినుంచీ సానుభూతనే మృదుశబ్దాన్ని వినేందు కామె నోచుకోలేదు. ఇవ్వాళ అకస్మాత్తుగా దానిని విని ఆమె హృదయం ద్రవించిపోయింది.

"ఏడవకు అక్కా—" వీణ, మరియమ్ కళ్లు తుడిచి "ఈ రోజులుకూడా వెళ్ళమారిపోతాయి!" అన్నది.

"లేదు. నేను నా దుర్దినాలకు ఏడవడంలేదు వీణా!" మరియమ్ వెంటనే అన్నది—"నా యీ కటిక చీకటిగదిలో నేడు నువ్వు స్నేహ సానుభూతుల దీపం వెలిగించడానికి వచ్చావు. నీ యీ ఋణాన్ని ఎప్పుడు తీర్చుకోగలను..."

"వ్యర్థమైన మాటలంటున్నావమ్మా—" వీణ అన్నది. ఈ వ్యవధిలో వారిమధ్యనున్న పరాయిత్వమనే ఆవరణ దూరమైపోయి పాత చెలికత్తెల్లా మారిపోయారు.

"నువ్వు మోహావేశంలో పడిపోయావా లేక ఎవరైనా మోసగించారా? ఏ పెద్దమనిషికూడా యింత నిర్మమతగా వదిలి వెళ్ళరు—" వీణ అన్నది.

ఇంతవరకూ మరియమ్ అన్నింటినీ వొంటరిగానే సహించింది. హృదయంలో మండుతున్న జ్వాలను తనలోనే దాచుకుని వుంచింది. తన మనసులోని బాధను వ్యక్తపరిచే అవకాశమే ఆమెకు దొరకలేదు. నేడు వీణ తనయందు సానుభూతి చూపుతోంది. ఆమెను నమ్మి, మనసువిప్పి, ఆమెఎదుట వుంచవచ్చు. అందువల్ల మనసు తేలికపడుతుంది. మరియమ్‌కు ఆ అవకాశంకూడా వుంది. అందువల్ల వీణవేసిన సూటిప్రశ్నను నిరాకరించలేకపోయింది.

"కాదు. వీణా! నేను మోహావేశంలో పడి కొట్టుకుని పోలేదు. నన్నెవరూ మోసగించలేదు. ఛీ...ఛీ...వారి విషయంలో అలా వూహించడంకూడా పాపమే! వారిలాంటి సౌమ్యమూర్తులు దొరకడం కష్టం."

"ఏమీ తెలుసుకోకుండా, వారివిషయంలో నేను నిరాధారంగా అన్నమాటలకు క్షమించక్కా! కాని, వారు నిన్నిలా వొంటరిగా ఎందుకు వదలివెళ్ళారు.?"

"లేదు. వారు వదలివెళ్ళలేదు. బహుశా నా స్థితి వారికి తెలియదు. ఒకవేళ తెలిసినట్లయితే, నాకు సహాయం చేసేందుకు పరుగెత్తుకుని వస్తారని నా నమ్మకం!"

"ఐతే, నువ్వు వారికి ఉత్తరం ఎందుకు వ్రాయకూడదు? ఆయన అడ్రసు తెలియదా?"

మరియమ్ మాట్లాడలేదు. ఆ సంగతి చెప్పకూడదనిదని వీణ అనుకుంది.

"నువ్వాతన్ని మనసార ప్రేమించావా అక్కా.?"

"అవును..." మరియమ్ తన హృదయంలోని భావాల్ని ఆ రెండక్షరాల్లో వొలికించాలనుకుంది—"ఇప్పుడూ ప్రేమిస్తున్నాను." దృఢంగా అన్నది.

"మరి వారో...?"

"వారు కూడా ప్రేమిస్తున్నారు. బహుశా వారికీ సంగతి తెలియదనుకుంటాను. వారు తన జీవితలక్ష్యాన్ని యింకా ఎక్కువగా ప్రేమిస్తారు. వారు దానివెంటే పిచ్చివాడిలా పడ్డారు. వారిమార్గాన్ని అడ్డగించడం నేను ఉచితం కాదనుకున్నాను."

"విచిత్రమైన సంగతి. ఈ సంగతి ను వ్యాయనకు చెప్పావా?"

"చెప్పవలసిన అవుసరమేముంది చెల్లీ? వారు జీవిత లక్ష్యం మాటిమాటికీ పిలుస్తోంది, వెళ్ళాలి అన్నారు. అందుకు నేను 'మంచిది' అన్నాను."

"ఆయనను ఆపేందుకు నువ్వేమాత్రం ప్రయత్నించ లేదా?"

"లాభమేమిటి...? తమంత తాము రావాలనుకోని వారిని, బలవంతంగా గొలుసులతో కట్టివుంచినా ఏమి పొంద గలము? అంతేగాక, పురుషునిస్వభావం, స్త్రీస్వభావానికి భిన్నంగావుంటుంది వీణా-! పురుషుడు, జీవితసంగ్రామంలో విజయం పొందాలని చూస్తుంటాడు. అతను కార్యకుశ లత్వమూ, పురుషార్థవిజయం కోరుతాడు. స్త్రీ ప్రేమకోరు తుంది. ప్రేమించడం, ప్రేమించబడడం కోరుతుంది. పురుషుని ఆత్మ,- అంతఃకరణం, ఏదో ఒక లక్ష్యవిశేషంపై పిచ్చిదై పోతుంది. పురుషుడు తన లక్ష్యంవిషయమే ఆలోచిస్తూ-దాని యందే విశ్వాసపాత్రుడుగా వుంటాడు. స్త్రీ తన పురుషుని యందు విశ్వాసపాత్రురాలిగా వుంటుంది. ఒకవేళ పురుషుని ప్రణయం భంగమైతే, అతను వేలకొలది పనుల్లో తన మన సును లగ్నంచేయగలడు. స్త్రీకి ప్రణయంభంగమైనప్పుడు, ఆమె ప్రక్కమీద పడి తలగడదిండ్లలో తలదూర్చి ఏడవడం కన్నా చేయగలిగిందేమీ లేదు. లక్ష్యనిష్ఠాపరునికి, స్త్రీ అంటే ఏమీ లేదు. లక్ష్యనిష్టగల స్త్రీలకు పురుషుడే లక్ష్యం! అందుకనే క్రీస్తుభగవానుడు ఒకసారి- "Woman, what have I to do with thee" (నారీ! నాకు నీతో ఏంపనివుంది?) అన్నాడు."

వీణ యిదంతా ఏకాగ్ర ధ్యానంతో వింటోంది. స్త్రీజీవిత దురదృష్టకథను, ఈ అభాగిని నోటినుంచి విని ఆమె స్వయంగా వ్యథచెందింది. ఒక దీర్ఘనిట్టూర్పు విడిచి-"అయితే మన స్త్రీలజీవితంలో దుఃఖాంతమే వ్రాసుందా అక్కా?" అని అడిగింది వీణ.

"లేదు చెల్లీ! అలాకూడా లేదు. మనకు ప్రణయానుభూతి కలిగినప్పుడు, మనం మన సర్వప్రాణాలతో, ఆత్మ, హృదయం, శరీరంలోని ప్రతిరోమముతో, ఆ పరమసుఖాన్ని అనుభవిస్తాము. మన ప్రణయంలోని ఏకాగ్రతా, ఉత్కంఠతే, అన్నిటికీ మించిన మన గొప్పసంపద! మనం ఒకరికే మన హృదయాన్నిచ్చినప్పుడు ఏమీ మిగిలించుకోలేము. సంపూర్ణంగా ఆత్మసమర్పణచేస్తాము. మనం తిరిగి జీవితాంతంవరకు దానివిలువను తీర్చవలసిందే, అది మనస్వభావం. మనం దానికి విరుద్ధంగా వెళ్ళలేము. ఆనందంతాలూకు ఆ పరాకాష్ఠే మనకు అన్నిటికిమించిన గొప్పసుఖం. ఐతే, ప్రణయస్వల్ప జీవత్వం, దాని ఏకాగ్రఆనందాన్ని తగ్గించగలదా? ఏ ప్రబలమైన సుఖాన్ని నేను ముప్పదిరోజుల అల్పావధిలో పొందానో, దాని నొకవేళ ఆ తరువాతకూడా పొందలేకపోయినప్పుడు ఆ ముప్పదిరోజుల అనుభూతికూడా నీచమైనదేనా! కొన్ని దాంపత్యాలు, ప్రేమహీనంగా, తమజీవితాల్ని కొన్ని సంవత్సరాలవరకూ గడుపుతుంటాయి. ఐతే నేను వారికన్నా భాగ్యశాలినని కాదా? స్త్రీజీవితానికి చరమపరిసమాప్తి యీ మాతృత్వమే! దీన్ని పొంది మనం ప్రపంచంలో గొప్ప గొప్ప వైభవాల్నికూడా తుచ్ఛమని కాలదన్నగలము"

ఆ మాటలు వీణనుకూడా కదిలించేంత ఉత్సాహంగా అభిమానంతో చెప్పింది.

"అయితే, అక్కయ్యా! నీ మనసులో ఆయనమీద కొంచమైనా కోపంలేదా?" వీణకు స్త్రీజాతి మనోవిలాసాల కన్నా, తనెదుటకూర్చున్న స్త్రీజీవితంమీద ఎక్కువ కుతూహలం కలిగింది.

"లేదు చెల్లీ లేదు. పైగా ఆయనంటే ఎంతో కృతజ్ఞతతో వుంటున్నాను. ఆయనను కలుసుకోకముందు నేను నిజమైన జీవితసుఖా న్నెరుగను. ఆయనమూలంగానే, నాకా దివ్యానుభూతి కలిగింది. పరసువేది యినుమును తాకినంతనే బంగారంగా మారినట్లు - నా అభాగ్యజీవితాన్నికూడా వారు చరితార్థంచేసివేశారు. నేను పొందినది చాలా తక్కువమంది స్త్రీలకు మాత్రమే లభిస్తుంది. ఈ కల్పనతో నా తల గర్వంతో పైకెత్తుకనివుంటుంది ఈ దివ్యప్రేమానుభవం ప్రతి స్త్రీకి ప్రాప్తించేటు భగవంతుడు చేయాలి".

ఆ చీకటిలోకూడా మరియమ్మకళ్ళు ఒక విచిత్రమైన వెలుగుతో మెరిసినట్లు వీణకు కనుపించాయి. ఆమె మనసులోనే - "అటువంటి సౌభాగ్యం స్త్రీలందరికీ దొరకదు. నిజమే. ఐతే ఎప్పుడైనా, తన జీవితంలోకూడా అటువంటి దివ్యానుభూతి కలుగుతుందా?" అని అనుకుంది.

"ఆయన నీవద్దకు ఎప్పుడైనా తిరిగివస్తారా?" వీణ అడిగింది.

"తిరిగివస్తారో లేదో ఆ భగవంతునికే తెలుసు. కాని, ఇప్పుడు నాకా విచారంలేదు. వారు నన్ను వదిలిపెట్టివెళ్ళ

లేదని నా అభిప్రాయం. నా గర్భంలో దాగివున్నారు. ఈ నిధితోనే, నేను నాజీవితాన్ని ఎంతో హాయిగా గడుపుకుంటాను. ఎన్నికష్టాలు వచ్చినా, వాటన్నిటినీ సహించగలనని నా విశ్వాసం. అంతకుముందు నా జీవితానికి లక్ష్యమే లేదు చెల్లీ! ఇప్పుడు నాఎదుట ఒక లక్ష్యబిందువున్నది నే నిప్పుడు నాకోసం కాదు. ఇంకొకరికోసం జీవించివుండాలి. ఈ ఊహ తక్కువ సుఖదాయకమైందికాదు వీణా!"

విచిత్రప్రకృతిగల స్త్రీ, ఈమె. ఏ మహత్తరమైన తత్వాలతో పరిపూర్ణమైవుందో అది ప్రపంచానికి తెలియదు. ఏదో ఒక లక్ష్యం వెంటపడి, యీమెను వదిలి వెళ్ళిన ఆ మూర్ఖపురుషునికికూడా యీ మాణిక్యంవిలువ తెలియదేమో!

వీణ ఆ గదిలోంచి బయటికివచ్చేసరికి రెండుగంటలు కొట్టింది. ఇవాళ తనొక అమూల్యనిధిని పొందగలిగినట్లు వీణ భావించింది. ఆ ఆనందంలో ఆమెకు మిగిలినరాత్రి నిద్ర పట్టలేదు.

## 23

జబల్‌పూరుపట్టణ 'బూచితోట' ప్రాంతంలో కొన్ని చిన్న చిన్న బంగళాలు వున్నాయి. వాటిలో ఎక్కువగా రైల్వేపనివారూ, మధ్యతరగతి ఉద్యోగస్తులు వుంటుంటారు. వీరిలో అన్నిజాతులవారు—హిందువులు, క్రిష్టియన్‌లు, ముసల్మాన్‌లు, కొంతమంది పారశీకులు కనుపిస్తారు. ఆ బంగళాల చుట్టుప్రక్కల మైదానంలో చిన్న చిన్న తోటలు పెంచారు

వాటిలో పచ్చని చెట్లూ, చేమలు, రంగురంగుల పూలగుత్తులు చూడ్డానికి చాలా మనోహరంగా వుంటాయి.

ఈ బంగళాల్లో ఒకదానికి ఔట్‌హౌస్ వుంది. దానికి ఆఖరిగదికి సమీపంగానే బంగళా ఆవరణ ఆఖరవుతుంది. అక్కడినుంచే ఒక కాలువ పారుతూవుంటుంది. గదికి ఒక కొయ్యతలుపు, ఒక కిటికీ వుంది. ఎదురుగా చిన్న వసారా వుంది. గదిలో ఒకమూల పొయ్యి, కొన్ని మట్టిపాత్రలు, టిన్నులు, రెండుమూడు వెదురుబుట్టలూ వున్నాయి. రెండో మూలను ఒక పక్క చిందరవందరగా చుట్టివుంది. దానిమీద గుడ్డలమూట వుంది. గోడఅలమారులో కొన్ని పుస్తకాలు, నోటుపుస్తకం వున్నాయి. అందులోనే ఒక కలం, పెన్సిలు, సిరాబుడ్డి, రెండు మూడు సీమసున్నంముక్కలు వున్నాయి. గోడలకు మూడు నాలుగు పటాలు వ్రేలాడుతున్నాయి. వాటిలో కొన్ని సచిత్ర వారపత్రికల్లోంచి కత్తిరించినవి వున్నాయి. మధ్యలో ఒక ముక్కాలిపీటమీద తెల్లటిగుడ్డ పరచివుంది. దానిమీదనే పగిలిన గాజుసీసాలో నీళ్ళు నింపి, రెండు మూడు పూలూ, పచ్చని ఆకులగుత్తులు వుంచబడ్డాయి. కిటికీమీదకూడా నీలపువరదా వుంది. ప్రస్తుతం దానిరంగు వెలిసిపోయింది. ఆ కిటికీమూలలో రెండు గోడల మీద రెండు గట్టిమేకులు దిగగొట్టి, దానికి తాళ్ళుగట్టి జంపఖానా వుయ్యాలగా వేసివున్నది. దానిలో రెండుమూడు నెలల పసిపిల్లవాడు పడుకునివున్నాడు. ఆ దగ్గర్లో గోడకానుకుని ఒక యువతి, దా న్నెంతో ఆప్యాయంగా వూపుతోంది. ఆమె కళ్ళలో వాత్సల్యం దీప్తివంతంగావుంది. ముఖంమీద ఆనందం

తాండవిస్తోంది. కళ్ళు పిల్లవాడిమీదే వున్నాయి. కాని మనసు అతని భవిష్యత్తును గురించి కలలుకంటోంది.

ఇంతలో పొరుగింటినుంచి కర్కశస్వరం వినిపించింది.– "మరియమ్...ఓ మరియమ్...ఎక్కడ చచ్చావే..."

మరియమ్ స్వప్నావస్థకు భంగంకలిగి, ఆమెముఖంమీద భయం కనుపించింది. గాభరాపడి అక్కడినుంచే "వస్తున్నానండీ..." అన్నది.

ఈ సందడికి పిల్లవాడు మేలుకొని ఏడుస్తున్నాడు. మరియమ్ ఉయ్యాలను గట్టిగా వూపి బయటకు పరుగుతీసింది.

"ఏమే...! లోపల ఏం చేస్తున్నావు? నే నెప్పటినుంచో గొంతుపొయ్యేట్టు అరుస్తుంటే జవాబుకూడా చెప్పలేవా? బేబీ ఎప్పటినుంచి ఏడుస్తోందో వినలేదా? దీన్ని తీసుకో! నేను బజారుకెళ్ళాలి. రేపు ఆదివారమని నీకు జ్ఞాపకం లేదా?"

"నాకు నీ కేక వినిపించలేదక్కా! లేకుంటే వెంటనే పరుగెత్తుకునివచ్చేదాన్ని".

"నా కేక వినిపించలేదూ? అరిచీ అరిచీ నా గొంతు పడిపోయినా, నా కేక వినిపించలేదా? ఈ వయ్యారపుమాటలు నాదగ్గర పనికిరావు. ఇదుగో చెప్తున్నా. నేను దావూద్ పహిల్వాన్ కూతుర్ని, తెలిసిందా? నా మొగుడే నాకు భయపడుతున్నప్పుడు నీలాంటి దాసీది నా కొక లెక్కా? లోపల ఏమి చేస్తున్నావే...? ఎవడైనా విటుడు దొరికాడా?"

"అవేం మాట లక్కయ్యా?" ఆమె బేలగా అన్నది. "నేను అశోక్‌ను నిద్రపుచ్చుతున్నాను."

"భలే అశోక్...!" ఆమె ఎక్కిరించినట్లు ముఖం పెట్టి— "తండ్రెవరో తెలియని..."

"కాదు కాదు. అలా అనకు అక్కా! నేను నీకాళ్ళ మీద పడతాను." మరియమ్ చెమ్మగిల్లిన కళ్ళతో అన్నది. "దుఃఖితురాలిని. మీ అండచేరాను. ఎలాగైనా నన్ను ఆదరించండి."

"అరే, ఏడుస్తున్నావా? నాటకమాడటం నీకు బాగా తెలుసన్నమాట. బడిపంతులమ్మకు బదులు బజారులో దుకాణం తెరిచావంటే ధనవంతురాలివై పోతావు. ఇప్పుడింకా మునిగిందేమీ లేదు...సరే. యీ బేబీని పూరడించు. నేను వెడుతున్నాను. మిస్టర్ విలియమ్ బయట నాకోసం వేచివున్నాడు. దీన్ని ఏడిపించావంటే జాగ్రత్త." అంటూ ఆ స్త్రీరత్నం, చండికలా, గబగబా బయటికి వెళ్ళిపోయి, ఆ సమీపంలో నిండుసూటులోవున్న యువకునితోపాటు టాంగాలో ఎక్కి కూచుంది.

మరియమ్ ఒకటి రెండునిముషాలు తలొంచుకుని; నిశ్చలంగా నిలుచునివుంది. కన్నీరు కారుతూనేవుంది. చిన్నారి అశోక్ ఏడ్పు వినిపించాక, ఆమె తేరుకుని, బేబీని ఎత్తుకుని తనగదిలోనికి వెళ్ళిపోయింది. పిల్లలను ప్రేమించడం ఆమెకు తెలుసు. అందుకని పిల్లలిద్దరూ ఏడ్పుమానివేశారు.

ఆమె గదిలోకూర్చుని ఆలోచిస్తోంది. ఇటువంటి జీవితాన్నే విధి తనకు విధించాడా? అవమానాలూ, అపవాదులూ, హృదయాన్ని భేదించే వ్యంగ్యోక్తుల్ని వినవలసిందేనా? ఎటు చూచినా అడుగడుగునా ఆమె స్వాభి

మానంతో క్రుంగిపోతోంది. ఒకవేళ యీవిధంగానే వుంటే, తన ఆత్మ చనిపోదా ? తన స్వత్వమే నాశనంకాదా ? అదే నశించిపోయినప్పుడిక మిగిలేదేమిటి ?

ఆమెకు గతంలోని కొన్ని నెలల విషయాలు జ్ఞాపకం వచ్చినయ్.

తనను అశోక్ వదిలివెళ్ళినప్పటినుంచీ, తను అవమానాలూ, దెప్పిపొడుపులు తప్ప యింకేమీ వినలేదు. మిస్ థామస్ మొదలు, యీ కర్కశస్త్రీవరకు అంతా కఠినశబ్దాలతో తిరస్కారాలతో హృదయాన్ని భేదించారు. ఒక్కసారి వీణ మొదట తనగదిలోనికి వచ్చినప్పుడు మాత్రం, తనకు స్నేహం, సానుభూతి లభించాయి.

ఇటార్సీ ఆసుపత్రిలో తను బాధలేకుండా ప్రసవించింది. ఆమె కోరినట్లుగా మగపిల్లవాడే పుట్టాడు. చూడ్డానికి అచ్చంగా అశోక్‌లాగే వున్నాడు. కృతజ్ఞతతో ఆకాశంవంక చూచి ధ్వంసమైన తన జీవితంలోకూడా తనను భగవంతుడు మరిచిపోలేదనీ, తన ఆర్తనాదం విన్నందుకు ఒక్కసారి ధన్యవాదాలర్పించింది. మొట్టమొదటసారి ఆ సుకుమార కోమల పెదవులను, తన వక్షస్థలానికి హత్తుకున్నది.

ఆహా...మాతృత్వ ప్రథమానుభూతి ! అనిర్వచనీయానందం. దానిముందు స్వర్గంకూడా తుచ్ఛమైనదే! చాలు. దాన్ని పొంది తను అన్నీ నవ్వుతూ ఆనందంతో సహించగలదు.

ఈ చరమసుఖ ఉన్మాదంలో బిడ్డకు అశోక్ అని నామకరణం చేసింది.

అశోక్ ! ఈ మూడక్షరాల కలియకలో ఏదో ఇంద్ర జాలంవుంది. వాటిని ఉచ్చారణచేస్తుంటేనే, హృదయంలో ఏమిటేమిటో మృదువైన సంవేదన కలుగుతుంది. బహుశా పెద్ద అశోక్ తిరిగి ఆమెజీవితంలోకి రాకపోవచ్చు. అందువల్ల, యిప్పుడీ చిన్న అశోకే ఆమెకు సర్వస్వం! ఈ నిధి ఆమెకు చాలుకూడా!

ఆ పసికందు జన్మించి నెలా వారమయ్యాక, అతన్నీ, ఈశాపురాన్నీ అంటే, ఒక పక్క-చుట్ట, ట్రంకు తీసుకుని రాత్రి మూడుగంటల కామె ఎలాగో ఆసుపత్రినుంచి తప్పించుకుని, జబల్‌పూరు వెళ్ళే అలహాబాద్ ప్యాసింజరులో ముఖంకప్పుకుని కూచుంది. అవును! ఆమె వచ్చేప్పుడు, తనకోసం ఎవరినీ వెదకవద్దనీ, ఆత్మహత్యచేసుకుంటానని మాత్రం అనుకోవద్దని ఒక చీటీ పెట్టివచ్చింది. ఆమె కేవలం, తనకథ తెలియని అజ్ఞాతప్రదేశానికి వెడుతున్నాననీ, ఇటార్సీ ఆసుపత్రిలో తనకు జరిగిన సేవాశుశ్రూషలకు ధన్యవాదాలర్పిస్తున్నానని కూడా వ్రాసింది.

వీణ తప్ప మిగిలినవాళ్ళంతా—“సరే, వదిలిపోయింది” లెమ్మనుకున్నారు.

ఈవిధంగా ఇటార్సీ మిషన్ ఆసుపత్రిరిజిస్టరులో ఏ స్త్రీ పేరు ‘ఫ్రిటా ఫ్రాంక్‌లిన్’ అని రాసుందో, ఆమెజీవితంకూడా సమాప్తమైంది. ఆ తరువాత మరియమ్‌జీవితంలో తిరిగి క్రొత్త అధ్యాయం మొదలైంది.

బండి ఇటార్సీనుంచి బయలుదేరింది. సోహాగ్‌పూర్, పిపరియా, గాడర్‌వాడా, నర్సింగ్‌పూరు......

మరియమ్ స్త్రీల పెట్టెలో కూర్చుంది. తోటి ప్రయాణీకురాలు అడిగింది- "ఎక్కడికి వెడుతున్నావమ్మా ?"

"జబల్ పూరు"

"బస ఎక్కడ...?"

మరియమ్ మాట్లాడ లేదు. ఎక్కడవుండేది ఏమని చెప్పగలదు ? అసలు ఫలానా అని తెలిస్తే కదూ ?

ఆ స్త్రీ పిల్ల వాణ్ని తన చేతుల్లోకి తీసుకుంది. బహుశా ఆమెకు యింతవరకూ మాతృత్వంపొందే సౌభాగ్యం కలగనట్లుంది.

"అందమైనవాడు; వీడి తండ్రి ఎక్కడున్నాడు ?"

మరియమ్ తిరిగి మాట్లాడలేదు. కాని, కనురెప్పలు తడిసినై.

"ఓహో ! బహుశా చనిపోయి వుండవచ్చు" ఆమె సానుభూతిని ప్రదర్శిస్తూ-"ఛీ ఛీ ఛీ ! ఇంత అందమైన ఆడదాన్ని, పిల్లవాడ్ని వొదిలి వెళ్ళిపోయాడా ? ఆరి భగవంతుడా ! నీ లీలలు విచిత్రం" అన్నది.

మరియమ్ కన్నీళ్ళు కారుస్తూనేవుంది. ఆమె మాటను ఖండించనూ లేదు, వినసూ లేదు. మౌనంగా అంతా సహిస్తూ వుంది.

ఆ స్త్రీ సహాయంతో, ఆమె జబల్‌పూరులో తనూ, తనబిడ్డకడుపు నింపుకునేందుకు నౌకరీకోసం, యింటింటికీ తిరుగుతోంది.

విక్టోరియా ఆసుపత్రిలో నర్సింగ్ శిక్షణ నేర్చుకుంటే కొంత గౌరవ వేతనం దొరుకుతుంది. భవిష్యత్తులో గౌరవ ప్రదమైన జీవితాన్ని గడిపే దారికూడా దొరుకుతుంది.

హిందీ - యింగ్లీషులో మేట్రన్ కొన్ని ప్రశ్నలు అడిగాడు. మరియమ్ బుద్ధిమంతురాలనీ, నర్సింగ్ కోర్సు తెలుసుకో గలదని, ఆమె జవాబులవల్ల గ్రహించి సంతోషించాడు. కాని, చదువుకున్న సర్టిఫికెట్ లేదు. అందువల్ల కొంచం ఆటంకం కలిగింది. అయినప్పటికీ, అతను డాక్టరుతో సిఫారసు చేయించినట్లయితే ఏదో ఒక దారిచూడవచ్చనుకుని- "వివాహితురాలివా? అవివాహితురాలివా? లేక విధవవా?" అని అడిగాడు.

మరియమ్‌కు సంకోచం కలిగింది. తిరిగి కొంచంసేపు ఆగి మెల్లగా- "అవివాహితురాలిని" అని చెప్పింది.

"అయితే, రేపుదయం యిదే సమయంలో యిక్కడికి రా! నేను డాక్టరుతో మాట్లాడి జవాబు చెపుతాను. నిన్ను ఏదో ఒక పనిలోకి తీసుకుంటారని నాకు నమ్మకంవుంది."

ఆ మరునాడుదయం, సాయంకాలం తనకున్న సామాను సంతా - తీసుకుని క్వార్టర్సులో వుండేందుకు రమ్మని చెప్పినప్పుడు తనెంతో సంతోషించింది. తన సౌభాగ్యాన్నెంతో పొగడుకుంది.

కాని, సాయంకాలం, ఆమె చిన్న అశోక్‌ను తీసుకుని టాంగాలోంచి దిగినప్పుడు మేట్రన్ వచ్చి - "ఇదేమిటి...? యీ పిల్లవాడెవరు ?" అని అడిగాడు.

"నా పిల్లవాడే-" ఆమె క్రిందకు చూస్తూ అంది.

"నీ పిల్లవాడా–? ఐతే నువ్వు వివాహితవా ? ఓహో ! నో – నో – నో – పనికిరాదు. ఇది ఆసుపత్రి. ఇక్కడికి గౌరవ నీయులైన మహిళలు వస్తుంటారు. రంకు – బొంకుల కూటం కాదు. సారీ ! ఐ కాంట్ హెల్ప్ యు. (నేను మీకు సహా యంచేయలేను)." అని మేట్రన్ వెంటనే వెనకకు తిరిగిచూడ కుండా వెళ్ళిపోయాడు.

మరియమ్ అక్కడే దుఃఖితురాలై, నిరాశతో నిలబడి పోయింది. ఇంతలో ఆమె కొంతమంది స్త్రీలు కిలకిలమని నవ్వడం విని తెలివితెచ్చుకుంది. ఆ చుట్టుప్రక్కల వసారా లలో ఎంతోమంది నర్సులు, స్త్రీలు తను విషపుచూపులతో తనను చూస్తూ కుత్సితంగా నవ్వుతున్నారు. వారిచూపుల్లో పరిహాసభావం కనిపిస్తోంది.

మరియమ్ సిగ్గుతో అక్కడే కుంచించుకుపోయింది. ఇంతకుపూర్వం బాణాల్లా హృదయంలో గుచ్చుకున్న తీక్షణ వీక్షణాలు ఆమె మరిచిపోలేదు.

ఆతరువాత ఏ దొరగారియింట్లో వంటచేయడానికో, పిల్లలదాదిగా వుందామనో, ఆమె ప్రతి వాకిలీ తిరిగింది. కాని సమాజవిరుద్ధమైన ఆమె మాతృత్వం ప్రతిచోటా ఆమెకు అడ్డువచ్చింది. ప్రతిచోట అవమానింపబడి తిరిగిరావలసి వచ్చింది. ఒకటిరెండుచోట్ల, ఆమెకు ఆశ్చర్యం కలిగేటట్లు కొంతమంది అపురానికిమించిన స్నేహం, ఆత్మీయతా చూపించారు కాని, తొందరలోనే వారి స్వభావం మంచిది కాదని, వారు కేవలం ఆమెశరీరాన్నే వాంఛించారని గ్రహిం చింది. ఏమి జరిగినా, నాకు కోరిన జీవితాన్నామె

గడపలేదు. ఆమె తన తనువూ, మనసూ, ఒక్కసారే ఒక పురుషునికి అర్పించింది. అంతే! ఇది అతనిదే; ఇంకొకరిది ఎప్పటికీ కాలేదు. అశోక్ ప్రేమ, ఆమె వ్యక్తిత్వాన్ని ఒక విశుద్ధ పవిత్రజ్యోతితో ఆలోకితంచేసింది. దాన్నామె మోసగించలేదు. ఇప్పుడామె ఏమైనా, కేవలం ఆమె అశోక్‌కు పవిత్రమైన అనుబంధంగానే వుంది. బ్రతికివున్నంతవరకూ దాన్నామె నిశ్చలంగా వుంచగలదు. అదే ఆమె స్వర్గీయ ప్రణయానికి ధ్యేయం.

ఈవిధంగా దెబ్బలుతింటూ, చివరకు ఆమెకు 'బూంచితోట' ప్రయిమరీ మిషన్ గరల్సుస్కూలులో పంతులమ్మ పని దొరికింది. అది ఆక్టింగ్‌పనే! ఇంకా వేసవిసెలవులు రెండుమాసాల పదిహేనురోజులున్నాయి. అంతవరకు ఆ ఉద్యోగముంటుంది ఆ తరువాత సెలవులకు, తనకూ సెలవుదొరకుతుంది కాని, జులైలో తిరిగి బడి తెరిచినప్పుడు తిరిగి తనకు వుద్యోగమిస్తారనే నమ్మకంవుంది. ఈ రెండున్నర నెలలపని సంతృప్తికరంగా వుంటేనే ఆ అవకాశముంటుంది. ప్రస్తుతం జీతం నెలకు పన్నెండురూపాయలు. ఐతే సెలవుల్లో ఏమీ యివ్వరు.

ఏమీ లేనప్పుడు దొరికిందే మంచిదని ఆలోచించి, దీన్నామె వొప్పుకుంది. తనచరిత్రను స్పష్టంగానూ, సురక్షితంగాను వుంచుకోనేందుకు, ఇదొక్కటే గౌరవప్రదమైన ఉద్యోగం. ప్రపంచంలోని ప్రలోభాలు, పాపాలు, స్వార్థం నుండి ఆమె వెంటనే విముక్తురాలై పోవాలనుకుంది.

అదృష్టవశాత్తు ఆమెకు మిస్టర్ జాన్‌లాంటి సజ్జనుని ఆశ్రయంకూడా దొరికింది. ఆయన జబల్‌పూరు గన్ కేరేజ్ ఫ్యాక్టరీలో రోజూ మూడురూపాయలు గడించే కార్మికుడు. ప్రతిరోజూ ఉదయం ఆరున్నరగంటలకు సైకిలుమీద బయలుదేరి, రాత్రిఏడుగంటలకు, అప్పుడప్పుడు ఎనిమిదిగంటలకు, మరొకప్పుడు రాత్రి తొమ్మిదిగంటలకు యింటికి చేరుకుంటాడు. మధ్యాహ్నభోజనం కారియర్‌లో తీసుకొని వెడుతుంటాడు. థర్మాస్ఫ్లాస్కులో టీ వుంటుంది. అంతే! దానితోనే అతనా పగలంతా గడుపుతుంటాడు. యింట్లో ఖర్చుఎక్కువ. అందువల్ల మామూలుసమయమేకాకుండా, రెండుగంటలు పని ఎక్కువ చేస్తుంటాడు. అప్పుడప్పుడు ఆదివారంనాడు కూడా, ఫ్యాక్టరీకి వెళ్ళేవాడు. దాని కతనికి అదనంగా జీతం ముడుతుంది. పాపం! మధ్యాహ్నం సూర్యుని తన యింటి వరండాలో నిలుచుని చూచేభాగ్యం అతనికి దొరకడం అరుదు. గొప్పపనివాడు,

ఖర్చు ఎక్కువకావడానికి అతని భార్యే కారణం. ఆవిడ దావూద్ పహిల్వాను కూతురు. దావూద్ పహిల్వానును చాలామంది దావూద్ సర్కస్‌వాలా అంటారు. ఎందుకంటే కొన్నేళ్ళక్రితం అతనికి ఒక సర్కసుకంపెనీ వుండేది. దానిలో నలుబది, ముప్పదిమంది మంచి యవ్వనంలోవున్న యువతీయువకులు పనిచేస్తుండేవారు. కాని ఆ తరువాత అది నడవలేదు. దావూద్ దాని గుడారం, కర్రలు అన్నీ అమ్మేశాడు. తిరిగి పెద్దబజారులో ఒక హోటలు తెరిచాడు. ఇప్పుడు అతను నాలుగుటాంగాలు నడుపుతున్నాడు. హోటలుకూడా

బాగానే నడుస్తోంది. దాన్నానుకునివున్న అతని కిళ్లీ దుకాణంలో ఎప్పుడూ ఒక పచుచు కిళ్లీలు అమ్ముతూవుంటుంది. అందువల్ల అమ్మకం జోరుగా సాగుతోంది. రసికులైనవారికోరికలను తృప్తిపరిచే వస్తువులుకూడా అతనిదగ్గరున్నయ్! కల్లు దుకాణం, జూదగృహం మొదలైనవాటితో గూడా అతనికి సంబంధంవుంది. దావూద్ సర్కస్‌వాలా అసలు సంపాదనంతా రాత్రుళ్లే జరుగుతుందని అంటారు. దెబ్బలాటలూ, తగాదాలలోకూడా, సూక్ష్మంగా నిజానిజాలు విచారించినట్లయితే. ఏదో కొంత అతనికి సంబంధంవున్నట్లు తప్పకుండా తెలుస్తుంది. కొంతమంది పోలీసులూ, ఇన్‌స్పెక్టర్లుకూడా అతనికి స్నేహితులు. అందువల్ల అతనెప్పుడూ నేరస్థుడుగా పట్టుబడలేదు. ఆ పట్టణంలో దావూద్ పహిల్వానును ఎరుగనివారుగానీ, అతని ప్రతాపానికి భయపడనివారుగానీ లేరు.

మిస్టర్ జాన్‌భార్య గుణవతి. దావూద్ పహిల్వాను ఏకైకపుత్రిక! వీరిద్దరివివాహం దావూద్‌హోటలులోనే జరిగింది. కొంతమంది జాన్‌లాంటి సరళహృదయుడు వారికి ఎలా చిక్కాడా? అని అనుకునేవారు. సరే, దాన్ని వదిలివేద్దాము.

కాని, జాన్ వివాహమైనంతనే ఆపదలు వచ్చిపడ్డాయి. అతనిభార్య శృంగారజీవితాన్ని సంభాళించుకోటంలోనే అతనికి కష్టమైపోయింది ఆమె పైకి మంచిగానే కనుపిస్తుంది. కాని, గుణగణాల విషయంలో తనపేరుకు విరుద్ధప్రవృత్తిగల్గి వుంటుంది ప్రతివిషయంలో భర్తతో పోట్లాడుతూ దావూద్‌కూతుర్నని భయపెడుతుంది. తండ్రిని ఆమె రెచ్చ

గొట్టగలను. ఇవాళ కొత్తచీర కావాలి...డాడీహోటల్లో డాన్సుకు వెళ్ళాలి. నాకు కొత్త ఇయర్‌రింగ్సు కావాలి. పౌడరుడబ్బా ఎప్పుడో ఖాళీఅయిపోయింది. అది లేనిదే నేను ముఖం ఎలా బయటచూపగలను? మరి బూట్లు! ఇప్పుడు చెప్పులతో పనిజరగదు. ఎత్తుమడమల బూట్లు కావాలి. మీకు పసివల్ల తీరుబడి లేకుంటే, దావూద్‌కూతుర్నై పుట్టి సినిమా మానుకుంటానా? నేను ఆడదాన్నైనా, మగవారికిగల హక్కు-లన్నీ నాకు కావాలి. కాలం మారిపోతోందికదూ? మీరు సినిమాకు రాలేనప్పుడు, డాడీతో వెడతాను. డాడీ రాకుంటే, విలియమ్‌తో వెడుతాను, లేదా ఇంకొకరితో వెడతాను. కాని ఏదిఏమైనా వెళ్ళితీరాల్సిందే— ఇదీ వరుస.

విలియమ్! ఈ విలియమ్ చబీల్‌దాసుపేట రసికాగ్రేసరుడు. పట్టణంలో యితనితండ్రికి పెద్ద బట్టలదుకాణం వుంది. ఇంకా మూడు నాలుగు మేడలమీద మంచి అద్దెవస్తుంది. మెట్రిక్ మూడుసార్లు తప్పి చదువు మానుకున్నాడు. "ప్యాసుకావడంలో విలువేముంది. కోర్సు చదవడమే అసలైన విషయం. అది నేను మూడుసార్లు చదివి పూర్తిచేశాను" అంటాడు. కావలసినంత ధనం వుంది. ఖర్చుచేయవచ్చు. మూడు నాలుగు గంటలు దుకాణంలో కూర్చోవడమూ, అక్కణ్నుంచి డబ్బెత్తుకుని పారిపోవటం, ఆడపిల్లల వెంట పడటం, హోటళ్ళకెళ్ళడం, సినిమా చూడ్డం మొదలైనవన్నీ అతని నిత్యకృత్యాలు. దావూద్‌పహిల్వాను విభిన్నవ్యాపారాలకు అతను పాత కొనుగోలుదారు. గుణవతీ జాన్‌తో అతనికి పాతస్నేహముంది. అతనామెతో సినిమా, బజారు, మదన

మహాలు, పిండివిసిరే స్త్రీలకుటీరాలూ, మార్బుల్‌రాక్సు-మొదలైన చోట్లకు చాలాసార్లు వెళ్ళాడు.

మిస్టర్ జాన్‌కు తన భార్యగుణాలవిషయం తెలుసు. అతనికి ఎంతో కష్టంవేసింది. కొన్నిమార్లు విడాకులివ్వాలని కూడా ఆలోచించాడు. కాని, దాఫ్రాద్ పహిల్వాను భయంతో ధైర్యంచేయలేకపోయాడు. విలియమ్ ఛబీల్‌దాసుమీద ఎంతో పగతోవున్నాడు. ఒకనాడు తన్నబోయాడు. కాని, తప్పించుకుని పారిపోయాడు. అదిమొదలు జాన్‌వుండగా అతనింటికి వచ్చేవాడుకాడు.

మరియమ్ ఒకగది అద్దెకు అడిగేందుకు మిస్టర్ జాన్ యింటికి వచ్చినప్పుడు, అతనికి చాలా సంతోషంకలిగింది. దీనితోనైనా, గుణవతిస్వేచ్ఛ కొంత తగ్గుతుందని ఆశించాడు. మరియమ్‌బీదతనంమీద అతనికి సానుభూతివున్నందువల్ల, మనసార ఆమెకు సహాయంచేయాలనుకున్నాడు. ఒక అందమైన యువతి పెండ్లికాకముందే, తల్లై వచ్చి, తన అండనవుండాలని కోరిందనేసంగతి గుణవతి విని, కనురెప్పలు మలమలలాడించి మనసులోనే సంతోషించి ఆమెను ఆదరించింది మరియమ్ విషయంలో ఆమె ఏమేమో ప్లానులు వేసుకుంది. మొదటి రోజునుంచే మరియమ్‌మీద తన ప్రభావాన్ని చూపించసాగింది. ఆమెను పనిలో కష్టపెట్టేది. దబాయించేది. ఒకటిరెండుమార్లు ఆమెకు మంచి భోజనంపెట్టేది. విలియమ్ ఛబీల్‌దాసు వచ్చినప్పుడు ఆమెను టీకోసం పిల్చేది!

కాని, విలియమ్‌ను చూడగానే మరియమ్‌మనసు అసహ్యంతో నిండిపోయింది. అతని విషపుచూపుల్లోని విషయ

లోలుత్వానికి ఆమె భయపడిపోయింది. గుణవతిబిడ్డలో యీ విలియమ్ పోలిక ఎక్కడనుంచి వచ్చిందా అని ఆమెకు ఆశ్చర్యంకలిగింది. పాపం. జాన్... సంపాదనకోసం, నిప్పుబట్టీముందు పగలంతా కూర్చుని, తన రక్తాన్ని సలసల మరగబెట్టేసమయంలో, అతనివెనుక తనయింటిలో ఏమి జరుగుతుందో పూర్తిగా తెలియదు. కాని, మరియమ్ అద్దెకు వచ్చాక అతను కొంత నిశ్చింతుడయ్యాడు.

కాని మరియమ్...? ఇలా వచ్చి చిక్కుకునిపోయా నేమిటా అని ఆలోచిస్తోంది. ఈ నరకంనుంచి తప్పుకుంటే, బాగుంటుంది. కాని, ఆమె వెంటనే అక్కణ్నుంచి వెళ్ళలేదు. ఒకటి: ఆయింటికి బడి చాలా దగ్గరలోవుంది. పదినిముషాల విరామసమయంలోకూడా తటాలున యింటికివచ్చి అశోక్ కు పాలుపట్టి నిద్రపుచ్చి వెళ్ళగలదు. రెండోది: ఉద్యోగంకూడా రెండున్నర నెలలే! ఆ తరువాత? తిరిగి బీదరికం తప్పదు. నిరుద్యోగం తప్పదు. ఒకవేళ దొరికినా రెండుమాసాల తరువాత జులై నెలలో ఉద్యోగం దొరుకుతుంది. అదికూడా నమ్మకమేమిటి-? అటువంటి అనిశ్చిత భవిష్యత్తుతో, ఆమెకున్న యీ చిన్నఆధారం, అదెంత చెడ్డదైనా వదిలి ఎక్కడికెళుతుంది? ఎటు చూచినా కంటకప్రాయమైన మార్గమే కనుపిస్తోంది. ఇక్కడ ఎలా లేదన్నా జాన్ ఆధారమనేది వుంది. ఈ ఆలోచనలతోనే ఎలాగో రోజులు గడుపుతోంది.

మరియమ్ తను చెప్పిన పెడమార్గాన పడి, యిద్దరి సంపాదన వృద్ధిచేయడానికి యిష్టపడడంలేదని గ్రహించి గుణవతి కోపంతో మండిపడి, ఆమెతో మరీ అసహ్యంగా

ప్రవర్తిస్తోంది. మరియమ్ అసహాయస్థితి ఆమెకు తెలుసు. అందు చేత, దానివల్ల పూర్తిలాభం పొందాలనుకుంది. మరియమ్ దృఢత్వాన్ని చూచి ఆమె ఆశ్చర్యం చెందింది. మరియమ్ సులభమైన సంపాదనమార్గాలు తెలుసుకుని, తన విచారం, కష్టాల్నుంచీ ఎందుకు విముక్తిపొందదూ అని ఆమె భావించేది. మూర్ఖురాలిలా వుంది. సరే, ఈ రోజు కాకుంటే, కొన్ని రోజులతరువాత స్కూలుకు సెలవులుయిచ్చినప్పుడు, ఆమెకు జీతంముట్టినప్పుడు, తనమాట వినకేంచేస్తుంది. ఈ ధైర్యమే గుణవతికి లేకుంటేమాత్రం, మరియమ్‌ను ఎప్పుడో యిల్లు ఖాళీచేయించేది. ఆమె అసలు తన స్వేచ్ఛకే కంటకంగా వుంది. కాని, అటువంటి విషయాల్లో, గుణవతి అంత తొందరగా అధైర్యపడేరకం కాదు.

చిన్న అశోక్ ముఖంచూచే మరియమ్ యివన్నీ సహిస్తోంది. ఆమె తనగదితలుపులు మూసుకుని పిల్లవాణ్ని హృదయానికి హత్తుకుని కూర్చుని "నాతండ్రీ! నువ్వే నా స్వర్గానివి. నీ కోసమే నే నన్నీ సహిస్తున్నాను."- అని వాపోయేది. ఈ జీవితలక్ష్యమే, మోహానందమే ఆమె నింతవరకూ అన్ని ప్రపంచనాలనుంచీ, కష్టాలనుంచీ సుదర్శనచక్రంలా కాపాడుతోంది.

ఈమధ్యలో, ఏప్రియల్ మొదటివారంలో నాగపూరు ఆంగ్లేయపత్రిక 'ఇండిపెండెంటు'లో ఒక సమాచారం చదివి నిశ్చేష్టురాలైంది. ఆమె కళ్ళెదట తారలు మెరుస్తున్నట్లు, ఎంతో కష్టంమీద తనను తాను తమాయించుకోగలిగింది. అదృష్టవశాత్తు మూర్ఛరాలేదు. కాని, చైతన్యహీనురాలవు

తున్నట్లు తెలుసుకుంది. రెండుమూడునిముషాల అనంతరం ఆమెకు స్పృహ తెలిసింది. తిరిగి ఆ సమాచారాన్ని ధ్యాన పూర్వకంగా చదివింది.

"సామాజికం-వ్యక్తిగతం!' (Social and personal) ఆ చిన్నశీర్షికలో వార్త యీవిధంగా ముద్రించివుంది-

"అభినందనీయ వివాహం" పత్రిక రిపోర్టు.

# 24

'గత మంగళవారంనాడు, ఏప్రియల్ మూడవతారీఖు ప్రాతఃకాలం తొమ్మిదిగంటలకు నాగపూరు సుప్రసిద్ధ ఆర్టిస్టు శ్రీ అశోక్ ఠాకూరుకు, రాయపూరు డిస్ట్రిక్టు జడ్జి శ్రీ వివేక రంజన్ అధికారిగారి ఏకైకపుత్రిక, కుమారి అరుణతో, సివిల్ మారేజి ఆక్టు ననుసరించి, రాయపురం డిస్ట్రిక్టు మేజస్ట్రేటుగారి సమక్షాన వివాహం జరిగింది. ఈ వివాహానికి ఛత్తీస్‌గఢ్ ప్రాంత కమీషనర్, ఇతర ప్రభుత్వోద్యోగులూ, లోకప్రియ ప్రజానాయకులూ, వ్యాపారస్తులు పేరుప్రఖ్యాతిపొందిన గౌరవ నీయులూ, మహిళలు వచ్చారు. వధూవరులకు అందిన ఎన్నో అభినందనల టెలిగ్రాంలు, ఉత్తరాలు, వివిధ కానుకలతో అక్కడొక కళావస్తుప్రదర్శన జరిగినట్లయింది. అభ్యాగతు లందరికీ విందుచేయబడింది.

'శ్రీ ఠాకూరు మధ్యప్రాంతపు సుప్రసిద్ధ ఆర్టిస్టు. కేవలం ఆ ప్రాంతంలోనే కాకుండా, సమస్తదేశ కళాక్షేత్రంలో

కూడా వారి ఖ్యాతి వ్యాపించింది. గత ఫిబ్రవరి నెలలో నేపాలులో జరిగిన అఖిల విశ్వకళాప్రదర్శనలో శ్రీ ఠాకూరు 'బ్రహ్మైక్యం' అనే చిత్రానికి ప్రశంసాపత్రం లభించింది. కుమారి అరుణ అధికారి నాగపూరు విశ్వవిద్యాలయ విద్యార్థిని. ఈ సంవత్సరమే ఎం. ఏ. పరీక్షకు హాజరయింది.

'మేము మీ శిక్షిత, సుశీల దంపతులను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.'

మరియమ్ హెడ్‌మిస్ట్రెస్‌తో తనకు తలనొప్పిగావుందని చెప్పి, యింటికి వెళ్ళడానికి సెలవు అడిగింది. ఇంటికివచ్చి గదిలో తలగడదిండ్లలో తలపెట్టి వెక్కి-వెక్కి- ఏడ్చింది.

నేడు కలిగిన మనఃక్లేశానికి మానవస్వభావంమీదున్న ఆమె విశ్వాసం మొదటిసారిగా ముక్కలైపోయింది. భగవంతుని న్యాయవిచక్షణయందున్న విశ్వాసం కూడా జీవితంలో మొదటిసారిగా సడలిపోయింది. తిరుగులేని ఆమె ఆశావాదం కూడా సన్నగిల్లిపోయింది.

ఐతే, యిది నిజమేనా? ఇటువంటి సంఘటన జరుగుతుందని స్వప్నంలోకూడా వూహించలేదు. అశోక్ ఠాకూరు తనను మరిచిపోయి, యింకొకపిల్లను వివాహం చేసుకుంటాడని ఆమె అనుకోలేదు. ఆయన కళలో తన్మయుడై వుంటాడనీ, వివాహంచేసుకోడనే ఆమెకు తెలుసు. కళ- స్త్రీ అనే ద్వంద్వంలో పురుషుని ధ్యేయమగ్న మనను కళనే ఎన్నుకుంటుందని ఆమెకు తెలుసు. కాని, అశోక్ ఎప్పుడైనా వివాహవిషయంలో ఆలోచించడం జరిగి, అతను తనవద్దకు తిరిగివస్తాడనే సూక్ష్మ ఆశ ఆమె మనసులో దాగివుంది.

ఆయన తననిందామయజీవితాన్ని రూపుమాపుకొనడానికి అనేకరకాలుగా తిరగవచ్చు. అయినప్పటికీ, ఆరోజు వచ్చినప్పుడు అశోక్ ఆమెను హిమాలయపర్వతాల్లో వున్నా, ప్రశాంత మహా సాగర గంభీర అఘాతాలలో వున్నా, వెదికి తీసుకునిరాగల డని ఆమె నమ్మకం. పవిత్ర ప్రేమ కంత బలం వుంటుందీ. కాని, ఈనాడు తన ఆ విశ్వాసమూ, ఆ స్వప్నసుఖమూ చెడి పోయి, ఛిన్నా-భిన్నమైపోయాయి. హృదయంలో పదిలంగా దాచుకుని ధైర్యంగావుండేందుకు, దానితాలూకు తత్వ మిప్పు డేమీ మిగలలేదు.

ఐతే, ఇదే మానవ జీవితమా ? దాన్నెవరూ నమ్మ లేరా ? ఐతే స్వర్గీయ ప్రేమనుకూడా యింత తేలికగా తృణీక రించివచ్చా ? ఐతే యిది స్వయంగా భగవంతుని అవమా నించడం కాదా ?

పాత్రీపుకంలో ఆ బంగారునెల-దాన్నే ఆమె జీవితంలో అన్నిటినీ మించిన సత్యమనుకుని, ఆ బలంమీదనే వొంటరిగా కష్టాలతో కూడిన పర్వతాల్నిసహితం మోయడానికి సిద్ధ పడింది. కాని, యీనాడు అదికూడా మిథ్యని తేలిపోయింది. ఇప్పుడు ఏ ఆశ్రయాన్ని, ఏ లక్ష్యాన్ని ఆధారంచేసుకుని ఆమె తన ఏకాకి శూన్యజీవనయాత్ర పూర్తిచేయగలదు? ఎటు చూచినా కటికచీకటే!

ప్రపంచం, జీవితం, అస్తిత్వం—అంతా కలైపోయింది. అవును, కేవలం పేకా ఏమంటే, ఆ కల మధురమైనదికాదు. కాని, భీషణమైంది, భయంకరమైనది. తను ఎక్కువకాలం జీవించివుంటుందనే నమ్మకం ఆమెకు లేదు. కాని, ఏదోఒక

విధంగా రోజులు గడపవలసేవుంటుంది. అందువల్ల అమితమైన ఆ దుఃఖాన్నీ, మానసికవ్యథనుకూడా ఆమె మెదలకుండా సహించి సారహీనమైన జీవితంతో నీరసంగా రోజులు గడుపుతోంది.

బహుశా మానవునిజీవితంలో, యీ దుర్దినాల ఎడతెగని క్రమంలో ఏదో పరివర్తనం కలుగుతుందనీ, కొంత వెలుగూ, కొంత ఆశా, కొంత ఆనందం దొరుకుతుందనే కొద్దిమాత్రం ఆశకూడా మిగిలివుండనప్పుడు, ఆ సమయమే అత్యంత దుఃఖభాజనంగా వుంటుంది. ఎవరి జీవితపోరాటం భయంకరంగా, దారుణంగా వుంటుందో. అట్టి దరిద్రులకు మాత్రం అంతా జరిగిపోయాకకూడా కడుపనే కందకాన్ని నింపుకునేందుకు ఈ అపార మూగవేదన కొంత సంయమన శక్తి నిస్తుంది. తమ భగ్నజీవితాలమీదా చెడిపోయిన స్వప్నాలమీదా, రెండు కన్నీటిచుక్కలు కార్చేందుకు పాపం వారికి వీలెక్కడుంటుంది? ఉదయం మొదలు సాయంకాలంవరకూ, పగలూ-రాత్రి, ఎప్పుడూ ఒకే వస్తువు కనుపిస్తుంటుంది. అదే శ్రమ-శ్రమ-శ్రమ! అంత చెమటోడ్చి స్తేనే గాని కలో గంజో త్రాగడానికి నోచుకోరు. ఇక గతాన్ని గురించిగాని, భవిష్యత్తునుగురించిగాని వూహించుకునేందుకు వారికి అవకాశం ఎక్కడుంటుంది? సుఖానందాలు, దిగజారిపోతున్న పగటి సూర్యప్రకాశంలా, జీవితంలోంచి మెదలకండా జారిపోతూవుంటాయి. ఇక శూన్యం మాత్రం మిగిలివుంటుంది. అందులో ఏడ్చేందుకు, విప్లవం రేపేందుకు శక్తేవుండదు. దుఃఖభారంతో మానవుడు తన పాదాలక్రిందున్న రెండడుగుల

భూమి తప్ప, యింకేదీ కనుపించనంతగా కృశించిపోతాడు. ఇదిలాకావడం మంచిదే హృదయంలో తగిలిన లోతైన గాయాన్ని మాన్పుకోవడానికి అవసరమున్నట్లయితే పరిశ్రమం తాలూకు అవిశ్రామ చక్రభ్రమణంలో మనుష్యుని ఆత్మచింతనకూ, పూర్వస్మృతులకూ సమయం దొరకకుండా వుండడమే ఉచితం!

పన్నెండురూపాయల వేతనం పొందే దరిద్ర ఉపాధ్యాయుని ప్రణయభంజితమైన శూన్యజీవితానికిక యీ కథే మిగిలివుంది. మృత్యువు రాదుగనుక జీవించివుండాలి. బహుశా, అశోక్ కోసం—చిన్న అశోక్ కోసం జీవించివుండాలి. గనుక మృత్యువు రాదు. ఇంత జరిగాకకూడా విధి ఎంతో దయచూపుతోందనిపించింది మరియమ్‌కు.

## 25

అరుణ అశోక్‌ల వివాహమయ్యాక, యిద్దరూ ఒకవారం వాల్తేరులో గడపాలని వెళ్ళారు. సముద్రతీరంలో-యిసుకమీద కొన్నిగంటలు కూర్చోవడమూ, స్నానంచేయడమూ, సినిమా, విందులు, షికార్లు మొదలైనవాటితో గడపడానికి వారికి రాత్రింబగళ్ళు అంతే యిరవైనాలుగుగంటలు కూడా సరిపోవడంలేదు. ప్రబలమైన జీవితానందం, అప్రతిహతమైన ప్రవాహంలో అశోక్-అరుణలు తమకు తాము పూర్తిగా బంధనాలు తెంచుకుని నిగ్రహం, తర్కాలు లేకుండా, సామా

జిక నియమాలవల్ల ఆటంకం లేకుండా సంచరించడానికి తమ ప్రాంతాన్ని వదలి, తమ కనుకూలమైన క్రొత్తప్రాంతానికి వెళ్ళారు. అశోక్ యీ సుఖోన్మాదంలో తన కాలాన్ని పూర్తిగా అరుణకు అర్పించాడు. ఆమె రూపొందించిన కార్యక్రమానికి అశోక్ కట్టుబడివుండేవాడు. వైవాహిక జీవితంలోని యీ ఆనందమయమైన ప్రథమ సప్తాహంలో అశోక్ పొందిన అనుపమ సుఖం అదివరకెప్పుడూ పొందలేదనుకున్నాడు. ఇద్దరూ ప్రత్యక్ష ప్రపంచంలోంచి ఎగిరి ఆకాశంలోని తరళ-విరళ ప్రదేశంలో క్రీడిస్తున్నారు. అరుణ అభిరామ శరీరసౌందర్య మోహామే అశోక్‌ను ఆత్మవిస్మృతుడై పోయేటట్లు చేసి వేసింది. అతను కొన్నిరోజులవరకూ తన కళ, జీవిత లక్ష్యం మొదలైన విషయాల్ని మరిచిపోయాడు. తను కొన్ని సంవత్సరాలనుంచీ కంటున్న మధురస్వప్నం—యిలా యిప్పుడు ప్రణయ స్వర్గం ప్రాప్తించినట్లు అరుణ కనిపించింది. అశోక్‌లాంటి ఆరోగ్యవంతుడు, సుందరయువకుడు, యిప్పుడు సంపూర్ణంగా తనవాడై పోయాడు. అతన్ని ఆమె ఎలాగైనా ఆడించగలదు, అశోక్ శరీరం, మనసూ, ఆత్మమీద ఆమె సంపూర్ణ అధికారం సంపాదించింది. ఈ కొత్త విజయంతో ఆమెకు పరమసుఖం కలిగింది వాస్తేరంటే స్వర్గానికి మూడు వేసనుకున్నది.

కాని వారు నాగపూరు తిరిగివచ్చాక, వాస్తేమ స్వప్నకాలం సమాప్తమైనట్లే. నాగపూరులో అశోక్‌కు యిల్లువుంది. కొన్ని బాధ్యతలున్నాయి. కర్తవ్యం, వృత్తికూడా వున్నాయి. ఎప్పుడూ స్వప్నాలు కంటూ, నిట్టూర్పులు విడుస్తూ, జీవితం

గడపలేము. వాస్తవికజగత్తులో యింకా కొన్ని అవసరాలుంటాయి. వాటికోరికలు వేరుగా వుంటాయి. వాటిని ప్రతివ్యక్తీ నెరవేర్చచేయవలసిందే. స్వభావసిద్ధంగా అతను వాత్రేసులో రోజంతా అరుణకు అవకాశంయిచ్చాడు. కాని, నాగపూరులో యివ్వలేకపోయాడు. అతను తన స్టూడియోలో కూర్చోవడం అవసరం. చిత్రం తయారుచేయడంలో నాలుగైదుగంటలు గడపడం అవసరం. కాని, అరుణకు తన నిధిలో ఏదో తగ్గినట్లు, తన ఏకస్వామ్య సంపూర్ణాధికారంలో ఏదో అడ్డంకి ఏర్పడినట్లనిపించింది. ఇదా మెకు బావుండ లేదు.

సంపన్నులూ, సుఖవంతులైన తల్లిదండ్రుల కూతురామె! పుస్తకాల్లో చదివిన విజ్ఞానప్రపంచంలో ఆమె ఎప్పుడూ విహరించేది. జీవితం కేవలం, ప్రణయానందాలతో పరిపూర్ణమైన స్వప్నంలాంటిదని ఆమె అభిప్రాయం! జీవిత మూలతత్వంతో, జీవిత సత్యతత్వంతో, ఆమె కేనాడూ ఏ సంబంధమూ కలుగలేదు. కాల్పనిక జీవితాన్ని భంగపరచి, వాస్తవికతను చూపించి, స్వప్నాన్నుంచి మేలుకునేట్లుచేసే సంఘటన యింతవరకూ ఆమె ఎరుగదు. ఈ కళకొరకు సాధనా, పరిశ్రమ, తపస్సు చేయవలసివుంటుందనే విషయాన్నామె అవగతం చేసుకోలేకపోయింది. అందువల్లనే ఆమె ప్రియుడు ఆర్టిస్టని తెలుసుకుని సంతోషించింది. డబ్బుతో సినిమా, చీరలూ, సంగీతం దొరుకుతాయి. కాని, దానిని సంపాదించడానికి చెమటోడ్చవలసివుందనీ, సంపాదించేవాడు కష్టపడాల్సివుంటుందనేది ఆమెకు తెలియదు. ఇంతవరకూ తనతండ్రి తొమ్మిదివందలయాభై రూపాయలజీతం ఆమెను సంరక్షించింది.

ఇప్పుడు అశోక్ సంరక్షణలో వుంది. కచేరికి వెళ్ళి తన తండ్రిలా శ్రమపడేవాడో, అలాగే అంతకుమించి అశోక్ ఏది శ్రమచేయాలనేది ఆమె వూహించి ఎరుగదు. అశోక్ అందమైన ఆర్టిస్టనీ, తనకు ప్రీతిపాత్రుడనీ మాత్రం తెలుసు కుంటే చాలనుకుంది. కాని, అశోక్ కు ఒక బంగళావుందనీ, దాని కద్దెయివ్వవలసివుందనీ, నౌకరులకు జీతాలు యివ్వవలసి వుందనీ, వంటఖర్చుకు డబ్బుకావలసివుంటుందనే విషయం మీదకి అరుణదృష్టి పోలేదు. ఇప్పుడు నాగపూరు వచ్చాక, యీ సంగతులు మొదటిసారిగా తెలుసుకున్నప్పుడు తనకు దెబ్బతగిలినట్లనిపించింది. మొట్టమొదటిసారిగా జీవితం కేవలం స్వప్నంకాదనే సంగతి తెలిసింది.

మెల్ల మెల్లగా, అరుణ స్వప్నావస్థను సమూలంగా కదిలించివేసే సంఘటనలు యింకా కొన్ని జరిగాయి.

క్లబ్బుజీవితం అరుణకు ఎంతో యిష్టం! ఆమె క్లబ్బులో మెంబరైంది. కాని, ఆమె ఎప్పుడూ అశోక్ ను వెంట లాక్కుని వెడుతుండేది. అశోక్ కూడా మెంబరే కాని పేరుకు మాత్రమే! ఎప్పుడో నెలకు ఒకటిరెండుసార్లు వెళ్ళేవాడు. కాని, ఆ జీవితం అతనికి రుచించలేదు. ఇప్పుడు అరుణ కారణంగా అతను రోజూ రెండుమూడుగంటలు అక్కడగడపవలసివస్తోంది.

ఇక క్లబ్బుజీవితంతోపాటు 'టీ' 'బ్రిజ్' పార్టీలు ఆరంభమయ్యాయి. విందులు జరిగాయ్! ఇతరుల యిండ్లకు వెళ్ళిరావడం మొదలైంది. వాటితోపాటు సినిమాలు, నాటకాలు చూసే కార్యక్రమముకూడా ఏర్పాటవుతోంది. అరుణ వ్యక్తిత్వం సుందరమైనది. పశ్చిమ శిష్టాచారం, సామాజిక

వ్యవహారాలు బాగా తెలుసు! అందువల్ల ఆమె సర్వప్రియ మైనది. ఆమెకు యిటువంటి ఆనంద - విహారాల జీవితమంటే యిష్టం! అందువల్ల కొంతమంది స్త్రీ-పురుషులు ఆమెకు పరిచయమయ్యారు. రెండువారాల్లో వారి సంఖ్యను చూచి అశోక్ గాభరాపడిపోయాడు. ఇటువంటి విషయాలకు అత నెంతదూరంగా వుండాలని ప్రయత్నించాడో, అంతగా వాటిలో చిక్కుపడిపోతున్నాడు. అతని కెంతో భయంకల్గుతోంది.

మాయాదేవి అరుణను చూస్తూనే, ఎందుకో ఏమో, ఆమెమీద అమితదయను వొలికించి "మీరు మిస్టర్ అశోక్ బాబును మనిషిగా మార్చగలిగారు" అన్నది.

"ఎలాగు...?" అరుణ అడిగింది.

"వివాహానికి ముందా మహాశయుడు ఎవరితోనూ మాట్లాడేవాడుకాడు ఒకవేళ వచ్చినా చాలారోజుల కొక సారి వచ్చి, అరగంటలో వెళ్ళిపోయేవాడు. భోజనానికి పిలిచి నప్పుడు, ఎన్నో సాకులుచెప్పి ఎగవేసేవాడు. ఒక వేళ వచ్చినా, ఏదో తినీ, తిననట్లు తనమీద ఏదో దుండగం జరుగుతున్నట్లు కూచునేవాడు ఆర్టిస్టాయెను! కాని యిప్పు డిప్పుడే మానవశ్రేణిలోనికి వస్తున్నాడు. ఈ ఉపకారమంతా మీదే అరుణాదేవీ!"

అరుణ విజయోల్లాసంతో గర్వంగా నవ్వి యీ అభి నందనను స్వీకరించింది. తన యీ ప్రతిభను చూచి ఆమె కానందంకలిగింది. కాని దాని పరిణామం పాపం అశోక్ ఠాకూర్ అనుభవించవలసివచ్చింది. ఇప్పుడతన్ని 'మనిషి'గా తయారుచేసేపని రెట్టింపుఉత్సాహంతో ప్రారంభమైంది.

మాయాదేవి అరుణల స్నేహం అశోక్‌కి యిష్టంలేదు. ఒకసారి అరుణతో మాయాదేవిమీద, లోకులకున్న భావం అంత మంచిదిగాలేదని మెల్లగా చెప్పిచూచాడు. ఆమె చరిత్రను గురించి చెప్పడం మంచిదికాదని, వీలున్నంతవరకు ఆమె నుంచి తప్పుకుని తిరగడంలోనే బుద్ధిమంతతనంవుందనికూడా చెప్పాడు.

అరుణ వెంటనే మాయాదేవివిషయంలో చర్చకు దిగింది.

"స్త్రీలపట్ల పురుషు లెప్పుడూ తృణీకారభావంతోనే వుంటున్నారు. అనేకశతాబ్దాలనుంచి వారిని 'అబల'లని వారిమీద అత్యాచారాలుచేస్తున్నారు. కాని ప్రస్తుతం స్త్రీ హుంకరించి మేలుకుంది. ఇప్పుడామె ఆ అత్యాచారాలకు ప్రతీకారంచేయడానికి సిద్ధంగావుంది. ఆమె తనవిషయంలో పురుషుని అభిప్రాయం కోరడంలేదు. ఆమె ఎవరిని కలిసుకోవాలో, ఎవరిని కలుసుకోగూడదో - ఇటువంటి సలహాలు యివ్వాడు కోరదు."

అరుణ ఉగ్రవాఖ్యానం విని అశోక్ చల్లబడ్డాడు. తనొక స్వాతంత్ర్యప్రియురాలైన ఆధునికయువతితో మాట్లాడుతున్న సంగతి అతను మర్చిపోయాడు.

మాయాదేవి వుద్దేశ్యమేమిటో భగవంతునికే తెలుసు. కాని, అరుణతో ఆమెస్నేహం రోజురోజుకూ వృద్ధవుతోంది. అతనిమనసు విచిత్రమైన అనుమానంతో కంపించిపోయింది.

ఒకనాడుదయం మాయాదేవిఉత్తరం వచ్చింది. అందులో అరుణ - అశోక్‌లను వారి వివాహసందర్భంగా

విందుకు ఆహ్వానించింది ఆ ఆహ్వానాన్ని స్వీకరించకూడదని అశోక్ అభిప్రాయపడ్డాడు.

"ఎందుకని స్వీకరించకూడదు?" అరుణ కొంచం కోపంతో అన్నది. "ఆమె అంత శ్రద్ధగా పిల్చినప్పుడు మనం అనాదరణ చేయవచ్చా? పైగా ఆమె నీ పాత పేట్రన్ కూడాను."

"ఈ వ్యాపారబుద్ధి అకస్మాత్తుగా నీలో ఎక్కణ్నుంచి ప్రవేశించింది అరుణా? మాయాదేవి నా పేట్రన్ అని ఎవరన్నారు? ఒకవేళ ఐనప్పటికీ, పేట్రన్ ఏది అడిగితే, అది చేయడం మనకేమవుసరం?"

"మాయాదేవిని అసహ్యించుకుంటున్నావు గనుక అంటున్నావు. ఆమెమీద నీకంత కోపమెందుకు? నీకామె చేసిన అపకారమేమిటి?"

"అపకారం ఉపకారం ఏమీ లేదు. కాని, ఆ స్త్రీతో స్నేహం చేయడం అంత మంచిది కాదని నా అభిప్రాయం."

"అభిప్రాయాని కేముంది? అది నీ దూషిత దృష్టి. సరే, నేను వాదించను జవాబేమని వ్రాయమంటారో చెప్పండి?"

"అదే...అవకాశం లేదని..."

"కాదు. నే నలా వ్రాయలేను."

"మరి ఎందుకడుగుతున్నావ్?"

"ఆ నిర్ణయమేదో, మనిద్దరం సంతోషంగా చేద్దామని..."

"మనిద్దరమని ఎందుకంటావు? నీ ఒక్కదానిదేనని చెప్పు". అశోక్ కఠినంగా అన్నాడు.

"అలాగే అనుకో! సమాజంలో ఎలా వ్యవహరించాలో, ఆ సంగతి పురుషులకన్నా స్త్రీలకే ఎక్కువ తెలుసు. ఎంతకాదన్నా ఈ విషయంలో నువ్వు నామాట వొప్పుకోవలసిందే; చెప్పు...నరేనని వ్రాయమంటావా ?"

"వద్దు అరుణా! నాకు యిష్టంలేదు."

"తిరిగి అదే మాటా ?" మండిపడి-"ఒకవేళ నువ్వు రాకుంటే నేను వొంటరిగానైనా వెళ్ళాలి. నేను మాయాదేవి లాంటి సభ్యయువతిని అవమానించలేను."

"అయితే అది అంత మంచిదికాదు, అరుణా? మనింటి గుట్టు బయటపెట్టినందువల్ల లాభమేమిటి ?"

"అందుకనే వెళదామంటున్నాను. మాయాదేవి ఆహ్వానమే లేకుంటే, యింతగా బలవంతపెట్టేదాన్ని కాదు" అరుణ వినయంగా చెప్పింది.

ఏ కారణంతో అరుణ బలవంతపెడుతోందో ఆ కారణంతోనే అశోక్ తప్పించుకోవాలనుకున్నాడు. కాని, వ్యర్థంగా వాదవివాదాలు చేసినందువల్ల లాభముండదని అతనికి తెలుసు అందుకని-"నీ యిష్టం" అన్నాడు.

"ఓహో! మై డార్లింగ్! యు ఆర్ సచ్ ఎ గుడ్ బాయ్! (నువ్వెంత మంచివాడివి !)" అని అరుణ చప్పట్లు కొట్టి గంతులేసింది.

ఈవిధంగానే సినిమాకు వెళ్ళేందుకుకూడా అభిప్రాయ భేదాలువచ్చేవి అరుణకు సినిమాలంటే మహాసరదా! ఆమె ప్రతి కొత్తసినిమాను చూడకుండా వుండేదికాదు. కాని, అశోక్ తాకూరు సర్వాంగసుందరమైన చిత్రాన్నితప్ప యింకొక

దాన్ని చూచేవాడుకాడు. ఏదైనా చెడ్డసినిమాలకు వారానికి రెండుమార్లు రెండున్నరగంటలకాలాన్ని వ్యర్థం చేయడం అతను సహించడు. కాని అరుణ బలవంతంగా లాక్కునివెళ్ళేది. ఎందుకంటే వివాహమై యింకా నెలఅయి వుంటుందేమో! ఈవిధంగా ఆమె వొంటరిగా బయటికి వెళ్ళడం బావుండదు.

అరుణ ఆనందవిలాసాల్లో ఏమీ అడ్డుపెట్టకూడదని అశోక్ ఎప్పుడూ ప్రయత్నించేవాడు. తనకెన్ని కష్టాలు వచ్చినా తను స్వయంగా ఒకరిజీవితాన్ని బాధించకూడదను కునేవాడు. అరుణ తనభార్య! ఆమెకుకూడా కొన్నిరుచులు అభిరుచులతో కూడిన కోరికలుంటాయ్! వీలున్నంతవరకు వాటిని పూర్తిచేసేందుకే ప్రయత్నించేవాడు. కాని, అరుణ తనను యీవిషయాలన్నిటిలోనూ త్రోసివేయకండావుంటే మంచిదని అనుకునేవాడు. అవును! ఆమె వొంటరిగా ఏది చేసినా, అందుకు అశోకుని అభ్యంతరమేమీ లేదు.

ఈ డిన్నరులూ, పార్టీలు, సినిమాలు, క్లబ్బులు—అన్నీ కాలాన్ని అపవ్యయంచేయడమే ననిపించిందతనికి! వాటిలో దాగియున్న కృత్రిమజీవితం అతనికి విసుగనిపిస్తోంది. ప్రతిచోటా శిష్టాచారమే! వాటితో చచ్చినంత పనవుతోంది. హృదయంలోవుండే దొకటి, చెప్పేది యింకొకటి...కొద్దిగా తలనొప్పివస్తే చూపించే సానుభూతి, శీతలోప చర్యలకు అంతులేదు. ఎప్పుడైనా పిక్నిక్‌కు వెళ్ళినప్పుడు యిక చెప్పవలసిన అవుసరమేలేదు. ఆ మనునాడు అందమైన నీలం, ఆకుపచ్చ, ఊదారంగు కాగితాలమీద ఉత్తరాలు కురు

స్తుంటయ్ ! పిక్‌నిక్ అన్న మాటేమిటి, నందనవనంలో విహారించినట్లే ! ఎవరైనా ఒక కొత్తడిజైనుకారు కొన్నప్పుడు, క్లబ్బులో కొసాయంకాలమంతా దానిచర్చతోనే గడిచిపోతుంది. ఒకరిద్దరు హిందూస్థానీ ఐ. సి. యస్. లను సెక్రెటరియేటులో యింతవరకూ, ఆంగ్లేయులచేతిలో వున్న పదవులకు ప్రమోషను చేసినప్పుడు, జరిగే అభినందనలూ, టీ పార్టీల కోలాహలం 'స్వరాజ్యమే వచ్చిందా?' అన్నట్లు జరుగుతుంది. చర్చలలో గాసిప్పులు, సినిమాలను గురించి విమర్శలూ, కార్లూ, బంగళాలు, బట్టలు, నగల డిజైనులతో పాటు రాజకీయ విషయాలుకూడా వుండేవి. ఏవిషయాన్నికూడా గంభీరంగా లోతుగా ఆలోచించే ప్రవృత్తే కనుపించదు. వారు యింకొక ప్రపంచంలో వున్నట్లుంటారు.

సాంగపూరు వాతావరణానికీ, యీ వాతావరణానికి ఎక్కువ భేదం లేదని అశోక్ అనుకున్నాడు. అతనికందులో ఆశ్చర్యం కలుగుట లేదు. ఇటువంటిజీవితాన్ని అతను యింతవరకూ త్రోసివేస్తూ వచ్చాడు. ఇవాళ అయుణకారణంగా అతను దానిలో రోజురోజుకూ యిరుక్కుపోతున్నాడు. స్వతంత్రవ్యక్తిత్వం గల పాత అశోక్ తాకూరు సమూలంగా మారిపోడుకదా ? ఈ విషయం తలుచుకుంటే, అతని మనసు కంపించిపోయేది.

కాని, అతను యీ విషయాలన్నిటినీ వీలైనంత వరకూ సహించేవాడు. అతనిస్వభావం కోపిష్టిది కాదు. అందువల్ల ఎప్పుడూ పోట్లాటను త్రోసిపుచ్చేవాడు. ఐనా ఒకనాడు హద్దు మీరిపోయింది.

అతను తనస్టూడియోలో చిత్రంగీయడంలో నిమగ్నుడై వున్నాడు. మధ్యాహ్నం రెండుగంటలకు స్టూడియోలోదూరిన వాడు, సాయంకాలం ఆరుగంటలవరకు బయటికిరాలేదు, టీ కూడా అక్కడికే తెప్పించుకొని త్రాగాడు. చాలారోజుల యాక, నేడు అతనిమనసు ఒక చిత్రంగీయడంలో ఆనందానుభవిస్తోంది. అతను దాన్ని పూర్తిచేయడానికి సంపూర్ణంగా దానిలో లీనమైపోయాడు కాలం ఏవిధంగా దొర్లిపోయేదీ అతనికి తెలియదు. ఇంతలో అరుణ దభాలున తలుపు తెరుచుకుని లోపలికి వచ్చింది. స్టూడియోనియమానికి అది విరుద్ధం. అవమానం! ఐనా ఆమె యింటియజమానురాలు, ఖరీదైన సిల్కుచీర కట్టుకుంది. నేడేదో ముఖ్యమైన కార్యక్రమం పెట్టుకునివచ్చినట్లు ఆ వేషమే చెప్తోంది.

ఇంకా నీ పెయింటింగ్ పూర్తికాలేదా? ఆరైంది నేను ఎప్పుడో తయారై [illegible], యిక వస్తావు అని ఎదురు తెన్నులు చూస్తు[illegible] కాని నీ జాడా-జవాబు లేదు. మోటారు కూడా......

"సంగతేమిటి అరుణా?" కూర్చున్నచోటునుంచే భార్యవైపు చూడకుండానే అడిగాడు. అతని కళ్ళలో ఆ కళారాధన వ్యక్తమవుతోంది. తనను ప్రశంసించడమటుంచి, అశోక్ తన వేషాన్ని కూడా కన్నెత్తిచూడలేదని ఆమెకు బాధకలిగింది.

"అరే! మర్చిపోయావూ! నేటిసాయంకాలం ఆరున్నర గంటలకు బ్రిజ్ పార్టీకి మాయాదేవి, మిస్టర్ రాయ్ వస్తారని చెప్పానుకదూ...? సరిగ్గా సమయానికే అక్కడికి చేరుకుంటామని నేను వారికి మాటయిచ్చాను. ఇక అరగంటలో చేరుటా

ముఖం కడుక్కుని బట్ట లెప్పుడు మార్చుకుంటావు? ఇంకా బయలుదేరేదెప్పుడు? అక్కడికి చేరేదెప్పుడు? పద...పద... కూర్చునేవున్నావేం? తొందరగా ముగించు."

"ఓహో! క్షమించు అరుణా! నేను మర్చిపోయాను. ఐనా నా కివాళ సెలవుయివ్వు. ఈ చిత్రాన్ని పూర్తిచేయాలి. ఇంకా గంటన్నర రెండుగంటల పనివుంది. యిప్పుడిలా వది లేసినట్లయితే చెడిపోతుంది."

"గంటన్నర సేపే! అమ్మబాబోయ్! వాళ్ళేమను కుంటారు? మనకి మర్యాద తెలియదనీ, కాలంవిలువ గ్రహించ లేనివారని అంటారు. కాదు, కాను. ఒక్క మాయాదేవి విష యమైతే నేను అంతగా బ్రతిమిలాడేదాన్ని కాను. ఆమె నిన్నె రుగును, కాని, మిస్టర్ రాయ్ ఏమనుకుంటారు?"

మిస్టర్ రాయ్ ఐ. సి. యస్. రాయపూరులో ట్రైనింగ్ పొంది ప్రస్తుతం నాగపూరు అసిస్టెంటు కమీషనర్‌గా వచ్చాడు. మిస్టర్ అండ్ మిసెస్ అశోక్ ఠాకూరు పేరుతో ఆయన శ్రీ అధికారివద్దనుంచి పరిచయపత్రాన్నికూడా తీసు కుని వచ్చాడు.

కాని, నేడు అశోక్ తన కళాసాధనలో మునిగిపోయి వున్నాడు. అందువల్ల ఎంతమాత్రం కుంచెను మధ్యలో వదిలి పెట్టడానికి యిష్టంలేదు. తగిన కారణంవుండాలిగా "మిస్టర్ రాయ్ ఏమంటారు? నాతరఫున నువ్వు క్షమాపణ అడుగు. తన స్టూడియోలో నిమగ్నుడయ్యాడని చెప్పు. కళావేశంవచ్చిం దని ఆయనే అనుకుంటారు."

"అలా అని ఎలా చెప్పగలను ? పరిహాసాలపాలుకామా? ఆఖరిక్షణంలో ఏదైనా ఎంగేజ్ మెంటు మానివేయడమా ? అలా అయితే మొదటే నిరాకరించవలసింది. మిస్టర్ రాయ్ నిజంగా అపార్థంచేసుకుంటారు."

"అపార్థంచేసుకుంటే చేసుకోనివ్వు. అతనికోసం నేను కళాసమాధిని ఎందుకు వదిలిపెట్టాలి! నా తరఫున క్షమాపణ కోరమని చెప్పానుకదా ? దానికికూడా వారు సంతృప్తిపడక పోతే నాకొచ్చే నష్టమేమీ లేదు." అశోక్ దృఢంగా అన్నాడు తనుకూర్చున్న చోటునుంచి కదలకుండానే.

"ఎందుకు లక్ష్యంలేదు. వారు నాన్నగారివద్దనుంచి వుత్తరం తీసుకొని వచ్చారు. అయితే నువ్వు నాన్నగారిని అవమానంచేయడంకాదా ఇది?"

"ఇందులో అవమానమేముంది ? ఆర్టును వదలివేసి డ్రింక్ పార్టీలో మిస్టర్ రాయ్‌ని కలుసుకోమని ఉత్తరంలో ఎక్కడ వ్రాశారు !"

"నువ్వు నన్నూ మా నాన్నను పరిహాసంచేస్తున్నావు." అరుణ కోపంతో అన్నది— "నేనిది సహించలేను. సరిగ్గా చెప్పు. నువ్వు వస్తావా ? రావా ?"

"రాను..." అశోక్ ఉద్రేకంతో అన్నాడు.

"రావా...?" గట్టిగా అరుణ అడిగింది.

"రాను..." అలాగే శాంతంగా చెప్పాడు.

"నీకు నామీద, నిజమైన ప్రేమవుంటే రావలసే వుంటుంది." అరుణ దృఢంగా అన్నది.

"నీమీద నాకు ప్రేమవుంది. కాని, ఇవాళ నే నీ చిత్రాన్ని పూర్తిచేయనిదే, యిక్కడనుంచి కదలను."

"ఐతే నాకంటే నీకు కళే ఎక్కువ ప్రియమైనదా? నేను నీకవసరం లేదా?" గొంతు పెద్దది చేసి అంది. ఆమె శరీరాన్నే మర్చిపోతున్నట్టుంది.

"అటువంటి వ్యర్థ ప్రశ్నలు ... వేస్తున్నావు అరుణా? చిన్నవిషయా... రావే సిన అవసరమేముంది? ఎన్నోమార్లు నా కయిష్టం ... కూడా నీతో వచ్చాను. ఈమారు క్షమించలేవా...?"

"నేను యుక్తులేమీ వినదలుచుకోలేదు. నేను మాట యిచ్చివచ్చాను. నువ్వు వచ్చితీరాలి."

ఈమాటలు యజమాని నౌకరును శాసించినట్టు అరుణ అన్నది. కాని, కళను ఆదరించడమటుంచి, దాని నామె అర్థం చేసుకోలేదన్న విషయం అతనికి కష్టం కలిగించింది. అతను కూడా కొంచెం కోపంవ్యక్తంచేస్తూ అన్నాడు. "ఐతే నేను తర్కించాలనుకోవడం లేదు. నువ్వు అనవసరంగా నా కాలాన్ని వ్యర్థపరచవద్దు." అంటూ తిరిగి చిత్రఫలకంమీద కుంచెను నడిపిస్తున్నాడు.

అరుణకు ఇక సహించడం కష్టమనిపించింది. తన కేదో ఘోరమైన అవమానం కలిగినట్లనిపించింది. దెబ్బతిన్న త్రాచులా ఆమె ముందుకువచ్చి, అశోకుని కుడిచేయి పట్టుకుని వూపుతూ "ఐతే రావా?" అనడిగింది.

అశోక్ కళ్ళెత్తిచూచాడు. ఎదురుగా అరుణ చండికావతారంలో నిల్చునివుంది. కోపంతో ఆమెపెదిమలు వణుకు

తున్నాయి. తనలో తను లేను. అది చూచికూడా అతను విచలితుడుకాకుండా "రాను." అన్నాడు.

"ఐతే నీ చిత్రకళ నాశనంకావాలి. ఇదిగో ఇంకేమి చిత్రాలుగీస్తావు!" అంటూ పండ్లునూరుతూ, ఎర్రరంగుపళ్ళాన్ని తీసుకుని, నిముషంలో ఆ చిత్రఫలకంమీద విసిరికొట్టింది. ఆ పళ్ళెంలో మెరుస్తున్న రంగు కాన్‌వాస్‌మీద చిందరవందరగా పడిపోయింది. ఆచిత్రం ఒక్కనిముషకాలంలో, కళకు అప్రతిష్టను కలిగించే రాక్షసప్రతినలా అట్టహాసంచేస్తున్నట్లుంది. కొన్ని రంగుమరకలు అశోక్ ముఖం, శరీరంమీదకూడా పడ్డాయి. వాటితో అతని ఛాతీభాగం - విశేషించి హృదయం వద్దనున్నభాగం రక్తరంజితమైనట్లయింది. అశోక్ విషణ్ణుడై లేచి నిల్చొని, తలవంచి చూచాడు.

అతని హృదయంలో గాయాన్నుంచి రక్తం బయటికి వస్తున్నట్లనిపించింది. అతని నయనాలు అశ్రుపూరితమయ్యాయి.

## 26

తను అరుణను వివాహం చేసుకోవడంలో పొరపాటు పడినట్లు ఈనాడే మొదటిసారిగా అశోక్‌కు తెలిసింది. "లోనావలా" లోని ఆ స్వల్పసహవాసం, ఆ తరువాత జరిగిన ప్రత్యుత్తర ప్రత్యుత్తర వ్యవహారాల్లో చూచినది అసలైన అరుణ కాదనీ, అసలైన అరుణ దానికి భిన్నమైనదని తెలుసుకున్నాడు. ఇంటిలో మనస ఎంత అసహ్యంగా వున్నప్పటికీ, బయటికి వెళ్ళేముందు, యితరులకు అసహ్యంకలగకుండా వుండేందుకు మనం వేష, భాషల్ని బాగా సరిచేసుకుంటాము. దుకాణదారు తనదుకాణాన్ని దారివెంట వెళ్ళేవారికి తన దుకాణంలోని

వస్తువులు వెండి, బంగారం, మణి మాణిక్యాల్లాగు కనిపించేటట్లు అద్దాల్లో అలంకరిస్తాడు. కాని, దగ్గరకు వెళ్ళి చూసినట్లయితే, అవి తులం రెండున్నర రూపాయలకుదొరికే మాయబంగారునగలనీ, మాణిక్యాలకు బదులు ఎరుపు నీలపు గాజుముక్కలనీ తెలుసుకుంటాము సినిమాలు చూసి అరుణ జీవితరూపాన్ని మలచుకుంది. షైరన్, కీట్సు బ్రౌనింగ్‌ల కావ్యాలు ఆమెను ప్రేరేపిస్తున్నాయని, కల్పనాజగత్తులోని స్వప్నాల్నే, ప్రపంచంలోని నగ్నసత్యాలనుకుంది. కాని, పటం మీదగీసిన సముద్రంలో ఓడలు నడుపలేవనీ, దానిలోని పర్వతాలకు శిఖరాలు లేవనీ, మేఘాలు వర్షించవనీ, ముద్రించిన పుస్తకాల్లోనికథలతో, తెరమీది చిత్రాలతో, ప్రత్యక్ష జీవితసమస్యలు పరిష్కారంకావనే ఈ పరమసత్యాన్ని అరుణ తన యిరవై నాలుగు సంవత్సరాల సుఖమయజీవితంలో ఒక్కసారైనా ఆలోచించలేకపోయింది.

అందువల్ల, ఈనాడు ఆమె అడుగడుగునా, వాస్తవిక జీవితంతో పోట్లాడవలసివస్తోంది, ఆమె పూర్వప్రపంచం తాలూకు విలువంతా పేకమేడల్లా ఒకదాని తరువాత ఒకటి కూలిపోతున్నాయంటే అందులో ఆశ్చర్యమేముంది ? ఆమె తల్లిదండ్రుల ప్రేమ-వాత్సల్యాలు, జీవితసంగ్రామంలో విజయం సంపాదించటం అంత సులభంకాదనే విషయాన్ని ఎప్పుడూ తెలుపలేకపోయాయి. ఆమెతండ్రి తన న్యాయపీఠంమీద కూర్చుని, ఎంతోమంది స్త్రీ పురుషులకు నీతి, సద్వర్తనల పాఠం చెప్పాడు. కాని, ఆయన అంతమందిని ఉద్ధరించేందుకు ప్రయత్నించినా, తన ఏకైక కుమార్తెజీవితాన్ని సరిదిద్దలేక

పోయాడు. తన ప్రేమ వాత్సల్యాలతో పెంచిన కుమార్తెకు తనే శత్రువని ఆయనముఖంఎదుట అన్నప్పుడుకూడా చలించడు. కాని తన మూర్ఖత్వంవల్లనే అతని ఏకైకకూతురి జీవిత పథం కంటకప్రాయమైనదని అతడు అంగీకరించకపోయినా యదార్థం కాకమానదు.

మన యీ పీడిత దేశంలోని మధ్యతరగతి, గొప్పతరగతి వారి ప్రతియింటిలో, యీనాడు దుఃఖప్రదగాథలు జరగడం లేదా? తూర్పుదేశాల సుక్షేత్రంలో పశ్చిమ సంస్కృతీ బీజాలు నాటిన అంధానుకరణ పరిణామమే ఇది. దానివల్ల సువిద్య, సంస్కృతీ గలవారి ఒక తరానికి తరమే నాశనమై పోతోంది. ఈ దౌర్భాగ్యాన్ని తొలగించడానికి ఎవ్వరూ శ్రద్ధ చూనడం లేదు.

అరుణ వ్యక్తికాదు, ఈ అభాగ్యతరంతాలూకు ప్రతిమ మాత్రమే. దాని నిర్మాణబాధ్యత తనచేతుల్లోవుండికూడా భారతీయసంస్కృతి నంతిగా అవహేళనచేసినట్లు నేడుకాకుండా రేపైనా తెలుసుకోనకమానదు.

అరుణ అసలుస్వరూపాన్ని తెలుసుకోనందుకు, అశోక్ కి విచారంకలిగింది. ఈ ఒక్కపొరపాటుకు ఫలిత మెంత భయంకరంగా వుంటుందో, వూహించగానే అతనిమనసు క్రుంగిపోయింది. వివాహం చేసుకోవడంలో అపాయమున్నదనే సంగతి అతనికి తెలుసు. కష్టంలేనిదే సుఖంవుండదనే సంగతికూడా తెలుసు. కాని, అతని జీవితంలో కష్టాలేకాని సుఖాలేమీ విధి వ్రాయలేదా!

అలాగైతే అతనిజీవితం ఇంకేముంది? ధనే కళ్లారా

అతని జీవిత చరమలక్ష్యం! అదే అతని ఆత్మాభివ్యంజనకు యొక్క ఏకమాత్ర సాధన; అతని అంతఃకరణంలోని ఏకైక క్షుధకూడ అదే! అతని కళ రాజమహలులో నాట్యమాడేదికాదు. గద్దె మీద, పరుపులమీద పొర్లాడే నిరుపయోగమైనదికాదు. అది దీన - దరిద్రుల పూరిగుడిశెల్లో, అవమానితులూ, పీడితులైనవారి హృదయాల్లో, వన పర్వత పవిత్ర వాతావరణంలో నివాసయోగ్యమైనది. దాని కొక సందేశం, ప్రయోజనం వున్నాయి. జీవితాన్ని సమృద్ధం చేయడం, మానవుణ్ణి ఉన్నతస్థాయికి లేవనెత్తడం, భారతదేశ సంస్కృతిని, గౌరవాన్ని ప్రపంచానికి చాటడమే అతని ధ్యేయం. కాని, నేడో? నేడు అతని ఆంతరంగిక జీవితం భగ్నమైన కారణంగా తన యీ ఉన్నతధ్యేయం సమూలంగా విరిగి తునాతునకలై కూలిపోతుందేమోననిపిస్తోంది.

అరుణ మొదట తన వుత్తరాల్లో కనిగించిన నమ్రకమంతా మిథ్యేనని తేలిపోయింది. బహుశా ఆ సమయంలో తన కలం వుల్లేఖించిన మాటల్ని ప్రయోగపూర్వకంగా పూర్తి చేయడానికి రక్తమనేసిరా అవసరమనేసంగతి ఆమెకు తెలియక పోయివుండవచ్చు. అతని దూరదృష్టినంతా మోహావేశంఆవరించివుండటమే అశోకునితప్పిదం. మరి శిక్ష తప్పకండా అనుభవించాల్సిందే.

తనబోటి ఆందమైన స్త్రీ మోహాన్నికూడా విస్మరించి, పురుషుడు తన కళఅనే లక్ష్యంకొరకు యింత పిచ్చివాడెలాఅవుతాడనేది అరుణకు అర్థంకాలేదు. కళ గొప్పదనే అనుకుందాము. కాని, దానికోసం, మానవుడు, మాన

వుడే కాదన్నట్లు సమాజంపట్ల బాధ్యతలనుకూడా మర్చిపోవల సిన అవుసరమేమిటి? అయితే అతను అడివిలోనేవుండకుండా, సమాజంలో ఎందుకుండాలి?

ఇక అరుణకు ఏ సమాజం అంటే,-క్లబ్బు - సినిమా, విందులు, యిష్టమో అది అశోక్‌కు తుచ్ఛమైనదికావడమే ఆమెకు ఆశ్చర్యంగావుంది. తనకూ, తనభర్త అభిప్రాయాలకు ఆకాశానికి భూమికున్నంత తేడా ఎందుకుండాలి? అని ఆమె మథనపడుతోంది.

ఆమెకు ఎన్నో కోరికలున్నాయి. ఎప్పుడూ అశోక్ తనవాడిగా వుండాలని కోరుతోంది. అశోక్ తన కళ, ఆత్మ, శరీరం-సంపూర్ణ జీవితంతో తనలో లీనమైపోవాలని కోరు తోంది. వివాహంజరిగిన మొదటివారం వాళ్ళిద్దరులో అలాగే వున్నారు. ఒకసారి లభ్యమైనది, సర్వదా ఎందుకు లభించదో ఆమెకు అంతుపట్టకుండావుంది.

కాని, ఆనాటిసంఘటనలో ఆమెవల్ల పొరపాటు జరి గింది. క్రోధావేశంలో ఆమె వివేకం కోల్పోయింది అందు వల్ల ఆమె మర్యాదను పాటించలేకపోయింది. నిష్కారణంగా ఆమె మనసులో కొంత పరితాపం చెందింది. ఆ దుర్ఘటన తరువాత తిరిగి యిద్దరూ కలిసి క్లబ్బుకు వెళ్ళలేకపోయారు. అశోక్ ఉదాశీనుడై వెళ్ళి, ఒక పడకకుర్చీలో కూర్చుని యింటికప్పును చూస్తూవుండిపోయాడు. అరుణకూడా తన పడక గదిలో ప్రక్కమీదపడి విలపిస్తోంది. సాయంకాలం అశోక్ అరుణా అనునయవినయాలతో, విధిగా రెండుమెతుకులు తిన వలసివచ్చింది. అతనేమీ మాట్లాడలేదు. అరుణ చెప్పిందేదో

యంత్రంలా చేస్తున్నాడు. అతనికళ్ళలో ద్యోతకమవుతున్న దుఃఖాగ్నికి అరుణకూడా చలించిపోయింది. ఆమె తనవల్ల తప్పైవదని ఒప్పుకుని అశోక్‌ను క్షమాపణకోరింది. వారిద్దరినీ ఆవరించిన కారుమేఘాలు మెల్ల మెల్లగా విడిపోసాగాయి.

అశోక్‌ను నొప్పించకూడదని అరుణ భావించింది. తన యిష్టంవచ్చినట్లుండమని అశోక్ ఆమెకు పూర్తి స్వేచ్ఛ నిచ్చాడు. అతడామెజీవితాన్నుంచి మెల్ల మెల్లగా తప్పుకోవా లనుకున్నాడేమో...! అరుణ యీ సద్వర్తనతో ఒకవారం రోజులుమాత్రమే వ్యవహరించింది. ఇద్దరి అభిరుచులు, ప్రవృత్తులలోనే భేదంవుంటే, ఈ అనుబంధ మెంతకాలం పొసగు తుంది?

ఒకనాడు మాయాదేవి వారిద్దర్నీ టీకి ఆహ్వానించగా అరుణ ఒంటరిగా వెళ్ళింది. అశోక్ వెళ్ళలేదు. వారిద్దరికీ సరిపడడంలేదని మాయాదేవి గ్రహించింది. మూడు నాలుగు ప్రశ్నలలోనే యీ సంగతి ధ్రువపడిపోయింది. మాయాదేవికి మనసులో చెప్పలేనంత సంతోషమైంది.

"నేనుకూడా మిస్టర్ ఠాకూరుకు వీలుచిక్కలేదా?" ఆమె కుటిల మందహాసంచేస్తూ అడిగింది.

"లేదు. వారు తిరిగి స్టూడియోలో నిమగ్నమయ్యారు. ఉత్తమచిత్రాన్ని తయారుచేస్తున్నారు." తను అబద్ధం చెప్పు తున్నానని అరుణకు తెలుసు. అశోక్ అసలు స్టూడియోలో లేడు. అంతా తెలిసివుండే యింటివద్ద వుండిపోయాడు.

"ఉత్తమ చిత్రమా!" మాయాదేవి వ్యంగ్యంగా అంది. "వారిఎదుట యింత సర్వాంగసుందరమైన భార్య సజీవ

మూర్తివున్నప్పటికి, ఆ నిర్జవచిత్రాలేఆకర్షిస్తున్నాయన్నమాట. ఈ ప్రత్యక్షసౌందర్యాన్ని అవహేళనచేసి, ఆయన రంగుల మిశ్రమసౌందర్యాన్ని వెదకుతున్నారా ?"

మాయాదేవివ్యాఖ్యానానికి ఆమె ప్రసన్నురాలైంది. మాయాదేవి తన మనసులోని విషయాన్ని ఏకరువుపెడు తోందా అన్నట్లుంది. కాని, పతిగౌరవమే స్త్రీ కర్తవ్యమని గ్రహించి, ఆ ప్రసక్తిని మార్చడానికి— "కాదు. అవహేళన చేయలేదు." అన్నది.

"ఎందుకు అవహేళనచేయలేదు ! మీహృదయంలో ఎటువంటి అసంతృప్తి రేగుతోందో నాకు తెలియదంటారా అరుణాదేవి...? స్త్రీహృదయాన్ని స్త్రీయే గుర్తిస్తుంది. నేను మీ స్నేహితురాలిని. అందుకని మీసుఖంకోసం నాహృదయం పరితపిస్తోంది. మీరు సుఖంగావుంటే..." మాయాదేవి ఆవేశంతో పల్కింది.

ఈ సానుభూతికి అరుణ తన్మయురాలై తను నిజంగా ప్రణయక్షేత్రంలో దుఃఖభాగినినే అనుకుంది. ఐనా, పరస్త్రీ యెదుట దాన్నంత తేలికగా అంగీకరించకూడదనుకుంది.

"నేను సుఖంగానే వున్నాను మాయాదేవి !"

"నావద్ద నిజం మరుగుపరుస్తున్నారా ? నా కేమీ తెలి యదనుకున్నారా ? మీ మనసులో బాధవుందని నాకు తెలుసు. అందుకనే నేను చర్చను పొడిగించలేదు. ఆర్టిస్టు ఎప్పుడూ అలాగే వుంటాడు. మన స్త్రీలు రాజులు, లక్ష్మీపుత్రులహృద యాల్ని జయించవచ్చు. కాని, ఆర్టిస్టును జయించలేము. వారు

తమ అపూర్వమైన కల్పనాప్రపంచంలో వుంటారు. మన హావభావాలు, వలపు వారిమీద పనిచేయవు. వారు మనవారేనని ఒకక్షణం అనుకుంటాము. కాని, ఆ మరుక్షణంలోనే వారు మనవుచ్చును గ్రహించి, తిరిగి ఎప్పుడూ దగ్గరకురాకుండా పారిపోతారు."

"కాని, వారిజీవితానికి ఒక విశిష్ట ధ్యేయముంటుంది కదా! దానికోసం..."

"అవును. దానికోసం వారు సాధనచేయవలసివుంటుంది. ఐనా, దానితో మనజాతిస్త్రీల కేమి పని? వారి ఉద్దేశ్యం ఫలిస్తుందో లేదో నేను చెప్పలేను. కాని, అటువంటివారి జీవితానుబంధమయిన స్త్రీ ఎప్పుడూ విచారంగానే వుంటుంది. ఆమె వ్యథితహృదయాక్రందన వినేవారు ఎవరూ వుండరు."

"కాని, భర్తజీవితలక్ష్యంతో సహకరించడం భార్య కర్తవ్యంకాదా?"

"అవును! కర్తవ్యమే! ఆ పరతుమీద, భార్య, తన సంపూర్ణవ్యక్తిత్వాన్ని వమ్ముచేసుకొని పురుషునితో, అతని నీడలా అనుసరించడానికే సంసిద్ధపడాలి. ఐతే, సుశిక్షితురాలైన ఆధునిక అభ్యుదయస్త్రీ అభీష్టమిదేనా?"

"కాదు. అదికాదు"-అరుణ హృదయంలోవున్న ఎం. ఏ. ప్యాసైన ఆధునికస్త్రీ మేలుకుంది. "దీనికంటే మనకు చావు మేలనుకుంటాను. కాని, మన ఆత్మను చంపుకోవడం సహించలేము."

"అదీ సంగతి...!" మాయాదేవి సమాధానంగా తలూపి అన్నది "స్త్రీల స్వభావంలో యింకొక విశేషముంది

అరుణాదేవి ! పురుషులమీదా, సార్వభౌములైన పాదుషాల మీదా, చివరకు నీలంటే భగవంతునిమీదకూడా మనం ఆధిపత్యం కావాలంటాము. చరిత్రలోకూడా అది ధృవపడింది. జూలియస్ సీజర్, జహంగీర్, నెపోలియన్, ఎనిమిదవ ఎడ్వర్డు వారందరి సింహాసనాలు ఆడదాని పాదాక్రాంతమయ్యాయి. ఈ సర్వాధికారంలేనిదే మనం సుఖపడలేము. కాని ఆర్టిస్టు వీరందరికీ అతీతుడనిపిస్తోంది. అటువంటివారికి హృదయంయిచ్చి మనం వేదనాభారాన్ని మోస్తూ, జీవితమంతా దుఃఖిస్తూ వుంటాము."

"చాలు, చాలు, ఆపండి మాయాదేవి!" అరుణ కన్నీరుపెట్టుకుని — "ఈ మాటలకు నాకు దుఃఖం పొర్లు కొస్తోంది." అన్నది.

"ఓహో ! క్షమించండి అరుణాదేవి ! నేను మీ హృదయాన్ని గాయపరిచాను. నా ఉద్దేశ్యం అదికాదు..."

"కాదు. కాదు. మీ రలా అనకండి! నాకు మీయందు ఏమాత్రం దురభిప్రాయం లేదు. పైగా మీరు నామనసులోని బాధను స్పష్టంగా తెలియచేసి, సానుభూతిచూపించారు. అందుకు నేను కృతజ్ఞురాలిని. మన స్త్రీలకు దుఃఖమే ఏకైక చిరకాల నెచ్చెలి. ఇక నేను యింటికివెడుతున్నాను."

"అవును చెల్లీ !" మాయాదేవి దీర్ఘంగా నిట్టూర్పు విడిచి— "నా వైభవ్యం చూడు ! దానివెనుక దుఃఖకరమైన దీర్ఘకథ దాగివుంది. స్త్రీలనొసట ఎప్పుడూ, దుఃఖమే వ్రాసుంది. నేను చెప్పేది నిజం. భగవంతుడుకూడా తన

క్రూరత్వాన్నంతా మనమీదనే కురిపిస్తున్నాడు. సరే, యీ మాట లిక వదిలేయండి! మీకు క్లబ్బుకురారా?" అనడిగింది

"నేటికి క్షమించండి మాయాదేవి! నాకు తలనొప్పి గావుంది."

"ఓహోహో! వెరీ సారీ! ఐతే చన్నీటిగుడ్డ తల మీదుంచమంటారా?"

"వద్దు, అంత అవుసరంలేదు. కారులో గాలితగిలితే అదే పోతుంది. ఇక వెడుతున్నాను. ధన్యవాదాలు."

అరుణ గబగబా వెళ్ళి కారులో కూర్చుంది

అరుణను పంపించాక, మాయాదేవి తన శృంగార మందిరంలోని నిలువుటద్దంముందు నిలుచుంది. ఆమె మెత్తని సిల్కు 'ఫఫ్ బ్రష్'తో బుగ్గలమీద గులాబీపౌడరు అద్దుకుంటూ, కుటిల మందహాసంతో తన ప్రతిబింబంవేపు చూచి- "మాయాదేవి! నీ బుద్ధి సుశిక్షితంగా వున్నంతవరకు నీకు జయమే కలుగుతుంది. నేడు రగులుకున్న దావాగ్ని, అశోక్ గారి దాంపత్యజీవితాన్ని భస్మంచేయకపోదు. దీనివల్ల పని జరగనప్పుడు, నీవద్ద యింకా ఆయుధాలు వున్నాయి, హో హ్హో హ్హో...అశోక్ బాబూ! నీవు నావాడివై వుంటావా లేక నీ యిల్లు స్మశానంచేయమంటావా...? నువ్వెవ్వరితో శత్రుత్వంవహించావో తెలుసా?" అంటూ ఒక భీషణ అట్టహాసంచేసింది. బెల్ మ్రోగించి నౌకరును పిల్చి-"క్లబ్బుకు కారుతీసుకురా'' అని చెప్పింది.

అరుణ, మాయాదేవియింటివద్దనుంచి తిరిగివచ్చేసరికి, అశోక్ పడకకుర్చీలో కూర్చుని రేడియో వింటున్నాడు. అరుణ వ్యగ్రముఖం చూచి, నేడు మాయాదేవి కొన్ని విషబీజాలు నాటినట్లు తెలుసుకున్నాడు. అదేమిటో మాత్రం తెలుసుకోలేకపోయాడు. కాని, ఇలా ఎప్పుడో ఒకప్పుడు జరిగితీరుతుందనేది, అతనికి స్ఫురిస్తూనేవుంది. తను మాయాదేవిని ఎరిగినంతవరకు ఆమె ఎంతకైనా తెగించగలదని, ఆమె ప్రణయయాచనను తిరస్కరించినందుకు ఎప్పుడో ఒకప్పుడు కక్ష తీర్చుకోకుండా వుండదనికూడా గ్రహించాడు. పాద్రీపురంలోని మరియమ్ విషయం ఆమెకు పూర్తిగా తెలియకపోయినా, తప్పకుండా వూహించగలదు బహుశా, అశోక్ ని సర్వనాశనం చేసేందుకు ఆ అస్త్రమే ఆమె ఆఖరిఅస్త్రం కావచ్చు. ఏదో ఒకనాడు ఆ దుర్ఘటన జరిగితీరుతుంది.

అరుణవ్యవహారం అతనికి విరుద్ధంగా, కఠినంగామారింది. ఆమెలో కోరికలు చెలరేగాయి. అశోక్ హృదయంమీద తనకు సంపూర్ణాధికారాన్ని కోరుతోంది. అది లేదని తెలిసి, తను దుఃఖితురాలిననీ, అభాగ్యురాలిననీ అనుకుంటోంది. అశోక్, అరుణల స్వభావాల్లోని మూలవిరోధకారణం కొంతకాలంనుంచీ అగ్రాహ్యంగా వుంది. ఇప్పుడిప్పుడే, అది స్వల్పంగా విశదమవుతోంది.

కాని, ఈ పరిస్థితుల్లోకూడ అశోక్ స్వభావసిద్ధమైన గాంభీర్యం, శీలం, సంస్కారం అరుణకు దుఃఖం, అసంతృప్తి

కలుగనివ్వలేదు. అందువల్ల అశోక్ యింకా ఆమె కోర్కెలు అవసరాలవిషయంలో పూర్తిగా జాగ్రత్త తీసుకునేవాడు. అతని ఆ ఉదాత్తత అరుణమీద అప్పుడప్పుడూ గొప్పగా పనిచేసేది. కాని, అది తాత్కాలికంగానేగాని, శాశ్వతంగా వుండేదికాదు.

తమయిద్దర్ని సన్నిహితం చేసేందుకు, ఇద్దరి విభిన్న హృదయాల్ని సమన్వయం చేసేందుకు అరుణకు ఒక బిడ్డ కలిగితే, అదొక సూక్ష్మ ప్రేమబంధం కాగలదని అశోక్ ఆలోచించాడు. బహుశా ఆ బంధం, ఆ ఆకర్షణ, వారి వైవాహిక సంబంధాన్ని అవిచ్ఛిన్నంగా వుంచగలవనుకున్నాడు. కాని, ఆ వూహకూడా నిష్ఫలమైంది.

ఒకనాటి ప్రాతఃకాలం అరుణ లేచి, ఎంతో వినయంగా, తను మాతృత్వశృంఖలాలనుంచి స్వయంగా విముక్తి పొందడంలో విజయం సంపాదించినట్లు అశోకునితో చెప్పింది. పత్రికల్లో ప్రకటించబడిన మాత్రలు ఎంతో ఉపయోగపడినట్లు చెప్పింది. ఇదే సైన్సుఅనీ, ప్రకృతినికూడా జయించగలిగిందనీ సగర్వంగా చెప్పింది.

విజ్ఞానంతో కూడిన యీ విజయగాధను విని అశోక్ స్థంభించిపోయాడు. అతని కలలూ, ఆశలూ చెదిరిపోయినై. అతని సున్నితమైనగుండెలమీద ఎవరో సమ్మెటపెట్టుపెట్టినట్లయింది.

అతను కళాకారుడు. సృజనాత్మకమైన క్షుదాపీడితుడు. సృష్టిలోని ఏ కళావస్తువైనా అతనికి పరమానందంగా వుంటుంది. శిశుపుజన్మతో పురుషునికుండే పితృత్వంతో పాటు,

అతని సృజనాత్మక క్షుధకూడా పరితృప్తిచెందుతుంది. అతను యీ సమయంకోసం, గంపెడాశతో ఆతృతతో చూస్తున్నాడు.

కాని అవన్నీ వ్యర్థమైనవని ఋజువైంది. అతని కల్పనా సుందరచిత్రం, అనివార్యమైన ఆత్మక్షుధ అన్నీ అలాగే నిలిచిపోయాయి.

ఇలా ఎందుకు జరిగింది?

ఆ అనాగత శిశువు తన క్లబ్బు, సినిమా, భోగ విలాసజీవితంలో బాధకలిగిస్తుందనీ, కనీసం, మూడు నాలుగేళ్ళవరకైనా మాతృత్వబాధ్యత వహించకూడదని ఆమె అభిప్రాయం!

అరుణఆర్గ్యుమెంటుకు అశోక్‌కు కోపం, విచారం కలిగాయి. ఈ స్వార్థం, భోగలాలసత్వం అరుణలో ఎక్కడినుంచి వచ్చాయ్? ఇది ఆమె మూలస్వభావమా లేక మాయాదేవి యింద్రజాలప్రభావమా? ఈవిషయం అతడు సరిగ్గా చెప్పలేడు. మాయాదేవి...మాయాదేవి! ఆమె ఎంతవరకు విజృంభిస్తుందో, మనం వూహించలేము.

ఈసంఘటనతో, తమ వివాహబంధం ఎక్కువకాలం నిలవదని గ్రహించాడు. నిస్సందేహంగా అతను తనజీవితంలో ఎంత గొప్ప పొరపాటుచేశాడు? కాని యిప్పుడు పశ్చాత్తాప పడినందువల్ల ఏమి ప్రయోజనం!

అయినప్పటికీ, తను స్వయంగా వివాహవిచ్ఛేదనమనే భావం రానీయడు. సమాజంలో యిటువంటి సంఘటనలు

జరగడం మంచిదికాదు. ఆ ప్రాంతంలో అతనికి మంచి పలుకుబడివుంది. ప్రతిష్ట వుంది. దేశంలోని కళాక్షేత్రంలో, విశేషించి నేపుల్స్‌ప్రదర్శనలో ప్రశంసాపత్రం పొందాక, అతని పేరెంతగానో ప్రాకిపోయింది. ఈ సమయంలో పత్రికల్లో విడాకుల సమాచారం పడినట్లయితే ఎంత అసహ్యంగా కనుపిస్తుంది? వివాహవిచ్ఛేదానికి కారణమేదైనా, లోకులు తనను తిరుగుబోతుఅని, నీచుడని, విలాసప్రియుడనీ అంటారు.

కాదు. ఈ అపవాదుకు అతను ఎన్నటికీ అవకాశమీయడు. అతడు నిమ్మకునీరెత్తినట్లు అంతా సహించగలడు. ఈ ప్రమాదాన్నుంచి తనను తాను రక్షించుకోగలడు.

ఆసమయంలో అబ్దుల్లా, ఒక పెద్ద బాదామీరంగు కవరు తీసుకునివచ్చి అశోక్‌కు యిచ్చాడు. దానిమీద పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ముద్ర వేసివుంది. అడ్రసు వ్రాసేచోట అతనిపేరు వ్రాయబడివుంది. పోస్టల్‌డిపార్టుమెంటు తన కెందుకు కవరు వ్రాసిందో అతని కర్థంకాలేదు.

దాన్ని చించి చూసేసరికి, లోపల చినిగివున్నకవరులో తను వివాహానికి నెలరోజులకుముందు మరియమ్‌కు వ్రాసిన ఉత్తరం కనుపించింది. కవరుమీద, కొన్నిపోస్టాఫీసుల ముద్రలుపడివున్నాయి. అక్కడక్కడా నీలం, ఎర్రసిరాలతో 'చిరునామాదారుని జూడలేదు. పంపించినవారికి వాపసుచేయబడింది.' అని వ్రాసివుంది.

ఎన్నోచోట్ల తిరిగి, షుమారు మూడున్నర నెలల యాత్ర సమాప్తంచేసి చివరకు 'డెడ్ లెటర్ ఆఫీసు'కు చేరి

ఆ వుత్తరం తనకు చేరింది. అతడు ఎంతో పరిశీలనగా ముద్ర లను చూచేసరికి నాగపూర్ జి. పి. వో., బైతూల్, పాద్రీ పురం, ఇటార్సీ; ఇత్‌వార్, ఇగత్‌పూర్ మొదలైన పేర్లు ముద్రించబడినట్లు కనుపించాయి. ఆ తరువాతముద్రల్ని చదవ లేకయాడు. అన్నీ ఒకదానిమీద ఒకటి ముద్రించబడివున్నాయి. లోపలువున్న కవరుకూడా అసహ్యంగా చినిగిపోయింది.

ఆ ఉత్తరంలో తను వివాహం చేసుకుంటున్నానని సూచించి, ఆమెశుభాకాంక్షలు కోరాడు. ఎంతో ఆలోచిం చినమీదటే తను యీ నిశ్చయానికి వచ్చినట్లూ, కాని ఎందుకో తనమనసులో కొంచం వ్యాకులత, అనుమానంకూడా వున్నాయనీ, జీవితప్రయోగం సఫలమవుతుందో లేదో తెలియ దనీ, అయినా. ఈ బరువును తలమీద పెట్టుకుంటున్నాననీ, ఈ మార్గంలో తనకు తన కళాసాధనలో ఏదైనా ప్రేరణ, ప్రోత్సా హం లభించగలవేమో ప్రయత్నించాలని వ్రాశాడు. తన స్థితి ఏదో అజ్ఞాతప్రదేశంలో, చీకటిలో పాదంపెట్టిన ఒక ప్రవాసి లాగావుందని వ్రాశాడు.

చివర — తను పాద్రీపురం వదిలిపెట్టాక మరియమ్ సంగతులేమీ తెలియలేదనీ, ఆమె భిక్షుకిదీక్షనుంచి విరమిం చుకుని యిప్పటికేదో స్వతంత్రవృత్తిచేపట్టివుండవచ్చుననుకుం టున్నాననీ వ్రాశాడు. ఆమె తన యోగక్షేమాలతో వుత్తరం వ్రాసినట్లయితే తనకు సంతోషమనీ, భగవంతుడు ఆమెను సర్వదా రక్షించగలడని నమ్ముతున్నట్లుకూడ వ్రాశాడు.

వికలమైన మనసుతో ఈ వుత్తరం వ్రాశాడు. అతని వేదనాహృదయం అందులో వ్యక్తమవుతోంది. ఒక నెలవరకు

మరియమ్‌వద్దనుంచి వృత్తరంవస్తుందని ఆశించాడు. మరియమ్ వ్రాసే ఆ ఒక్కవుత్తరంతో అతనిబరువు కొంత తగ్గుతుందని, తన హృదయమథనం కొంత తగ్గుతుందని అనిపించిందతనికి.

కాని మరియమ్‌వద్దనుంచి వుత్తరం రాలేదు. మూడు నాల్గు నెలలతరువాత, తనవుత్తరమే తనను వెదకుతూ నిరాశతో తిరిగివచ్చింది.

ఐతే మరియమ్‌కు తన వివాహంసంగతి తెలియదా? మరి, మరియమ్ ఎక్కడున్నట్టు? ఈ ఉత్తరాన్నిబట్టి ఆమె షాద్రీపురంలో లేదని తెలుస్తూంది. ఆమె అడ్రసు కొట్టివేసి ఎవరో-బహుశా మిస్ థామస్ హస్తాక్షరాలు కావచ్చు. ఇటార్సీ అని చదివేందుకు వీలయ్యేట్లు వ్రాశారు. మిగిలిన దంతా చినిగిపోయింది. ఎంతో పరీక్షగా చూశాడు. కాని, ముందువిషయాన్ని అర్థంచేసుకునే సంకేత మేమీ కనుపించ లేదు.

బహుశా, మరియమ్ యింకేదైనా పెద్దపట్టణానికి వెళ్ళిందేమో! బహుశా దర్జీదుకాణం పెట్టుకొని వుండవచ్చు. లేకుంటే ఎక్కడైనా, నర్సింగ్‌కోర్సు పూర్తిచేస్తోందేమో! లేక యింకేదైనా చేస్తోందేమో! ఆమెను మంచిదారిని పెట్టా లంటే ఆ నాలుగువందలు చాలు. ఆమె ఎక్కడున్నా సుఖంగా వుంటుందని వూహించడంలో పొరపాటులేదు.

ఈవిధంగా అశోక్ తన మనసును వూరడించు కున్నాడు కాని, ఎందుకో మరియమ్‌విషయమే జ్ఞాపకం వస్తోంది. హృదయంలోకూడా అల్లకల్లోలం బయలుదేరింది. అతన్ని మౌనం ఆవేశించింది.

వివాహవిషయంలో మరియమ్‌కున్న వూహ అబద్ధమైనదని ఋజువైంది. అసలు అశోక్ భయమే నిజమైంది. వివాహవిషయంలో యీ వినాశకర పరాజయంలోకూడా అతనికి తన వూహాసత్యంవల్ల సంతోషంకలిగింది.

కాని, యీ వినాశకర పరాజయం నిజంగా జరిగినట్లయితే—!

ఒకవేళ మరియమ్‌తోనే తనకు వివాహం జరిగివుంటే—!

ఛీ...ఛీ...నేడు అతను అరుణతో వివాహసూత్రంతో బంధింపబడ్డాడు. ఆమె మరియమ్ అయివుండవచ్చు. కాని, ఈ స్థితిలో యితరులవిషయంలో యిలా ఆలోచించడం అనుచితమవుతుంది.

అతడు యీ ఔచిత్యాన్ని ప్రక్షాళనం చేసుకునేందుకు "అరుణా!" అని పిల్చాడు.

అరుణ వచ్చి నిర్వికారంగా అడిగింది-"ఏమిటి?"

"సినిమాకు వస్తావా?"

ఈ అనాపేక్షిత ఆహ్వానంతో ఆమె స్థంభించిపోయింది. తనను సినిమాకు తీసుకుని వెడతానని అశోక్ యింతవరకూ అనిఎరుగడు. అవును వాస్తవంలో ఏడురోజులుతప్ప! నేడిలా అశోక్ ఎందుకంటున్నాడు?

కారణం ఏదైనా, అరుణ సంతృప్తిచెందింది. నేడామెకు ఎంతో సంతోషమైంది తన అశోక్ తనను సినిమాకు తీసుకుని వెడుతున్నాడు.

"ఎప్పుడు ? ఏ సినిమాకు ?"

"ఈ మొదటిఆటకే! న్యూ థియేటర్సువారి 'ముక్తి'. బారువా, కనన్‌బాల నటించారు. బారువా యాక్టింగ్ నా కెప్పుడూ బావుంటుంది. 'కళలో అంత ఉజ్వలఅవధానాన్ని నే నెక్కడా చూడలేదు. బారువా మన భారతీయ కళా-సంస్కృతులకు ప్రతినిధి."

"తప్పకుండా వెళదాం. అరుణ పసిపిల్లలా కిలకిలమంటూ నవ్వి చప్పట్లుచరిచింది.

అశోక్ కూడా అరుణ సహజానందాన్ని చూచి, నిండు హృదయంతో చిరునవ్వునవ్వాడు.

## 28

అశోక్‌కి సినిమాకు వెళ్ళేందుకు ప్రేరణకలిగించిన ఉల్లాసం యింకా సమసిపోలేదు. దానిని చూచి అరుణ శ్రీమతి మాయాదేవిని భోజనానికి ఎందుకు ఆహ్వానించకూడదని అడిగింది. వారింటియందు ఎన్నోమార్లు భోజనం చేసి వచ్చామనీ, అందుకు బదులుగా మాయాదేవిని ఆహ్వానించడం ఉచితమని చెప్పింది.

ఈ యుక్తిలోని యధార్థం అశోక్‌కు తెలుసు. మనసులో అతిథివాత్సల్యంకూడా వుంది. అందువల్ల, అతను అరుణ సూచనను ఆలస్యం చేయకండా అంగీకరించాడు.

అయిదురోజుల తరువాత, అంటే రాబోవు శనివారం నాటి సాయంకాలం మాయా దేవిని ఆహ్వానించాలని నిశ్చయించుకున్నారు. ఆహ్వానం వెళ్ళింది. ఆమె దాన్ని స్వీకరించింది.

కాని, విధివిలాసం యింకొకవిధంగా వుంది. శుక్రవారం మధ్యాహ్నం షుమారు పన్నెండుగంటలకు, తన భార్యకు జబ్బుగావుందని అరుణను మొదటిబండికి వెంటనే పంపించమని రామపురంనుంచి అధికారి టెలిగ్రాం పంపించారు. ఘోరమైన దుశ్చింతతో ఆ పగలంతా గడిచింది. రాత్రి హౌరాఎక్స్‌ప్రెస్‌లో అరుణ రాయపూరు వెళ్ళిపోయింది. ఆమెను పంపించడానికి అశోక్ స్టేషన్‌కు వెళ్ళాడు. అక్కడికి చేరినవెంటనే, తనతల్లికి ఎలావున్నదీ వెంటనే టెలిగ్రాంద్వారా తెలియజేయమనీ, లేకుంటే తనెంతో వ్యాకులపడవలసివస్తుందనీ చెప్పాడు.

ఈమధ్యలో మధ్యాహ్నమప్పుడు, అరుణ ఆకస్మిక ప్రయాణాన్ని గురించి, విందుఏర్పాటు విరమించుకున్నట్లు మాయా దేవికి తెలియపర్చారు. మాయా దేవి వెంటనే కారులో వచ్చి జబ్బు అంత ప్రమాదమైనదై వుండదనీ, ఐనా టెలిగ్రాం వచ్చినప్పుడు కొంచం అధైర్యపడటం స్వాభావికమేనని వారికి ధైర్యంచెప్పింది. అరుణవద్దనుంచి టెలిగ్రాంరాగానే తనకు తెలియపర్చమనికూడా చెప్పి వెళ్ళిపోయింది.

శనివారం ఉదయంనుంచే, అశోక్ రాయపూరునుంచి టెలిగ్రాంకోసం ఎదురుచూస్తున్నాడు. అరుణ తెల్లవారుజామున నాలుగుగంటలకు చేరివుంటుంది. టెలిగ్రాఫ్ ఆఫీసు

ఏడుగంటలకో, ఎనిమిదిగంటలకో తెరవబడుతుంది. ఈ విధంగా అరుణకు తన తల్లివద్ద వుండేందుకు నాలుగైదుగంటల వ్యవధివుంటుంది. ఎటుచూచినా తొమ్మిదిన్నర, పదిగంటల లోపున టెలిగ్రాం రావలసిందేనని ఆలోచిస్తున్నాడు.

కాని, పన్నెండుగంటలకు టెలిగ్రాం వచ్చింది. ఆ పెద్ద కవరును చూచి, అందులో ఒకపేజీకంటే ఎక్కువ టెలిగ్రాంవచ్చినట్లు గ్రహించాడు. అందువల్ల అతను కొంత నిశ్చింతుడయాడు, వెంటనే కవరుచించి చదివాడు.

"అమ్మకు మలేరియాపట్టుకుంది. మొన్నరాత్రి 105.4 డిగ్రీల జ్వరంలో భయపడి పలవరింతలుపెట్టిందట. ఆమె బల వంతాన నాకు టెలిగ్రాంయిప్పించి పిలిపించారట. నిన్న ఉదయం పదిగంటలకు జ్వరం నార్మల్‌కు వచ్చింది. ఇప్పుడే, ఒక యింజక్షనుకూడా యిచ్చారు. అప్పటినుంచి కొంత నయం గావుంది. రాత్రికూడా అంతగా బాధలేదు. ఇక జ్వరంవచ్చినా, అంత ఎక్కువగా రాదనీ, రెండోయింజక్షనుకు జ్వరం తప్ప కండా తగ్గుతుందనీ సివిల్‌సర్జన్ చెప్పారు. ఇప్పుడిక విచారించ వలసినపనిలేదు. నేను వచ్చినందుకు అమ్మ ఎంతో సంతో షించింది".

అశోక్ మనసు తేలికపడింది. అతను వెంటనే డ్రైవరుకు సైకిలిచ్చి టెలిగ్రాం మాయాదేవివద్దకు పంపించాడు.

డ్రైవరు గంటన్నరకు తిరిగివచ్చాడు. తిరిగివస్తూ మాయాదేవి సుందరహస్తాలతో, వ్రాసియిచ్చిన ఉత్తరాన్ని

తీసుకుని వచ్చాడు. దుఃఖమేఘాలు దూరమైనందుకు సంతో షంగావుంది. ఈ ఆనందోత్సాహంలో విందు పూర్వనిశ్చయాన్ని స్థిరం చేద్దామని ప్రార్థించింది. విందు అశోక్ యింట్లో కాకుండా, మాయాదేవియింట్లో జరిగేటట్లు ఏర్పాటయ్యింది. సమయం సాయంకాలం ఎనిమిదిన్నరగంటలకే! మాయాదేవి, ఎంతో ప్రేమతో, అనంగీకారం తను వివవల్సుకోలేదనీ, ఒకవేళ అశోక్ రానట్లయితే తను స్వయంగా కారులో తీసుకుని వెళ్ళడానికి వస్తాననీ వ్రాసింది. ముఖ్యంగా అశోక్‌తో కొన్ని విషయాలు మాట్లాడాలనీ, అందుకని వెంటనే అంగీకారం తెలియజేయుమని వ్రాసింది.

తనతో మాయాదేవి ఏమి మాట్లాడాలనుకుంది? తన స్వార్థంవిషయమే కావొచ్చు. అయితే, తను ఆమెయింటికి ఎందుకు వెళ్ళకూడదు? అని ఆలోచించాడు అశోక్.

నేటిచర్చలో ఆమె తన సంసారజీవితంలో ... ఎంత విషంపోసిందో? ఆమె ఏ ఏ విషయాలు చర్చించిందో అవన్నీ తెలుసుకోవడం సంభవంకావచ్చుననుకున్నాడు. అరుణకోసం చూస్తుంటే - మాయాదేవి ఆమెను వలలోవేసుకున్నట్లేనని స్పష్టంగా తెలుస్తోంది. కాని, అస లది ఏవిషయమో సరిగ్గా తెలియదు. బహుశా యీనాటి చర్చలో ఆవిషయం బయట పడవచ్చు. యిదంతా చూస్తుంటే, మాయాదేవి యింతవరకు మరియేమ్ విషయం చెప్పలేదనే వొప్పుకోవాలి. ఒకవేళ చెప్పివుంటే, తన భార్యలాంటి అసూయాపరురాలు తన మనసులోని భారాన్ని దాచుకోలేక ఎప్పుడో తనయింట్లో భీషణకాండ

జరిపిడం డేదికాదా ? ఈవిషయంలో తనకు మాయాదేవి ఉప కారమే చేసిందనుకున్నాడు.

మాయాదేవితో మాట్లాడితే, యికముందామె ఏమి చేయదలచుకున్నదో ఆ విషయం బయటపడుతుంది. అశోక్, తన వైవాహిక జీవితాన్ని భ్రష్టంచేసే నిశ్చయం ఆమెకున్నట్లయితే, ఆ ప్రయత్నం విడనాడి, యికమీదట తటస్థంగా వుండమని సూచించవచ్చునుకున్నాడు. ఇలా జరిగినప్పుడు బహుశా ఆమె యిష్టపడితే తను, మాయాదేవి-యిద్దరూ తమకున్న పాతసంబంధాలు మరచిపోయి, తిరిగి పరిశుద్ధమైన మిత్రత్వాన్ని కొనసాగించుకోవచ్చునని, ఆమెమీద తన ద్వేషాన్ని రూపుమాపుకోవచ్చునని భావించాడు.

ఈ ఆలోచనలతో వెంటనే తను విందుకు అంగీకరించినట్లు, అందుకు తన సంతోషం వెలిబుచ్చుతున్నట్లు కబురు పంపించాడు.

నేడు అతిడు ముస్తాబుకావడంలో ప్రత్యేకాసక్తి కలిగి వున్నాడు. వివాహసమయంలో శ్రీ అధికారి బహూకరించిన అందమైన నీలిసూటు వేసుకున్నాడు. అసలు అశోక్ సహజంగా సౌందర్యవంతుడవడంచేత ఏబట్టలైనా అందంగానే వుంటా యతనికి. అంతేగాక, ప్రత్యేక శ్రద్ధవహించినప్పుడు యింక చెప్పనవసరం లేదు.

అశోక్ నిస్సంకోచంగా వ్యవహరించటం చూచి మాయాదేవిముఖకమలం వికసించింది. నేడామెకు అశోక్

మాటల్లో ఎంతో ఆత్మీయత కనుపించింది. ఈ నిధిని పొంద డానికి క్రొత్త ప్రయత్నాలుచేసేందుకు సిద్ధపడింది.

మాయాదేవి అశోక్‌కు స్వాగతంచెప్పేందుకు ప్రత్యేక ఏర్పాట్లుచేసింది. భోజనాలగదిని ఏదో ఉద్యానవనంలా, పూలతో, క్రోటన్సుతో అలంకరింపచేసింది. భోజనంచేసే మేజాబల్లమధ్య, మనోహరమైన పుష్పగుచ్ఛాలు వుంచింది. ఆ పుష్పగుచ్ఛాలమధ్యనుంచి ఒక చిన్న ఊర్ధ్వధార, అందంగా తుషారాన్ని పైకి విరజిమ్ముతూ పచ్చని బల్బు సౌమ్యప్రకా శంలో రవ్వల్లా కన్పింపజేస్తోంది. మనసులోని చల్లని ఆహ్లా దాన్ని భంగపరచి, ఉగ్రతను కలిగించే వస్తువు ఆ గదిలో మచ్చుకు ఒక్కటైనా లేదు. నయనమనోహరమైన ఎలెక్ట్రిక్ బల్బులుకూడా ఆ వాతావరణంలో మనసుకు సుఖంకలిగించే అద్భుత స్నిగ్ధదీప్తిని ప్రసరిస్తున్నాయి. వీటన్నిటికంటే మాయాదేవి వుపయోగించిన పారిస్‌సెంటు పరిమళం వింత మత్తును కలిగిస్తోంది. ఒకప్రక్క రేడియో మధురసంగీతాన్ని ఆలాపిస్తోంది. ఈ సుఖమయ వాతావరణంలోని మోహప్రభా వాన్నుంచి తమనుతాము నిగ్రహించుకోవడం కష్టమే!

మాయాదేవి అశోక్‌కు చాలా దగ్గరలోవుండి, అతన్ని తదేకంగా చూస్తోంది. అశోక్ మీద ఎంతో భ్రమకలిగివుంది. అతని పొందుకోసం, అహర్నిశలు ప్రయత్నిస్తూనేవుంది. ఆమె అశోక్‌యందు ఎన్నోమార్లు ప్రేమ వ్యక్తపరిచింది. ఈ హేతు పూర్వకంగా చేయబడిన బాహ్యప్రదర్శనలమునుగున, ఆమె మనసులోని వాంఛ దాగివుంది. అశోక్ తనకు దూరమవు

తున్నకొద్దీ అతన్ని పొందాలని యింకా ఎక్కువగా ప్రయత్నించేది. బైతూల్ గ్రామంలో అటువంటి పరిస్థితే ఒకసారి కలిగింది. బహుశా, తను ప్రేమోన్మాదంలో పడిందేమోనని పించిం దప్పుడు. కాని, అదీ ఒకే ఒక్క క్షణం! ఆ తరువాత తను యింతవరకూ ఎరుకుపడకండా తప్పుకు తిరుగుతోంది.

ఈ అనుభవం ఆమెకు అపూర్వమైనది. ఈనాటివరకూ పురుషులతో ఆమెకున్న సంబంధాన్ని బట్టీ, ఆమెముందుకు వచ్చినవారి స్వభావ స్వరూపాన్ని బట్టీ, స్త్రీ - పురుషులు అంటే 'అగ్ని-మైనపు వత్తి' వంటివారని ఆమెఅభిప్రాయం. అగ్నిసమీపానికి వచ్చినప్పుడు మైనం కరిగిపోవలసిందే. కాని, పురుషుడు తన శారీరకసౌఖ్యాన్ని అధిగమించగలడని ఆమెకు మొదటిసారిగా అవగతమయింది. ఆమె మనసులోనే అశోక్‌ను గౌరవించింది. ఆమె మోహావేశం తీవ్రమైంది. అశోక్ మీద విజయంపొందాలనే కోరికకూడా విజృంభించింది.

పురుషుని మనోవిజ్ఞానవిషయంలో మాయాదేవి అనుభవం ఏమంత తక్కువదికాదు. ఆమె తన సమస్తబుద్ధినీ, అనుభవాలను క్రోడీకరించి ఏకాగ్రతతో అశోకునిస్వభావం పసిగట్టేందుకు ప్రయత్నించింది.

మొదటిసారి అతను తనదగ్గరకు వచ్చినప్పుడు, ఏ స్త్రీమోహంకూడా అతన్ని తాకలేనంత కళాపిపాసతో వున్నాడు. మాయాదేవిలాంటి సౌందర్యవతి కూడా అతన్ని సమ్మోహపరచలేకపోయింది. అప్పుడే ఆమెకు కొంత నిరాశ కలిగింది.

ఐనా, అటువంటి అశోక్ మీద, పాత్రీపురంలో మరి యమ్‌లాంటి సహజ సుందర వనకన్యాప్రభావం పడినట్లు, ఆమె తీక్షణదృష్టి పసిగట్టింది. చివర కలిదు మాయాదేవినికూడా అవమానించాడు. మాయాదేవికి ఈర్ష్యకలిగింది. అతని తిర స్కారానికి కోపంకూడా వచ్చింది. కాని, దానితోపాటు అశోక్ జితేంద్రియ మర్యాదా-పురుషోత్తముడుకాడని తెలుసు కుని సంతోషించింది. అతను పురుషుడే - స్త్రీవ్యామోహ విముక్తుడుకాడు. అశోకుని వశపరచుకునేందుకు చాలా అవ కాశముంది.

ఇప్పుడు మరియమ్ ఎక్కడికో వెళ్ళిపోయి, ఆ తావును అరుణ ఆక్రమించింది. ఇక ఈ పురుషుడు వివాహసూత్రంలో పడకుండా తప్పించుకోవడానికి మార్గంలేకపోయింది. కళ, కళా సాధనంతా, ఒకప్రక్క ఉపపత్నిగా వుండిపోయింది. పురుషుణ్ణి స్త్రీ జయించింది, ప్రపంచ ఆదిశక్తిసింహాసనంమీద దాని పునఃస్థాపితం జరిగింది. అశోక్ అరుణయందు సంయ మనశక్తి కోల్పోయాడు. ఇందుకుకూడా మాయాదేవి గర్వం చింది. ఇప్పుడాశకు ఎక్కువ బలిమిచిక్కింది. తనలాంటి కుయుక్తులకి అరుణలాంటి కాలేజిపిల్ల పెద్ద ఆటంకంకాదు.

అందువల్లనే, ఆనాటి సాయంకాలం అరుణఒక్కర్తే తనయింటికి వచ్చినప్పుడు, అశోక్, అరుణలకు సరిపడటంలేదని మొదటిసారిగా తెలుసుకుని సంతోషించింది. ఇంద్రజాలం ప్రయోగించడాని కామె ఒక్కనిముషంకూడా ఆలస్యంచేయ లేదు.

ఆనాడామె నాటిన విషబీజాలు, నిస్సందేహంగా మూలస్థానంలో నాటుకునేవుండవచ్చు. ఆ దంపతులిద్దరిమధ్య అవి అగాధాన్నే ర్పరచివుండవచ్చు. వివాహవిషయంలో అశోక్ కున్న స్వప్నాలు చెదరిపోయినట్లు కనిపించింది. అరుణలాంటి స్త్రీని పొందికూడా, అత నీనాడు ఏకాకి. అతనిహృదయం వ్యథతో నిండివుంది. మరి భావుకపురుషుడే కదా!

నేడతనికి సానుభూతి అవుసరం; సుఖంకావాలి. ఆమె మనసులోనే అనుకుంది. "మాయాదేవీ! నువ్వీనాడు అతి జాగ్రత్తగా మసలావంటే, ఈరోజే నీకు స్వర్ణసంధి. నీ అఖండవిజయానికి సుదినం ఉదయించింది. ఇంతకు మించిన సదవకాశం నీ కెప్పుడూ లభించదు." ఆమెలోని స్త్రీ ప్రకృతి ఉత్తేజితమైంది ఆమె మనసు ఆనందంతో చిందులాడుతోంది.

మాయాదేవి నేడు తన శృంగారసరళిని పరిపక్వం చేసిందని చెప్పనవుసరం లేదు. శృంగారనిమగ్నమై ఆమె క్లబ్బుకుకూడా వెళ్ళలేదు. మిష్టర్ రాయ్‌నుంచి వచ్చిన టెలిఫోను ఆహ్వానంకూడా త్రోసివేసింది. తన అందమైన వేషభూషణాలతో, యితర హంగులతో, తన వయస్సునుకూడా కప్పివుచ్చింది. ఇటువంటిరోజుకోసమే ఆమె ఎప్పటినుంచో ఎదురుచూస్తోంది.

భోజనసమయంలో, అరుణ, ఆమె పరివారం, శ్రీమతి అధికారిజబ్బూ, స్వాస్థ్యమూ, వాతావరణం మొదలైన మామూలువిషయాలపై చర్చజరిగింది. అశోక్ రెండు

మూడుసార్లు-"నాతో ఏ విషయాన్ని గురించి అడగాలను కున్నారు ?", అని అడిగాడు. ఇప్పు డంత తొందరేమిటని మాయాదేవి ఆ ప్రసంగాన్నంతటితో ఆపివేసింది.

భోజనమయాక మాయాదేవి అతన్ని డ్రాయింగు రూంలోనికి తీసుకుని వెళ్ళకుండా యింకొకగదిలోనికి తీసుకు వెళ్ళింది. బహుశా అది మాయాదేవి స్వంతగది కావచ్చు. అశోక్ అనుమానించాడు. మాయాదేవి ఆ విషయం గమనించి వెంటనే-"భయపడకండి! రండి! నేను మిమ్మల్ని ఏమీ మాయాభవనంలోనికి తీసుకువెళ్ళడం లేదులెండి" అంది.

అశోక్ సిగ్గుపడి ఒకసోఫాలో కూర్చున్నాడు.

ఒకేఒక చూపులో అత నా గదినంతా పరికించాడు.

అవును, అది మాయాదేవి ప్రయివేట్ గదియని తెలుస్తోంది. బంగళాలో ఒకప్రక్కన పశ్చిమగాలి బాగా వచ్చేదిక్కున వుంది. గదిగోడలమీదున్న చిత్రాలూ, ఫోటోలూ, టేబులుమీదున్న పాలరాతి శిల్పమూర్తులూ విలాసవాతావరణానికి నిదర్శనాలు. కిటికీలకు, వాకిళ్ళకూ నీలిరంగు ముతకపరదాలున్నాయి. గోడలకుకూడా లేతపచ్చ రంగు వేసివుంది. నేలమీద పరచిన కార్పెట్, జంపఖానా, కుర్చీల కుషనులన్నీ అదేరంగువి వున్నవి. బయట సన్నగా వానకురుస్తోంది. ఆ కారణంగా, గాలిలోకూడా ఆహ్లాదకరమైన చల్లదనం వచ్చింది. ఇక్కడకూడా మాయాదేవి రేడియోను సన్నస్థాయిలో పెట్టింది. కలకత్తా రేడియోస్టేషను బెంగాలీ సంగీతమాధుర్యంతో రమణీయవాతావరణం ఆనంద

మయమైంది వీటి సూక్ష్మప్రభావాలకు అశోక్ మనసులో ఆనందించకుండా వుండలేకపోయాడు. మాయాదేవి యింటిలో మొదటిదఫా కలుసుకున్నప్పుడు కలిగిన ఆ అయిష్టతాభావం, ఒకవేళ నేడు కలుగకపోయినా, కొంచమైనా తగ్గివుంటుంది.

మాయాదేవి ఎదురుగావున్న సోఫాలో కూర్చుంది. ఈనాడామె ప్రతిచేష్టలో ఆత్మవిశ్వాసం వుట్టిపడుతోంది. కాని, యిది కేవలం అశోక్ విషయంలోననే చెప్పలేము.

"అడగండి...?" అశోక్ అన్నాడు.

"మీ వైవాహికజీవితం సుఖంగావుందికదూ?" ఇదీ మాయాదేవి మొదటిప్రశ్న! ఇటువంటి అనాపేక్షితరీతిని, వ్యక్తిగత విషయాలతోనే చర్చ ప్రారంభమవుతుందని అశోక్ ఊహించలేదు. అందువల్ల కొద్దిగా చకితుడయాడు. కాని, మాయాదేవితో సూటిగా, బహిరంగంగా చర్చించడంతప్ప వేరే వుపాయం లేదు.

"సుఖంగా లేదని ఎవరన్నారు?" అతను కొంచం ఉద్రేకంతో అని, తిరిగి తన అనవసర ఆవేశానికి సిగ్గుపడిపోయాడు.

"లేదు. ఎవరూ అనలేదు. ఐనా, అరుణవల్లో ఎలా పడ్డారా అని అడుగుతున్నాను."

"పడలేదు. చూచి, అంతా విచారించే వివాహం చేసుకున్నాను."

"అలాగా...! మరియమ్మను ఎక్కడ వదిలివేశారు? వదిలేయడం మంచిదే, ఆ వనకన్యకంటే, అరుణ ఎంతో అందమైనది."

ఈ మాటకు అతనికి కోపంవచ్చింది. కాని ఈ సమయంలో దాన్ని వ్యక్తంచేయడం మంచిదికాదని వూరుకున్నాడు. మరియమ్ప్రశ్న తప్పించడమే అతను కోరుతున్నది. మాయాదేవి ఆతరువాత అంది- "వివాహంచేసుకున్నందుకు నేను అభినందిస్తున్నాను. కాని, మీ కళ, కళారాధన ఎక్కడికి వెళ్ళాయో చెప్పండి.? అంతా ఒక కోమలాంగిమోహంలోపడి కొట్టుకుపోయింది...అంతేనా.? '

ఈ ప్రశ్నకుకూడా జవాబుచెప్పడం కష్టమే. కాని, మెదలకుండా వూరుకోవడంకూడా మంచిదికాదు. ఏదోఒకటి చెప్పాలి. అందుకని "వివాహంవల్ల ఆ సాధనకు ఏదైనా ఇబ్బందికలుగుతోందో-లేదోననే ప్రయోగమే చేస్తున్నాను." అన్నాడు.

"ఐతే, ఆ ప్రయోగం ఫలించలేదనే తెలుస్తోంది ?"

"మాయాదేవి...!"

"ఏం...? నిజానికి భయపడుతున్నారా ? ఆశయహీనురాలు, గాంభీర్యం ఎరుగని ఓ కాలేజీకన్యను మీరు వివాహం చేసుకున్నారని, నేను ఎరుగనా? మీ కళనూ, మీఉన్నతహృదయాన్ని ఏమి తెలుసుకుంటుంది? మీ జీవితలక్ష్యాన్ని సాఫల్యం చేయడానికి ఆమె తోడ్పడుతుందా ? మీ రెలాగూ దెబ్బ తిన్నారు. మీకై మీరు చాలా జాగ్రత్తగలవాడిననుకుంటారు కదూ ?"

"మాయాదేవీ! ఈ వ్యక్తిగతవిషయాల్ని బయటికిలాగవలసిన అవసరమేమిటి ? నా అదృష్టం నా వెంట వుంటుంది. మీది మీతోనే వుంటుంది."

"బహుశా యీ విషయాన్ని కాదని వాదించడానికి మీకు ధైర్యంలేనట్లుంది." మాయాదేవి కోపంతో అన్నది. "ఈవిధంగా వుంటే ఏమెలా జరుగుతుంది అశోక్ బాబూ? మీరు మిమ్మల్నెంతకాలమిలా మోసపుచ్చుకుంటారు. స్త్రీ వ్యామోహం మిమ్మల్ని తాకదని లోగడ చెప్పారు. నా ప్రణయ యాచన తిరస్కరించి వెళ్ళిపోయారు. కాని, వెళ్ళి ఆ పల్లె పడుచు వలలో చిక్కిపోయారు. సరే, అదేముందిలెండి! పురుషులంతా యింతే! ఇప్పుడు మీరు అరుణఅందానికి ముగ్ధులై పోయారు. కళంతా మట్టిలో కలిసిపోయింది. మరి అరుణలో ఏమి చూడగలిగారో చెప్పండి? రూపమంటారా- ఆమెకన్నా నేను తీసిపోలేదే. ఇది నేను పందెంవేసి చెప్పగలను. ధనమంటారా, ఆమె తండ్రిలాంటివారిని పదిమందిని కొనగలను. బుద్ధి అంటారా! ఆమె స్కూలులోచదివే అమాయకపుపిల్ల మాత్రమే! ఇక కళవిషయం ఆమెకన్నా, నాకు వందరెట్లు కళాభిరుచివుంది. ఏమి చూసి, నన్ను వదలి ఆమెను చేపట్టారో చెప్పగలరా?"

మాయాదేవి విచిత్రమైనది. ఆమె దేనికీ భయపడదు. మనసుకు తోచినది జంకూ గొంకూ లేకుండా ముఖమెదుటే అనేస్తుంది. స్త్రీయా లేక మాయావినా? మొత్తంమీద మహా భయంకరమైన ఆడది...

అశోక్ మనసు ఆమెమాటలకు వ్యాకులపడింది. అతని హృదయంమీద యీ మాటల ప్రభావం పడుతోంది. అతను ఖిన్నుడై, అక్కణ్నుంచి పారిపోదామనుకున్నాడు. కాని, అలా చేయలేకపోయాడు. మాయాదేవి యధార్థవాది. ఆమెమాటలు

బాణాల్లా గుచ్చుకుంటాయని అతనికి తెలుసు. ఒక వేళ అతనికి యీ మెతో సంబంధం లేకుండావుంటే బావుండేదేమో ? తన బాధను ఎంతో ప్రయత్నంతో నిభాయించుకుని అన్నాడు. "ఈరకంగా మనుష్యుల గుణదోషాల్ని చర్చించినందువల్ల లాభ మేమిటి ? గతాన్ని మరిచిపోవడమే గొప్పతనం!"

"మీరు మర్చిపోగలరు. మరి నేనెలా మరువగలను ? నా ప్రణయాన్ని తిరస్కరించి మరియమ్‌బహుపాశంలోకి దూకేం దుకు మీకు సంకోచంకలుగ లేదే? మరిప్పుడు, ఆ మరియమ్‌ను ఒక్కతాపు తన్నేసి, యీ అరుణవెంట పడ్డారు! అరు ణనుమించిన అందకత్తె దొరికితే, ఆమెనుకూడా వదిలిపెడ తారుకదూ ? దీని అర్థమేమిటో కొంచెం ఆలోచించండి ?"

ఈ సూటిపోటిమాటలతో అశోక్‌కు పట్టరానికోపం వచ్చింది. మాయా దేవిలాంటి చరిత్రహీనురాలైన విలాసిని, తన చరిత్రనుగురించి. వివరాలు అడగడం, తన భావాలమీద వరుసగా దెబ్బకొడుతూపోవడం అతను సహించ లేకపోయాడు. ఇంతవరకూ సహించినదే చాలు, తన కళ్ళెదుట మరియమ్‌ను, తనభార్య అరుణను అవమానించడంకూడా సహించ లేక పోయాడు. అందుకని—"దాని అర్థంఏమైనా, దానితో మీకు సంబంధమేముంది ? నా జీవితబాధ్యత నాదే దీని అంచనా మీ ఎదుటవుంచడానికి బాధ్యుణ్ణికాను. నాఎదుట మరియమ్‌ను, అరుణను సమానంగా అవమానించడం గమనిస్తూనే వున్నాను. నే నిది సహించలేను."

"ఓహో!" ఆమె యీమాత్రానికే అధైర్యపడేరకం లోనిది కాదు. తన సామర్థ్యంలో ఆమెకు పూర్తి విశ్వాసం వుంది.

"ఐతే, యిప్పుడుకూడా మరియమ్మకు మీమనసులో స్థానముున్నట్లేం దే—"

"ఉందో, లేదో, దానితో మీకేంపని ?"

"ఏనెందుకు లేదు ? సవతులని ఈర్ష్యకలుగుతోంది."

"మాయాదేవీ! మీ నోటికి కళ్ళెంలేదా ?"

"సత్యానికి భయపడటం దేనికి? మనసులో ఒకటివుంచుకొని బయటకు వేరొకటిచెప్పే డాంబికురాల్ని మాత్రంకాదు."

"ఐతే, మీ వాగుడు మీరు వాగుతూవుండండి. నాకు దానితో పనిలేదు, నేను వెడుతున్నాను." అంటూ నిజంగా లేచి నిలబడ్డాడు.

మాయాదేవి వెంటనే అతనిచేయిపట్టుకుని కూర్చోపెట్టి, "అంత తేలికగా వెళ్ళగలరా అశోక్ బాబూ? నేను చెప్పుతున్న యధార్థవిషయం మీకు చేదుగావుంది. మీ వైవాహిక జీవితం నా గుప్పిట్లోవుందని మీ రెరుగుదురా ? తలుచుకుంటే దాన్నొక్క-క్షణంలో చిన్నాభిన్నం చేయగలను. ప్రపంచానికి మీ అపకీర్తిని చాటించగలను. అరుణకు మరియమ్మకథ తెలిసినప్పుడు మీగతేమవుతుందో ఎరుగుదురా !" అని బెదరించింది.

మాయాదేవి ఘూర్తడబాయింపుతో అశోక్ నిజంగా భయపడి అలాగే సోఫాలో కూర్చునివున్నాడు ఈభయంకర స్త్రీ ఎందుకైనా సిద్ధపడగలదని అతనికి తెలుసు. ఒకవేళ ఆమె తనను బెదరించినట్టు రహస్యాన్ని బయటపెట్టితే...? తన

గార్హస్థ్య జీవితానికి దెబ్బతగులుతుంది. తన ప్రతిష్టకు గొప్ప కళంకం కల్గుతుంది. మరి దాన్నెలా సహించగలడు? ఆ పిమ్మట అధికారిమహాశయుడు, లేడీ దినేశ్ కాంగా, ధర్మసీసేఠ్ మొదలైన తన ఖాతాదారులకు ముఖ మెలా చూపించగలడు? ఈ జీవితంకన్న మృత్యువే శరణ్యం! అటువంటి అపవాదులు బయలుదేరి కీర్తిహానికలిగాక తానింక బ్రతికివుండలేడు.

తన పన్నుగడ ఫలించినందుకు మాయాదేవి సంతోషించింది. ఆమె లేచి అశోక్ వున్న సోఫామీదకూర్చుని అతని భుజంమీద చేయివేసి మెల్లగా అన్నది. "గాబరాపడకండి! నేనావిధంగా మిమ్మల్ని సర్వనాశనం చేయాలనుకోలేదు. అది ఏ పరిస్థితులలోనైనా చేయగలనా? అసలు నా స్నేహితురాలు."

అప్పుడు అశోక్‌కు కొంత ధైర్యంచిక్కింది. అతను మాయాదేవివైపు తలెత్తిచూచాడు. అతనికళ్ళలో కొంత కృతజ్ఞత, కొంత దీనత్వం కనుపించాయి. ముఖంలో భయభీతులు తగ్గి సౌమ్యంగా మారింది. మాయాదేవి "నేడుకూడా ఆ వినాశనాన్నుంచి తప్పించుకునేందుకు ఒకదారివుంది. సమస్య పూర్తిగా పరిష్కారమైపోతుంది." అన్నది మృదువుగా.

అశోక్ తనముఖంలో ప్రశ్నార్థకభావాన్ని కనబరుస్తూ "ఏమిటది?" అని అడిగాడు.

"ఉఫ్! ఎంత వేడిగావుంది!" అంటూ మాయాదేవి తన పైటచెరగును క్రిందకు జారవిడచి, బ్లవుజ్ బటన్స్ విప్పింది.

ఆ కామిని, నిర్లజ్జాభావానికి, విషయవాంఛకు సిగ్గుపడి అశోక్ కళ్ళు క్రిందకు దించుకున్నాడు అవుసరంలేకపోయినా,

ఆ దగ్గర్లో టేబులుమీదున్న జపాన్ విసనకర్రనందుకుని మాయాదేవి విసురుకుంటోంది. ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా వున్నారు. వారిద్దరూ ఒకేసోఫాలో ఒకరిశ్వాస యింకొకరికి తగిలేటంత దగ్గరగా కూర్చునివున్నారు.

"ఐతే మీరు సిద్ధంగావున్నారేమో చెప్పండి?'' ఏదో నిగూఢకోర్కెతో, విచిత్ర భావావేశంతో ఆమెకళ్ళు మెరిశాయి.

"ఏమిటది? దేనికి?" భయపడుతూ అడిగాడు.

"ఈ సమస్య యికముందు తలెత్తకుండా వుండేందుకు?"

"ఎలా?'' ఆమెచూపులో చూపుకలుపుతూ అశోక్ అడిగాడు.

'ఆమాత్రం తెలుసుకోలేరా అశోక్ బాబూ'' మాయాదేవి పంకాను ఎప్పుడు క్రిందకు జారవిడచిందో తెలియదు. ఒక్క నిముషమాత్రంలో తన రెండుచేతుల్ని అశోక్ మెడకు పెనవేసి– "ఒకవేళ మీరు నన్ను స్వీకరించినట్లయితే ఈ సమస్య ఎన్నడూ తలెత్తదు. మీరు నా మనసు నెందుకు... ..?" అంటూ వాక్యంపూర్తిచేయకుండానే తన అరుణాధరాలను ఆవేశంతో అశోక్ పెదిమల కందించింది. అతనిశరీరం వణికింది. రెప్పపాటుకాలంలో అతడు రెండుచేతులతో, ఆమె నగ్నంగావున్న భుజాల్నిపట్టుకుని ఒక్కవూపుస వెనక్కుత్రోసి– ''మాయాదేవీ, నువ్వు నిజంగా మాయావినివే! భవిష్యత్తును విస్మరించి వర్తమానకాలమే సత్యమని భావిస్తే బహుశా నువ్వు విజయంపొందగలవు. కాని, క్షణకాల మోహావేశం

జీవితమంతా పశ్చాత్తాపం కలిగిస్తుంది. నేను యిక్కడికి రావడం పొరపాటే అయింది–" అన్నాడు.

ఆ తరువాత అతను దృఢమనస్కుడై లేచి నిల్చున్నాడు. మాయాదేవి వీపు భూమికానుకుని వుంది. తల సోఫాకు తగిలింది. ఆ దెబ్బతిన్న మాయాదేవి కోపం, అవమానం, ద్వేషంతో కుమిలిపోతూ పడివుంది. అశోక్–"ఛీ, ఛీ! మాయాదేవి! అరుణ నీ స్నేహితురాలు! ఆమె పరోక్షాన యీవిధంగా దగా చేయడానికి నీకు సిగ్గువేయలేదూ? నువ్వు పవిత్రమైన స్నేహాన్ని కూడా అపవిత్రం చేయగలవు" అన్నాడు.

మాయాదేవి అలా పడివుండే కోపంతో నిప్పులు గ్రక్కుతూ హెచ్చరించింది. "అశోక్ బాబూ! అంతా ఆలోచించుకోండి! నన్నీవిధంగా అవమానించినందుకు మీరు పశ్చాత్తాపపడవలసివస్తుంది. మీకు నా బలం తెలియదు. మీ కుటుంబాన్ని సమూలంగా నాశనం చేయకుంటే, మీ గౌరవాన్ని మంటకలుపకుండా వుంటే, నా పేరు మాయాదేవి కాదు." ఆవిధంగా గర్జిస్తూవుంటే, ఆమె చండికావతారం చూసి అశోక్ నిశ్చేష్టుడయ్యాడు.

సంతి ప్రస్త్రీ ఉగ్రస్వరూపాన్ని అత నిదివరకెన్నడూ చూడలేదు. తనకు మాయాదేవి తెలిసివున్నంతవరకు ఆమె చెప్పింది అక్షరాలా చేస్తుందని తెలుసు. ఈ బెదరింపుతో అతను వివశుడైపోయాడు. మాయాదేవిని తిరస్కరించగల శక్తి అతనిలో మాయమైంది.

అశోక్ స్థితి చూచి, మాయాదేవికి సంతోషం కలిగింది. తన శక్తి ప్రదర్శనా ప్రతిభకు తనపై తనకు అభిమానంకూడా ఎక్కువైంది.

అశోక్ మాయాదేవివైపు చూశాడు. అతనికళ్లలో ఆత్మవిశ్వాసం, కొంత అసహాయతాభావం, తొంగిచూస్తున్నాయి. తన జీవితం ఈ రాక్షసిచేతుల్లో చిక్కుబడిందని గ్రహించాడు. వెంటనే సోఫాలో కూలబడిపోయాడు. రెండుచేతులతో తలపట్టుకుని ఆలోచిస్తున్నాడు. ఏంచేయాలి? ఏంచేయకూడదు?

మాయాదేవి విజయంపొందిన సామ్రాజ్ఞిలా అతనివైపు చూస్తోంది. తన బాణందెబ్బకు తల్లడిల్లే ప్రాణినిచూసి వేటగాడు అమితానందం పొందినట్లు ఆమెకూడా సగర్వంగా చూస్తోంది.

గదంతా నిశ్శబ్దంగావుంది. గడియారం టిక్ టిక్ శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది.

కాని అశోక్ మనస్సులో శాంతిలేదు. మనస్సులో భయంకరమైన ప్రేత పిశాచాలమధ్య ద్వంద్వయుద్ధం జరుగుతోంది. ఆ భయంకరాలోచనలకు తల పగిలిపోతుందేమోననిపించింది.

తనప్రతిష్టకు భంగం కలుగబోతోంది. ప్రపంచంలో తనను ప్రతిచోటా తిరస్కరిస్తారు. తన జీవితం, గౌరవమంతా బూడిదపాలవుతాయి.

దాన్నుంచి తప్పించుకోవాలంటే, మాయాదేవి ఎదుట ఆత్మసమర్పణచేసుకోవడంతప్ప మరోమార్గం కనుపించలేదు. ఆమె చెప్పినట్లు చేయవలసిందే!

తనను తాను సంబాళించుకుని అడిగాడు. "మాయా దేవీ! నేను సర్వనాశనమైతే నీకు లాభమేమిటి?"

"ఎందుకు లేదు, మీరు నామనసులోని దాహాన్ని రెచ్చగొట్టి నన్ను సర్వనాశనం చేయలేదా?"

"అలా చేయవద్దు మాయాదేవీ! ఈవిధంగా నా ప్రతిష్టకు భంగం కలిగించవద్దని ప్రార్థిస్తున్నాను." అశోక్ వినయంగా ప్రాధేయపడ్డాడు. అతనలా ఎప్పుడూ జీవితంలో ఒకరిముందు తలవంచి ఎరుగడు.

"అవును! మీరు నాకు తగిన ప్రతిఫలం చెల్లించినట్లయితే అలాగే." మాయాదేవి నిశ్చయంగా చెప్పింది.

అశోక్ హతాశుడై కూర్చున్నాడు. అతని తల క్రిందికి వంగిపోయింది.

ప్రతిష్ట! ప్రతిష్ట!

ఈ ప్రతిష్టను కాపాడుకునేందు కింత భయంకరమైన మూల్యాన్ని చెల్లించవలసిందేనా? తను చెల్లించగలడా?

పరిస్థితులుకూడా అలాగే కనిపిస్తున్నాయి తగిన మూల్యమైనా చెల్లించాలి. లేదా ప్రతిష్టను బూడిదపాలైనా కానివ్వాలి.

కాని, మాయాదేవితో యిటువంటి వ్యవహారానికి తలపడినప్పుడు, తను తన వైవాహికజీవితానికి, ప్రేమకూ, మానవత్వానికీ కళంకమాపాదించినట్లు కాదా? తాను, అలా చేయలేడు.

ప్రతిష్టను కాపాడుకునేందుకు నీచానికి పాల్పడవలసి వచ్చినప్పుడు, తను స్వయంగా ఎంత హీనుడవుతాడు ? మరి అది బూటకపు ప్రతిష్ట కాదా ?

అటువంటి బూటకపు ప్రతిష్టకోసం అతను సత్యాన్ని మోసగించగలడా ? సత్యాన్ని ఖూనీచేయగలడా ?

సత్యాన్ని హత్యచేశాక అతను కళాకారు డెలా అవుతాడు ? మానవు డెలా అవుతాడు ?

కాదు. అత నలా చేయలేడు. మాయాదేవి ప్రతీకారం చేసినాసరే, అత నామెకు తలవంచడు. ముమ్మాటికీ వంచడు.

ఈమాటు మళ్ళీ అతడు లేచి నిల్చున్నాడు. ఇప్పుడతని కాళ్ళు వణకడంలేదు. గుండెలు అదరడంలేదు. తలతిరగడం లేదు.

అతను తన పూర్తిబలాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కూడదీసుకొని లేచినిలబడ్డాడు.

"ఏమాలోచించారు?" మాయాదేవి అడిగింది. ఆమె అశోక్‌లో కలిగే భావసంచలనాన్ని గమనిస్తోంది. అతనిలో బలం ప్రవేశిస్తున్నకొద్దీ, ఆమెధైర్యం సడలిపోతోంది.

"ఆలోచించడమా ? నీబోటి మాయావినిమాయకు లోబడిపోవడానికి యీ అశోక్ సిద్ధంగాలేడు. ఎప్పటికీ లోబడడు"

"ఇంకొకమాటు ఆలోచించుకోండి అశోక్‌బాబూ! నా సంగతి మీ రెరుగరు." మళ్ళీ హెచ్చరించింది మాయాదేవి. కాని, ఆ బెదరింపులో అంత బిగువులేదు.

"అవును! ఎరుగుదును!" అశోక్ ధైర్యంగా అన్నాడు. "పరుల సుఖంలో విషంపోయడమే నీబోటి విలాసినుల తుదిఅస్త్రమనికూడా ఎరుగుదును ... దాని పరిణామం భయంకరంగా వుంటుందనికూడా తెలుసు. నీ యీ మురికి మోహంకన్నా దాన్ని అనుభవించడమే మంచిది. నీవు చేయదలచుకున్నదేదో చేసుకోవచ్చు. నా ప్రారబ్ధంలో ఎలా వ్రాసివుంటే అలా అనుభవించేందుకు సిద్ధంగావున్నాను. కాని, నువ్విలా పురుషుల జీవితంతో ఆడుకునే రాక్షస ప్రవృత్తితో ఎన్నోరోజులు వ్యవహరించలేవని మాత్రం జ్ఞాపకంవుంచుకో. శారీరకసౌందర్యమున్నంతకాలమే నీ ఆట సాగుతుంది. కాని యీ సౌందర్యం శాశ్వతంకాదన్న సంగతి ఎప్పుడూ మర్చిపోవద్దు. నీ చెక్కిళ్ళు ముడతలుపడినప్పుడు, శిరోజాలు తెల్లబడినప్పుడు, నీ మకరందాన్ని జుర్రుకునేందుకు ఏ భ్రమరమూ నీమీద వాలదు. ఏ పురుషుడూ నీ ముఖం చూడడు. ఆరోజు కాస్త గుర్తుంచుకో! సరే, ఆవిషయాలతో నాకేం పని...? నేను వెడుతున్నాను"

అతను వెనక్కుతిరిగి రెండడుగులు వేసేసరికి ఏడుపు వినిపించి ఆగిపోయాడు. నిలబడి మాయాదేవివైపు చూచాడు. ఆమె బూరుగదూది దిండులో తలదూర్చి ఏడుస్తోంది. ఆ దృశ్యానికి అతనిలో కొంచం జాలికలిగింది. కాని, అతనక్కడే నిలబడి ఉద్వేగంతో చెప్పాడు. "నీ అసహాయత్వం, నీ ఏకాకిజీవితంపట్ల నాకెంతో సానుభూతి వుంది. నేను నీకు నిజమైన స్నేహితునిగా వుండాలని కోరుతున్నాను. నీ నిరాశామయజీవితంలో కొంత సుఖం కలిగించాలనేవుంది నాకు.

కాని, నీ మోహావేశం అందుకు ప్రతిబంధకంగా తయారైంది. నీవద్ద శరీరానికే విలువ వుంది. ఆత్మకు లేదు. కాని, ఆత్మ అమరమైనదనీ, శరీరం క్షణభంగురమనీ నువ్వు మర్చిపోయావు. ఈ సత్యదిగ్దర్శనం నేడు కాకుంటే, రేపైనా నీకు కాకమానదు. అంతవరకూ—అంటే, యీ మూడునాళ్ళూ, నీ విలాసమయ రాక్షసత్వాన్ని విచ్చలవిడిగా ప్రదర్శిస్తూ వుండు. ఎన్ని నరబలులు పుచ్చుకుంటావో పుచ్చుకో...''

ఈ ఈసడింపుతో మాయాదేవి మూగరోదన ఎక్కువై, వెక్కెక్కి ఏడుస్తోంది. తీవ్రమైన భావోద్వేగంలో ఆమె నోటి నుంచి మాట పెకిలిరాలేదు. అశోక్ హృదయంలోంచి వెలువడిన వాణి పదునైన కత్తిలా ఆమె హృదయాన్ని భేదిస్తోంది. అందులోని సత్యం ఆమె హృదయాన్ని స్పర్శించింది. కోపం స్థానంలో ఆత్మగ్లాని ప్రవేశించి, విచిత్రమైన పరస్పర విరుద్ధభావాలతో ఆమెహృదయం మథనపడుతోంది. ఈ కఠిన శబ్దాలకు మారుగా అతను తన గొంతులో కత్తితో పొడిచినా బాగుండేదనిపించింది. నేడామెహృదయం పరితాప జ్వాలతో దహించుకుపోతోంది. నవచైతన్యంతో కళ్ళు తెరుచుకున్నాయి. ఆ క్షణంలోనే ఆమెకు నిజం తెలిసింది. ఆమె గత జీవితంమీద స్వచ్ఛమైన కాంతిపుంజం పడి, భీషణమైన తన నగ్నస్వరూపాన్ని సాక్షాత్కరింపజేస్తోంది.

నేడామెకు మొట్టమొదటిసారిగా, తనజీవితంమీద అసహ్యంకలిగింది. అప్పు డక్కడ అశోక్ బాబు నిలబడివున్నట్లయితే, ఆయనపాదాలను తన పరితప్తాశ్రువులతో అభిషేకిం

చేదే! కాని, తన దుష్ప్రవర్తనతో ఆయన హృదయాన్నే కాక, ఆయనపాదాలుతాకే అర్హతనుసహితం కోల్పోయింది. కొన్ని క్షణాలకుపూర్వం కాలసర్పంలా బుసకొట్టిన ఆ మోహావేశిత రాక్షసికి యీ కొద్దిపాటి భిక్షుకోరే సామర్థ్యంకూడా లేక పోయింది.

ఈ ఆత్మగ్లానిలో అశోక్ ఎప్పుడు వెళ్ళిపోయినదీ మాయాదేవి గమనించలేదు. ఆయనకారు ధ్వని వినిపించాక ఆమెహృదయం అపారమైన శూన్యత్వంతో నిండిపోయింది. వెక్కి వెక్కి ఏడ్చింది. కాని, ఆమె ఏకాంత ఆక్రందన వినేందుకు ప్రపంచంలోని ఒక్కవ్యక్తి కూడా సిద్ధంగా అక్కడలేదు.

సరిగ్గా అదేసమయంలో రేడియోలో కలకత్తాస్టేషన్ నుంచి ఎవరో స్త్రీ బెంగాలీగీతాన్ని ఆలాపిస్తోంది.

"ఆనందలోకం అదిగో,
జీవా మేలుకో
ప్రణమిల్లు శ్రీహరిచరణాలకు
అదె నీ శోకానికి విరుగుడు
భజభజగోవిందం,
తాపహరణమే శ్రీహరిచరణం.
దీనజనావళి కదె శరణ్యం.

## 29

ఆమరునాడు, ఉదయం ఎనిమిదిగంటలకు అశోక్ 'టీ' త్రాగి, బట్టలువేసుకుని బయటికింకా రాలేదు. అబ్దుల్లా మాయాదేవి వచ్చిందని కబురుచెప్పి వెళ్ళాడు.

అశోక్ కొంచెం ఆశ్చర్యపడ్డాడు. ఏమి వింతమనిషి! ఇంత అవమానంపొందికూడా వెంటపడుతోందే! ఈ మెను ఎలా వదిలించుకోవాలో అతనికి అర్థంకాలేదు.

- అతను ముఖం కాళ్ళు కడుక్కొని, బట్టలు మార్చుకుని గదిలోకివచ్చి మాయాదేవిని చూచి స్థంభించిపోయాడు. తన కళ్లను తానే నమ్మలేకపోయాడు.

మాయాదేవి తెల్లని సాదాచీర కట్టుకుంది. జుట్టు చిందరవందరగా రేగివుంది. చెక్కిళ్ళకు పౌడరు లేదు. పెదిమలకు లిప్‌స్టిక్ లేదు. ఆమె కుమిలికుమిలి ఏడ్చినట్లు కళ్ళు ఎర్రగావున్నాయి. దీనికి అర్థమేమిటో అశోక్ గ్రహించలేకపోయాడు. ఆ గర్విష్టి మాయాదేవి ఎక్కడ? మరి యీ వినయసంపన్నురాలైన నతమస్తకురాలెక్కడ...?

మాయాదేవి లేచి నిలబడి ముకుళితహస్తాలతో "నమస్తే"-అంది. "ఇంత పెందలకడనే ఎందుకు వచ్చిందా? అని మీకు ఆశ్చర్యంకలుగవచ్చు. మిమ్మల్ని క్షమాపణ కోరడానికి వచ్చాను" అంది తన రాకనుగూర్చి తెలియజేస్తూ.

అశోక్ ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఈ వింతపరివర్తన చూచి ఆశ్చర్యంచెందాడు. అతని సందేహం తీరిపోయింది.

"కూర్చోండి...కూర్చోండి...క్షమార్పణా? ఎందుకు? ఒక్కనిముష మాగండి. అబ్దుల్లా! ఓ అబ్దుల్లా...! తొందరగా టీ పట్టుకురా" అని మాయాదేవికి దగ్గరగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

"నేను మిమ్మల్ని అవమానించాను. అంతకు క్రితం కూడా అల్లాగే చేశాను. వాటన్నిటికీ క్షమాపణకోరడానికే యిప్పుడు వచ్చాను. మీరు నిన్న నా కళ్ళు తెరిపించారు. మీరు వచ్చినప్పటినుంచి రెండుగంటలవరకు దుఃఖంలో కుమిలి పోయాను. తిరిగి రాత్రంతా నిద్రపట్టలేదు. గతజీవితమంతా చిత్రపటంలా కళ్ళముందు తిరిగింది. నాకు దానిమీద అసహ్యం కలిగింది. నేను మిమ్మల్ని గుర్తించలేకపోయాను. అశోక్ బాబూ! ఇతరపురుషులతోవలెనే మీతోకూడా వ్యవహరించ టానికి ప్రయత్నించాను. ఎంత ఘోరంచేశాను! ఈనాటి వరకూ, నా కనుసైగలకు లోబడని మగవాడే లేడు. స్త్రీ వ్యామోహంలో విశ్వామిత్రుడంతటివాడే నిగ్రహం కోల్పోగా ప్రస్తుతకాలపు పురుషు లెంత? కాని, విషయవాంఛలకు లోబడని పురుషులు మీరొక్కరే కనుపించారు. తుదకు నా అపజయంపై నాకే కోపంవచ్చింది. ఆతరువాత రెట్టించిన బలంతో మిమ్మల్ని పొందాలని ప్రయత్నించాను. నాకు నిన్న సంపూర్ణవిజయం కలుగుతుందని ఆశించాను. కాని, నిన్న నా కళ్ళు తెరుచుకున్నాయి. నేను మిమ్మల్ని సర్వనాశనం చేసినా, మిమ్మల్ని పొందలేననుకున్నాను. మీరు నాకు వశం కారనికూడా నిన్ననే తెలుసుకున్నాను. తిరిగి మీ ప్రతిష్ట మీద దెబ్బతీయాలనుకున్నాను. కాని, యిప్పుడటువంటి ఆనురాగానందం మాయాదేవి కోరడంలేదు. నేనంత నీచు రాలినికాను. మీ రిది నమ్మగలరా అశోక్ బాబూ!"

అంతులేని భావతరంగాలు అతనిలో ఉప్పొంగాయ్. మెదలకుండా వింటున్నాడు. మాయాదేవి చెప్పుకుపోతూనే

వుంది. "నిన్న నాకు మీ విలువ తెలిసింది. అంతకుముందు మిమ్మల్ని ఎంతో అవమానించాను. కాని, ఆ సమయంలో నేను కామాంధురాలినై వున్నాను. ఇప్పుడలా లేను. మీరే నన్నుద్ధరించారు. ఇప్పుడు నన్ను మీరు క్షమించలేరా ?"

తననట ఏమిజరుగుతోందా అనే ఆలోచనలో కొన్నిక్షణాలు వుండిపోయాడు. అశోక్ ఇదంతా నమ్మలేక పోయాడు. అంతా నాటకమేమో నని ఆమెముఖంలోకి తీక్ష ణంగా చూచాడు. కాని, యీనాడామెహృదయం పరితాప జ్వాలతో దగ్ధమైపోతున్నట్లు మాయాదేవికళ్ళు అశ్రుజల పూరితమైయుండడంవల్ల గ్రహించాడు.

"కాదు. కాదు. ఇందులో క్షమించవలసిందేముంది? ఉద్ధరించానని అంటారెందుకు మాయాదేవి! నేను..."

"కాదు. అలా కాదు. మీ క్షమాపణపొందనిదే నాకు శాంతిలభించదు. మనస్ఫూర్తిగా క్షమించానని మీరు చెప్పవలసిందే!"

"దానితో మీకు సంతోషంకలిగేటట్లయితే, క్షమి స్తున్నానని అంటున్నాను. కాని, క్షమించేందు కసలు ఏముంది"

"ఎందుకులేదు ? నా జీవితదిశను మార్చిన బాధ్యత మీదే. ఇకను క్రొత్తజీవితాన్ని ప్రారంభించాలని నిన్ననే సంకల్పించుకున్నాను. గత పదిహేను సంవత్సరాల మురికి జీవితం యిప్పుడాఖరైంది. ఆ మాయాదేవి మరణించింది;

నిన్ననే మరణించింది. ఇప్పుడు మీఎదుట యింకొక స్త్రీ కూర్చునివుంది. బహుశా నేనుకూడా నా మాటలు మిమ్మల్ని నమ్మించలేకపోవచ్చు. కాని, భవిష్యత్తులో నా నిశ్చయం ఎంత స్థిరమైనదీ మీకు తెలియకమానదు. నేను సంకల్పించినది-చేసి తీరుతానని బహుశా మీకు తెలిసేవుంటుంది. ఇంతవరకూ యీ శక్తిని దుర్వ్యసనాలకు వినియోగించాను. ఇక సత్కార్యాలకు ఉపయోగించాలని సంకల్పించుకున్నాను."

"మాయాదేవీ! నేడు నిన్ను మనసార అభినందిస్తున్నాను భగవంతుడు నీకు మేలుచేస్తాడు."

"నేను ఒక భిక్ష కోరుతున్నాను. మీరికముందు కూడా ఒక స్నేహితునిగా, పథప్రదర్శకునిగా వుండాలని కోరుతున్నాను. నా హితాభిలాషులు ప్రపంచంలో ఎవరూ లేరు. నేను అబలను. నాకు మీ ఆధారం అవుసరం. క్రొత్తగా రూపొందిన మాయ ఈ భిక్ష పెట్టవలసిందిగా అర్థిస్తోంది."

"నాకు అంగీకారమే!" నన్నాడు అశోక్. అతని గొంతు కొంచెం గాద్గదికమయింది.

"మీ రెంత ఉదారులు! మీ హృదయం మహాసాగరంలా విశాలమైనదని నాకు తెలుసు. అయినకు నే నెంతో తీరని అన్యాయంచేశాను. సరే, జరిగిందేదో జరిగిపోయింది. యిక మీ జీవితంలో నావల్ల ఎటువంటి ఆపదలు రావు."

"ఇంతగా చెప్పవలసిన అవుసరంలేదు మాయాదేవి! నా కంతా తెలుసు."

"ధన్యవాదాలు. నేడు మీరు నా కెనలేని ఉపకారం చేశారు. ఈరోజు నాకు పునర్జన్మ కలిగింది. ఇక నేను వెడుతున్నాను."

— మాయాదేవి వెళ్ళడానికి ఉద్యుక్తురాలైంది. అశోక్ కూడా లేచి నిల్చున్నాడు. భావోద్వేగంతో మాయాదేవి ఇప్పుడున్న హృదయం పరిపూర్ణమైంది. భావాతీత పవిత్ర మైనవి, శుభప్రదమైనవి!

మాయాదేవి తన కుడిచేతిని చాపింది. అశోక్ నిస్సంకోచంగా కరచాలనం చేశాడు.

అశోక్ చేతిని తన చేతివ్రేళ్ళతో స్నేహపూర్వకంగా నొక్కుతూ, తన సమస్తభావాల్ని మిళితంచేసి "అశోక్ అన్నయ్యా" అని మెల్లగా సంబోధించింది.

"ఏమిటి చెల్లీ!" అశోక్ కూడా అదే స్నేహార్ద్రితతో సంబోధించాడు.

ఒక్క రెప్పపాటుకాలంలో ఆమె అతనిపాదాలమీద వాలి తలను పాదాలకు ఆనించింది,

అశోక్ తటాలున ఆమె కుడిచేతినిపట్టుకుని లేవనెత్తి ఆమెచేతిని ఎంతో ప్రేమతో ముద్దుపెట్టుకున్నాడు.

ఆ దివ్యసంఘటనకు మాయాదేవికళ్ళనుండి కృతజ్ఞతాశ్రువులు ప్రవహించాయి. ఆమెముఖం పావనజ్యోతిలా దీప్తివంతంగా కనుపించింది.

అశోక్ కళ్ళుకూడా చెమ్మగిల్లాయి. మరుక్షణంలో మాయాదేవి వెళ్ళిపోతూ పైటచెంగుతో కళ్ళద్దుకోవడం

చూశాడు. అతడు అలాగే ఊపిరిబిగపట్టి, నిశ్చలంగా నిలబడి వున్నాడు. ఇప్పుడు కన్నీరాపుకునేశక్తి అతనిలో లేదు.

అరనిముషంలో క్రిందనుంచి కారుతలుపు వేసుకున్న ధ్వనితో పాటు కారు బయలుదేరిన ధ్వనికూడా వినిపించింది.

"బాబుగారూ! మాయాదేవి వెళ్ళిపోయిందా?"

"అవును. వెళ్ళిపోయింది. అరే! టీ విషయం నాకు జ్ఞాపకమే లేదే! తీసుకురా! ఆమెకు మాకుగా నేనే పుచ్చుకుంటాను." అని అబ్దుల్లాకు కనుపించకుండా, రుమాలుతో కళ్ళద్దుకున్నాడు.

# 30

సాయంకాలం ఏడున్నర గంటలవుతుంది. ఆకాశం మేఘావృతమయింది. గాలి బాగా వీస్తోంది. జూన్‌మాసపు చివరిరోజులు; వర్షఋతువు ప్రారంభమైంది. రోడ్డుమీద విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి.

ఒకామె చేతిలో చిన్నమూట పట్టుకుని, న్యూకాలనీ వీధిలో ఎవరిదో యిల్లు వెదుకుతోంది. ఆమె భయపడుతూ, ఆ చుట్టుప్రక్కలవారి నడుగుతూ, అశోక్ యింటి ఆవరణలోనికి వచ్చింది. ఆమె మాటిమాటికీ వెనుకకూ, ముందుకూ చూస్తూ నడుస్తోంది. బహుశా తన నెవరైనా చూస్తారేమోనని భయపడుతున్నట్లుంది.

ఆవరణలోకి వచ్చినతరువాత కుడివేపునున్న నౌకరు లుండే గదులవేపు వెళ్ళి అక్కడ ఒక గడ్డమున్న ముసలివాడు హుక్కా తాగుతుండటం చూచి "అబ్దుల్లా" అని పిల్చింది.

"ఎవరూ ? ఎవరది ?" అబ్దుల్లా కనిపించినంతవరకు చీకటిలోచూచి, కొంచెంసేపయాక, ఆశ్చర్యంతో— "అరే, ఎవరు, మరియమ్...! రామ్మా! రా! హఠాత్తుగా వచ్చావేం? అరె, బాగా చిక్కిపోయావేమిటి ? ఏమిటి సంగతి...! జబ్బు పడలేదుకదా !" అని ఆత్రుతగా ప్రశ్నించాడు.

"లేదు అబ్దుల్లా ! జబ్బుపడలేదు. దానికేంగాని మీ యజమాని ఎక్కడున్నారు ? ఆమెకంఠస్వరం క్షీణించి వుంది ఎంతో విషాదభరితమైయున్నట్లు తోస్తూవుంది.

"క్లబ్బుకు వెళ్ళారమ్మా! అరగంటలో రావచ్చు"

"యజమానురాలు?"

"వారూ వెంట వెళ్ళారమ్మా!" అయ్యగారికి వివాహ మైనదని నీ కెలా తెలిసింది ?"

"పత్రికలో చదివాను. మీ యజమానురాలు ఎలా వుంటుంది అబ్దుల్లా ?" అంటూ ప్రశ్నించి భారంగా నిట్టూర్పు విడిచింది.

"బా... బాగానేవుంటుంది."

"బాబుగారు సంతోషంగా వుంటున్నారా ?"

"ఆ... అవును... ఉన్నట్లే..." యజమాని యింటి పరిస్థితులు నౌకరు ఎలా చెప్పగలడు ? ఆసంగతి అతనికి చెప్పా లనిపించలేదు. "కాని, నువ్వెప్పుడు వచ్చావ్ ? ఎక్కడ బస చేశావు మరియమ్ ?"

"హుం, దానికేంగాని, ఒక్కపనిచేసి పెట్టగలవా ?"

"ఆ... ఎందుకుచేయనమ్మా ? తప్పకుండా చేస్తాను. చెప్పు ?"

"ఈ మూట బాబుగారి కివ్వగలవా ?"

"ఆ ఇవ్వగలను. కాని, నువ్వాయన్ను కలుసుకోవా ? వారు వస్తూనేవుండవచ్చు."

"కలుసుకోవచ్చు. కాని మీా యజమానురాలు అపార్థంచేసుకోదా ? ఎందు కంత ముప్పుకొని తెచ్చుకోవాలి?

"అవును ! అలా కావచ్చు" తన గడ్డాన్ని సవరించు కుంటూ, ఆలోచించి అన్నాడు అబ్దుల్లా. అతని కళ్ళెదుట యజమానురాలి స్వభావం తాండవించింది. దానితోపాటు పాద్రీపురంలో మరియమ్-అశోక్‌లు నెరపిన స్నేహంకూడా జ్ఞప్తికివచ్చింది. అవును, మరియమ్ మూలంగా ఆ యింటిలో తిరిగి తుఫాను రేగవచ్చు. అయినప్పటికీ యజమానిని కలు సుకోనన్నమాట అతనికి నచ్చలేదు.

"మరి బాబుగారు చూస్తానంటే కలుస్తావా ?"

"ఆ...బహుశా..."

ఇంతలో దూరంగా కారు లైట్లు కనుపించాయి. మరియమ్ భయపడుతూ—"బహుశా వారు వస్తున్నట్లుంది. నేను వెడుతున్నాను" అంటూ గబగబా గేటుదాటి చీకటిలో మాయమైంది. ఆ కారు వచ్చి సరాసరి వెళ్ళిపోయింది. అది మరెవరిదో. కాని మరియమ్ తిరిగిరాలేదు. అబ్దుల్లా మూట పట్టుకుని చీకటిలోకి చూస్తూ అలాగే నిల్చుండిపోయాడు.

♦ ♦ ♦

ఎనిమిదిన్నరగంటలకు, అరుణ, అశోక్ లిద్దరూ క్లబ్బు నుంచి వచ్చారు. అరుణ బట్టలు మార్చుకునేందుకు తన గది లోకి వెళ్ళినప్పుడు, అబ్దుల్లా మునిగాళ్ళమీద వచ్చి, ఆ మూటను అశోక్ కిచ్చి-"బాబూ! మరియమ్ యిచ్చి వెళ్ళిం" దని చెప్పాడు.

"మరియమ్..! ఎప్పుడు..? ఎక్కడ...? అబ్దుల్లా! ఆమె ఎక్కడుంది?"

"ఆమె వెళ్ళిపోయింది బాబూ"

"ఎక్కడికి వెళ్ళింది అబ్దుల్లా? చెప్పు? తొందరగా చెప్పు?"

"తెలియదు బాబూ! ఐనా ఇందులో ఏదైనా ఉత్తరం గిత్తరం వుందేమో..."

అశోక్ ఆత్రుతగా మూటవిప్పాడు. ఏమాత్రం ఆల స్యాన్ని సహించలేకపోతున్నాడు. అందులో ఒక రుమాలు వుంది.

అరె! తను సాత్పూరా అడివిలో ఆమె కన్నీళ్ళు తుడిచిన రుమాలే యిది. ఒక మూల అతనిపేరు విసీఅక్షరా లతో అ. రా. అని వుంది.

ఒక దిండుగలీబు మడతపెట్టి వుంది. దానిమీద రంగు రంగుల సిల్కుదారాలతో అందంగా 'Sweet Remembe-rances' (మధురస్మృతులు) అని కుట్టివుంది.

ఇంకొక వస్తువుకూడా వుంది. అది ఒక కవరు. దాన్ని కూడా తొందరతొందరగా విప్పేసరికి, దానిలో పందరూపా యుల నోట్లు నాలుగు, వాటితోపాటు ఒకవుత్తరం వున్నాయి.

అరే, యీ డబ్బు మరియమ్‌కు తాను యిచ్చినదే! వాటిని అల్లాగే, తిరిగి యిచ్చివేసిందా? అవును! అదే కవరు! కొంత మాసిపోయిమాత్రం వుంది.

అశోక్ ఉత్తరం తెరిచి చదవడం మొదలుపెట్టాడు. అవును, మరియమ్ హస్తాక్షరాలే! ఉత్తరంమీద 'సర్వదా మీదాన్ని' అని వ్రాసివుంది. ఆ తరువాత...

"అశోక్ బాబూ!"

"ఆనాడు మీరు నాలుగువందల రూపాయలిచ్చి, నా హృదయానికి బాధకలిగించారు. ఏ అయాచిత ప్రేమను విశుద్ధంగా, నిరాపేక్షభావంతో మీకు అర్పించానో, దానికి విలువగట్టి ప్రతిఫలం మీ రిస్తారని నేను ఎప్పుడూ వూహించి వుండలేదు. నేను వీటిని మీకు తిరిగియిచ్చివేసి, నా మనసును తేలికపర్చుకుంటున్నాను.

"ఈ గలీబును నా దుర్దినాల్లో ఎడతెగని కన్నీటి ప్రవాహాన్ని ఆపుకుని తయారుచేశాను ఆ అశ్రుధారలమీద ఎప్పుడూ మీ మూర్తే అంకితమై వుంది. ఈ స్వల్ప శ్రద్ధాంజలి నందుకునే దైవసమానులు మీరే! అందుచేత నేడు దాన్నికూడా నా ఆరాధ్యచరణాలకు అర్పిస్తున్నాను.

"ఇక యీ రుమాలు వుంది. దీనివిషయంలో ఏం వ్రాయను? ఒకప్పుడు దీనికి, నా కళ్ళలోంచి వచ్చే గొప్ప గొప్ప వెల్లువల్ని ఆపే శక్తివుండేది. కాని, నేడు...?... ఓహ్! పోనివ్వండి సంతులు.

"మిమ్మల్నీ, మీధర్మపత్నినీ సుఖంగా వుంచాలని సదా సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తుంటాను"

మరియమ్"

— ఉత్తరంమీద గ్రామంపేరుగాని, తారీఖుగాని, అడ్రసుగాని ఏమీలేదు. అతనిజీవితంలో అది మరియమ్ మొదటి ఉత్తరం. కాని, దానిలోని ఒక్కొక్క శబ్దమూ ఒక్కొక్క బాణంలా హృదయానికి గుచ్చుకున్నాయి. అవ్యక్తమయిన బాధామయశబ్దంమాత్రం ఉచ్చరించగలిగాడు.

ఆ వస్తువులన్నింటినీ అతను మంచంపై తలగడదిండు క్రిందుంచాడు. అలాగే పిచ్చివానిలా గబగబా క్రిందకు పరుగు తీసి కారులో కూలబడి— "అబ్దుల్లా! అరె అబ్దుల్లా!" అని కేకలువేశాడు, అతను సగం దుస్తులు విడిచేసినసంగతికూడా మరచిపోయాడు.

"బాబూ—"

"మరియమ్‌బస ఎక్కడ?"

"తెలియదు బాబూ! ఉత్తరంలో అడ్రసు లేదా?"

"ఉత్తరంలో ఏమీ లేదు. అబ్దుల్లా! నువ్వేంమనిషివి? ఇంత పెద్దవాడివైకూడా ఆమె అడ్రసయినా తెలుసుకోలేక పోయావా?"

"తప్పైంది బాబూ!"

"ఎప్పుడు వచ్చింది?"

"ఇప్పుడే ఒకగంటముందు..."

"మరి ఎటు వెళ్ళింది?"

"అటు........" అంటూ వ్రేలితో చూపించాడు.

"ఐతే పద... తొందరగా బండెక్కు. ఆమెను వెదికి తీసుకువిద్దాం."

"మీ కోటు తీసుకురమ్మంటారా?"

"వద్దబ్బా వద్దు. టైం ఎక్కడుంది? తొందరగా కూర్చో.."

అతనొకవిధంగా అబ్దుల్లాను బలవంతంగా బండిలో కూచోపెట్టాడు. ఆ నిముషంలో కారు వాయువేగంతో బయలుదేరింది వారు ఎక్కడికెడుతున్నదీ అరుణకెవరూ చెప్ప లేదు.

ఆ సమయంలో అశోక్ చొక్కా, పాంటు మాత్రమే ధరించివున్నాడు. కాళ్ళకు చెప్పులు మాత్రమున్నాయి. జుట్టు అస్తవ్యస్థంగా వుంది. కాని వీటిపై అతనికి ధ్యాసలేదు. రెండు మూళ్లు అపాయంజరగబోయి తప్పించుకున్నాడు.

"మరియమ్‌స్థితి ఎలా వుంది అబ్దుల్లా?"

"బాగుండలేదు బాబూ! జబ్బుపడ్డట్టుంది."

"ఓహ్!—" ఒక నిట్టూర్పు విడిచాడు.

కారువేగంకంటే అతని ఆలోచనల వేగంఎక్కువగా వుంది. తన జీవితంలో అత్యాధిక మహత్వం కలిగించిన యీ మరియమ్, ఏ అజ్ఞాతలోకంనుంచో వచ్చి, తిరిగి ఆ తీయని స్మృతులను మేల్కొలిపింది.

'మరియమ్...! మరియమ్...!'

"నువ్వు ఒక్కమారు కలిశావంటే, నీకు కలిగించిన దుఃఖానికంతకూ క్షమాపణ కోరుకుంటాను. బహుశా ఎన్నో

కష్టాలు సహించివుంటావు. నీ వుత్తరంలో ఒక్కొక్క శబ్దంలో యిమిడివున్న అంతర్వ్యథను నాబోటి నీచుడు గ్రహించలేదు.

'ఎంతకాదన్నా ఒక్కసారి నన్ను కలుసుకో. మరియమ్! కేవలం ఒక్కమారు. నా పాపాలకూ, నా దుండగాలకూ, కొద్దిగా ప్రాయశ్చిత్తం చేసుకునే అవకాశం కలిగించు. నా సమస్త అంతర్భావాలతో, యీ భిక్షే నిన్ను కోరుతున్నాను.

అశోక్, యీవిధంగా, శోకాచ్ఛన్న వికలమనసుతో మరియమ్కోసం అనేక ప్రదేశాలూ, రోడ్లూ వెదికాడు. ఎక్కడైనా, ఆడమనిషి కనుపించినప్పుడు కారువేగాన్ని తగ్గించి, ఆమె ముఖాన్ని పరకాయించి చూసి, మరియమ్ కాదని తెలుసుకున్నతరువాత నిరాశచెంది, తిరిగి పోయిన కాలాన్ని కూడదీసుకునేందుకు కారు వేగాన్ని ఎక్కువ చేస్తున్నాడు.

ఈవిధంగా అతను మూడు నాలుగు చర్చిలూ, క్రిస్టియనుల హోటళ్ళూ, వై. యం. సి. లు, నివాసాల్నీ, సత్రాల్నీ, రైల్వేస్టేషను విశ్రాంతిహాలు వెదికాడు. ధన్ తోలా, ధరమ్పేట్, సివిల్లైన్సు, పెద్దబజారు రోడ్డు గాలించాడు. కాని, ఎక్కడా మరియమ్ కనుపించలేదు.

కారు తిరుగుతుండేది. ఎక్కడో ఆగేది. అబ్దుల్లా దిగి ఆచూకీతీసేవాడు. అంతుదొరికేది. నిరాశకలిగేది. కారు తిరిగి కదిలేది. ఆ కారుశబ్దం అశోక్కు రోదనలా వినిపిస్తోంది.

కాలంగడిచి. కొద్దీ అశోక్కు నిరాశ ఎక్కువై పోతోంది. ధైర్యంకూడా సడలింది. గొంతు ఎండిపోతోంది. కళ్ళు ఎర్రబడుతున్నాయి.

ఐనా మరియమ్‌జాడ తెలియలేదు.

అకస్మాత్తుగా, ఆమె ఇటార్సీపాసింజరులో వెళ్ళిపో తుందేమోనని ఊహించాడు. కారును వెంటనే స్టేషనుకు మళ్ళించాడు.

ఒక గుర్రబ్బండికి కారు ఢీకొంది. బండి తిరగబడి పోయింది. వాడు తిడుతూ తగువుకు తయారయ్యాడు. చుట్టూ గుంపు పోగైంది. అబ్దుల్లాకు మనీపర్సుయిచ్చి తగవును సర్దమని చెప్పాడు. బండివాడు అక్కడికక్కడే నాలుగుంబావలాతో పరిష్కారంచేసుకుపోయాడు.

పదిగంటలవుతోంది. ఇటార్సీ పాసింజరు బయలుదేర డానికి సిద్ధంగా వుంది. ప్లాటుఫారంమీద రద్దీ ఎక్కువగా వుంది. అందువల్ల దారిచేసుకోవడమే అశోక్‌కు కష్టమై పోయింది. అందర్నీ త్రోసుకుంటూ, వారి నిందలకు గురి అవుతూ, ప్రతి కంపార్టుమెంటు వెదుకుతున్నాడు.

ఒకచోట బెంచికి గుద్దుకుని పడిపోయాడు. పాంటంతా చెడిపోయింది. చుట్టుప్రక్కలవాళ్లు నవ్వుతున్నారు. అతడు పాంటు దులుపుకుని ముందుకు బయలుదేరాడు. వారి పరి హాసాలు వినేందుకుకూడా అతనికి వ్యవధి లేదు.

అరె, ఎవరామె? సన్నగా, తెల్లగా ఆ వీపు మాత్రమే కనుపిస్తోంది. ఆ శరీరం, ఎత్తు అంతా మరియమే!

అవును! మరియమే!

అతనామె సమీపానికి వెళ్ళి—"మరియమ్!" అని పిల్చాడు.

ఆమె వెనకకు తిరిగిచూచి—"ఏ మరియమ్?" అని ప్రశ్నించింది.

"ఓహ్! క్షమించండి! పొరపాటుజరిగింది. మిమ్మల్ని చూచి మరియమ్ అనుకున్నాను"—అతని ముఖం నిరాశతో జేవురించింది

ఆ సమీపంలో ఇద్దరుగురు కాలేజీ విద్యార్థులు నిలబడి వున్నారు. వారు అతని వ్యాకులపాటునుచూచి బహుశా పిచ్చివాడై వుంటా డనుకున్నారు

అందులో ఒక విద్యార్థి "కాదు....తాగాడు. నేను మోతాదు ఎక్కువైనట్లుంది. హి...హి..." అని వెకిలిగా నవ్వుతున్నాడు.

అశోక్ ఏమీ చేయలేక ఒక్కసారి వారివంక కసిగా చూశాడు.

గంట కొట్టారు. సిగ్నల్ యిచ్చారు. గార్డు పచ్చజెండా వూపాడు. అశోక్‌కు ప్రాణాలు పోయినంతపనైంది. పరుగు తీశాడు. ముఖమంతా చెమటతో తడిసింది. చొక్కాకూడా పూర్తిగా తడిసిపోయింది.

ఈమారు యింజను కూత వేసింది. ఆ మరుక్షణమే బండి కదిలింది. అతను పరుగెత్తుకుంటూ ఆడవారిపెట్టెవద్దకు వెళ్ళి వ్యాకులపాటుతో—"మరియమ్! మరియమ్!" అని పిల్చాడు.

జవాబు లేదు బండివేగం ఎక్కువైంది. కళ్ళెదుట నుంచి ఒక్కొక్క రైలుపెట్టె కదలిపోతోంది. గార్డుపెట్టె కూడా దాటిపోయింది.

ఆఖరిపెట్టెకెనకవుండే ఎర్రని దీపం కనుపించింది. అది కూడా మెల్లమెల్లగా దూరమై అంధకారంలో లీనమై పోయింది.

అశోక్ దిగాలుపడి దానివేపే చూస్తున్నాడు.

ప్లాటుఫారంమీద జనసందడి తగ్గిపోయింది. ఐనా అశోక్ అక్కడే దీనమూర్తిలా నిలబడ్డాడు. కన్నీరు ఏక ధారగా స్రవిస్తోంది.

"ఇక యింటికి పదండి బాబూ!" అబ్దుల్లా వినయవిధే యతలతో దీనంగా అన్నాడు.

ఆ మాటలు అతని ధ్యానమగ్నతకు భంగం కలిగిం చాయి. తలెత్తి ముందుకు చూచాడు. నాలుగోప్లాటుఫారం మీద కలకత్తావైపు వెళ్ళే హౌరాఎక్స్‌ప్రెస్ వెళ్ళిపోతుండడం కనుపించింది.

మూడోతరగతి స్త్రీలపెట్టెలో మరియమ్ జబల్‌పూరు టికెట్టు పట్టుకుని, నాగపూరుమీద తన ఆశలన్నీ వదులుకుని వెళ్ళిపోతోంది. ఆహా! ఈ సృష్టివిధాన మెంత విచిత్రం!

అశోక్, మరియమ్‌లమధ్య కేవలం రెండు ప్లాట్‌ఫారాల అంతరమే! ఒకరినొకరు చూడలేకపోయారు. ఇప్పుడు వారిమధ్య దూరం ఎంతో ఎక్కువైంది.

# 31

స్టేషనునుంచి తిరిగివస్తూండగా అబ్దుల్లా అన్నాడు- "బాబూ! నావల్ల గొప్ప పొరపాటుజరిగింది. ఉత్తరంలో

అక్షరసు వ్రాయలేదని తెలిసివుంటే, ఆమెను తప్పకండా ఆపే వాణ్ణే! ఆమె నామాట తీసివేసేదికాదు."

"అదంతా అదృష్టంమీద ఆధారపడివుంది."

— అశోక్ బరువుగా నిట్టూర్పువిడిచి అన్నాడు. అతని హృదయంలో ఏదో శూన్యత్వం వ్యాపించింది.

ఇంటికివచ్చేసరికి సరిగ్గా పదకొండుగంటల పదిహేను నిముషాలయింది. అరుణ తనపడకగదిలో విద్యుద్దీపం వెలుతురులో, పడకకుర్చీలో కూర్చుని ఎదురుచూస్తోంది. ఆమె గంభీర ముఖాన్ని చూచి, అది తుఫానుచెలరేగబోయేముందుండే శాంతస్వభావమని అశోక్ గ్రహించాడు.

అశోక్ చింతాక్రాంతుడైయుండటం చూచి, అరుణ ఒక్కనిముషంకూడా ఆలస్యంచేయకుండా వెంటనే పడకగది తలుపులు మూసింది, తనసంభాషణ బయటివారికి వినిపించకుండావుండాలని. ఆ మాటను చేతిలోకితీసుకుని- "ఇది నిజమేనా-?" అని అడిగింది.

"అవును. నిజమే!"

"నిజమా...? వొప్పుకోవడానికి నీకు సిగ్గుకూడా లేదా?" కఠినంగా మాట్లాడింది.

"నిజాన్ని, నిజమని వొప్పుకోవటానికి సిగ్గెందుకు?"

"మరి ముందే నాకెందుకని చెప్పలేదు?"

"నువ్వు అడగలేదు. అడిగివుంటే చెప్పేవాడినే"

"పైగా, యీ బడాయికూడానా? నువ్వు నన్ను వెన్నుపోటు పొడిచావు. ఈ సంగతి ముందే నాకు తెలిసివుంటే, ఎట్టి

పరిస్థితులలోనూ నిన్ను వివాహం చేసుకునేదాన్ని కాను. నేను అమాయకురాలిని — నీవలలో పడిపోయాను."

"ఇలా అంటున్నావేమిటి అరుణా! నిన్ను కలుసుకోక పూర్వమే మరియమ్ నాజీవితంలో ప్రవేశించింది. ఆసంగతి నీకు చెప్పలేదు. కాని, నిన్ను పొందినప్పటినుంచీ నిన్ను వివాహం చేసుకుందామనే నిశ్చయానికి వచ్చినప్పటినుంచీ పూర్తిగా నీయందు విశ్వాసంకలిగి వుంటున్నానని నేను భగవంతుని మీద ప్రమాణంచేసి చెప్పగలను. జీవితంలో ఆ భాగం ఆఖరై పోయిందనే ఆ సంగతి నీతో చెప్పలేదు. పాతవిషయాలను బయటికిలాగినందువల్ల వచ్చేదేముంది? అందువల్ల దుఃఖమే కలుగుతుంది. అంతా తెలిసివుండికూడా, ఆ దుఃఖాన్ని పెంచుకోవడం కష్టంకాదా? చెప్పు?"

"ఐతే, నువ్వామెను ఎందుకు వెంబడించావో చెప్పు?"

"నే నామెకోరికకు వెళ్లిన కారణం ఫలించనేలేదు. మరియమ్‌జాడ దొరకలేదు. నే నామెకు ఒకసారి ధనసహాయం చేశాను. ఆమె తిరిగి దాన్నంతా యిచ్చి వెళ్ళింది. ఏ ఇబ్బందుల్లో పడిందో? నిజమైన మిత్రభావంతో వీలుంటే తిరిగి సహాయం చేయాలనుకున్నాను."

"నిజమైన స్నేహితునిరూపంలోనా—?" అరుణ కోపంగా ముఖాన్ని వికృతంగా పెట్టి— "ఆమెప్రియునిరూపంలోనని ఎందుకు చెప్పవు? నన్ను వివాహం చేసుకుని, ఇంకొక ఆడదానితో ప్రణయసంబంధం పెట్టుకోవటానికి నీకు సిగ్గులేదూ? అయ్యో రామా! నేను సర్వనాశనమైపోయాను. నీ యీ స్వరూపంలో యింత విషముందని నాకు తెలియదు. లేకుంటే

నేను నీయింట్లో అడుగుపెట్టేదాన్నికాదు." అంటూ ఆమె గట్టిగా ఏడవటం మొదలుపెట్టింది.

"అరుణా! కొంచం ఆలోచించి, గ్రహించి మాట్లాడాలి. నీ కావాలంటే, ఆ ప్రశ్నకు వివరంగా జవాబుచెప్పేందుకు తయారుగా వున్నాను ఏమీ దాచను కాని, నువ్వు నా శీలానికి కళంకం మాత్రం అంటగట్టవద్దు."

"భలే చరిత్ర! పరాయి ఆడదానితో సంబంధం పెట్టుకున్న నీ శీలంచూచుకొని గర్విస్తున్నావా?"

"అరుణా! అరుణా!" అశోక్ పిరికివాడిలా అన్నాడు.

"ఈ వుత్తరం, ఈ గలీబు, 'Sweet Remembrances' వీటి అర్థమేమిటి? ఇంతకుమించినసాక్ష్యం యింకేంకావాలి? నేను అనాగరికురాలినా? పల్లెటూరిదాన్నా? నాకళ్ళల్లో దుమ్మెందుకు కొట్టాలి? అయ్యో భగవంతుడా! ఇలాంటి రాత నాకు ఎందుకువ్రాశావు? ఇతనితో నాకింత విశ్వాసఘాతం కలిగించావెందుకు? కాదు. నేను దీన్ని సహించను వ్యభిచారితో నేను నా జీవితాన్ని గడుపను. గడుపలేను. నేను రేపే యీ యిల్లువదిలి నాన్నగారివద్దకు వెళ్ళిపోతాను. నాకుకూడా ఆత్మగౌరవం వుంది. నాకూ శీలంవుంది. ఇదంతా మెదలకుండా సహించివుండేందుకు నేను నీ ఆశ్రితురాలిని కాను" అని తిరిగి బావురుమని ఏడ్చింది అరుణ. ఆమె అశోక్ మాట వినేందుకు సంసిద్ధంగా లేదు. ఆ ప్రశ్నను నిష్పాక్షికదృష్టితో చూసేశక్తికూడా లేదు అశోక్ అన్నీవింటూ అలాగే తలొంచుకుని నిలబడివున్నాడు. అతని శరీరం భావ

మరియమ్మను యింత దగ్గరగా పొందికూడా తిరిగి పోగొట్టుకున్న దౌర్భాగ్యం. దానిమీద ఒకదానితరువాత ఒకటిగా తనభార్య కఠోర పరుషవాక్యాలను సహించడం అతని శక్తికి మించి పోయింది.

అతను వెళ్ళి మంచంమీద దభాలున కూలబడి పోయాడు. అరుణ కుర్చీలో కూర్చుని ఏడుస్తోంది. పావుగంట వరకెవరూ ఏమీ మాట్లాడలేదు. విద్యుద్దీపం అలాగే వెలుగుతోంది. ఆతరువాత అరుణ లేచి లైటుఆర్పి తన మంచంమీద పడి ఏడుస్తోంది.

చీకటిలోనే అశోక్ కు కొంత శాంతి దొరికింది. నేడు అతనికంతా అంధకారబంధురమే. ఇప్పుడతని జీవితంలో ఆ సుఖానందాలజ్యోతి ఆరిపోయినప్పుడు యింకేమి మిగిలి వుంటుంది. శరీరం కొంచెం వేడిగావున్నట్లు శ్వాసలో తెలుపించింది. కాని, చైతన్యశక్తి, ఆత్మ మాయమైనట్లని పించింది. ఒక గొప్పకోసం అంత అంధకారంలోకూడా అతని ఎదుట తాండవిస్తోంది.

పదిహేను నిముషాలయాక, ఎవరో అతని గదితలుపు తట్టి మెల్లగా-"బాబుగారూ" అని పిల్చాడు.

అరుణ అప్పుడుకూడా వెక్కి-వెక్కి ఏడుస్తూనేవుంది. అశోక్ ఆ చీకటిలోనే తొట్రుపడుతూ వచ్చి తలుపు తెరిచాడు. అబ్దుల్లా భుజంమీద కొన్నిబట్టలూ, చేత్తో ట్రే పట్టుకుని, నిలబడివున్నాడు.

"బాబుగారూ! తడిబట్టలు విడవండి! ఈ వేడి కాఫీ పుచ్చుకోండి."

కృతజ్ఞతతో అశోక్ కళ్ళు చెమ్మగిలినయ్! నేడు స్వయంగా, అరుణే తనను కాదన్నది. తన ఆకలిదప్పులు శరీరాన్ని గురించి శ్రద్ధతీసుకోలేదు. చివరకు అబ్దుల్లాయే తనకు ఆయువువాడయ్యాడు. మంచిదినాల్లోనూ, దుర్దినాల్లోను అతను తనను వదిలిపెట్టలేదు.

ఆ చీకటివసారాలోనే, లైటు లేకుండానే, అశోక్ అబ్దుల్లా యిచ్చిన బట్టలు కట్టుకున్నాడు. కాఫీవంతు వచ్చినప్పుడు—"అమ్మగారుకూడా ఏమీ పుచ్చుకోనట్లుంది అబ్దుల్లా! నేనుకూడా కాఫీ పుచ్చుకోను" అన్నాడు.

అబ్దుల్లా ఏమీ మాట్లాడలేదు. తలమాత్రం క్రిందకు దించుకున్నాడు. ఆతరువాత మెల్లగా వెళ్ళిపోయాడు. తన గదికి వచ్చి పొయ్యిమీదున్న పులగం డేగిశానుదించి, మూతవేసి ఒకమూలవుంచి వెళ్ళి పక్కమీద పడుకున్నాడు.

నే డతనికీ నిద్రకూడా పట్టలేదు.

* * *

అరుణ పెందలకడనే లేచి, తన సామానంతా సర్దుకుంటోంది. ఉదయం కలకత్తా మెయిలులో రాయపురం వెళ్లేందుకు తయారుగావుంది. అశోక్ యింకొకమారు చెప్పి చూశాడు. కాని పరివర్తన కలగలేదు. రాత్రి కల్గిన భావావేశం తెల్లవారేసరికి దిగిపోతుందనుకున్నాడు. బహుశా తిరిగి అరుణ యథార్థం తెలుసుకుంటుందనుకున్నాడు. కాని, ఆ ఆశ కూడా విఫలమైపోయింది.

అశోక్ కు రాత్రంతా వొళ్ళునొప్పులుగా వుంది. పక్క వదిలిపెడదామనే కోరిక లేదు. థర్మామీటరు పెట్టిచూశాడు. నూరు డిగ్రీల జ్వరం వుంది.

ఆగిపొమ్మని ఆఖరిసారిగా చేసిన విజ్ఞాపనకూడా అరుణ తిరస్కరించినప్పుడు అశోక్ రుద్ధకంఠంతో-"అరుణా! నీకు వెళ్ళాలనివుంటే వెళ్ళవచ్చు. కాని, ఈవిధంగా హృదయం మీద గాయం, అపవాదులు వేసి వెళ్ళకుండావుంటే, బాగుండేది. సరే, నీ ఆనంద విలాసమయ జీవితంలో, నాకారణంగా నీకు ఎక్కువ కష్టం కలిగించినందుకు నాకు బాధగానేవుంది. అందుకు నన్ను క్షమించు. మన వివాహం మూన్నాళ్ళ ముచ్చటగా రుజువైనందుకు నాకు విచారంగావుంది. దాన్ని సఫలీకృతంచేసే ఆశను నేను వదల్లేదు. కాని అదంతా వ్యర్థమైపోయింది. నువ్వు వెళ్ళాలనుకుంటే వెళ్ళు. కాని, నా మనసులో నీయందు ఒకసారి కల్గిన ప్రేమ యీనాడుకూడా సిద్ధంగానేవుంది ఏనాడన్నా రాదల్చుకుంటే, ఒక కార్డు వ్రాయి. నేను స్వయంగా వచ్చి నిన్ను తీసుకునివస్తాను. నీవు యీ యింటికి ఎప్పుడువచ్చినా స్వాగతం చెప్పబడుతుంది. కాని, దానిని నువ్వే తిరస్కరించదల్చుకున్నట్లయితే, వేరే చెప్పవలసిందేమీ లే"దన్నాడు.

ఈ మాటలుకూడా అరుణకు రుచించలేదు. డిస్ట్రిక్టుజడ్జిగారి కూతురు, ఎం. ఏ. పాసైన సుశిక్షిత రమణి, సమానాధికార, వ్యక్తిస్వాతంత్ర్యోపాసకురాలు అయిన ఆమె కలకత్తా మెయిలుకు వెళ్ళేందుకు స్టేషనుకు వెళ్ళిపోయింది.

వెళ్ళేకముందు అబ్దుల్లాను పిలిచి ఆమెతోపాటు స్టేషనుకు వెళ్ళి సెకండుక్లాసు పెట్టెలో కూర్చోబెట్టమని చెప్పాడు అశోక్. అరుణ కోపంతో-"అవసరంలేదు. అంతా నేనే చేసుకోగలను" అన్నది.

"ఒకే ఒకరాత్రి ఈ కొద్దిపాటి సేవకూడా చేయరానంత పరాయివాడినై పోయానా అరుణా?" అశోక్ అడిగాడు. అరుణ సిగ్గుపడి ఏమీ మాట్లాడలేదు.

అబ్దుల్లా స్టేషనునుంచి వచ్చి, అనువైనస్థలం దొరికిందనీ, ప్రయాణం హాయిగా చేయగలదని చెప్పాడు.

అందుకు జవాబుగా అశోక్ ఒక నిట్టూర్పువిడిచి, ప్రక్కకు వత్తిగిలి శాలువాకప్పుకొని, తనముఖాన్ని దాచుకని పడుకున్నాడు. అబ్దుల్లా శాలువాను పాదాలవరకు లాగి, నాలుగుప్రక్కల దోమతెర సరిచేసి వెళ్ళిపోయాడు. ఈ సమయంలో యజమానికి ఏకాంతమే ఊరడింపు కలిగిస్తుందని అతనికి తెలుసు.

అశోక్ తన దుర్భరదుఃఖాన్ని అశ్రుప్రవాహంలా ప్రవహింపచేసే ప్రయత్నంలో వున్నాడు.

## 32

మధ్యాహ్నం డాక్టరును పిలిపించినప్పుడు, ఆయన "ఇన్‌ఫ్లూయెంజా, పూర్తిగా విశ్రాంతి అవసరం"అని చెప్పాడు. మందు మాకు యిస్తున్నారు.

మూడు రోజులవరకు జ్వరం తగ్గలేదు. ఎముకల్లో చాలా నొప్పిగా వుంటోంది. నిద్రకూడా పట్టటంలేదు. కాని, యీ శారీరక బాధలకన్నా అతనికి మనోవ్యథ ఎక్కువ భయంకరంగా, కఠినంగా వుంది. దానికి మందు ఏ డాక్టరువద్దా వుండదు.

అతని కోమల భావనాహృదయంమీద, ఒకదానితరువాత ఒకటిగా తగిలిన తీవ్రాఘాతాలవల్ల, అతని కాళ్ళు తొట్రుపడి సంబాళించుకోలేకపోయాడు. అతని స్వల్పజీవిత, వైవాహికజీవన భగ్నావశేషస్మృతులు ఆయింటిలో అక్కడక్కడా చెదజల్లబడివున్నాయి. తన జీవితంయొక్క ఆశయాలు, కోరికల మధ్య తనొక్కడే వొంటరిగా పడివున్నాడు.

అతనికి వివాహమైనప్పటినుంచీ మూడు నాలుగు చిత్రాలు పూర్తిచేయగలిగాడు. ఆ ఆఖరిచిత్రం ఎర్రనిరంగులో రుధిరస్నానమయ్యాక, అతను కుంచెను ఒక్కసారికూడా పట్టుకుని ఎరుగడు.

చాలు! అతని జీవితకళాతత్త్వం ఆఖరై పోయింది. అతని ప్రేరణా, అనుభూతి, అతని పరమానందం, ఉల్లాసం సమాప్తమయ్యాయి.

ఈనాడు యివన్నీ ఏకమై, అతనెదుట నిలుచుని రాక్షసుల్లా వికటబడిసవ్వుతూ అతన్ని పరిహాసంచేస్తున్నాయ్!

కళ పోతే పోయింది. దానితోపాటు జీవితంకూడా సమాప్తమైపోయింది. ప్రేమజ్యోతి ఆరిపోయింది మరి ప్రేమను గూర్చిన అంతర్వ్యథదావానలం మాత్రం మిగిలింది. అరుణ

వెళ్ళిపోయింది. భగ్నసంసార కఠినస్మృతులు మాత్రం మిగిలి వున్నాయ్!

ఈ వ్యాధిగ్రస్త జీర్ణశరీరం, దానిలో నివసించే ఛిన్నాభిన్నమైన హృదయం, మృతప్రాయమైన ఆత్మమాత్రం మిగిలి వున్నాయి.

ఈనాడు తన కళ్ళతో స్వయంగా మృత్యువును చూస్తోంపటంమాత్రం నిజం!

నాలుగోనాడు కొంచం జ్వరంతగ్గాక, అబ్దుల్లాను వంద రూపాయలిచ్చి ఎలాగైనా, వీలున్నంతవరకు మరియమ్ సంగతి తెలుసుకునిరమ్మని పాద్రీపురం పంపించాడు. ఆవిషయంలో ఎక్కడికి వెళ్ళవలసివచ్చినా, ఎంత ఖర్చుచేయవలసివచ్చినా వెనుకాడవద్దన్నాడు. ఈ జబ్బుస్థితిలో యజమానిని వదలడం యిష్టంలేదని అబ్దుల్లా చెప్పాడు. అశోక్ అందుకు ఒప్పుకో లేదు. తన కిప్పుడు జబ్బులేదనీ, ఆరోగ్యంగావుందనీ, ఐనా డ్రైవరున్నాడనీ, అందువల్ల భయంలేదనీ చెప్పాడు. అసలు మరియమ్అంతు తెలియనిదే ఆరోగ్యంచేకూరదనేది నిజం!

ఐదోనాడు అబ్దుల్లా తిరిగివచ్చి, తను మరియమ్కోసం తిరిగినదంతా నివేదించాడు.

మొదట పాద్రీపురంలో జోసెఫ్కాకా చెప్పినదానినిబట్టి దొరసానిగారు ఆమెను యింట్లోంచి వెడలగొట్టిందనీ ఆమె గర్భిణితో వుండటమే అందుకు కారణమని చెప్పాడు. ఎంతో వచ్చి మొత్తుకున్నా, ఇటార్సీఆసుపత్రికి ఒకవుత్తరం వ్రాసి యిచ్చి పంపించిందట. ఆ తరువాత ఆ జాడ తెలియలేదు. జోసెఫ్కాకా కన్నీళ్ళుపెట్టుకుని, మరియమ్ వెళ్ళాక పాద్రీపుర

మాతా అంధకారంగావుందనీ, ప్రజలంతా దొరసానిగారిని వొత్తిడిచేసిన ఫలితంగా, ఆమె సెలవుపెట్టి, స్కాట్లండ్ వెళ్ళిపోయిందని చెప్పినట్లు చెప్పాడు.

"తిరిగి నేను ఇటార్సీ వెళ్ళాను. మిషన్ ఆసుపత్రి చుట్టు ప్రక్కల తిరిగాను. అక్కడ విచారించాను. మరియమ్ అనే పేరుతో ప్రసవించేందుకు అక్కడి కెవరూ రాలేదని తెలిసింది. ఆ...అయినవంటిదే 'ప్రీటా ఫ్రాంకోవిన్' అనే అమ్మాయి అక్కడ ప్రసవించి, బిడ్డతండ్రిపేరు చెప్ప నిరాకరించిందని తెలిసింది-"

"ఓహో! అదే నా బిడ్డ అబ్దుల్లా; ఆమే మరియమ్! కళంకాన్నుంచి రక్షించుకునేందుకు పేరుమార్చుకునివుంటుంది. ఆ తరువాత...?" ఆత్రుతగా అడిగాడు అశోక్.

"ఆమెకూడా ఒకనాటిరాత్రి, తనబిడ్డను తీసుకుని హఠాత్తుగా మాయమైపోయింది. ఆమె వెళ్ళిపోతూ ఒక చీటీలో తను ఆత్మహత్య చేసుకోననీ, సమాజకాఠిన్యాన్నుంచీ అవమానాలనుంచి రక్షించుకునేందుకు తెలియని ప్రదేశానికి వెడుతున్నానని వ్రాసిపెట్టింది."

"ఆ తరువాత...?" అశోక్ ఆసక్తితో దావా తీర్పు వింటున్నవాడిలా అడిగాడు.

"ఆ తరువాత ఎంత విచారించినా సంగతి తెలియలేదు బాబూ!"

"ఇటార్సీసంగతి నీ కెవరు చెప్పారు?"

"వీణా అనే ఒక నర్సు బాబూ! బహుశా ఆమెతో మరియమ్‌కు స్నేహమేర్పడివుండవచ్చు. మొదట ఆమెకొంచెం

సందేహించింది. నేను ఆమెతో ఆమెహ్రాత్రెపినని చెప్పాను. అప్పుడామె అన్ని విషయాలు చెప్పింది. మరియమ్ అంటే, ఆమెకు ఎంతో ప్రేమఅని తెలుసుకున్నాను. ఇవాళకూడా మరియమ్‌కోసం కన్నీళ్ళు పెట్టుకుంది"

"మరియమ్ అటువంటిదే అబ్దుల్లా! ఎక్కడవుంటుందో తెలియదు. ఏం చేస్తుంటుందో తెలియదు. ఎన్నెన్ని కష్టాలు సహిస్తోందో? వాటన్నిటికీ కారణం నేనే అబ్దుల్లా!" అశోక్ కంఠం రుద్ధమైంది.

"బాబూ!"

"ఆమె జీవితమెల్లాగ్గా నా బాగానే గడిచేది. నావల్లనే దాన్నామె పతనం చేసుకోవాల్సి వచ్చింది. ఈనాడు ఏమీ ఎరుగని ఒక పసిగుడ్డును తీసుకుని ఎక్కడెక్కడో తిరుగుతూ ఎన్నో తిట్లూ, ఎన్నో అవమానాలు సహించవలసివచ్చింది. అయ్యో, భగవంతుడా! యీ ఘోరపాపానికి నువ్వెంత శిక్ష విధించినా, అది స్వల్పమే అవుతుంది. నా యిల్లుకూడా సర్వనాశనమైపోయింది—న్యాయమే జరిగింది. ఒక అమాయకురాలిని నేను సర్వనాశనం చేశాను. అందుకు నేను అనుభవిస్తున్నది ఏపాటిది. బాగుంది... అబ్దుల్లా!—"ఆర్తస్వరంతో పిలిచాడు.

"ఏమిటి బాబూ! నేను దగ్గరేవున్నాను"

"కడుపులో విపరీతంగా నొప్పివస్తోంది. అబ్బా...!" అశోక్ తీవ్ర వ్యధతో అటూ-యిటూ పొర్లుతున్నాడు. ముఖంపై చిరుచెమటలు పోశాయి.

అబ్దుల్లా పరుగెత్తుకుని వెళ్ళి మెల్లమెల్లగా పొట్టను చేత్తో నిమురుతూ—"బాబుగారూ! కొంచం విశ్రాంతి తీసుకుంటే బాగుంటుంది" అన్నాడు.

"కడుపులో తిప్పుతోంది—" అంటూనే అశోక్ వెంటనే వాంతి చేసుకున్నాడు.

ఈమారు మనసు తేలికైంది. "అబ్దుల్లా! ఒకమారు నాచేతికి స్వర్గం దొరికింది. కాని, నా మూర్ఖతవల్ల దాన్ని పోగొట్టుకున్నాను. నన్ను అజ్ఞానం ఆవరించింది. దానితో యథార్థాన్ని గుర్తించలేకపోయాను దానికి శిక్ష నేను అనుభవిస్తున్నాను. అరె! తిరిగి అదే నొప్పి...అబ్దుల్లా...! అబ్బా!..."

అబ్దుల్లా ఈమారు విచారగ్రస్తుడై—"డాక్టరుకు కబురు చేస్తాను బాబూ" అన్నాడు.

"అవునవును! పిలిపించు-" మూలుగుతూ అన్నాడు— "ఆగు, కొంచం ఆగు మళ్ళీ కడుపులో తిప్పుతోంది". తిరిగి వాంతిఅయింది. శరీరమంతా చెమటపట్టింది. అబ్దుల్లా వొంటి మీద చెయ్యి వేసి చూశాడు. కొంచం వేడిగావుంది. వాంతయ్యాక కొంచం నెమ్మదించింది.

"ఇలా మాటిమాటికీ నొప్పివస్తుంటే, బ్రతకననిపిస్తోంది అబ్దుల్లా! భరించలేకుండా వున్నాను. కాని వాంతయ్యాక నెమ్మదిగా వుంటోంది. ఈ బాధ ఆశ్చర్యంగావుంది. ఇంతకుముందెప్పుడూ అనుభవించలేదు."

"డాక్టరు యిప్పుడే వస్తారు బాబూ! మీరు భయపడకండి. వెంటనే తగ్గుతుంది."

డాక్టరు వచ్చాడు. జాగ్రత్తగా పరీక్షించాడు. ఆయన గంభీరముఖం చూచి, అబ్దుల్లా హృదయంలో పిడుగు పడి నట్లయింది.

ఆయన 'అపెండిసైటిస్' అని అనుమానంగావుందనీ, ఎక్స్‌రే తీయించినట్లయితే, అనుమానం తీరుతుందని చెప్పాడు.

వెంటనే అంబులెన్సుకారును పిలిపించి, మేయో ఆసు పత్రిలో ఎక్స్‌రే తీయించారు. ఫోటోచూచి డాక్టరు అది 'అపెండిసైటిస్' అనీ, ఆపరేషన్ చేయడం అవుసరమనీ, లేకుంటే భవిష్యత్తులో అపాయంకలుగుతుందని చెప్పాడు.

అబ్దుల్లాకళ్ళలో గిర్రున నీళ్ళుతిరిగాయ్.

"అనవసరంగా ఎందుకు బాధపడతావు అబ్దుల్లా! భగ వంతునికి న్యాయాన్యాయాలు తెలుసు. మరియమ్‌పట్ల నేను చేసిన అన్యాయానికి శిక్ష అనుభవించవలసిందేకదా! జీవి తంలో ఏ నమ్మకంతో, ఏది మిగిలివుందనుకున్నానో, దాని కోసం ఎదురుచూస్తూ కూర్చుంటాను. ఇక నేను చనిపోవడమే మంచిది."

"అలా అనకండి బాబూ! భగవంతుడు మేలుచేస్తాడు" ఆ తరవాత మాట్లాడలేకపోయాడు. భుజంమీదున్న రుమా లును కళ్ళకు అడ్డుపెట్టుకున్నాడు.

"కాదు, అబ్దుల్లా! ఇక బ్రతకాలనే కోరికగాని, మోహంకాని లేదు. ఎప్పుడైనా మరియమ్ కనిపించి నట్లయితే, అయిదువేలు ఆమె కివ్వు! మిగిలింది నీ జీవితానికి సరిపోతుంది."

"కాదు-కాదు హృదయాన్ని చీల్చివేసే మాటలనకండి

బాబూ! భగవంతుని దయవల్ల మీకు నయమవుతుంది. 'అపెండిసైటిస్' తాలూకు ఏ ఆపరేషనైనా ఫలిస్తుంది. ఇక డాక్టర్ లాల్‌గారిచేతుల్లో చక్కగా జరుగుతుంది."

"అవును. జరగవచ్చు. కాని, ఇప్పుడు దానిలో పూర్తి నమ్మకం లేదు."

ఈవిధంగా ఆ చిన్న బంగళా వాతావరణమంతా దాని ప్రాణజ్యోతే క్షీణిస్తున్నట్లు శోకాచ్ఛన్నమైపోయింది.

మందుమాకులు జోరుగా యివ్వబడుతున్నాయి. వచ్చే నెల మొదటివారంలో ఆపరేషన్ చేయడానికి నిశ్చయించారు. అశోక్‌ను తిరిగి బంగళాకు తీసుకునివచ్చారు.

అబ్దుల్లా కన్నీళ్ళు తుడుచుకుంటూ యజమానికి పరిచర్యలుచేస్తున్నాడు. ఇప్పుడతను రోజూ అయిదుమాట్లు నమాజుచేస్తున్నాడు. అశోక్‌కు యీ కష్టకాలంలో అతనొక్కడే ఆధారమయ్యాడు.

అంతేకాదు. ఇంకొక ఆధారం మాయాదేవికూడా వుంది. ఆమె రోజూవచ్చి, కొన్ని గంటలు నర్సులా పరిచర్యలు చేస్తూనే వుంది. తన జీవితంలో చేసిన అపరాధానికి ప్రాయశ్చిత్తంచేసుకునేందుకే యీ విశుద్ధసేవాసాధనలో మునిగివున్నట్లు, ఆమె యీ పనిలో నిమగ్నఅయింది. క్లబ్బు, సినిమా అన్నీ వదిలివేసింది. స్నేహితులచుట్టూ తిరగటం కూడా తగ్గించింది. ఇటువంటి కష్టసమయంలో అశోక్‌ను వదలి, తొందరపడి వెళ్ళినందుకాను అతనను క్షమించలేను.

ఈ సేవానిరతిలో మాయాదేవికి నేడు ఎంతో ఆనందం కలిగింది. అశోక్ విషయంలో ఆమెలో భావపరివర్తన జరిగి

పవిత్రభావ మేర్పడింది. మొదట అతనిమీద కామాసక్త్తురాలై వుంది. ఏవిధంగానైనా అతన్ని వశపరుచుకుని, తన ఆధిపత్యాన్ని చెలాయిద్దామనుకుంది. ఐనా, అతను లొంగలేదు. అశోక్ తన ప్రతిష్టను భస్మంచేసే ఆమె ప్రేమను కాలదన్ని నప్పుడామె, అతని తత్వం వేరనీ, యితర పురుషుల మనస్తత్వానికి భిన్నమైనదనీ అనుకుంది. ఆరోజున ఆమె తన పరాజయాన్ని స్వీకరించి అశోక్ ముందు పాదాక్రాంతురాలైంది. ఆనాటినుంచి ఆమె విషయవాంఛలకు దూరమై అశోక్ యందు ఆదరణభావం కలిగివుంది ఈ ఆదరణభావమే రోజురోజుకీ ఉదాత్తమై క్రమ క్రమంగా పవిత్ర, భక్తి స్వరూపాన్ని దాల్చింది. ఇప్పుడామె వెనుకటి మాయాదేవి నీలకంఠ కాదు. మొదట ఏ భోగవిలాసాలు జీవితానందప్రాప్తికి సాధనాలని భావించి వాటిలో మునిగిపోయిందో—ఇప్పుడవే ఆమెకు గర్భ శత్రువులుగా మారాయి. వాటిని పరిత్యజించడంలోనే నేడామెకు నిజమైన ఆనందం, సుఖం లభిస్తాయి. మాయాదేవిలో ఈ పరివర్తనచూచి అశోక్ కూడా ఆశ్చర్యం చెందాడు.

♦ ♦ ♦

ఆపరేషన్ రోజు దగ్గరకొస్తున్నకొద్దీ మాయాదేవికీ, అబ్దుల్లాకు విచారం ఎక్కువైపోతోంది. అశోక్ నిద్రలో, కలలో, జ్వరంలోకూడా, మరియమ్ రాలేదా?' అని అప్పుడప్పుడూ- 'నాబోటి దుర్మార్గుని క్షమించు మరియమ్ !... మరియమ్... మరియమ్...!' అని పలవరిస్తున్నాడు.

అదివరకు మరియమ్‌ను అసహ్యించుకునే మాయాదేవి

కూడా, యిప్పుడు మరియమ్మప్ప అభిమానంచూపసాగింది. ఆమె అబ్దుల్లాను ఒకప్రక్కకు తీసుకువెళ్ళి- "అబ్దుల్లా, ఎంత డబ్బైనాసరే, మరియమ్‌జాడ తెలుసుకో" అని చెప్పింది.

"అదే నేనూ అనుకుంటున్నానమ్మా! కాని, ఏం చేయను? మెదడు సరిగ్గా పనిచేయడంలేదు." అని విచారిస్తూ వుండేవాడు.

# 33

తన సుఖస్వప్నాలన్నిటినీ, నాగపూరులోనే వదిలిపెట్టి, మరియమ్ ఆ వర్షపురాత్రి, హౌరాఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళిపోతోంది. ఎటుచూచినా చీకటి. ఆకాశమంతా నల్లనిమేఘాలు ఆవరించి వున్నాయి. ఆమె కిటికీలోంచి తొంగిచూసింది. హంసపురి రైల్వేబ్రిడ్జిమీదున్న పెద్ద లైటు క్రమక్రమంగా తన జీవనజ్యోతికూడా యిలాగే క్షీణించి, లుప్తమైపోతున్నట్లు, దూరమవుతోంది. ఏ కాంతిపుంజంలో ఆమె ఆనందం, సుఖం యిమిడివున్నాయో, అదే యిప్పుడు శాశ్వతంగా అస్తమించిపోతున్నట్లనిపించింది.

రైలువేగం ఎక్కువైంది. నాగపూర్ అనే శబ్దంలో ఆమెకున్న మక్కువంతా క్రమక్రమంగా సన్నగిల్లిపోతూ, కొంచంసేపటికి పూర్తిగా లోపించుకోయింది. నా-గ-పూ-రు. ఈ నాలుగు అక్షరాల్లో ఎంతో వర్ణనీయమైన అర్థంవుంది. అక్కడ తన సర్వస్వమైన తన ఆరాధ్యదైవం వుంటున్నాడు. ఆ స్థానం, రమణీయమైన భావాలకు, తీయని కలలకూ,

మధురాతిమధుర ఆశలకు ముఖ్యక్షేత్రం. అక్కడనుంచి వచ్చే గాలి తెరలూ, స్త్రీపురుషులు అంతా ఆమెకు విచిత్రసౌంద ర్యంతో ప్రకాశవంతంగా కనుపిస్తాయి. ఆ పట్టణం ఆమెకు జెరుసలమ్‌లాంటి తీర్థస్థానంవంటిది. ఆ ఒక్కయాత్రలో ఆమె కీ చైతన్యవంతమైన నవజీవితం ప్రాప్తించేది.

కాని, నేడో-?

నేడు అశోక్ అరుణసొత్తయిపోయాడు. ఆయన హృదయంలోంచి మరియమ్ తొలగిపోయింది. భగ్నప్రణయిని విరహావేదనకు హద్దులేమిటి? ఆమె ఆత్మవిశ్వాసమూ, ఆత్మ గౌరవమూ మంటగలిశాయి. కేవలం అస్థిచర్మమయ దేహం మాత్రం మిగిలివుంది.

కంపార్టుమెంటులో రద్దీ ఎక్కువగా వుంది. నిరాశ, నిస్పృహలతో శుష్కించిన ఆమె శరీరాన్ని చూచి, ఆమెను ఎవరూ బెంచిమీద కూర్చోనీయలేదు. అందువల్ల ఆమె తలుపుప్రక్కగా క్రింద మూటమీద కూర్చుంది. కొంతమంది స్త్రీలు ఆమె దీనావస్థను కుతూహలంగా చూస్తున్నారు. కాని ఆమె ధ్యాస అటువైపు లేదు. అటుచూచినప్పుడు, వారి తీక్షణదృక్కులనుంచి ముఖాన్ని చేతులతో కప్పుకుని ఆలో చనల్లో మునిగిపోతోంది.

జూన్ యిరవైవకున, స్కూలు హెడ్‌మిస్ట్రెస్, జులై రెండో తారీఖునుంచి తిరిగి పనిలో ప్రవేశించమని నోటీసు పంపించింది. ఈ కబురుకోసమే ఆమె తన భగ్నహృదయంతో రోజులు గడుపుతోంది. అశోక్ వివాహసమాచారం చదివాక ఆమె దివ్యప్రేమనాటకం ముగిసింది. చిన్న ఉపసంహారం

మిగిలివుంది. దాని తరువాత, ఆ దుఃఖాంతనాటకం ఎప్పటికి ముగుస్తుందో! దాన్ని పూర్తిచేసేందు కామె, ఆ నాలుగు వందల రూపాయలూ, రుమాలు, గలీబు, తీసుకుని గుణవతి వద్ద ఒక్కరోజు సెలవుపుచ్చుకుని నాగపూరు బయలుదేరింది. ఆ దారుణ, వేదనాభరిత ప్రేమకథకు సంబంధించిన స్మృతి చిహ్నాంకూడా తనవద్ద మిగలకుండా, వాటిని బహూకరించిన వారికే అందజేయాలనుకుంది.

ఇంకొక కోరికవుంది. తన ప్రియుణ్ణి, వీలుంటే దూరం నుంచే దర్శనం చేసుకుందామనుకుంది. ఆతరువాత ఆమె అతని జీవితపథాన్నుంచి శాశ్వతంగా తొలగిపోవాలనుకుంది. నేటికి కూడా, తను ఏ అవకాశాన్ని పొందాలని కోరటం లేదు. అందనిదానికోసం అర్రులుచాచడంవల్ల లాభంలేదని ఆమె అభిప్రాయము. గుణవతిని ఎంతో బతిమిలాడి, యిరవైనాలుగు గంటల సెలవుమీద, ఏడుమాసాల పసివాడిని ఆమెకు వొప్పగించి పంజాబ్ మోటారుసర్వీసులో ఉదయమే జబల్‌పూరు నుంచి నాగపూరు చేరి, అక్కడ నాలుగైదుగంటలు గడిపి, రాత్రిబండిలో యింటికి తిరిగివస్తోంది. అందు క్కారణం, ఆమె ఎక్కువకాలం పిల్లవాడ్ని వొదిలివుండలేదు. ఆమె వచ్చేప్పుడు పాలసీసా, గ్లూకోజ్ మొదలైనవన్నీ ఏర్పాటుచేసివచ్చింది. కాని, తల్లిపాలకూ, ప్రేమకూ సాటిరాగగల వస్తువు ప్రపంచంలో ఏముంటుంది!

నేడామె అంతులేని దుఃఖంతో, నిరాశతో నిండిన హృదయంతో బండిలో కూర్చుంది. తను ఏ పాపానికి, ఏ అప

రాధానికి జీవితంలో ఇంత కఠినశిక్ష అనుభవించవలసి వచ్చింది? అనే ప్రశ్న ప్రతిపూటకీ ఆమెను వేధిస్తోంది.

ఆమె ఎవరికీ అపకారంచేయలేదు. ఆమె ఎన్నడూ దొంగతనంచేయలేదు. హత్యచేయలేదు. ప్రణయక్షేత్రంలో కూడా ఆమె ఏ తప్పూ చేయలేదు.

ఆమె తన శరీరాన్నీ, హృదయాన్నీ ఒకే పురుషునికి అర్పించింది. తన సమస్తశక్తులతో, సమస్త ప్రాణాలతో వరించి, ఆరాధ్యదైవంగాభావించి అతనికే తనసర్వస్వాన్ని సమర్పించింది. ఆ సమర్పణలో తన అస్తిత్వాన్నే కోల్పోయింది. ఈ ఆత్మసమర్పణ తరువాత పరపురుషుని వైపు కన్నెత్తి చూడటం అటుంచి, ఆ విషయమే మనసులోకి రానీయలేదు. త్రికరణశుద్ధిగా ఆమెకు ఒక్కడే ప్రియుడు. అతన్నే హృదయ మందిరంలో ప్రతిష్ఠించుకుని నిరంతరం పూజిస్తోంది.

ఈ నిష్ఠ సతీసాధ్వీమతల్లుల పతిభక్తికి తక్కువైనదా? హిందూధర్మశాస్త్రరీత్యా పాతివ్రత్యప్రమాణానికి తాను ఏమాత్రం వీగిపోదు. సీతా, సావిత్రుల ఆదర్శాలను తన జీవితంలో జీర్ణింపచేసుకోలేదా?

అయినా, తన విశుద్ధ పవిత్రప్రేమ యింత తిరస్కారాన్నీ, వ్యథనూ ఎందుకు సహించవలసివచ్చింది? తన ప్రియతమ పసివాడు సంఘ మర్యాదలకు, అవహేళనకు ఎందుకు బలికావాలి? ప్రణయక్షేత్రంలో తన ఆరాధ్య దేవునిచే తాను నెందుకీవిధంగా అవమానింపబడింది?

బహుశా అరుణ డిస్ట్రిక్టుజడ్జి కూతురవటంవల్లనూ,

తన తల్లిదండ్రుల జాడ లేకపోవడంవల్లనూ కావచ్చు—! అరుణ ఎం. ఏ. ప్యాసైంది. తను కాలేజీభవనం మెట్లుకూడా తొక్కివుండదు. అరుణ ధనవంతులబిడ్డ. తను దరిద్రుల కూతురై ఉండవచ్చు. బహుశా అరుణ అందమైనదీ, తను సాధారణమైనదీ కావచ్చు!

—ఈవిధంగా ఆలోచించడం బహుశా అశోక్‌ను అవమానపర్చడమే కావచ్చు. ఇంత ఘోర అవమానం పొందాక, ప్రపంచంలోని కృత్రిమ, నీచ, వాతావరణంలో బహుశా వీటికే విలువవుంటుందనీ, సర్వసమీకరణశక్తివుందనీ మరియమ్ గ్రహించకుండా వుండలేకపోయింది. అందువల్ల తననుదుట వ్రాసివున్న విధిలిఖితానికి ప్రతీకారం చేయలేక, దానిబరువుకు నడుమువిరిగిపోయినా శరీరం, మట్టిలోకలిసిపోయినా మెదలకుండా సహించవలసిందే! ఇదే జీవితం...... ఇదే జీవితం......!

ఇటువంటి భయంకర భావోద్వేగంతో ఆమెమనసు పరిభ్రమిస్తోంది. ఆమె కళ్ళు మసకలుక్రమ్మాయి. మతి స్థిమితం లేకుండాపోయింది. ఒక యంత్రపుబొమ్మలా ఆమె ప్రయాణం చేస్తోంది. ఆమెహృదయంలో దట్టంగా చీకటి అల్లుకున్నట్లుగానే, వాతావరణమంతా గాఢాంధకారం వ్యాపించివుంది.

ఆమెకు మాటిమాటికీ దాహమవుతోంది. గొంతెండిపోతోంది. నీళ్ళదొరికే ప్రతిస్టేషనులో, ఆమె దాహంతీర్చుకునేందుకు ప్రయత్నించేది. ఒక్కొక్కప్పుడు నీరుదొరికేది. మరొకప్పుడు నీళ్ళవాడు దగ్గరకువచ్చేసరికే బండికదిలిపోయేది.

అప్పుడప్పుడు తోడి స్త్రీప్రయాణీకులు "ఎందుకన్ని నీళ్ళు త్రాగుతావు ?" అని ప్రశ్నించేవారు.

ఐనా అది తీరేదాహంకాదు. ఆమె శరీరం విపరీతంగా వణుకుతోంది. చెవులు దిమ్మెక్కాయి. కళ్ళు ఎర్రగా చింత నిప్పుల్లా వున్నాయి.

ఒకామెచేయి ఆమె శరీరాన్ని తాకింది. "అరే! ఈమె వొళ్ళు మండిపోతోందే ?— అంది.

అవును. లోపలా, బయటా జ్వాల మండుతోంది. జ్వరతీవ్రతలో ఆమెకు స్మృతితప్పినట్లయింది.

ఈ అర్ధమూర్ఛితావస్థలో "గొందియా" ఎప్పుడు వచ్చిందో ఆమె బండి ఎప్పుడు మారిందో, హావుబాగ్‌లో దిగిందో, యింటి కెప్పుడు చేరుకుందోకూడా తెలియదు. ఆమెకు స్మృతే లేకుండాపోయినట్లయింది. ఇంటికి వచ్చేసరికి ఆమెపిల్లవాడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఆ పసివాడి ఆక్రందన ఆమె హృదయాన్ని కలచివేసింది. ఆమెను చూడగానే గుణవతి- "ఎంత దుర్మార్గురాలవే! తల్లివా, రాక్షసివా ? జబ్బులోవున్న పిల్లవాణ్ని వదిలి ఎక్కడికెళ్ళావు ? రాత్రంతా ఏడుస్తూనేవున్నాడు. ఒక్క నిముషంకూడా నిద్రపోనీయలేదు. ఇటువంటి పిల్లవాణ్నెక్కడా చూడలేదు. తండ్రిలేనివాడై తేనేం...?" అని ఏమేమో అన్నది.

కాని, ఆ కర్కశవాక్యాలు మరియమ్ చెవిని సోకలేదు. ఒకవేళ అవి ఆమెచెవినిబడ్డా ఆమె మీద పనిచేయలేక పోయాయి. ఆమె పిల్లవాణ్ని ఆప్యాయంగా దగ్గరకుతీసుకుని పాలుపడుతోంది.

ఒక నాటి వియోగానికే పిల్లవాడు ఏడ్చి ఏడ్చి సగమై పోయాడు. వేడిగావున్న పిల్లవాడి శరీరాన్నిచూసి ఆమె హృదయం తల్లడిల్లిపోయింది. వాడికికూడా జ్వరంతగిలింది. మాతృహృదయంలోని ఆవేదన, కన్నీరుగా పెల్లుబికి శోకధారగా స్రవించింది.

"అయ్యో భగవంతుడా! ఏమి టీ నిర్ణయం! యిద్దరికీ ఒకేమారు అస్వస్థత కలిగిస్తావా? మరియమ్ వ్యాకుల పడుతూ అంది. "నా దేహంమీద నాకు వ్యామోహం లేదు. నీ పిలుపందిననాడు నీవద్దకు రావడానికి సిద్ధంగా వున్నాను. కాని, పాపపుణ్యమెరుగని యీ పసివాడిపైన నీకుదయ లేదా? ఎలా సహించను"

ఒకే ప్రక్కమీద తల్లీకొడుకులు పడుకొని జ్వరంతో మూలుగుతున్నారు. సేవచేసేందు కెవరూ లేరు. దావూద్ పహిల్వానుకూతురు గుణవతి సపర్య లెందుకు చేస్తుంది? ఆమె కంత తీరుబడెక్కడుంది?

ఆ మరునాటి సాయంకాలం జాన్ ఫ్యాక్టరీనుంచి వచ్చి ఆ తల్లీకొడుకుల దుస్థితికి చాలా విచారించాడు. వెంటనే డాక్టరును పిలిపించి చూపించాడు. ఆ రాత్రి నాలుగుసార్లు లేపి మందు త్రాగించాడు.

డాక్టరు తల్లిశక్తి చాలా క్షీణించిపోయిందని చెప్పాడు. 105 డిగ్రీలజ్వరంలో కలవరిస్తోంది. ఆ స్థితిలో మరియమ్ ఏదో కలకంటున్న దానిలా వుంది.

ఒక భయంకర రాక్షసుడు ఆమెగొంతు నొక్కుతున్నట్లు ఆమె అరచింది. "వద్దువద్దు. నన్ను చంపకు, నన్ను చంపకు.

నేను బ్రతకాలనుకుంటున్నాను. నా పిల్లవాడికోసం నేను బ్రతికి వుంటాను. ఓ......"

ఆమె మేలుకుంది. అది కలో కాదో ఆమెకు తెలియ లేదు. ఆ చీకటిలో, రాక్షసుడు దగ్గర్లో వున్నాడేమోనని చేతితో తడిమిచూచింది.

తిరిగి మూర్ఛపోయింది. ఇంకొక కల!

ఈమారు పిల్లవాడు చలనంలేకుండా పడివున్నాడు. వాడిమీద తెల్లటి దుప్పటి కప్పివుంది.

ఆ తరువాత జాన్ వాడిని ఎత్తుకుని చర్చివేపు తీసుకుని వెళ్ళడం చూచింది. ఆయనవెనక హరికేన్‌లైటుపట్టుకుని ఒకమనిషి, పలుగుతీసుకుని యింకొక మనిషి వెడుతున్నారు.

ఆపిమ్మట నాలుగడుగుల గొయ్యితీయించి ఆ పిల్లవాడిని అందులో పడుకోబెట్టారు. కాని, పిల్లవాడికళ్ళుమాత్రం తెర చుకునేవున్నాయి. జాన్ గోతిలో మట్టివేస్తున్నప్పుడామె అరి చింది. "ఎంత నిర్దయుడివి ? వాడికళ్ళలో మట్టిపడదూ ?"

ఈ కేకతో తిరిగి మెలుకువ వచ్చింది జాన్ లేచివచ్చి చూశాడు. మరియమ్ చేతితో పిల్లవాడిని తడుముతూ, శ్వాస ఆడుతోందా లేదా అని పరీక్షించడం చూశాడు.

ఆఁ! శ్వాసఆడుతోంది అదంతా కలే!—

తరువాత ఆమెకు నిద్రపట్టలేదు. మనసులోనే అను కుంటోంది— "కాదు. వీణ్ని తీసుకుపోనీయను. వీడిని రక్షిం చుకునేందుకు నేను బ్రతికే వుంటాను తప్పకుండా వుంటాను. వుంటాను."

ఆశ అనే నిధిని భగవంతుడు మానవునికి ప్రసాదిం

చాడు. దాని బలంతోనే మానవుడు ఫలితం లేదని తెలిసికూడా ప్రయత్నశీలుడౌతాడు. అందువల్లనే 'మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్' అనే లోకోక్తి ప్రపంచంలో చెల్లామణి అవుతోంది.

దాని ప్రోద్బలంతోనే బ్రతికివుండాలనే ఆకాంక్ష మరియమ్ జీవితంలో తీవ్రరూపం దాల్చింది. ఆమె ఆరోగ్యం రోజురోజుకు బాగుపడుతోంది. ఇందు కామె దాని కెంత విలువ చెల్లించిందో తెలియదు. అసలు బ్రతకవలసివుంది కనుక బ్రతికింది.

కళ్ళు పీక్కుపోయినా, బుగ్గలు గుంటలుపడినా, శరీరం శుష్కించిపోయినా అది వేరేవిషయం. అస్థిచర్మమయ దేహం మాత్రం మిగిలివుంది. సౌందర్యమంతా క్షీణించిపోయింది. చివరకు గుణవతికూడా ఆమెను అసహ్యించుకుంటోంది.

ఐనప్పటికీ బ్రతికివుంది. పిల్లవాడనే మహత్తరమైన ఆకర్షణ లేకుంటే, ఆమె యిప్పటికేమయ్యేదో తెలియదు.

# 34

ఆపరేషన్ జరగబోయేనాటి ముందురోజే అశోక్‌ను మేయోఆసుపత్రిలో చేర్పించారు. ఒక డాక్టరు వచ్చి, అతని గుండె, నాడి, కళ్ళు అన్నీ పరీక్షించి వెళ్ళాడు. అయిదునిముషాలయాక, ఒకనర్సు వచ్చి, తెల్లనిపొడను తినిపించి, నీళ్ళు త్రాగించింది. ఇలా మందుతినిపించే క్రమము జరుగుతూనే వుంది.

సాయంకాలం ఆపరేషన్ చేసే డాక్టర్ లాల్ వచ్చి చూశాడు. ఆయనతోపాటు యింకా యిద్దరుడాక్టర్లూ ముగ్గురు నర్సులు వచ్చారు. వాళ్ళంతా కలిసి ఈ కేసువిషయంలో ఆలోచించుకున్నారు. ఈ కారణంగా అశోక్ వున్నవార్డు ఆవరణలో గాంభీర్యం వ్యాపించింది. దాని ప్రతిబింబం అబ్దుల్లా ముఖంలో కన్పించింది. ఐనప్పటికీ అతను సంతోషంగా కన్పించేందుకు ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు.

డాక్టర్లూ నర్సులు వెళ్ళిపోయాక, అశోక్ అబ్దుల్లాను పిలిచి "అబ్దుల్లా! నా కొక కోరికవుంది. నేను చనిపోయాక... ........." అన్నాడు.

"వద్దుబాబూ! చనిపోయాక గినిపోయాక అనేమాటలు రానీయకండి. భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తాడు."

"రేపేమవుతుందో తెలియదు అబ్దుల్లా! అవును. అపెండిసైటిస్ ఆపరేషన్ జయప్రదం కావచ్చు. కాని, అందుకు రోగికిసహాయం చేయవలసి వస్తుంది. అయినా నా కిప్పుడు బ్రతకాలనిలేదు. చనిపోతేనే నాకు శాంతి లభిస్తుంది."

ఈ ప్రసంగం అబ్దుల్లాహృదయాన్ని కలవరపరచింది. కాని, అతను సంబాళించుకుని, "అలా ఎప్పటికీ జరుగదు బాబూ! మరియమ్ వచ్చినట్లూ ఆపరేషన్ జయప్రదమైనట్లు నాకు కలవచ్చింది." అన్నాడు.

"అదంతా వట్టి భ్రమమాత్రమే అబ్దుల్లా!" అశోక్ దీనంగా నవ్వాడు. అందులో కొంత అవ్యక్తమైన బాధకూడా

కనుపించింది. అలా జరిగితే మంచిదే. కాని, అలా జరగక పోతే నా కొక కోరికవుంది."

"ఏమిటి బాబూ!"

"ఒకవేళ నేను చనిపోతే, నా దహనసంస్కారాలు పాద్రీపురంలో జరిపించాలి. ఆ సెలయేటివొడ్డున పొగడచెట్టు వుందికదూ— దానికి సమీపాన్నే, కొంతడబ్బు ఖర్చుపెట్టి, ఒక చిన్న స్మ్రతిచిహ్నాన్ని ఏర్పాటుచేయించాలి."

పాపం! అబ్దుల్లా తలవంచుకుని అంతా వింటున్నాడు. ఒక్క దీర్ఘనిట్టూర్పుమాత్రం విడిచాడు.

ఆసుపత్రివాతావరణంలో కొన్ని నిష్ప్రయోజనమైన ఆలోచనలు చేయడంకూడా కద్దు. రోగులవార్డులలోవుండే తెల్లని మంచాలూ, వాటిమీద పడుకునివుండే రోగపీడితులూ, తలకూ, చేతులకు కట్లు కట్టబడివున్నవాళ్ళూ, మందుసీసాలూ, తెల్లని ఎనామిల్ గిన్నెలూ, పళ్ళాలూ, రబ్బరు సంచులూ, మెడలో స్టెతస్కోపులతో తిరిగే డాక్టర్లూ, వారితో పాటు నల్లంచు తెల్లచీరెలు ధరించిన నర్సులూ, వారందరిమీద నుంచివచ్చే క్లోరోఫారం వాసనా, మహా విచిత్రంగావుంటుంది. మధ్యలో ఎవరో ఒకరోగి మూలుగు... ఆక్రందన... భరించ రాని బాధా- అవన్నీ వింటూంటే ప్రత్యక్షంగా మృత్యువు ముందు నిలుచున్నప్పుడు మన సెలా వుంటుందో, అలాగే అనిపిస్తుం దక్కడ.

అశోక్‌కుకూడా అలాగే అనిపిస్తోంది. కాని, మనసు పూర్వకంగా అతడు మృత్యువు నాహ్వానించడానికి సిద్ధంగానే వున్నాడు. అందువల్ల అతనిహృదయంలో ఒకరకమైన విరక్తితో

కూడిన శాంతి వ్యాపించివుంది. భయాందోళనలతో అబ్దుల్లా తనకు తాను సంబాళించుకోలేకపోతున్నాడు. మాయాదేవి వచ్చినప్పుడు మాత్ర మతనికి ధైర్యంచిక్కేది. తను అసహ్యంగా చూచిన స్త్రీయే అతని కిప్పుడు ముఖ్యాధారమై పోయింది.

ఆనా డుదయాన్నే అశోక్ కు స్నానంచేయించి స్ట్రెచర్ మీద ఆపరేషన్ థియేటరులోనికి తీసుకునివెళ్ళినప్పుడు, అబ్దుల్లాకు హృదయావేదన ఎక్కువై, థియేటరు వేపు వెళ్ళడానికి ధైర్యంచాలకపోయింది. దూరంగా రావిచెట్టుక్రింద కూర్చుని, కేవలం థియేటరువైపు చూస్తూవుండిపోయాడు.

## 35

తనకూ, పిల్లవాడికీ వచ్చిన జబ్బుకారణంగా. మరియమ్ జీవితంలో నిరాశ ఎక్కువై పోయింది. ఎనలేని విచారభారంతో కృంగి కృశించి ఆమె జీవనసూత్ర మెప్పుడు పుటుక్కున తెగిపోతుందాఅన్నట్లుంది. పిల్లవాడిభవిష్యత్తు ఏమిటో, ఆయుఃపరిణామ మెంతో ఎవరికీ తెలియదు. ఇటువంటి విపరీత పరిస్థితుల్లో, యీ బిడ్డ యీ ప్రపంచంలోకి వచ్చాడు. పరిస్థితుల దారుణ యాతనలతో నీ డెంతకాలం పెనుగులాడవలసి వస్తుందో తెలియదు.

అశోక్ తానూరు యిప్పుడు ఆమెను తన మనః ఫలకంపైనుంచి తుడిచివేశాడు. అతని వివాహం

కాకముందుకూడా, అతనిదరికి తనంతట తను వెళ్ళలేదు. అతన్ని ఏమీ యాచించలేదు. ఐనా, యీవిధమైన అభిమానంతో తనబిడ్డభవిష్యత్తును చెడగొట్టడానికి తనకు హక్కుందా? తన స్వాభిమానరక్షణకోసం, ఈ నిర్దోషి బాలుణ్ని, తండ్రిప్రేమనుంచీ, ఆశ్రయంనుంచి వంచించడం ఎంతవరకు న్యాయం? తనబోటి దరిద్రురాలు, చివికి జీర్ణించిన తల్లి, తనబాధ్యతలను ఎంతవరకు నిర్వర్తించగలదు? ఈబిడ్డను కన్నవారికి అప్పగించడం యింతకంటే మంచిపని కాదా? ఈ పిల్లవాడికోసం, తన అభిమానాన్ని చంపుకుని మళ్ళీ తను అశోక్ యింటిగడప త్రొక్కవలసిందేనా? రేపు పెరిగి పెద్ద వాడై— అమ్మా! నీ అభిమానంకోసం, నా తండ్రిప్రేమకు నన్నుదూరంచేశావా? అని అడిగినప్పుడు ఏమని జవాబు చెప్పను?

'అమ్మా! నాన్నగారు కాదని వెళ్ళిపోయినప్పుడు, పిలవలేకపోయినా, తిరిగి నువ్వే ఆయనింటికి ఎందుకు వెళ్ళ లేదు.? ఈ విధంగా మన యిద్దరి ఆత్మగౌరవానికి ఎందుకు ఈ విఘాతంకలిగించావు? నువ్వు నా సంరక్షకురాలివి. అలాగే నా ఆత్మగౌరవానికికూడా సంరక్షకురాలివికదా?' అన్నప్పుడు నేను ఏమని జవాబుచెప్పను.

ఐతే, ఈ సమస్య నాకుమాత్రమేనా? ఆయనకూడా ఆలోచించాలికదా? ఆయనకూ కొంత బాధ్యతవుందికదా? అయినా, ఆయన కీ పిల్లవాడున్నాడనేసంగతి తెలియనిదే ఏంచేయగలరు? పిలవకపోయినా తనెందుకు ఆయనవద్దకు ఒకసారి వెళ్ళగూడదు?

కాని...ఈ వివాహానంతరం...-అరుణను తనహృదయంలో ప్రతిష్ఠించుకున్నాక... తనను నిర్దాక్షిణ్యంగా వదలి వేసినతరువాత...? కాదు. ఎప్పుడూ అలా వెళ్ళలేదు...!

అశోక్ వివాహవార్త పేపరులో చదివిననాడే ఆమె తనజీవితంలో ఎక్కువగా విలపించింది. ఆవిధంగా అసహాయ స్థితిలోకూడా ఆమె ఏడవలేదు. ఇంతకుమించిన కష్టం యింకేమీ వుండదని ఆమెఅభిప్రాయం! ఈ అభిప్రాయబలంతోనే, యీనాడు తన కొడుకు అనారోగ్యస్థితినికూడా ధైర్యంగా సహించింది.

కష్టాలపరంపర శృతిమించినప్పుడు మానవుడు వాటిని లెక్కచేయడు. అతను వాటిని మౌనంగా, విరక్తిభావంతో సహిస్తుంటాడు.

ఈ పరిస్థితిలోనే మరియమ్‌కూడా తలమునకలువేస్తోంది. ఆమె చావాలని కోరడంలేదు. ఐనప్పటికీ జీవితానికి అంతంగా మృత్యువు ఎప్పుడు వచ్చేదీ తెలియనిస్థితిలో వుంది. భావాలన్నీ కఠిన పాషాణాల్లా మారిపోయినయ్! శరీరం శుష్కించి పోయింది. ఇంక జీవితమంటే...? ఆమెజీవితమే సాపరివాహాలైపోయింది.

మృత్యువు మెల్లమెల్లగా తనను సమీపిస్తోందని మరియమ్‌కు తెలుసు! ఈ దుర్భరమైన బాధలన్నిటినుండీ పూర్తిగా రక్షించగల దొక్కటే! బహుశా. ఆరోజు ఎంతో దూరాన లేదనిపిస్తోంది.

ఎందుకంటే-కోమలమైన భావాలన్నీ ఒకదానితరువాత ఒకటి సమూలంగా నశించిపోయి, తలదాచుకునేందుకు

ఆశ్రయందొరక్క హృదయం ఛిన్నాభిన్నమై, విచారము, వేదన —నిరాశల బరువుతో మనసుశుష్కించిపోయి, ఎనలేని శుశ్రూష, ఘోరమైన పరిశ్రమతో శరీరం జీర్ణించిపోయి, పన్నెండురూపాయలజీతంతో కడుపునిండా తిండికిగతిలేక, అవసరానికి బట్టచాలక, భారంగా కొనసాగిస్తున్న ఈ జీవిత యాత్రలో ఆ కడపటిరోజు ఎప్పుడాసన్నమౌతుంది?

* * *

ఆనాడుదయం స్కూలుకు వెళ్ళినప్పుడు తన తోటి ఉపాధ్యాయిని అడిగింది-"ఒక ఆర్టిస్టును చనిపోయాక డాక్టర్లు బ్రతికించిన వైనం పత్రికలో నువ్వు చదివావా?"

"ఎక్కడ...? ఏ పత్రిక?" ఉత్సాహంగా మరియమ్ అడిగింది.

"నేటి 'నాగపూరుటైమ్సు' చూడలేదా? స్కూలంతా యీ అద్భుత విజయాన్నిగురించే చర్చిస్తోంది. దీన్ని కొంత మంది భగవంతుని లీల అంటున్నారు. మరికొంతమంది విజ్ఞాన శాస్త్ర విచిత్రమంటున్నారు."

"ప్రస్తుతం నేను పేపరు చదవటంలేదు. కాని, ఎక్కడ వుందా పేపరు?"

"ఆఫీసులో వుండవచ్చు."

మరియమ్ గబగబా ఆ పేపరు చదివింది. కాని, చదువు తున్నంతసేపూ, తనేం చదువుతోందో, ఆమెకే తెలియదు- ఇది నిజమా? లేక కల్పితగాథా...?

అందులో యిలా వుంది:

# మృగజల్

"నాగపూరు ఆర్టిస్టు పునర్జన్మ!
భగవంతుని అద్భుతలీల"
— మా ప్రత్యేక విలేఖరి.

'నిన్నటి ఉదయము, మేయో ఆసుపత్రిలో ఒక అద్భుత సంఘటన జరిగింది. ఒక మృతవ్యక్తిని తిరిగి బ్రతికించి, అతనికి ప్రాణంపోయడం జరిగింది. ఆ వ్యక్తి ఎవరో కాదు. నాగపూరులో సుప్రసిద్ధ ఆర్టిస్టు శ్రీ అశోక్ ఠాకూర్....!

'నిన్నటి ఉదయం 9 1/2 గంటలకు శ్రీ ఠాకూర్‌ను 'అపెండిసైటిస్' ఆపరేషను చేసేందుకు ఆపరేషన్ థియేటరులోని బల్లమీద పడుకోబెట్టారు. ఆయనకు క్లోరోఫారం యిస్తున్నప్పుడు, అసిస్టెంటు డాక్టరు అశ్రద్ధవల్ల, మోతాదు ఎక్కువై, మూర్ఛితావస్థ మూడో మెట్టుదాటి నాలుగో మెట్టు ప్రవేశించినసంగతి తెలియకపోయింది. అందుచేత రోగి శ్వాస ఆగిపోయింది. ముఖం, శరీరం నీలంగా మారిపోయాయి. వైద్యశాస్త్రరీత్యా అతను చనిపోయాడు.

'కాని అదృష్టవశాత్తు ఆ పొరపాటు తొందరలోనే గ్ర[illegible] గ్రహించారు. వెంటనే హృదయస్పందనానికి యింజక్షన్ [illegible] యిచ్చారు. మళ్ళీ శ్వాస ఆడడానికి 'ఆర్టిఫిషియల్ రెజకరెసి[illegible] రేషన్' ప్రయోగించారు. మూడు నాలుగు నిముషాలనంతరం జకం[illegible] హృదయం నిదానంగా కొట్టుకోవటం గమనించారు. శ్వాస [illegible] క్రియకూడా యథావిధిగా జరిగింది. డాక్టర్లుకూడా మనసు [illegible] తేలికపడి సంతోషించారు.

'శ్రీ ఠాకూరు మూర్ఛితావస్థలో సరిగ్గా ఏడు నిముడు నిముషాల యిరవైసెకండ్లు వున్నాడు. శరీర విజ్ఞానశాస్త్ర దృష్ట్యా

ఆ వ్యవధిలో ఆయన యిహలీల సమాప్తమైనట్లే—!

'భగవంతునిలీల విచిత్రమైనది. వర్తమానయుగంలో కూడా మానవుడు పునర్జన్మఎత్తే చమత్కారంచూచే అదృష్టంపట్టింది. దీని గొప్పదనమంతా వైద్యశాస్త్రానిదా, లేక భగవంతునిదా అనే వాదన అనవసరం! ఇందుకు రోగి అదృష్టం, కొంత డాక్టరుల సమయస్ఫూర్తికూడా కారణమని వైద్యుల అభిప్రాయం.

'శ్రీ ఠాకూరు 'అపెండిసైటిస్' ఆపరేషన్ విజయవంతంగా జరిగింది. వారి మూర్ఛితావస్థకూడా క్రమక్రమంగా తగ్గిపోయింది. శ్రీ ఠాకూరు పునర్జీవితులైనందుకు వారికి యీ సమయాన అభినందనలు తెలియచేస్తున్నాం. అనతికాలంలో స్వాస్థ్యంచేకూరి, తిరిగి తన కళారాధనద్వారా, దేశ యశస్సును ప్రపంచానికి చాటిచెప్పగలరని ఆశిస్తున్నాము.

'మేము వారి వ్యక్తిగత జీవితానికి సంబంధించిన దుఃఖగాధ నొకదాన్ని ఎంతో విచారంతో ప్రకటిస్తున్నాము. ఆయనభార్య శ్రీమతి అరుణఠాకూర్ ఎం. ఏ. గతవారంలో రాయపురంకోర్టులో దాఖలుచేసిన విడాకులదావా మంజూరైనది. శ్రీ ఠాకూర్ యీ ఆఘాతానికి ధైర్యంగా తట్టుకోగలరని ఆశిస్తున్నాం. వారి యీ దురవస్థకు కొంతమంది స్నేహితులూ, కళా రసికులూ, ఎంతో విచారిస్తున్నారు..."

సుఖ, దుఃఖ, ఆనంద, ఆశ్చర్యాల సమ్మిశ్రిత భావాలతో, మాలిని హృదయం నిండిపోయింది. ఆ మెలో ఏదో అవ్యక్తమైన అల్లకల్లోలం బయలుదేరింది. పిచ్చిదైపోతు

దేమో ననిపించింది. ఆమె పిచ్చిదానిలా- "నేను వెడతాను. ఇప్పుడే వారివద్దకు వెడతాను. వారి కీ సమయంలో నా అవుసరముంది." అని అరిచింది

## 36

ఆపరేషన్ జరిగిన ఆరుగంటలకు అశోక్ మూర్ఛితావస్థ గడచిపోయింది. అతడు మొదటిసారిగా అస్పష్టంగా- "మరియమ్!" అని ఉచ్చరించటం వినిపించింది.

అబ్దుల్లా దగ్గరే నిలబడివున్నాడు కాని, యజమాని పిలుపుకు తాను చేయగలిగిందేమీ లేదు. అశోక్‌కు మందిచ్చి తిరిగి పడుకోబెట్టాడు. అలా జరిగిపోతూనే వుంది మూడో నాడు కొంచెం స్వాస్థ్యంచిక్కింది నాలుగోనాడు యింకొంచెం మెరుగనిపించింది. ఐనా బలహీనత ఎక్కువగానేవుంది.

"ఆపరేషనేమో జరిగిపోయింది. కాని మరియమ్ రాలేదు అబ్దుల్లా! నీ కల నిజం కాలేదు కదా!" అశోక్ హీన స్వరంతో అన్నాడు.

"బాబుగారూ!" అబ్దుల్లా వికలమైన మనసుతో, అంతకు మించి యింకేమీ అనలేకపోయాడు.

కాని, అదే సమయంలో గదిలోకి ఒక నర్సువచ్చింది. ఆమెతో పాటు ఒక శుష్కదేహధారిణికూడా ప్రవేశించి దిగులు చెందుతూ, కుతూహలభావంతో చూస్తోంది.

"ఎవరు? మరియమ్...!"-అశోక్ ఆత్రుతగా తలెత్తి చూచ్చునేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు.

"అవును, నేనే" మరియమ్ జవాబుచెప్పింది. ఆమె కంఠ ధ్వనికూడా క్షీణించిపోయింది.

నర్సు గబగబా వెళ్ళి అశోక్‌ను తలగడదిండ్లమీద ఆనించింది. కొంచం కఠినంగా వారించింది. "వద్దు వద్దు, మీరు కదలకూడదు. అలా చేయకపోతే యీమెను బయటికి పంపించవలసివుంటుంది."

"వద్దు వద్దు. ఆమెను బయటికి పంపకండి. మీరు చెప్పినట్లు వింటాను. కాని, ఆమెను పోనీయకండి! అబ్దుల్లా! కొంచం చూస్తూవుండు. మళ్ళీ పారిపోతుందేమో! అబ్బ...!" మాట్లాడుతుంటే అతనికి ఆయాసంవచ్చింది. బాధతో తలను దిండ్ల కానించాడు.

మరియమ్ వెంటనే వచ్చి, తలవద్ద కూర్చుని, అతని కుడిచేతిని తనచేతిలోనికి తీసుకుని మృదువుగా స్పర్శిస్తూ "అశోక్ బాబూ! ఇక నేను వెళ్ళను. మిమ్మల్ని వొదిలి నే నెప్పుడూ వెళ్ళను" అంది.

"మరియమ్! నువ్వేనా? లేక స్వప్నంలో వున్నానా?"

"నేనే అశోక్ బాబూ! మీరు చూస్తున్నది మిథ్య కాదు, యధార్థమే చూస్తున్నారు."—మరియమ్ లాలనగా మాట్లాడింది.

ఇంతలో అబ్దుల్లా పరుగెత్తుకునివచ్చి, సంతోషంగా అన్నాడు—"నువ్వు వచ్చేశావా మరియమ్? ఇక నా యజమాని తొందరగా లేచి తిరుగుతారు! ఓ భగవంతుడా...! నీ లీలలు అద్భుతంకదా!" అంటూ పైకిచూచి నమస్కరించి ఆనందంతో గెంతుతూ బయటికి వెళ్ళాడు.

అదంతా చూస్తున్న నర్సు నవ్వుతూ బయటికి వెళ్ళింది.

అశోక్ శుష్కశరీరాన్ని చూచి మరియమ్ దుఃఖించింది. మరియమ్‌ను చూచి అశోక్ ఆనందాశ్రుధారలు కురిపించాడు. ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. అయిదారు నిముషాలవరకూ యిద్దరూ తమ తమ భావోద్వేగాలను అశ్రు రూపంలో ప్రవహింపచేశారు.

"నన్ను క్షమించావా మరియమ్...?"

"క్షమించడానికేముంది.!"

"నేను మహాపరాధం చేశాను. నీకు అన్యాయం చేశాను. చెప్పు! నన్ను క్షమించావా? లేకుంటే, నా మనసు తేలిక పడదు-"

"అపరాధమా-? ఇందులో అపరాధమేముంది? అన్యాయమేముంది? మీరిలా అంటున్నారేమిటి?"

"అపరాధం కాకుంటే యింకేమిటి? కేవలం ప్రేమనే కాకుండా, కళారాధనపై దీక్షకలిగించి కర్తవ్యోన్ముఖుని చేసిన నీబోటి నారీరత్నం ఒకమారు నాకు దొరికింది. కాని, నే నా రత్నాన్ని గుర్తించలేనంత మందభాగ్యుణ్ణయాను. నే నాసమయంలో కళకూ, ప్రేమకు సమన్వయం సాధించలేని కృత్రిమ ఎండమావులకై పరుగెత్తాను. కాని, యీనాడు, ఒకవేళ కళ, ప్రేమ పరస్పరవిరుద్ధాలు కాకుంటే, వాటికి సమన్వయం కుదిరి ఎంతో అందంగా, వికసించగలవని గ్రహించాను. జీవితంతో విరక్తిచెందే కళ కళకాదు; ప్రేమ ప్రేమకాదు. కాని, ఆ పరిజ్ఞానం నాకు నీవల్లనే కలిగింది. నువ్వే నా కళ్ళు తెరిపించావు. నన్ను వదిలిపెట్టి, నాచేతికందని ఎండమావుల్లాంటి

లక్ష్యం కొరకు పరుగెత్తే మూర్ఖుణ్నైపోయాను. తత్ఫలితంగా, నేను నీకు మహాపరాధం చేయలేదా మరియమ్? నీపట్ల చేసిన ఘోరఅన్యాయానికి ప్రాయశ్చిత్తం నే నీ జన్మలో చేసుకోగలనా?"

"అవన్నీ గతించిన విషయాలు అశోక్ బాబూ! వాటిని జ్ఞాపకం చేసుకున్నందువల్ల లాభం లేదు. అవన్నీ పీడకలల్లా గతించిపోయాయి."

"అవును! గతించిపోయాయ్! అదంతా నీ విశాల హృదయంలోని ఉదారత్వమే! కాని, నువ్వు క్షమించానని అననిదే నాకు శాంతిలభించదు."

"దానివల్ల మీాకు శాంతిలభించేటట్లయితే, క్షమించాను." అంది మరియమ్.

"నువ్వెంత మంచిదానివి మరియమ్! ఇక నేను నిన్నెక్కడికీ వెళ్ళనీయను." అని అశోక్ కృతజ్ఞతతో అంటూ ఆమెతలను తన ఛాతీమీాదకు లాక్కున్నాడు. మరియమ్ అలసిపోయివుంది. భావావేశంతో మాట్లాడినందువల్ల, అశోక్‌లో కొంత అలసటకనుపించింది. ఇద్దరూ కొన్నిక్షణాలు మౌనంగా వున్నారు. కాని, వారికి అనిర్వచనీయమైన సుఖానుభూతి కలిగింది.

కొంచెంసేపయ్యాక అశోక్ అడిగాడు-''బిడ్డ వడీ...?"

ఈ సంగతి ఎలా తెలిసిందాఅని మరియమ్ త్రుళ్ళిపడి ''ఎవరుచెప్పారు...'' అని అడిగింది.

''ఎవరోఒకరు చెప్పారు. కాని, వెంటతీసుకునివచ్చావా లేదా చెప్పు?''

"లేదు. ఎలా వెంట తీసుకురాగలను...?" ఒక నిశ్వాసం విడిచింది. దీనంగా — "వాడు జబల్‌పూరులో జబ్బుగావున్నాడు" అన్నది.

"ఎవరివద్ద...? అలా అక్కడ ఎల్లా వదిలివచ్చావ్?"

"ఏంచేయను? ఈ ప్రయాణానికి తట్టుకోగలడా?"

"ఎక్కడ వుంచావు?"

"మిషన్ అనాథాలయంలో."

"అబ్బ!" తన కొడుకు మిషన్ అనాథాలయంలో వున్నాడా? అశోక్ కంటతడిపెట్టాడు.

మరియమ్ చిన్నతనమంతా మిషన్ అనాథాలయంలో గడిపినసంగతి గుర్తుకువచ్చింది. ఆమె తండ్రి పోయాడు, తల్లి పోయింది. అందువల్ల ఆమె అనాథాలయంలోకి వెళ్ళవలసి వచ్చింది ఇదంతా అర్థమవుతూనేవుంది. కాని, తనకొడుకు— తల్లీ తండ్రీ బ్రతికుండగానే, అనాథాలయాశ్రయం పొందవలసి వచ్చిందికదా అని అతనిమనసు పరితపించింది.

అశోక్ బాధపడడం గమనించి, మరియమ్‌కూడా ద్రవీభూతురాలై—"ఇప్పుడు వాడిని గురించి మీరు విచారించకండి. భగవంతునిదయవల్ల వాడు ఆరోగ్యవంతుడవుతాడు. మీరు నాకు దొరికారు. నాకంతా దొరికినట్లే! ఇప్పుడు నాకు మించిన ధన్యురాలు యింకెవరున్నారు?" అని వూరడించింది.

ఈవిధంగా ఆ వుభయ పరితప్త విరహప్రేమికుల కలయిక జరుగుతుండగా, బయట ఆవరణలోకి, శ్రీమతి మాయాదేవి నీలకంఠ కారులోంచి దిగి ప్రవేశించింది. అబ్దుల్లా ఆమె

కోసమే ఎదురుచూస్తున్నట్లుంది. అతను సంతోషంగా వెళ్ళి మరియమ్ వచ్చిందనే కబురు చెప్పాడు.

"ఓ, గ్రాండ్!"- మాయాదేవి నిష్కల్మషహృదయంతో అభినందించి, మరియమ్‌ను కలుసుకోవటానికి తొందర తొందరగా లోపలికి వచ్చింది.

మరియమ్‌కు మాయాదేవిని చూడగానే మొదట కొంచెం ద్వేషంకలిగింది. కాని, ఆమె సాత్విక వస్త్రధారణ, ముఖంలో వ్యక్తమయ్యే సౌజన్యం, ప్రసన్నత చూచి, ఆమె మనసు మారింది.

"నువ్వు వచ్చావా మరియమ్! చాలా మంచిదైంది. నీకోసమే అశోక్ అన్నయ్య ప్రాణాలన్నీ బిగపట్టుకు కూర్చున్నాడు. ఈరోజు నువ్వు, ఆయనకూ నాకూ నూతన జీవితాన్ని ప్రసాదించావు." అంది మాయాదేవి.

జబ్బుగావున్న పిల్లవాణ్ని మరియమ్ జబల్‌పూరు మిషన్ అనాథాలయంలో వదిలిపెట్టివచ్చిన సంగతి విని మాయాదేవి వెంటనే లేచి నిలబడి-"నేను స్వయంగా కారులోవెళ్ళి వాణ్ని నా అధీనంలోకి తీసుకుంటాను. పాపం, వాడి కెలా వుందో!" అంది.

మాయాదేవి ఒక్కనిముషంకూడా ఆలస్యంచేయకుండా వెంటనే జబల్‌పూర్ వెళ్ళి అనాథాలయంలోని చిన్నఅశోక్‌ను తను తీసుకుంది. కాని, పిల్లవాడికి టైఫాయిడ్ అని తెలియగానే నిర్విణ్ణురాలైంది. భగవంతు డనుగ్రహిస్తే ఈ బిడ్డ చిరంజీవి కాకపోడని నిశ్చయించుకుంది.

డబ్బు ధారాప్రవాహంగా ఖర్చుపెట్టింది. మంచి మంచి

డాక్టర్లనూ, నర్సులను నియమించింది. తన శరీరారోగ్యాన్ని కూడా లెక్కచేయలేదు. మెలకువతో పిల్లవాడికి పరిచర్యలు చేయడంతప్ప యింకేమీ మనస్కరించడంలేదు. పిల్లవాడికి పరిచర్యచేయటంతో మాయాదేవికి యిదివరలో అనుభవం కాని వాత్సల్యానుభూతి కలిగింది. ఆ తన్మయత్వం సేవానిరతి చూచినవారు, ఆమె కన్నతల్లి కాదని, ఎవరూ అనుకోరు. ఈ నిర్లిప్త, నిస్వార్థసేవ మంగళమయుడైన పరమేశ్వరుని కృప వల్లనే జరుగుతుంది.

ఆ మంగళమయుడైన భగవంతునిదయవల్లనే, మాయాదేవిసేవకు కీర్తిదక్కింది. పిల్లవాడు కోలుకున్నాడు. వాడిని తన కారులో నాగపూరు తీసుకువచ్చే ప్రయత్నంలో వుంది.

మరియమ్‌కళ్ళు మాయాదేవిపట్ల కృతజ్ఞతాభావంతో అశ్రుసిక్తమయ్యాయి. "పిల్లవాని పురాకృతసుకృతంవల్లనే మాయాదేవి వాడికి దొరికిం"దని అంది.

మరియమ్ సాహచర్య పునఃప్రాప్తితో అశోక్ ఠాకూరు త్వరితంగా కోలుకుంటున్నాడు. ఆరవనాడు కళ్లువిప్పారు. పదోనాడు ఆసుపత్రినుంచి విడుదలచేశారు.

అశోక్ మరియమ్‌ను జరిగిన సంగతులన్నీ గుచ్చి గుచ్చి అడిగాడు. ఆమెదుర్దినాల కరుణగాథను విని ఎంతగానో పరితపించాడు. అతని కన్నీటిప్రవాహం చూచి మరియమ్ కూడా తన దుఃఖాన్నాపుకోలేకపోయింది. నేటివరకు అతనిలో లోలోపలే ప్రజర్విల్లుతున్న అంతర్వ్యథ, యిప్పుడు బహిర్గత మయ్యేందుకు ఒక అవకాశందొరికింది. రెండు భగ్నప్రేమహృదయ

యాల సమాగమము జరిగింది. కోర్కె ఈడేరింది. భగవదాశీర్వచనం సఫలమైంది.

అశోక్ ఆరోగ్యం త్వరితగతిని మెరుగవుతోంది. కాని, మరియమ్ రోజురోజుకూ శుష్కించిపోతోంది. ఆమె హృదయం అపార ఆనందంతో పరిపూర్ణమైంది. కాని, ఆమె శుష్కించిన శరీరం, ఆ సుఖభారాన్ని భరించలేకుండావుంది. ఆమెకళ్ళలో ఒక పావనకాంతి మెరుస్తోంది. కాని, శరీరాన్ని భయంకరమైన శిథిలత్వమూ, అలసటా వశ్యం చేస్తున్నాయి.

బహుశా ఆమె తనకొడుకును మృత్యుముఖంనుంచి రక్షించుకునేందుకు, సంకల్పశక్తి అనే కొరడాతో తన కాయమనే అశ్వాన్ని పరుగెత్తించేందుకు ఎంతో ప్రయత్నంచేసి నట్లుంది. ఈనాడు అందుకు ప్రతికూలంగా ఈ అశ్వం విశ్రమించాలనుకుంటోంది.

డాక్టరులిచ్చే యింజక్షనులూ, మందులూ ఆమెమీద పనిచేయలేదు. ఆమెశరీరం జీర్ణించిపోతున్నప్పటికీ, ముఖమంతా శాంతిసౌరభాలతో అపూర్వ పావనకాంతితో వెలుగొందుతోంది.

అశోక్ దీన్నెలా అర్థంచేసుకోగలడు ? ఏదో అజ్ఞాత అనుమానంతో అతనిహృదయం కంపిస్తోంది.

* * *

అశోక్‌ను తీసుకుని సాయంకాలానికి తను వస్తున్నట్లు మాయాదేవివద్దనుంచి టెలిగ్రాంవచ్చింది. మరియమ్ ముఖం సంతోషంతో వికసించింది. అశోక్ హృదయంకూడా మధుర

స్మృతులతో పులకితమైపోయింది. అతని పితృహృదయం తన చిరకాలక్షుదను తృప్తిగా తీర్చుకోవాలనుకుంది.

రాజకుమారునిలా చిన్నఅశోక్ వచ్చాడు. కారులో బూరగదూదిపరుపులు, అటూయిటూ యిద్దరునర్సులు, మందు సీసాలు, ఆటవస్తువులు — ఓడలూ, కుక్కలూ, ఏనుగులూ, గుర్రాలూ, పచ్చరంగు, నీలపురంగు బంతులు యింకా ఏమి టేమిటో......?

ఇవన్నీ చూచి మరియమ్ హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆమెకునిర్మలమైన నిశ్చితానందం కలిగింది

అశోక్ మంచంమీద దిండ్లకానుకుని పడుకునివున్నాడు. మరియమ్ అతనికి ఎడమవైపున కూర్చునివుంది.

కొడుకును చూచి మరియమ్ ఎంతో వాత్సల్యంతో మురిసిపోయింది పిల్లవాడికోసం అశోక్ చేతులు ముందుకు చాపాడు.

మాయాదేవి — "కాదు, నా చేతులతో మీకు యివ్వను. మరియమ్ చేతులమీదుగా పుచ్చుకోండి. ఆ అధి కారం ఆమెకే వుంది." అంది.

మరియమ్ చేతులు పిల్లవాణ్ని ఎత్తుకునేంత బలంగా లేవు. మాయాదేవి చేతుల్లోని బిడ్డను స్పర్శించి "కాదక్కా! వీణ్ని ఇక నువ్వే పెంచు." అంది.

అశోక్ ఆత్రుతగా పిల్లవాణ్ని తీసుకుని ముద్దుపెట్టు కున్నాడు.

మరియమ్ తనశక్తినంతా కళ్ళలో కేంద్రీకరించి, ఈ

పునర్మెనవృశ్యాన్ని చూస్తోంది. ఆ తరువాత ఎంతో కష్టం మీాద త[illegible], ఆమెకూడా పిల్లవాడ్ని ముద్దుపెట్టుకుంది.

ఈ స్వల్పశ్రమకే ఆమెకు ఆయాసం వచ్చింది. ఆమె అశోక్ వాడిలో తలవుంచి కళ్ళుమూసుకుంది. ఆమె 'అశోక్' అని ఉచ్చరించింది. తరువాత ఒక్క నిట్టూర్పువిడిచింది.

విచిత్రమైన ఆమె స్తబ్ధత చూచి అశోక్ గాబారా పడి "మరియమ్" అని పిలిచాడు.

మరియమ్ ఏమీా మాట్లాడలేదు.

మాయాదేవి గబగబా వెళ్ళి పిల్లవాడ్ని తీసుకుంది. అశోక్ కుడిచేత్తో ఆమెగడ్డాన్ని పైకెత్తి వ్యాకులపడుతూ "మరియమ్" అని పిలిచాడు.

ఐనప్పటికీ మరియమ్‌నుంచి జవాబురాలేదు ఆమె మహా సుఖంగా నిద్రపోతున్నట్లు కళ్ళుమూసుకుంది.

ఆమెశ్వాస ఆగిపోయింది. నాడికూడా ఆగిపోయింది. ఈ లక్షణాలకు మినహా మరియమ్‌మీాద మృత్యుహస్తాలు పడిన చిహ్నాలేమీా అశోక్‌కు కనుపించలేదు.

"మరియమ్! తిరిగి నన్నువిడిచిపెట్టి వెళ్ళిపోయావా ?" అశోక్ బావురుమన్నాడు. మాయాదేవి కళ్ళుకూడా చెమ్మగిల్లాయ్!

అబ్దుల్లా తలుపు ప్రక్కగా నిలబడి, గుమాలుతో నోటిని గట్టిగా అదుముకుని. దుఃఖించాడు.

మరియమ్‌ముఖంమీాద సుఖశాంతులభావం అంకితమై వుంది. తనబోటి అదృష్టవంతురాలు ప్రపంచంలోనే లేదన్నట్లు,

ఆమె తపశ్చర్యంతా పూర్తయినట్లు, సంపూర్ణ సమర్పణ భావంతో అశోక్ వొడిలో నిద్రపోతోంది.

కాని, తనెదుటనున్న భయంకర పరిస్థితిలోని యదార్థం అశోక్ యిప్పటికూడా నమ్మలేకపోతున్నాడు కాని, అబ్దుల్లా కళ్ళుతుడుచుకుంటూ, తెల్లటివస్త్రంతో మరియమ్‌నుపూర్తిగా కప్పివేసిన తరువాత అశోక్ తనుఅభాగ్యుడనని, నిస్సహాయుడనని, ఏకాకినని గ్రహించాడు.

మరియమ్ మృతకళేబరంమీద పూలు జల్లారు. అశోక్ ఆ మంచంవద్దనే మోకరించి మరియమ్‌కాళ్ళమీద తలబాదుకుంటూ మరియమ్, మరియమ్! అంటూ ఆర్తనాదం చేశాడు.

అతని ఆర్తనాదం ఆ గదంతా ప్రతిధ్వనించింది.

డాక్టరు తలమీది టోపీతీసివేశాడు. నర్సులు మోకాళ్ళమీద కూర్చుని తలవంచి ఆ శరీరావరణను వీడిపోయిన ఆత్మ శాంతికై ప్రార్థించసాగారు.

సమాప్తం.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AAL01C107 | Date | 24-9-21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 4, 357 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Mounika | Scanned | Ch. Ramya |
| BOOK SIZE | H 7.4 W 4.19 | Pages | 362 |

